# వాసిష్ఠ రామాయణము

## ద్విపద కావ్యము

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# వాసిష్ఠ రామాయణము
## ద్విపద కావ్యము

## మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము


సాధారణ సంపాదకుడు

**బి.యస్. రెడ్డి (భూమన్)**

సంచాలకులు,తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్ట్

"శ్వేత" తి.తి.దే. తిరుపతి






పరిష్కర్త : ఆచార్య కె.జె.కృష్ణమూర్తి

తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్ట్

"శ్వేత" తి.తి.దే.తిరుపతి



ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు,తిరుపతి.

2008

**VĀSIṢṬHA RĀMĀYAṆAMU**

(DVIPADA KĀVYAMU)

**MĀTṚ ŚRĪ TARIGONḌA VEṄGAMAMBA**

Edited by

Prof. K.J.Krishnamoorthy

Tarigoṇḍa Veṅgamāmba Vāṅgmaya Project

"SVETA", T.T.D., TIRUPATI.

TTD Religious Publications Series No. 785



First Edition: 2008

Copies : 1000

Published by

K.V. RAMANACHARY, I.A.S.,

Executive Officer,

Tirumala Tirupati Devasthanams,

TIRUPATI-517 507

Printed at

TTD.Press, Tirupati.

ఓం నమో వేంకటేశాయ

## * ముందు మాట *

15-07-2008.

భూమన కరుణాకరరెడ్డి
అధ్యక్షులు,
తి. తి. దేవస్థాన పాలకమండలి,
తిరుపతి.

తరిగొండ వెంగమాంబ రచించిన కృతుల్లో చివరిది "వాసిష్ఠ రామాయణము". ఇది ద్విపద కావ్యం. ఇందలి విషయం వేదాంతం. రఘువంశీయుల కులగురువయిన వసిష్ఠుడు విశ్వామిత్రుని ప్రేరణచేత శ్రీరామునకు అనేక తాత్త్విక విశేషాలను పెక్కు కథల రూపేణ క్రమంగా, విశదంగా ఉపదేశిస్తాడు. ఇది యిందలి యితివృత్తం.

పరమయోగినియైన ఈ కవయిత్రి వాల్మీకి మహాకవి సంస్కృతంలో రచించిన "వాసిష్ఠ మహారామాయణ" కావ్యంలోని విషయాలను స్వీకరించి, వాటిని స్వానుభవంతో చక్కగా సమన్వయించి, ఈ కావ్యాన్ని స్వేచ్ఛగా, సంగ్రహంగా ద్విపదలలో అనువదించింది.

యావద్ భారతీయ వాఙ్మయ మంతటిలోనూ అత్యుత్తమమైన గ్రంథంగా స్వామి రామతీర్థలాంటి మహాశయులచే కొనియాడబడిన ఈ "వాసిష్ఠ మహారామాయణా"నికి తెలుగులో రెండే రెండు అనువాదాలు గోచరిస్తున్నాయి. అందులో ఒకటి క్రీ.శ. 14-15 శతాబ్దుల నడుమ నివసించిన మడికి సింగన రచించిన పద్యానువాదం; రెండవది క్రీ.శ.18వ శతాబ్ది ఉత్తరార్ధంలో తిరుమలక్షేత్రంలో విలసిల్లిన మహాయోగిని వెంగమాంబ లేఖినినుండి వెలువడిన ప్రశస్త ద్విపదానువాదం.

ఈ యిరువురు సారస్వతమూర్తుల్లో ఒకరు అహోబల లక్ష్మీనృసింహస్వామి భక్తులు కాగా, ఇంకొకరు తరిగొండ లక్ష్మీనృసింహస్వామి భక్తులు. ఈ విధంగా ఈ యిద్దరూ నృసింహోపాసకులే అయివుండటం ఈ సందర్భంలో ఎన్నదగిన అంశం!

మొత్తం మీద, తాత్త్విక విషయాలను సామాన్య జనులకు సుబోధంగా వెల్లడించటానికి పద్యంకన్నా ద్విపద మిగుల అనువయినదనే సూక్ష్మాంశాన్ని ఈ ద్విపద కావ్యం సముచితంగా నిరూపిస్తూ వున్నది.

తిరుమల తిరుపతి దేవస్థానముల "శ్వేత" సంస్థ ఆధ్వర్యంలోని "మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టు" ఇలాంటి విశిష్ట ప్రచురణలను ఇతోఽధికంగా చేపట్టి ఈ "కవితాతపస్విని" సృజించిన వాఙ్మయ రాశిని విస్తృతంగా వెలుగులోకి తీసికొనిరాగల రని ఆశిస్తున్నాను; ఆశంసిస్తున్నాను.

సదా శ్రీవారి సేవలో

భూ. కరుణాకరరెడ్డి

**భూమన కరుణాకరరెడ్డి**

శ్రీనివాసో విజయతే

## నా మాట

22-07-2008.

**కె.వి.రమణాచారి, ఐ.ఏ.ఎస్.,**
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు,
తిరుపతి.

భారతీయ వాఙ్మయంలో విశ్వవిఖ్యాతిగాంచిన మహాకావ్యం "వాసిష్ఠ రామాయణం". వాల్మీకి మహాకవి సంస్కృతంలో రచించిన ఈ గ్రంథానికి "జ్ఞాన వాసిష్ఠం", "యోగ వాసిష్ఠం", "మహారామాయణం" - ఇత్యాది అనేకనామధేయాలు కాలక్రమేణ ఏర్పడినాయి. ఇవన్నీ ఈ కావ్యప్రశస్తిని చక్కగా చాటుతూవున్నాయి. ఈ కావ్యంలోని ముఖ్య విషయం వేదాంతం. ఇందలి అధ్యాత్మతత్త్వాన్ని ఉపదేశించిన మహానుభావుడు మహర్షు లందరికీ మాన్యుడయిన వసిష్ఠమహాముని. ఆ దివ్యోపదేశాన్ని శ్రద్ధతో స్వీకరించిన శిష్యసత్తముడు అవతారమూర్తి, రఘువంశ తిలకుడూ - అయిన శ్రీరామచంద్రుడు.

ఇంతటి ఉత్కృష్టగ్రంథానికి ఇటీవలిదాకా తెలుగులో వెలువడిన అనువాదాలు రెండే రెండు. ఆ రెండు అనువాదాల్లో మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ద్విపదలో రచించిన ఈ "వాసిష్ఠరామాయణం" ఒకటై వుండటం విశేషం! ఈ కావ్యం తాత్త్విక కవయిత్రి వెంగమాంబ రచించిన మొత్తం రచన లన్నింటిలోనూ చిట్టచివరిదై వుండటం ఇంకొక విశేషం!

అపూర్వములయిన అనేకకథలను ఆధారం చేసికొని ఆత్మతత్త్వాన్ని ఉపదేశించటం వాల్మీకి కావ్యంలోని రచనా ప్రణాళిక.

ఈ ఆధ్యాత్మిక కవయిత్రి ఆ ప్రణాళికను పుణికిపుచ్చుకొని, స్వతంత్రంగా, సంగ్రహంగా, తెనుగు జాతీయచ్ఛందమైన ద్విపదలో సులభశైలిలో ఈ కమనీయకృతిని వెలయించింది.

పరమయోగులైన ఆళ్వారులవంటి మనఃపరిపక్వత గలిగిన ఈ మహాయోగిని యొక్క రచన లన్నిటిలోనూ సురుచిరమణిహారంలో సువర్ణసూత్రంవలె తత్త్వజ్ఞానం (Philosophy) భాసిస్తూ వుండటం ఈ సందర్భంలో ప్రశంసింపదగిన ప్రత్యేకాంశం!

తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులు, "మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టు డైరెక్టరు శ్రీయుతులు "భూమన్"గారి దీక్షాదక్షతలవలన ఈ వాఙ్మయపీఠం అచిరకాలంలో వెంగమాంబగారి తదితరరచనలను, సాహిత్య సదస్సులకు సంబంధించిన వ్యాససంకలనాలను, సంచికలను, తులనాత్మక పరిశీలనలను, శబ్దసూచికలు concordances మొదలైనవాటిని క్రమేణ ప్రచురింపగల దని ఆశిస్తున్నాను; ఆశంసిస్తున్నాను.

సదా శ్రీనివాసుని సేవలో

కె.వి. రమణాచారి

## * సాహితీ సౌరభం *

01 -07 -2008.

"భూమన్"

సంచాలకులు,

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు,

"శ్వేత", తి. తి. దేవస్థానములు, తిరుపతి.

మహాయోగిని తరిగొండ వెంగమాంబ రచించిన గ్రంథా లన్నింటిలో చిట్టచివరిది "వాసిష్ఠ రామాయణము". ఈ ద్విపదకావ్యం "యోగ వాసిష్ఠం", "జ్ఞాన వాసిష్ఠం" - మున్నగు పేర్లతో ప్రసిద్ధి గాంచిన సంస్కృత గ్రంథానికి అనువాదం. అనువాదమయినా, స్వతంత్రంగా, స్వేచ్ఛగా సాగిన రచన!

వాల్మీకి రచించిన సంస్కృత మూలంలోని సారాన్ని స్వీకరించి, స్వానుభవంతో జోడించి, కవయిత్రి ఈ మహాకావ్యాన్ని సంగ్రహంగా, సామాన్యులకు సైతం సులభగ్రాహ్యంగా ఉండేటట్టు రచించింది. ఈ హేతువుచే ఈ గ్రంథంయొక్క వైశిష్ట్యం ఇనుమడించింది.

తేట తెలుగు పదాలతో తాత్త్విక విషయాలను బోధించటం వెంగమాంబకు వెన్నతో పెట్టిన విద్య - అనే విషయాన్ని 'తరిగొండ నృసింహ శతకం' మొదలుకొని, ఈ యోగేశ్వరి కృతులు అన్నీ నిరూపిస్తూ వున్నాయి; ఆ అన్నింటిలోనూ ఈ కావ్యం అగ్రగణ్యంగా అలరారుతూవుందనేది సత్యం!

గడచిన శతాబ్ది ఆరంభంలో గుజిలీప్రతిగా మద్రాసులో ముద్రితమైన ఈ తాత్త్విక కావ్యం తి.తి.దే. మాతృశ్రీ తరిగొండ వాఙ్మయ ప్రాజెక్టు పక్షాన వ్రాతప్రతుల సాహాయ్యంతో చక్కగా పరిష్కృతమై ఇప్పుడు పునర్ముద్రణ పొందుతుండటం చాలా సంతోషించవలసిన విషయం.

తి.తి.దే. "శ్వేత" సంస్థలోని. "మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టు" ఈ కవయిత్రి యొక్క తదితర రచనలను -శ్రీ భాగవతము (ద్విపద), శివనాటకము (యక్షగానము) - మున్నగు వాటి నన్నిటినీ అతి త్వరలో ప్రచురించే ప్రణాళికను సిద్ధపరుస్తున్న దని తెలియజేటానికి సంతోషిస్తున్నాను.

ఈ ప్రచురణలతోపాటు, ఆంధ్రావనిలో గల ఆ యా పట్టణాల్లో సాహిత్య సదస్సులు, సంగీత ప్రదర్శనలు, హరికథలు, బుర్రకథలు - మొదలయిన వివిధ సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించటంద్వారా ఈ మహాకవయిత్రి సారస్వతం యొక్క ప్రశస్తిని ప్రబోధించే ఉద్యమాన్ని తి.తి.దే. ఈ వాఙ్మయ ప్రాజెక్టు ద్వారా కొనసాగిస్తూవున్న దని తెలుపటానికి మిగుల ఆనందిస్తున్నాను.

శ్రీ. కె.జె. కృష్ణమూర్తిగారు సుప్రసిద్ధ పరిశోధకులు. ఎంతో ఓర్పు, నేర్పు ప్రదర్శించి ఈ కృతిని పరిష్కరించినందున వారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

భూమన్

# పీఠిక

## కావ్యప్రశస్తి:

భారతీయ ఆధ్యాత్మిక వాఙ్మయంలో కిరీట సదృశమైనది 'వాసిష్ఠ రామాయణము'. ఈ మహాకావ్యానికి 'జ్ఞానవాసిష్ఠము', 'యోగవాసిష్ఠము', 'మహారామాయణము', 'అఖండ రామాయణము', 'ఉత్తర రామాయణము', 'వసిష్ఠగీత'-ఇత్యాది అనేక నామధేయాలు కాలక్రమేణ ఏర్పడినాయి. ఈ పేర్లన్నీ ఈ తాత్త్విక గ్రంథానికి గల ప్రశస్తి, ప్రచారాలను చెప్పక చెపుతూవున్నాయి.

దాదాపు ముప్పదిరెండువేల శ్లోకాల పరిమితి గల ఈ బృహత్ కావ్యం i) వైరాగ్య ప్రకరణం ii) ముముక్షు వ్యవహారప్రకరణం iii) ఉత్పత్తిప్రకరణం iv) స్థితిప్రకరణం v) ఉపశమప్రకరణం vi) నిర్వాణ ప్రకరణం - అనే ఆరు ప్రకరణాలుగా వింగడింపబడివుంది. అద్వైత వేదాంతాన్ని ప్రబోధించే ప్రాచీనగ్రంథాల్లో ఇది అత్యంత ప్రముఖమైనది.

వాల్మీకి మహాకవి శ్రీమద్రామాయణ రచన పూర్తిచేసిన పిమ్మట కొంతకాలానికి ఈ వాసిష్ఠ రామాయణాన్ని రచించినట్లు అనూచానంగా తెలియవస్తున్న అంశం. విశ్వామిత్రుడు యాగసంరక్షణనిమిత్తంగా శ్రీరామచంద్రుణ్ణి వెంట తోడ్కొని వెళ్లటానికై అయోధ్యకు విచ్చేసిన సందర్భంలో, వసిష్ఠునిచే శ్రీరామునకు ఉపదేశింపబడినదయినందువల్ల, కథాక్రమంలో ఇది ముందు జరిగినది; శ్రీమద్రామాయణమునందలి కథ దీనికి తరువాత జరిగినది. అయినప్పటికీ, శ్రీమద్రామాయణము ముఖ్యంగా కర్మయోగాన్నీ, ఈ వాసిష్ఠరామాయణము జ్ఞానయోగాన్నీ ప్రపంచిస్తూ వున్నందువలన, అది పూర్వరామాయణంగానూ, ఇది ఉత్తర రామాయణంగానూ ప్రసిద్ధిపొందాయి.

వాసిష్ఠ రామాయణం భక్తులకు భాగవతంలాగా, కర్మ యోగులకు భగవద్గీతలాగా, జ్ఞానమార్గ అనుయాయులైనవారికి ఆరాధ్యమైన పారాయణగ్రంథం. ఇందులో కర్మయోగ, జ్ఞానయోగాలు రెండూ రసవత్తరములయిన ఉపాఖ్యానాల ద్వారా, దృష్టాంతాల ద్వారా కావ్యశైలిలో సోపానక్రమంలో విశదీకరింపబడివున్నాయి.

ఈ బృహద్ గ్రంథానికి భగవద్గీతతో కొన్ని పోలికలు, గోచరిస్తున్నాయి. 'గీత' భారతకథా సంబంధికాగా, 'వాసిష్ఠము' రామాయణ కథాసంబంధియైనది. శ్రీకృష్ణుడు గీతను ఉపదేశించిన అనంతరం అర్జునుడు కర్తవ్యోన్ముఖు డైనట్లే, ఇందులో వసిష్ఠుని ఉపదేశానంతరం శ్రీరాముడు కర్తవ్యపరాయణుడైనాడు. గీత సర్వోపనిషత్తుల సారమయినట్లే, వాసిష్ఠ రామాయణము అనేకోపనిషత్తుల ఆకరమై వెలసింది![1]

ఈ విధంగా ఈ వేదాంతకావ్యానికి సారస్వతజగత్తులో నెలకొనియున్న విశిష్టతను గుర్తించిన గౌడ అభినందుడనే కాశ్మీర పండితుడు (క్రీ.శ.9వ శతాబ్ది)[2] బృహద్ యోగవాసిష్ఠ రామాయణకావ్యాన్ని 'లఘుయోగవాసిష్ఠ' మనే పేరిట దాదాపు ఆరువేల శ్లోకాల్లో సంగ్రహీకరించాడు. ఈ సంగ్రహ గ్రంథం మూలగ్రంథంయొక్క సారాన్నీ, తత్సందేశాన్నీ లోకానికి అందిస్తూ, అన్ని విధాలా ఆ బృహద్ గ్రంథానికి ప్రాతినిధ్యం వహిస్తున్నది.

ఈ సందర్భంలో ఈ తాత్త్వికకావ్యంయొక్క ప్రశస్తిని వేనోళ్ళ ఎలుగెత్తి చాటుతూవున్న ఈ క్రింది ఆంగ్లవాక్యాలు - సుప్రసిద్ధ తత్త్వవేత్త, మహాజ్ఞానియంయున స్వామి రామతీర్థ (క్రీ.శ. 1873-1906) వక్కాణించినటువంటివి - ఈ సందర్భంలో పరికింపదగివున్నాయి:

"One of the greatest books, the most wonderful according to me ever written under the Sun is Yoga Vasishtha which nobody on Earth can read without attaning God - consciousness, nobody can read it without becoming one with All."[3]

ఈ మహోత్తమ కావ్యప్రశస్తిని గూర్చి వసిష్ఠ మహర్షే ఇందులో ఒకచో ఇలా వక్కాణించియున్నాడు:

---

1. vide : The Philosophy of the Yoga Vasishtha, B.L. Atreya, p.26. TheTheological Publishing House, Adyar, Madras (1936).

2.చూ. 'యోగ వాసిష్ఠ ఔర్ ఉసకే సిద్ధాంత,పుట 9, తారా ప్రింటింగ్ వర్క్స్, బెనారస్ (1957).

3. చూ. 'వసిష్ఠ గీత' (అను), శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు, ఉపోద్ఘాతము, పుట14, 1వకూర్పు (1972).

"యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్।
ఇమం సమస్త విజ్ఞాన శాస్త్రకోశం విదుర్బుధాః॥"[4]

'ఈ వాసిష్ఠరామాయణంలో ఏది వుందో, అదే యితర శాస్త్రాల్లోనూ ఉంది. ఇందులో ఏదిలేదో అది తదితర శాస్త్రాలలోనూ లేదు. పండితులు ఈ వాసిష్ఠాన్ని సమస్త విజ్ఞానశాస్త్రాలకు కోశం - అని అంటారు'

## రెండు అనువాదాలు:

ఆర్ష వాఙ్మయంలో ఇంతటి ప్రఖ్యాతిని పడసిన ఈ పురాతన గ్రంథానికి పూర్వాంధ్ర సారస్వతంలో రెండే రెండు అనువాదాలు వెలువడివుండటం విచిత్రంగా గోచరిస్తూవున్నా, యథార్థమయిన సంగతి! ఆ రెండు అనువాదాల్లో మొదటిది క్రీ.శ. 14 - 15 శతాబ్దుల నడుమ (క్రీ.శ. 1375-1435) నివసించిన మడికి సింగనామాత్యుని పద్యానువాదం. ఇది అయిదాశ్వాసాల్లో సంగ్రహంగా రచింపబడింది. సింగన ఆంధ్రీకరణకు మూలం అభినందపండితుని 'లఘుయోగవాసిష్ఠ'మే నని పరిశీలన వలన వెల్లడయ్యింది. మాతృశ్రీ తరిగొండ వెంగమాంబగారి ప్రకృత కావ్యం రెండవ అనువాదం.

సింగనవలెనే వెంగమాంబకూడా లఘుయోగవాసిష్ఠాన్నే స్వీకరించియున్నట్లు కావ్యారంభంలోని ఈ క్రింది ద్విపదలు వెల్లడిస్తున్నాయి:

"ధరణిమీఁద మదాత్మ - తరియించుకొఱకు

సామోదమతిని సు-జ్ఞాన వాసిష్ఠ
రామాయణార్థసా-రమును గ్రహించి,

---

4. చూ.'వాసిష్ఠమహారామాయణము'(వచనము),శ్రీవిద్యాప్రకాశానందగిరిస్వాములవారు, 'ముందుమాట' - స్వామివిద్యాస్వరూపానందగిరి,రెండవముద్రణ(2000), శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి.

వరుసగా ద్విపద కా-వ్యముగా రచించి,
యఱ లేక మీకు స-మర్పింతు నిపుడు,

శ్రీ తారకోల్లాస! - శ్రీశ్రీనివాస!
శ్రీ తరిగొండ నృ-సింహ! ధూతాంహ!"

-వాసిష్ఠ రామాయణము, 1 పుట.

పై పంక్తులలోని "సుజ్ఞాన వాసిష్ఠ రామాయణార్థ సారమును గ్రహించి" - అనే వాక్యంలో కవయిత్రి తాను స్వీకరించిన మూలగ్రంథాన్ని సూచించింది. ఇంతేగాక, ఈ ద్విపదకావ్యం అంతా ఈ అంశాన్ని స్పష్టంగా నిరూపిస్తూవుంది.

## వెంగమాంబ కథా సంవిధానం:

సింగనార్యుడి పద్యకావ్యానికి, వెంగమాంబ ద్విపద కావ్యానికి సంస్కృతమూలం ఒకటే అయినప్పటికీ, అనువాదవిషయంలో ఈ యిరువురి రచనావిధానాలు వేర్వేరుగా గోచరిస్తూవున్నాయి. సంస్కృతమూలంలోని మొత్తం ఆరు ప్రకరణాలను వెంగమాంబ ఐదు ప్రకరణాలుగా ఇమిడించి తెనిగించింది. ఈ ద్విపద కావ్యమందలి కథాసంవిధానంలో కవయిత్రి ప్రదర్శించిన స్వతంత్ర దృక్పథానికి, రచనా ప్రణాళికకు ఈ దిగువ ఉదాహరించిన పట్టిక ఒక నిదర్శనం:

| సంస్కృత మూలం | వెంగమాంబ రచన |
| --- | --- |
| i) వైరాగ్య ప్రకరణము<br>ii) ముముక్షువ్యవహార ప్రకరణము<br>iii) ఉత్పత్తి ప్రకరణము | మొదటి రెండు ప్రకరణాల్లోని కథ మిగుల సంక్షేపింపబడింది.మూడవదైన'ఉత్పత్తి ప్రకరణం'లోని ఉపాఖ్యానాలు దీనికి జోడింపబడినాయి. ఈ విధంగారూపొందిన తొలి మూడుప్రకరణాల సమష్టి కథాస్వరూపానికి "ఆది ప్రకరణము" అని పేరు పెట్టబడింది. |

iv) స్థితి ప్రకరణము .... ఈ ప్రకరణంలోని ఉపాఖ్యానా లన్నీ ఇందులో "ద్వితీయ ప్రకరణము"గా రూపొందినాయి.

v) ఉపశమ ప్రకరణము.. ఈ ప్రకరణంలోని కథ లన్నీ "తృతీయ ప్రకరణము"గా నెలకొన్నాయి.

vi) నిర్వాణ ప్రకరణము.... కవయిత్రి యీ ప్రకరణాన్ని తెనుగున రెండు (నాలుగవ, ఐదవ) ప్రకరణాలుగా దిద్దితీర్చినది. ఇలాగ విస్తరింప చేయటంలో ఆ ప్రకరణానికి గల ప్రాముఖ్యాన్ని లోకానికి సూచించటమే ఈ రచయిత్రి యొక్కముఖ్యోద్దేశంగా భావించాలి.

ఈ సందర్భంలో సంస్కృతమూల గ్రంథానికి సంబంధించిన ఒక విశేషం ఇక్కడ ముఖ్యంగా ప్రస్తావింపదగివుంది. వాల్మీకి రచించిన బృహద్ వాసిష్ఠ రామాయణంలో ఆరవదైన నిర్వాణ ప్రకరణం పూర్వార్థంఉత్తరార్థం - అని రెండు భాగాలుగా ఉంది. వాల్మీకి రచనను సంక్షేపించిన అభినంద పండితుడు ఏ కారణంచేతనో నిర్వాణ ప్రకరణం యొక్క ఉత్తరార్థాన్ని స్వీకరింపలేదు. ఇందువల్లే 'లఘు యోగవాసిష్ఠ' కావ్యం నిర్వాణ ప్రకరణం పూర్వభాగంతోనే పరిసమాప్తి పొందివుంది. ఇందులో పూర్వోత్తర భాగాల ప్రసక్తి లేకపోవటం గమనింపదగ్గ అంశం! ఈ సంగ్రహకావ్యాన్ని ఆధారంచేసికొని ఆ యా ప్రాంతీయభాషల్లో వెలువడిన అనేక అనువాదాలలాగే, మడికి సింగన, తరిగొండ వెంగమాంబ రచించిన వాసిష్ఠ రామాయణాలు రెండూ-పూర్వోత్తరభాగాల ప్రస్తావన (ప్రసక్తి) లేకుండానే-కేవలం పూర్వభాగ కథలతోనే పూర్తిగావింపబడివున్నాయి.

## కథాస్వరూపం:

పూర్వం భరద్వాజుడనే మునిపుంగవుడు మోక్షకాంక్ష మనస్సులో తీవ్రతరం కాగా, గురువర్యుడయిన వాల్మీకి మహర్షి సన్నిధికి వెళ్లి, ఆయన పాదపద్మాలకు సాష్టాంగదండప్రణామం కావించి, పరమభక్తితో ఇలా ప్రార్థించాడు: 'ఓ మహామునీంద్రా! మీరు వేదశాస్త్రాదిసద్విద్యలను ఏమాత్రం అరమర లేకుండా ప్రసాదించారు. ఆ రీతిగా నన్ను ఉత్తమ

విద్యావంతుణ్ణిగా ఉద్ధరించారు. అలాగే, మానవులు సంసారమనే మాయాసాగరాన్ని దాటి, పవిత్రమైన ముక్తిని పొందే మార్గాన్ని అనుగ్రహించండి!'. అనగా విని వాల్మీకి ఇలా పలికినాడు:

'నాయనా! భరద్వాజా! లోకు లందరినీ ఉద్ధరించే ఉత్తమమైన ఉద్దేశంతో అతిరహస్యమైన ప్రశ్న అడిగినావు. లోకమంతటికీ మేలు కలిగించే చక్కటిమార్గాన్ని ఉపదేశిస్తాను. శ్రద్ధగా వినవలసినది. ఈ లోకంలో ఏ వ్యక్తిఅయినా ఐహిక భోగాలను నిరసించి, తగిన గురుణ్ణి ఆశ్రయించి, శ్రద్ధతో సేవించి ముక్తిని పొందవచ్చు. ఆ విధంగా సద్గురు వర్యుణ్ణి ఆశ్రయించి జీవన్ముక్తులయిన వాళ్లలో శ్రీరాముడు అగ్రగణ్యుడు'.

ఆ పల్కులను ఆలకించిన భరద్వాజుడు శ్రీరాముని చరిత్రను వినిపింపవలసిం దని వాల్మీకిని వేడుకొన్నాడు. వాల్మీకి తెలిపిన రామకథ యిది:

'శ్రీమన్నారాయణుడు త్రేతాయుగంలో సూర్యవంశమందు శ్రీరాముడుగా అవతరించి పదునారేండ్లు దాటని వయస్సున ప్రవర్తిల్లుతూ వుండగా ఒకనాడు దేవతలు ఇలా ప్రార్థించారు:

'దేవా! మానవాళిని ఉద్ధరించటానికై మానవుడవుగా జన్మించావు. కులగురుడైన వసిష్ఠుణ్ణి ఆశ్రయించి వేదాంతజ్ఞానసారాన్ని ఆలకించు! లోకు లెల్లరూ మిమ్మల్ని ఆదర్శంగా గైకొని గురుశుశ్రూష కావించి కృతార్థులై తరిస్తారు!

శ్రీరాముడు దేవతల అభ్యర్థనను అంగీకరించి, ఐహికవిరక్తితో తీర్థయాత్రలు చేస్తూ, మున్యాశ్రమాలను సందర్శిస్తూ కొన్నాళ్లు గడపినాడు. అనంతరం అయోధ్యను చేరి తనకు మోక్షార్థతను ప్రసాదించే సద్గురువును గూర్చి ఆలోచిస్తూ ఉన్నాడు.

ఆ సమయంలో అయోధ్యకు విచ్చేసియున్న విశ్వామిత్ర మహర్షి విజయరాఘవుని విచారాన్ని గూర్చి విన్నాడు. ఆదరంతో దగ్గరకు పిలిచి, వాత్సల్యంతో ఇలా ఊరడించినాడు: 'అన్నా! రఘురామా! నీకు తెలియని జ్ఞానం ఉన్నదా! ఐనా గురుముఖతః వినదలంచినావు కదా! ఈ కోరిక

నీకు ఇంతటి పిన్నవయస్సులోనే కలుగటం విశేషం! శుకుడు నీలాగే పూర్వం తండ్రిని (వేదవ్యాసుణ్ణి) అడిగాడు. తన సమాధానం కుమారుని సందేహాన్ని నివారింపజేయనందున, వ్యాసుడు శుకుణ్ణి మిథిలా నగరాధిపతియగు జనకునివద్దకు పంపినాడు. జనకుని వాక్కులవల్ల మన స్సంశయం తీరిన శుకుడు నిర్వికల్పసమాధిద్వారా ముక్తిని పొందాడు.'

అని పల్కి, విశ్వామిత్రుడు రఘువంశ కులగురుడైన వసిష్ఠుణ్ణి చూచి 'యోగివర్యా! తమ ప్రియశిష్యుడికి తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించండి!' - అని ప్రోత్సహించాడు. వసిష్ఠుడు అందుకు అంగీకరించాడు. బ్రహ్మదేవుడు పూర్వం తనకు ఉపదేశించియున్న జ్ఞానసారాన్ని ఇలా విశదీకరింప నారంభించాడు:

'రఘువంశసోమా! శ్రీరామా! మానవప్రయత్నం (పౌరుషం) ఉచ్ఛాస్త్రము, శాస్త్రితము - అని రెండురకాలు. అందులో మొదటిది ఐహికానికి సంబంధించింది. రెండవది పరమార్థ సౌఖ్యాన్ని ప్రాప్తింపజేసేది. కాబట్టి జిజ్ఞాసువైనవాడు రెండవదానిచే మొదటి దానిని అణచి వైచి, మనశ్శాంతిని పొందాలి. మోక్షమనే మందిరానికి i) శాంతి ii) విచారం iii) సంతృప్తి iv) సత్సాంగత్యం - అనే నలుగురు ద్వారపాలకులు ఉన్నారు. ఈ నల్వురిలో ఏ ఒక్కరు పరిచయమయినా తక్కిన ముగ్గురు స్వాధీనులు అవుతారు. వీరి ప్రభావంవల్ల క్రమంగా సంసారబంధం తొలగిపోతుంది. ఈ విషయాలను వివరించే మోక్షశాస్త్రాన్ని తెలిసికోవడంవల్ల పూర్ణాయువు, ఆరోగ్యము, కీర్తి - మొదలైన ఐహిక ఫలితాలతో పాటు, జన్మరాహిత్యం కూడ చేకూరుతుంది.'

అనంతరం వసిష్ఠుడు కొన్నిఉపాఖ్యానాల మూలంగా ఈ ప్రపంచంయొక్క ఉత్పత్తిని గూర్చి వివరించాడు. ఆ ఉపాఖ్యానాల్లో మొదటిది ఆకాశజోపాఖ్యానము. ఆకాశజుడనే బ్రాహ్మణుడు ఎలాంటి కర్మములు చేయనివాడైనందున మృత్యుదేవి ఆతణ్ణి కబళింపజాలక పోయింది. రెండవదైన లీలోపాఖ్యానంలో పరమాత్మ మాయచేత జగములను కల్పించే సరణి చెప్పబడింది. కర్కటికథ, ఇందు పుత్రో పాఖ్యానము, కృతిమేంద్రోపాఖ్యానము, చిత్తోపాఖ్యానము, బాలకోపాఖ్యానము, లవణ శాంబరికోపాఖ్యానము - వీటి ద్వారా విశ్వోత్పత్తికి సంబంధించిన

వేదాంత విషయాలు వెల్లడింపబడినాయి. ఇంతవరకు చెప్పబడిన ఈ కథలన్నీ కలిసి 'ఉత్పత్తి ప్రకరణం'గా రూపొందాయి.

రెండవదైన 'స్థితి ప్రకరణం'లో శుక్రోపాఖ్యానము, శంబరోపాఖ్యానము, భీమాద్యుపాఖ్యానము, దాశూరోపాఖ్యానము, ఉపదేశోపాఖ్యానము - అనే కథల మూలంగా ఈ జగత్తుయొక్క స్థితి విశదీకరింపబడింది.

మూడవది 'ఉపశమప్రకరణం'. ఇందులో జ్ఞానం ద్వారా ప్రపంచోపశమనం (అజ్ఞానం ఉపశమించటం) వల్ల కలిగే విధానాలు తెలుపబడినాయి. జనకోపాఖ్యానము, పుణ్యపావనులకథ, బల్యుపాఖ్యానము, ప్రహ్లాదోపాఖ్యానం - మొదలయిన పదికథలద్వారా అజ్ఞానం ఉపశమించిన వెంటనే శాంతి కలిగి, జ్ఞానోదయం అవుతుందనే సత్యం ప్రవచింపబడింది.

చతుర్థ, పంచమప్రకరణాల్లో అవిద్యానాశంచేత సుజ్ఞానం ఉదయించి, ఆత్మానందం (నిర్వాణం) సిద్ధించే విధము, ధారణాయోగం (ప్రాణాయామం)వల్ల చిరంజీవిగా కొనసాగేవిధానం మొదలైన అపూర్వమైన అంశాలు నిరూపింపబడినాయి. ఇందునిమిత్తమై చతుర్థ ప్రకరణంలో భుశుండోపాఖ్యానము మొదలుగాగల తొమ్మిదికథలు, అలాగే పంచమప్రకరణంలో కచోపాఖ్యానము మొదలైన ఆరుకథలు చక్కని దృష్టాంతాలుగా ప్రతిపాదింపబడివున్నాయి.

## అనువాదవిధానం:

ఇంతటి ప్రసిద్ధిగల ఈ తాత్త్విక కావ్యాన్ని తన ఆత్మ తరించటానికై రచిస్తూవున్నట్లు వెంగమ్మ ఈకృతి ఆరంభంలో అత్యంత నిరాడంబరంగా పేర్కొన్నది. అయినా, ఈ కావ్య మందలి ఆ యా ప్రకరణాంతద్విపద పంక్తుల్లో "సదమలులై వ్రాసి చదివిన వినిన, నరులు తాపత్రయార్ణవము తరించి, పరమైన నిర్వాణపదము నొందుదురు" - అని ఫలశ్రుతి వ్యాజంతో ఈ కావ్యప్రయోజనాన్ని ప్రబోధించింది.

సకలపురుషార్థప్రదమూ, విమలమోక్షాకరమూ - అయిన ఈ ఆధ్యాత్మికకావ్యాన్ని అనువదించటంలో కవయిత్రి ఒక ప్రత్యేక పద్ధతిని అవలంబించింది.

వసిష్ఠమహర్షి ఆకర్షణీయములయిన వేర్వేరు ఉపాఖ్యానాల ద్వారా వేదాంతవిజ్ఞానాన్ని ఉపదేశించి వుండటంచేత ఈ కావ్యం చిత్ర విచిత్రాలైన కథలకు నిలయమై వెలసింది. ఇలాంటి విచిత్రకథలు చిన్నవి, పెద్దవి కలిసి ఈ కృతిలో ఇంచుమించు ఏబది ఉన్నాయి. ఇలాగ కమనీయ కథల నెపాన తాత్త్వికసందేశాన్ని లోకానికి అందిస్తున్న ఈ ఆధ్యాత్మిక కావ్యాన్ని ఆంధ్రీకరించటంలో వెంగమాంబ ప్రతి ఉపాఖ్యానాన్ని వీలైనంత మేర సంగ్రహించి, తత్సందేశాన్ని స్వానుభవ మిళితంగా, సూటిగా, సులభశైలిలో తెలియబల్కింది.

ఆది ప్రకరణంలోని 'లవణ శాంబరికోపాఖ్యానము' ఈ విషయమై ఒక చక్కని ఉదాహరణం. లవణుడనే రాజు తన కొలువులోకి వచ్చిన ఒకానొక ఐంద్రజాలికుని మాయవలన జవనాశ్వాన్ని ఎక్కిపోయి, ఘోరారణ్యంలో నివసిస్తూవున్న చండాలయువతిని పెండ్లాడుతాడు. ఆమెవల్ల అనేకసంతానాన్ని పడసి, అనేకవత్సరాలు జీవించి వృద్ధుడై, కఱవు బాధతో ఒకనాడు అగ్నిలో ప్రవేశిస్తాడు. ఈ అనుభవమంతా ఆ రాజు సింహాసనంమీద కనుమూసి నిద్రించినట్లున్నంత సమయంలో కలవలె జరిగిపోయింది. అటు పిమ్మట లవణుడు ఉలికి పడి మేల్కొంటాడు. మంత్రులు ఉలికిపాటుకు కారణం అడుగగా, ఆ రాజు వారి కందరికి తన స్వప్నానుభవాన్ని వివరిస్తాడు. ఈ వృత్తాంతం మూలంలో తొంభైశ్లోకాల్లో వర్ణింపబడివుంది.[5] కవయిత్రి ఈ కథను కేవలము 28 ద్విపదల్లో సంగ్రహీకరించింది.[6]

దేశ కాలాలు మనస్సుకు అధీనాలు. మనో విలసనమే జీవునికి బంధం. దానిని నిరాకరించటమే ముక్తి. మనోవిలాసంవల్ల గోష్పాదం (ఆవుకాలి గుర్తు) అంత ప్రదేశంకూడా ఆమడగా తోస్తుంది.ఒక క్షణ కాలంకూడా బ్రహ్మకల్పంగా భాసిస్తూ వుంటుంది. ఈ శాశ్వత సత్యాన్ని బోధించటానికే వసిష్ఠుడు లవణోపాఖ్యానాన్ని తెల్పినాడు.

5. చూ. 'లఘుయోగవాసిష్ఠః' III ప్రకరణమ్, 8సర్గః, పుటలు 83-85.

6. చూ. 'వాసిష్ఠ రామాయణము', పుటలు79-81.

ఈ కవయిత్రి అనువాద విధానానికి మరో ఉదాహరణ 'శిఖిధ్వజోపాఖ్యానము'. 'చూడాలకథ' - అనేది దీనికి నామాంతరం. మాళవదేశపురాజు శిఖిధ్వజుడు. ఆతని భార్య చూడాల. చాలాకాలం రాజ్యసుఖాలను అనుభవించిన తదుపరి ఆ దంపతులకు ఆత్మజ్ఞానాన్ని గూర్చిన జిజ్ఞాన కలిగింది. చూడాల నంరుచిరప్రయత్నంతో అచిరకాలంలోనే తత్త్వజ్ఞానాన్ని సాధించింది. తన కది సిద్ధింపనందు వల్ల శిఖిధ్వజుడు విరక్తుడై ఉడవికి వెళ్లి, తీవ్రంగా తపమాచరింప నారంభించాడు.

అందువల్ల, రాజ్యపాలనాభారాన్ని వహించిన చూడాల యోగశక్తిచే అప్పుడప్పుడు భర్త (శిఖిధ్వజుని) ఆశ్రమానికి 'కుంభు'డనే మునికుమారుని రూపంతో వెళ్లి, ఆతనికి తత్త్వజ్ఞానాన్ని చక్కగా ఉపదేశిస్తూ వచ్చింది. ఆ విధంగా తనకు జ్ఞానోదయం కావటానికి కారణుడైన ఆ ఋషికుమారుడు తనపత్నియే అని రాజు చివరకు గుర్తించి సంతోషించాడు. అలాగ పరిపూర్ణ జ్ఞానవంతులైన ఆ రాజదంపతు లిద్దరు రాజధానిని ప్రవేశించి, మునుపటి రాజభోగాలను అనుభవించటం ద్వారా ప్రారబ్ధాన్ని ముగించి, పరమపదవిని పొందినారు.

ఈ ఉపాఖ్యానం వాసిష్ఠరామాయణం యొక్క స్వరూప స్వభావాలకు సంగ్రహరూపేణ ప్రాతినిధ్యం వహిస్తూ వుంది. ఈ కావ్యంలో అనేక ఉపాఖ్యానా లున్నట్లే, ఈ కథలోనూ కిరాట, చింతామణి, గజేంద్ర- ఉపాఖ్యానాలనే చిన్నచిన్నకథలు అంతర్గతములై ఉన్నాయి. ఈ ఉపాఖ్యానం మొత్తంమీద ఈ కావ్యం ఉద్దేశించిన తాత్త్విక సందేశాన్ని అందివ్వగల్గినదై వున్నది.

ఈ ఉపాఖ్యానికి ఇంతటి ప్రాముఖ్యం ఉన్నందువల్లనే వెంగమాంబ దీనిని మరింత సంక్షేపించక, మూలానికి కుడియెడమగా అనువదించింది. మూలంలో 640 శ్లోకాల్లో ఉన్న[7] ఈ కథాంశాన్ని కవయిత్రి దాదాపు 600 ద్విపదల్లో వెలయించింది.[8]

వెంగమాంబ వాసిష్ఠ రామాయణ అనువాద పద్ధతికి ఈ ఉపాఖ్యానం ఒక ఉత్తమోదాహరణం. వాసిష్ఠంలో శ్రీరాముడు తీర్థయాత్రలను కావించినట్లే, ఇందులో శిఖిధ్వజుడు తీర్థయాత్రలు చేసివస్తాడు. ఈ శిఖిధ్వజుని తీర్థయాత్రా వృత్తాంతం కవయిత్రి కల్పించిందే! ఈ కథాంశకల్పన వల్ల ఈ ఉపాఖ్యానానికి ప్రధానకథతో చక్కని సామ్యం సిద్ధించింది.

ఈ మహా కావ్యంలో ప్రతిబింబించిన ఆ యా పాత్రల చిత్రణకూ, సన్నివేశాల చక్కదనానికీ, సంభాషణల తీర్మానానికీ - ఈ శిఖిధ్వజోపాఖ్యానం ఒక మచ్చు తునక! చూడాల ధరించిన కుంభుడనే బ్రహ్మచారి స్వరూపం, కుంభుడు శిఖిధ్వజుణ్ణి ఆశ్రమంలో ప్రప్రథమంగా కలిసికొన్న సన్నివేశం, కుంభుడు శిఖిధ్వజునికి కావించిన జ్ఞానోపదేశం - అనేవి అందుకు క్రమంగా ఉదాహరణలు.[9] ఒక్కమాటలో, ఈ ఆధ్యాత్మిక కావ్యం యొక్క సందేశమంతా కుంభుడు (చూడాల) శిఖిధ్వజునకు దెల్పిన గజోపాఖ్యానంలో నిక్షేపింపబడివుంది.[10]

మొత్తంమీద వెంగమాంబ వాసిష్ఠ రామాయణానువాదం మూలకథాసూత్రం ఆలంబనంగా ఆవశ్యకమైనచోట్ల చేయబడిన చిరుమార్పులతో, సహజమైన భాషలో, సరళమైన శయ్యలో, సంగ్రహంగా, స్వేచ్ఛగా, సుందరంగా సాగింది.

---

7. చూ. 'లఘుయోగ వాసిష్ఠః', VI ప్రకరణమ్, 9 సర్గః, పుటలు 669-864.

8. చూ. 'వాసిష్ఠ రామాయణము', చతుర్థ ప్రకరణము, పుటలు.244-292.

9. చూ. 'వాసిష్ఠ రామాయణము', అందే పుటలు.258-253.

10. చూ.అందే, పుటలు.267-270.

## స్వతంత్ర కల్పనలు:

కవయిత్రి ఈ కావ్యంలో కల్పించిన కథాంశాల్లో దేవతలు శ్రీరాముణ్ణి ప్రార్థించటం ఒకటి:

'దేవాదిదేవా! నీవు దశరథపుత్రుడవుగా అవతరించిన శ్రీమహావిష్ణుదేవుడవు. మానవాళిని మోహసముద్రంలో పడి మునిగి పోనీయకుండా ఉద్ధరించే కారణకర్తవు. కాబట్టి, వసిష్ఠ సంయమిని ఆశ్రయించి, సరస వేదాంత విజ్ఞాన ధర్మాలను ఆలకించవలె' - అని అనిమిషులు బహురీతుల ప్రార్థిస్తారు. శ్రీరామచంద్రుని పరాత్పరత్వాన్ని ప్రకటించే నిమిత్తమై కవయిత్రి ఈ కల్పనను కావించింది.[11]

వెంగమ్మ ఈ మహాకావ్యంలో కావించిన స్వతంత్ర కల్పనలలో పూర్వరామాయణ కథాసంగ్రహం అత్యంత ముఖ్యమైనది. వసిష్ఠుడు తనకు జ్ఞానోపదేశం చేసిన పిమ్మట, విశ్వామిత్రుని వెంట యాగసంరక్షణార్థమై లక్ష్మణునితోపాటు వెళ్తాడు. అది మొదలుకొని, శ్రీరాముడు రావణున్ని సంహరించి, సీతాసమేతుడై అయోధ్యనుచేరి, పట్టాభిషిక్తుడై, ప్రజలను పాలించేటంత వరకు గల యావద్రామాయణకథ నిర్వాణ ప్రకరణం చివరన సంగ్రహంగా ముప్పది రెండు ద్విపదలలో సమకూర్చబడింది.[12] ఈ సంగ్రహరామాయణ మహనీయగాథ ఈ కథను మంగళాంతం కావిస్తూ, వాసిష్ఠ రామాయణ మహాకావ్యానికి మకుటాయమానమై విలసిల్లుతూవుంది! ఈ రీతిగా అవకాశం లభించిన ప్రతిచోటా రామకథను సమగ్రంగా, సంగ్రహంగా, వర్ణించటం ఈ కవయిత్రీమతల్లికి మిగుల అభిమానపాత్రమైన విషయం![13]

---

11. చూ. అందే, ఆదిప్రకరణము, పుటలు.6-7.

12. చూ. అందే, పంచమప్రకరణము, పుటలు.345-348.

13.i) 'శ్రీ వేంకటాచలమాహాత్మ్యము' (పద్యకావ్యం)లో వైకుంఠ గుహావృత్తాంత సందర్భంలో కవయిత్రి సూతునిచే రామకథను సంగ్రహంగా చెప్పించింది. చూ. I ఆశ్వా., 242-244 ప.
ii) 'జలక్రీడావిలాసము' (యక్షగానం) లోనూ వెంగమాంబ యశోదచే బాలకృష్ణునకు రామాయణగాథను "ఊకుడు కత"గా చెప్పించింది. చూ. పుట......

## రాజవిద్య:

ఈ తాత్త్వికకావ్యంలోని ఉపాఖ్యానాలను క్షుణ్ణంగా పరిశీలిస్తే, ఇవి చాలవరకు రాజులకు సంబంధించిన గాథలుగా వున్నాయనే సత్యం విదితమౌతూవుంది. ఈ అంశాన్ని బట్టి, యువరాజైన రఘురాముడు సందేహనివృత్తిని పొంది స్వధర్మమునందు ప్రవృత్తు డవటానికై కులగురువగు వసిష్ఠభగవానుడు అలాంటి రాజన్యుల వృత్తాంతాలనే ఎన్నుకొని, దాశరథికి తత్త్వబోధ కావించియున్నా డని భావింపవచ్చు. ఇందువల్లనే కాబోలు, ఈ కావ్యంలో ప్రపంచింపబడిన ఆధ్యాత్మిక జ్ఞానం ''రాజవిద్య''గా పేర్కొనబడింది. ఈ అభిప్రాయమే బృహద్ వాసిష్ఠరామాయణమందలి ఈక్రింది శ్లోకంలో స్పష్టంగా ఉల్లేఖింపబడింది:

"అధ్యాత్మవిద్యా తే నేయం పూర్వం రాజసు వర్ణితా।
తదనుప్రసృతా లోకే రాజవిద్యే త్యుదాహృతా॥"[14]

'ఈ అధ్యాత్మవిద్య పూర్వకాలంలో రాజులకు చెప్పబడింది. అటు తరువాత లోకంలో ప్రచారం కావింపబడింది. అందువల్ల ఇది 'రాజవిద్య'గా పేర్కొనబడింది.'

పైన తెల్పిన రీతిగా ఇది 'రాజవిద్య'యైనను,రాజులకేగాక, తదితరు లందరికిని ఆవశ్యకమైనదే. 'రాజైన (శ్రేష్ఠమైన) విద్య'యైన ఈ దివ్య జ్ఞానాన్ని వ్యాపింపజేసి, లోకాన్ని ఉద్ధరించటానికే బ్రహ్మదేవుడు వసిష్ఠుణ్ణి సృజించినాని ఈ క్రింది ద్విపద పంక్తులలో ప్రకటింపబడింది:

"సరస భారతవర్ష - సంభవులైన
నరులు పామరులు, నా-నావిధావ్యాయ

కలితులు, లోభులు, - కాముకుల్, జడులు
బలవిహీనులు, మోహ-పరవశుల్, శఠులు,

14. చూ. 'శ్రీయోగవాసిష్ఠము', Vol 1. ముముక్షు వ్యవహార ప్రకరణమ్, 11సర్గః, 17శ్లో ఏర్పేడు శ్రీవ్యాసాశ్రమము వారి ప్రచురణ, తృతీయ ముద్రణ (1987).

గురువంచకులును, మూ-ర్ఖులు, దాంభికులును,
పరధనాసక్తులు,-పరసతీరతులు

కావున బహునార-కములందు మునిఁగి
పోవుదు రని తన-బుద్ధి నూహించి,

శోకింపుచుండెడి-సుతులకై తాను
శోకించు జనకుని-చొప్పున నజుఁడు

చింతించి, జప, హోమ,-శీల, ధర్మములు,
వంతుకెక్కిన తపో-వ్రతములు జనుల

శాంతిఁ బొందింపఁ-జాల, వందఱికి
సంతోషమిచ్చు సు-జ్ఞానం బటంచు

మది నిశ్చయించి, స-మ్మతముగా నన్ను
ముదమొప్పఁ దన మనం-బుననె సృజించె."

-ఆదిప్రకరణము, 511-516 ద్విపద పంక్తులు, పుటలు 25-26.

ఈ కావ్యంయొక్క ఉపక్రమ, ఉపసంహారాలు, వేర్వేరు ప్రకరణాల ఆద్యంతాలు మిగుల నిరాడంబరంగా నెలకొనివుండి, ఈ కావ్యానికి నిండుకుండతోడి సామ్యాన్ని సంతరింపజేశాయి. ఒక్కమాటలో, అతిగహనములైన ఆధ్యాత్మికవిశేషాలను తేటతెలుగు ద్విపదలలో సులభమైన శైలిలో సుబోధంకావిస్తూ వున్న ఈ కృతిరత్నం తెలుగులో వెలసిన వేదాంతకావ్యాల్లో అద్వితీయంగా అలరారుతూవుంది!

## ఒకటి రెండు ముఖ్యాంశాలు:

**1) తాత్త్విక కవయిత్రి, సహజ కవయిత్రి, ఆశుకవయిత్రియైన వెంగమాంబ ఈ ద్విపదకావ్యంలో కొన్నిచోట్ల తత్త్వకీర్తనల శైలిలో ద్విపదలను నడపినది. ఆధ్యాత్మిక భావాలు ఉట్టిపడుతూవున్న ఆ ద్విపద పంక్తులు తగిన రాగంతో జతగూర్చి తత్త్వకీర్తనలుగా పాడుకోవటానికి అనువుగా అమరి ఉన్నాయి.**

తృతీయ ప్రకరణంలోఉద్ధాలకోపాఖ్యానంలో "మనస!"- అనే మకుటంతో జాల్వారిన తొమ్మిది ద్విపదలు ఈ విషయమై ఒక చక్కని ఉదాహరణ:

"అక్కట! చిత్తమా!-హరియందు నిలువ
కెక్కడికో తేర-కేగుచున్నావు,
ధరను మాయా సంప-దల విచారించి
కరఁగి నీవేమి సౌ-ఖ్యముల నొందెదవు? ౧

పరువడిగా శ్రోత్ర-భావంబు నొంది
మురిసి ఘంటానాద-మును విని చొక్కి,
యుడుగక వేఁటకాఁ-డొడ్డిన వలను
బడు జింకగతిని లోఁ-బడకవే మనస! ౨

చర్మభావము నొంది-సంస్పర్శ సుఖము
నర్మిలిఁ గోరి మ-హా గజేంద్రుండు
కరిణితో నెరయ న-క్కడఁ బర్వు బాఱి,
యరిగి యచ్చటి యోద-మందుఁ దాఁ గూలు
కరణిని సంసార-గహన కూపమునఁ
బరువడి నెఱి దప్పి-పడకవే మనస! 3

వదలక రసనభా-వము నొంది యెఱ్ఱ
నదిమి మ్రింగెద నంచు - నరిగి, గాలమును
మ్రింగి చచ్చినంగుట్టి - మీనంబు పగిదిఁ
బొంగుచు రుచిఁగోరి - పొలియకే మనస! ౪

నేత్ర భావము నొంది - నిగుడుచు మీన
నేత్రలు మొదలుగా - నెఱయు దృశ్యముల
యం దాసపడి యగ్ని - నణఁగిన మిడుత
చందంబుగా నీవు - చావకే మనస! ౫

పనుపడి నాసికా - భావంబు నొంది
ఘన సుగంధముఁ గోరి-కమల మధ్యమునఁ
జెఱయున్న భృంగంబు - చెలువునఁ గర్మ
చిరవాసనలయందుఁ - జిక్కకే మనస! ౬

మెఱయు జింకయుఁ గరి - మిడుత, మీనంబు,
నరయఁగా భృంగ మి-ట్లాశలఁ బొంది,
యొక్కటొక్కటిచేత - నొకటొక టణఁగు;
నక్కట! నిటువంటి-యైదింద్రియముల
నెనసియుండంగ నీ-వెటు తరించెదవు?
చెనఁటుల పొందు వ-ర్జింపవే మనస! ౭

అటువంటి వాసన-లన్ని బంధకము,
లిటువంటి రీతుల-నెఱిఁగి, వైరాగ్య
చింతన సతతంబుఁ-జేసిన నీవు
శాంతిఁ బొందెదవు ని-శ్చయముగా మనస! ౮

సకల ప్రపంచంబు-సత్తా స్వరూప,
మకలంక, మద్వయ-మని నిశ్చయించి,
ఆ యాత్మ నేనైన-యప్పుడు వేఱె
నీ యత్నములు సాగు-నే? వెఱ్ఱి మనస! ౯

అజ్ఞానవైరి ని-న్నలమటఁ బెట్టెఁ,
బ్రజ్ఞచే నటువంటి-పాపాత్ముఁ బట్టి,
తునుమాడి, యధిక సం-తోషంబు నొంది,
అనిశంబు నీ వాత్మ-యందుండు మనస!" ౧౦

— తృతీయ ప్రకరణము, పుటలు 157-160

**2) విశిష్టమయిన శ్లోకం:** సంస్కృత వాసిష్ఠ రామాయణంలో ఐదవదైన ఉపశమప్రకరణం 78వ సర్గలో ఈక్రింది శ్లోకం ఉంది:

> **"ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానంచ రాఘవ||**
> **యోగః తద్వృత్తిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్||"[15]**

'చిత్తము చలింపక యుండునట్లు చేయుటకు అవలంబింపదగిన మార్గమేది?'

- అని శ్రీరాముడడిగిన ప్రశ్నకు సమాధానముగా వసిష్ఠుడు పల్కినది పైశ్లోకము.

'ఓ రాఘవా! చిత్త నాశమునకు (చిత్తమును అణచుటకు) 'యోగము', 'జ్ఞానము' అని రెండు మార్గాలు ఉన్నాయి. 'యోగ' మంటే చిత్తవృత్తులను నిరోధించటం, 'జ్ఞాన' మంటే సమ్యక్ దర్శనము' - ఇది పై నుదాహరించిన శ్లోకం యొక్క సారాంశం.

తి.తి.దేవస్థానముల సాహాయ్య సహకారాలతో శ్రీవేంకటేశ్వరుని పేరిట విశ్వవిద్యాలయం నెలకొల్పబడిన తరుణంలో ఆ విశ్వవిద్యాలయానికి అనుగుణమైన ఆదర్శవాక్యం (motto) గా పై శ్లోకంలోని నాలుగవ పాదం "జ్ఞానం సమ్యగవేక్షణమ్" - అనేది అప్పట్లో విజ్ఞులచే స్వీకరింపబడింది.

ఈ రీతిగా ప్రఖ్యాతిగాంచిన పైశ్లోకానికి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వెలయించిన అనువాదాన్ని పరికించడం ఈ సందర్భంలో మిగుల సముచితమైన సంగతి:

"ఓ మునీశ్వర! యూర-కుండక చిత్త
మేమిటఁ జలియించు? - నేమిట నిలుచుఁ?

గరుణ నా చిత్తరో-గంబు హరించు
పరమౌషధంబుఁ జె-ప్పందగు' ననిన

15. మూ. 'శ్రీ యోగవాసిష్ఠము' Vol. 4, పుట 1879, V ప్ర. 78సర్గ, 8శ్లో,
ఏర్పేడు శ్రీవ్యాసాశ్రమమువారి ప్రచురణ, తృతీయ ముద్రణ (1999).

విని వసిష్ఠుఁడు పల్కె-'విను రామచంద్ర!
ఘనమైన చిత్తరో-గమునకు రెండు

గల వౌషధములు: యో-గ మనంగ నొకటి,
యలఘు తత్త్వజ్ఞాన - మన్నది యొకటి

యున్నది' విను! యోగ-ముఱుకు చిత్తమును
పన్నుగాఁ బిగఁబట్టి - బంధింపనోపు;

పరమ విజ్ఞాన మా-పరమవస్తువును
సురుచిర ప్రజ్ఞచేఁ - జూపఁగా నోపు."

- తృతీయ ప్రకరణము, పుట 179

**పరిష్కరణ:**

ఈ గ్రంథం యొక్క పరిష్కరణ కార్యానికి ఆధారమయిన ప్రతులు రెండు. అందులో ఒకటి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ యందలి కాగితపు వ్రాతప్రతి. దీనీ సంఖ్య ఆర్ నం. 2348 (Paper). ఈ ప్రతికి "వేం" - అనే అక్షర సంకేతం ఉంచబడింది. రెండవది వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ (చెన్నపురి) వారిచే 1925లో ప్రకటింపబడిన ప్రతి. ఇందులో ఎలాంటి లఘుపీఠికగాని, పరిష్కరించినవారి పేరుగాని, విషయసూచికగాని లేవు. ఇందలి కాగితాలు పాతబడి, గుజిలీ ప్రతులకు సన్నిహితమగు స్వరూపాన్ని సంతరించుకొని వుంది. ఈ ముద్రితప్రతి ప్రకృతపరిష్కరణలో "వా"- అనే అక్షర సంకేతంతో పేర్కొనబడింది.

**మొదట ఈ రెండు ప్రతుల్లోని లేఖనదోషాలను, అచ్చు తప్పులను సవరించిన, అనంతరం, ఈ రెండు ప్రతులను తులనాత్మకంగా (సరిపోల్చి) పరిశీలిస్తూ మేలుప్రతిని (Master Copy) తయారుచేయటం జరిగింది. సరియైన పాఠాన్ని గ్రంథం (Text) లోనూ, అలాగే అర్థవంతమైన పాఠాంతరం ఉంటే, దానిని ఆ ప్రతియొక్క అక్షర సంకేతంతో అధోజ్ఞాపిక (foot-notes) లోనూ సూచించటం జరిగింది.**

వావిళ్లవారి ముద్రితప్రతిలో యతిమైత్రి పొసగనటువంటి ద్విపదపాదాలు,పదాల స్వరూపం మార్పునొంది అర్థసంక్లిష్టత ఏర్పడియున్న చోటులు ప్రశ్నార్థక చిహ్నం (?)తో గుర్తింపబడివున్నాయి.

అలాంటి సందర్భాలన్నీ వ్రాతప్రతి సహాయంతో సముచితంగా సవరింపబడినాయి.

సహజ కవయిత్రి, ప్రజాకవయిత్రి యయిన మాతృశ్రీ తరిగొండ వెంగమాంబగారి ప్రయోగసరణిని దృష్టిలో నిడుకొని ఈ కావ్య పరిష్కరణంలో ఛందో, వ్యాకరణాది లక్షణానుసరణం మెలకువగాయి పాటింపబడింది.

అద్వైతతత్త్వాన్ని ప్రపంచించే కావ్యాల్లో అగ్రగణ్యంగా విరాజిల్లుతూవున్న ఈ కావ్యరత్నంయొక్కపరిష్కరణ కార్యాన్ని మొత్తంమీద ఈ కవయిత్రీమతల్లి హృదయానికి అనుగుణంగా కొనసాగించియున్నా నని సహృదయ లోకానికి విన్నవిస్తూవున్నాను.

'శ్రీరామునిలాంటి శిష్యోత్తముడూ, వసిష్ఠునివంటి వరిష్ఠుడైన ఆచార్యోత్తముడూ, వాసిష్ఠ రామాయణం లాంటి ఆధ్యాత్మిక కావ్యమూ అంతకు పూర్వం లేవు; ఇకపై ఉండవు'- అనే ప్రసిద్ధి సంస్కృత మూలంతోపాటుగా, సుపరిష్కృత రూపంతో ఇప్పుడు వెలువడుతూవున్న ఈ మహాకావ్యానికి శ్రీవారి కృపావిశేషంతో ఇంతోఽధికంగా చేకూరగలదని ఆశిస్తున్నాను.

**"శ్రీరామసదృశః శిష్యః, వసిష్ఠసదృశో గురుః।**
**వాసిష్ఠసదృశం కావ్యం నభూతో నభవిష్యతి॥"**

* * *

# కృతజ్ఞతాంజలి

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టును నెలకొల్పటంలోనూ, దానికి శాశ్వత స్థితిని ప్రసాదించటంలోనూ ఆదినుండీ మూలవిరాట్టుగా విలసిల్లుతూవున్న శ్రీవారి ప్రతినిధులు,సహృదయ వతంసులు, సుగృహీత నామధేయులు, పరిపాలనా దక్షులు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి అధ్యక్షవర్యులు శ్రీభూమన కరుణాకరరెడ్డి మహెూదయులకు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి సభ్యులెల్లరకు నా అనేక ధన్యవాదములు.

శ్రీవారిప్రతినిధులు స్మితపూర్వభాషులు, మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుకు చిరస్థాయి యయిన అభ్యుదయాన్ని, సమగ్రతను ప్రసాదిస్తూవున్న సహృదయతంసులు తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు, పరిపాలనాదక్షులు, సుగృహీత నామధేయులు శ్రీ కె.వి. రమణాచారి, ఐ.ఏ. యస్., మహెూదయులకు నా అనేక ధన్యవాదములు.

తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి, సౌజన్యహృదయులు శ్రీ ఎ.వి. ధర్మారెడ్డి గారికి నా అనేక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుయొక్క సర్వతోముఖమైన వికాసానికి తమ వ్యక్తిత్వ లక్షణమైన ఉద్యమస్ఫూర్తిని సమన్వయించి ఉత్సాహ, ప్రభు, మంత్రశక్తి పూరితమైన దక్షతతో ముందుకు నడిపిస్తూ వున్న తి.తి.దే. "శ్వేత" సంచాలకులు, "భూమన్' గా సుగృహీతనామధేయులైన శ్రీ భూమన్ సుబ్రహ్మణ్యం రెడ్డి మహెూదయులకు నా అనేక హృదయపూర్వక ధన్యవాదములు.

తి.తి.దే. పౌరసంబంధాధికారివర్యులు, సరసహృదయులు శ్రీయుతులు కె. రామ్‌పుల్లారెడ్డిగారికి నా అనేక కృతజ్ఞతాభివాదములు.

సహృదయులు మాతృశ్రీతరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు సమన్వయకర్త ఇన్‌ఛార్జ్ విద్వాన్ డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య గారికి హార్దమైన నా కృతజ్ఞతాభినందనములు.

"శ్వేత" కేంద్రగ్రంథాలయం లైబ్రేరియన్ సోదరీమణి శ్రీమతి ఎన్. లీలావతి గారికి, వారి సహోద్యోగులయిన మిత్రబృంద మందరికీ - "శ్వేత" సంస్థ కార్యాలయం సూపరింటెండెంట్ శ్రీ వి. దామోదరంగారికి, శ్రీదీనదయాళ్(యు.డి.సి.)గారికి వారి సహోద్యోగబృందమందరికీ, నా అనేక కృతజ్ఞతాభినందనములు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ డైరెక్టర్ ఆచార్య వి. వేంకటరమణారెడ్డి గారికి, వారి సహోద్యోగులకు అనేక హార్ద కృతజ్ఞతాభినందనములు.

ఈ పుస్తకమును ముచ్చటగా ముద్రించిన తిరుమల తిరుపతి దేవస్థాన ముద్రణాలయ అధికారులకు నా కృతజ్ఞతాభినందనములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబా మహాకవయిత్రియొక్క ఆరాధ్యదైవమయిన "శ్రీ తరిగొండ శేషకుధరాధ్యక్షు"నకు నా భక్తి పూర్వక ప్రసూనాంజలి.

**కె. జె. కృష్ణమూర్తి**

# వాసిష్ఠ రామాయణము

## విషయసూచిక

శ్రీరస్తు

# వాసిష్ఠ రామాయణము

## ఆదిప్రకరణము

### * ఇష్ట దేవతా, గురు వందనము *

శ్రీవిఘ్ననాథుని - క్షేత్ర పాలకుని,
శ్రీవాణినిన్, విరిం-చిని, హయాననుని,

నలఘు దుర్గను, చౌడ-మాంబను, శివుని,
నల వరాహస్వామి - నాత్మయం దుంచి,

భక్తిచే నెపుడు సు-బ్రహ్మణ్య గురుని
ముక్తిప్రదుని పాద-ముల నాశ్రయించి,

మురిసి నవగ్రహ-మ్ములకుఁ గేల్మోగిచి,

### * రచనోద్దేశము *

ధరణిమీఁద మదాత్మ - తరియించుకొఱకు

సామోదమతిని సు-జ్ఞానవాసిష్ఠ
రామాయణార్థ సా-రమును గ్రహించి,

వరుసగా ద్విపద కా-వ్యముగా రచించి
యఱలేక మీకు స-మర్పింతు నిపుడు,

శ్రీతారకోల్లాస! - శ్రీశ్రీనివాస!
శ్రీ తరిగొండ నృ-సింహ! ధూతాంహ!

విన్నవించెద నేను - వినుఁ డదె ట్లనిన

### * కథోపక్రమము *

మున్ను భరద్వాజ - ముని పుంగవుండు
మోక్షేచ్ఛ నిజచిత్త-మునఁ బ్రకాశింప

[1]నక్షీణభక్తినిఁ - బ్రియము రెట్టింప
వరవిరక్తినిఁ బొంది - వాల్మీకిమౌని

చరణాంబుజములకుఁ - జాఁగిలి మ్రొక్కి,
వినుతులు పెక్కు గా -వించి యిట్లనియె:

### * భరద్వాజుని ప్రశ్న *

'ఘనమునీశ్వర! మీరు - కరుణించి నాకు

వేదశాస్త్రాది స-ద్విద్య లన్నియును
భేదంబు లేకుండ - చెప్పి ప్రోచితిరి;

మనుజులు సంసార - మాయాబ్ధి దాఁటి
సునిశిత ముక్తి హె-చ్చుగఁ బొందు సరణిఁ

దెలుపవే!' యనుచుఁ బ్రా-ర్థింప, వాల్మీకి
యల భరద్వాజున - కపు డిట్టు లనియె:

### * వాల్మీకి వాత్సల్య వాక్కులు *

'వత్స! భరద్వాజ! - వసుధ నందఱిని
వాత్సల్యమునఁ బ్రోచు - వైపు భావించి

యతిరహస్య ప్రశ్న - మడిగితి, వార్య
[2]హితమొప్పఁ జెప్పెద - నెట్లన్న వినుము!

---

1. వేక్షణ భక్తిని - వా.
2. హిత మతిఁ జెప్పెద - వేం.

పుట్టి గిట్టుచునున్న - భూప్రజలందు
నెట్టన నెవరైన - నిఖిలభోగములు

నిరసించి, వైరాగ్య - నిష్ఠ పెంపెసఁగ
'నెఱయు సంసారంబు - నిత్యంబు గాదు,

తను వశాశ్వతము, సి-ద్ధముగ నే నెవఁడ?'
[3]నని విచారింపుచు - నార్తుఁడై, తనకు

నీ రహస్యముఁ జెప్ప - నిష్ఠుఁడైనట్టి
కారణగురుఁ డెందుఁ - గలుగునో? యనుచుఁ

బొరిఁబొరి మదిఁదలం-పుచు నార్తుఁడైన
నరునకు గురుభక్తి - నాఁటుఁ జిత్తమున,

నా భక్తి దృఢముగా - నాత్మ నుంచుకొని,
ప్రాభవంబుల కాశ - పడక, కామాది

వైరుల ఖండించి, - వాంఛలు విడిచి,
యారూఢుఁడైన మ-హా గురుస్వామిఁ

జేరి శుశ్రూషఁ జే-సిన పుణ్యధనుఁడు
సార విహీన సం-సారాబ్ధి దాఁటి

రమణీయ మోక్ష తీ-రమునందుఁ జేరి,
యమల సద్వస్తువం-దైక్యమై నిలుచు.

ధరణి నజ్ఞుండైనఁ - దద్‌జ్ఞుండునైన
నిరవొందఁ దన్నుఁ దా-నెఱిఁగెడి కొఱకు

---

3. నని విచారించి దీనార్తుఁడై తనకు - వా.

సదమల గురుసేవ - సల్పఁగా వలయు;
సది మానిరేని మో-క్షార్హులు గారు,

ఆకాశమందు నై-ల్యాది వర్ణములు
జోకగాఁ గనిపించి - శూన్యంబులైన

కరణిఁ జిద్వ్యోమప్ర-కాశంబునందుఁ
బొరిఁబొరి భూతముల్ - పుట్టి నశించు,

నట్టి మిథ్యారూప - మైన ప్రపంచ
మెట్టి దని మదినూ - హింపంగనీక,

[4]పటు జాగరత్భ్రాంతి - భ్రమలఁ బుట్టించు,
నటువంటి భ్రమకు లో-నై చెడిపోక,

మదిలోనఁ దద్భ్రాంతి-మఱచుటే లెస్స.
అదె చూడు! దృశ్యంబు-లన్ని దబ్బఱలు

గానుండి, యజ్ఞాన-కర్మదృక్కులకుఁ
బూని యెప్పుడు నిజం-బుగఁ గానవచ్చు,

జ్ఞానదృక్కుకుఁ బ్రపం-చము గానరాదు;
మానితబ్రహ్మ మా-త్మకు గోచరించుఁ.

జిత్తవృత్తులు నశిం-చిన జీవతత్త్వ
మత్తఱిఁ జిత్తులో-నణఁకువై పొందు;

ఇటువంటి సూక్ష్మార్థ-మెఱుఁగ నేరకను
ఘటికులై బహుకర్మ-కంధిలోపలను

పొరలుచుండెడివారు-భూలోకమందుఁ
దఱచైన కల్పశ-తంబులకైన

---

4. పటు జాగ్రతన్ భ్రాంతి - వా.

ముక్తిఁ బొందఁగ లేరు;- ముక్తి యె ట్లనిన
యుక్తితో వినుము చే-యుచునుండు కర్మ

వాసవాసమై - వచ్చుచు లేవి
యాపల కాప్పదం-బైన పాపంబు

క్షీణించిపోవుటే-చిరముక్తి యనఁగ,
నాణెమై తగు వాస-నలు రెట్టి వనిన

నరవిని మలిన వా-సన, యదిగాక
సరసమౌ శుద్ధవా-సనయు నీరెండు;

అందు మలినవాస-నాజ్ఞానతమము
పొందుగాఁ దా నహం- బు వహించి, జన్మ

కారిణియగుచు దుః-ఖము నిచ్చుచుండు,
సారమై శుద్ధవా -సన పునర్జన్మ

కారిణిగా కహం-కార బీజంబు
[5]నారూఢిగాఁ గాల్చి-యానంద మిచ్చుఁ;

దా నర్ధదేహంబు-ధరియించియుండుఁ
గానఁ 'దద్జ్ఞ' యనంగఁ-గరమొప్పు చుండు.

ఘనశుద్ధవాసనా-కలితులు ధరణి
ననఘ! జీవన్ముక్తు-లనఁగ నొప్పుదురు;

అందు జీవన్ముక్తుఁ-డగు పంక్తిరథుని
నందనుకథ విన్న-నరులకు జన్మ

మరణ దుఃఖంబులు-మాయు; నా రాము
చరితంబుఁ జెప్పెదఁ - జక్కఁ గా వినుము!'

5. నారూఢిఁ గాల్చిన యానంద మిచ్చు-వా.

అని పల్కు వాల్మీకి-కంజలిఁ జేసి
మొనసి భరద్వాజ-ముని భక్తి నతనిఁ

గని 'రాముచరితంబుఁ -గ్రమముగా నాకు
వినిపింపవే!' యని-విశ్వాస మొదవ

నడుగ భరద్వాజుఁ -డాత్మలో మెచ్చి,
యడర వాల్మీకి యి ట్ల-ని చెప్పదొడఁగె:

## * శ్రీరాముని జననము *

'విను మో భరద్వాజ!-విబుధులఁ బ్రోవఁ
బనిఁ బూని యాపర-బ్రహ్మ మచ్యుతుఁడు

శ్రీవిష్ణుదేవుఁ డా-శ్రిత జనావనుఁడు
పావనాచారుండు-భానువంశమునఁ

బొలుపొంద దశరథ-పుత్రుఁడై పుట్టి
తొలఁగక వృద్ధిఁ బొం-దుచు నుండినపుడు,

## * దేవతల సంప్రార్థన *

దేవ తలతనిఁ బ్రా - ర్థించి యి ట్లనిరి:
'దేవాదిదేవ! పృ - థ్విని నీవు మనుజ

దేహంబు ధరియించి-తివి, మానవులను
మోహాబ్ధిలోఁ బడి - మునిఁగి పోనీక

కడతేర్చు కారణ-కర్తవే గనుక
నడర వసిష్ఠ సం-యమి నాశ్రయించి

సరసవేదాంత వి-జ్ఞాన ధర్మముల
వరుసగా నాలింప-వలె నీవు, పరమ

గురుఁడ వయ్యును మదిన్- కొంకక యన్య
గురు నాశ్రయించి, యీ - గురు రహస్యమును

విని నను, గొంద ఱా - విధమున గురుని
ననుసరించి కృతార్థు - లగుదు' రటంచు

బహువిధంబుల వారు - ప్రార్థింపఁగాను
విహితంబుగా విని - విజయరాఘవుఁడు

అనిమిషుల్ ప్రార్థించి - నందు కచ్చోట
తనమదిలో నిట్లు - దలఁచె నాఘనుఁడు

## * శ్రీరామచంద్రుని తలంపు *

'దేహేంద్రియములు వృ - ద్ధిని౯ బొంది విషయ
వాహినిలోఁ ద్రోయ - వచ్చి హెచ్చినవి,

మైత్రిని౯ దొలుత ని - మ్మాడ్కిని౯ జూపి,
శత్రువైనటువంటి - సంసారవార్ధి౯

గడపట ముంచుచు, -గట్టెక్క నీక
విడఁబడి చెఱచు నీ-విషయేంద్రియములు.

కావున సకలభో-గంబులు విడిచి
నే విరక్తిని౯ బొంది-నిస్పృహత్వమున౯

బొందిన, దశరథ-భూపతి చింత
నొందునో?'యను భీతి-యొక్కింత మదిని౯

బొడమఁగా, నది మాని-పుణ్యతీర్థముల౯
బొడగాంచి గ్రుంకుచుఁ,-బుణ్యాశ్రమముల౯

గనుఁగొని వచ్చి, య-క్కడ నుండినట్టి
మునివృత్తు లాత్మ ని-మ్ముగ మెచ్చు కొనుచు,

నిజరాజ్యసౌఖ్యంబు-నిరసించికొనుచు,
సుజనసాంగత్య మ-చ్చుగఁ గోరికొనుచుఁ,

గుజనులతోఁ జెల్మి-కొఱగా దటంచు,
విజనస్థలమునందు-వేఱె తా నుండి,

'యారసి తన్ను మో-క్షార్హునిఁ జేయు
కారణగురుఁ డెందుఁ-గలుగునో?' యనెడి

చింతచే దప్పి యా-శ్రీరామచంద్రుఁ
డంతఃపురంబులో-నార్తుఁడై యున్న

### * విశ్వామిత్రుని రాక *

వేళ గాధేయుండు-విమల సత్క్రతువుఁ
దాలిమితోఁ జేయఁ-దలఁచి వేడుకను

తా నయోధ్యకుఁ బోయి-దశరథుచేత
నానందముగఁ బూజ-లంది, యా మీఁద

గౌరవంబుగ మహీ-కాంతు నీక్షించి
ధీరత్వ మెసఁగ బ్రా-ర్థించి యి ట్లనియె:

'నరనాథ! మత్సవ-నంబు రక్షింప
నఱ లేక శ్రీరాము-నంపవే!' యనిన

విని పంక్తిరథుఁడు నిర్-విణ్ణుఁడై పలికె:
'మునినాథ! యిపుడు రా-మునిఁ బంపలేను,

ఏ క్రమంబుననైన-నీక్షణమందె
నీ క్రతురక్షకై-నేనె వచ్చెదను;'

అని పెక్కు విధముల -నమ్మహారాజు
వినిపింప, నమ్ముని-విభుఁడు కోపించి

బహువిష్ణు రోక్తులు-భాషింపఁజూచి,
మహిమ నొప్పు వసిష్ఠ-మౌని యా నృపునిఁ

గని యిట్లు లనియె: 'విష-కర్తగా గాధి
తనయుని వెంట నీ-తనయునిఁ బంపు'

మని యొప్పఁజెప్పఁగా-నా పంక్తిరథుఁడు
తమ మది హర్షించి, -తదనంతరమున

### * దశరథుఁడు శ్రీరాముని బిలిపించుట *

చారులఁ జూచి 'య-చ్చటికి మీ రరిగి
శ్రీరాముఁ దోడ్తెందు!-శీఘ్రంబుగాను'

అన విని చారు లి-ట్లనిరి: 'శ్రీరాముఁ
డెనలేని చింతతో -నెనయుచున్నాఁడు,

సకలసుఖంబులు-చాలించినాడు,
వికలుఁడైనా'ఁడని-విన్నవింపఁగను

విని నృపాలుఁడు చాల-విన్ననై 'యతనిఁ
గనవలెఁ దోడ్తెందు!-గ్రక్కున' ననిన

వేవేగ వారేగి-విజయరాఘవున
కా వార్త లెఱిఁగింప,-నందుండి లేచి

తా వచ్చి రాముఁ డా- తండ్రికి మ్రొక్కి
దీవెన లంది, గా-ధి తనూభవునకు

మ్రొక్కి, వసిష్ఠ స-న్మునికిని మ్రొక్కి,
యక్కఱగాను వి-శ్వా మిత్రు చెంతఁ

## * రాముని ఆర్తి *

జేరి చేతులు మోడ్చి-శిర మర [6]వాంచి,
యా రాముఁ డాత్మయం-దార్తి వహించి,

తన చింత రెట్టింపఁ-దనువు గంపింపఁ,
గనుల బాష్పము లొల్కగాఁ- దీను పగిది

నున్న, రాముని చంద-మూహించి, మౌని
'యన్న! ర'మ్మని పిల్చి-యాదరింపుచును,

తనువెల్ల నిమురుచుఁ-దాప మొందుచును
ముని దయ మీఱ రా-మున కిట్టు లనియెః

## * విశ్వామిత్రుని ఆదరోక్తి *

'నాతండ్రి! రఘువర!-నాటుగా నిపుడు
నీ తండ్రి రాజ్యంబు-నెమ్మదిగాను 190

[7]పాలింప యువరాజ-పట్టభద్రుండ
వై లలిత సుఖంబు-లనుభవింపకను

ఎలుకలు ద్రవ్విన-యింటి చందమునఁ
గలఁగుచు [8]దిగఁబడఁ-గారణంబేమి?

[9]పట్టైన యౌవన-ప్రాయంబునందు
నెట్టన సుఖముల-నేఁ బొందవలయు,

---

6. వంచి-వా.
7. వై లలి సుఖము లె-ల్లనుభవింపకయ-వా.
8. దిగులొందఁ గారణంబేమి?-వా.
9. పట్టి! నీ యౌవనప్రాయంబునందు-వా.

నట్టి చందము మాని-యార్తిఁ బొందితివి;
ఇట్టి మనోవ్యథ-యేల జనించె?'

నని పెక్కువిధముల-నమ్మునీశ్వరుఁడు
నెనరుతో నడుగగా,-నృపనందనుండు

మరల నంజలిఁ జేసి-మౌని నీక్షించి
కరఁగుచు గద్గద-కంఠుఁడై పలికె:

## * రాముని నిర్వేదము*

'మునినాథ! యీ లోక-మున మర్త్య వితతి
జనియించుటెల్లను-చచ్చుట కొఱకె,

చచ్చు టెల్లను మళ్లి-జనియించుకొఱకె,
హెచ్చుగా నిలుచుట-[10]కిర వెందు లేదు.

అన్ని యస్థిరములై-నట్టి చందంబు
మున్నుగాఁ దెలిసియు-మూర్ఖత్వ మెసఁగ

మది రాజ్యసుఖమందు-మల్లాడఁబోవు,
నదిమి నిల్పిన నిల్వ,-దాశతోఁ,హాడి

యొక్క చోటను నిల్వ-కుఱుకుచునుండుఁ,
జిక్కఁబట్టినఁగాని-చెనఁటియై జరుగు,

నిట్టి మదిని నిల్పు-టె?ట్లని చింత
పుట్టిన, దిదిగాక-భూరి రాజ్యంబు

10. స్థిరమెందు లేదు- వా.

మొదలైన సంపదల్-ముందుగా సౌఖ్య
మిది యనిపించి దా-హెచ్చి, పిమ్మటను

మదమును బుట్టించి-మాయాబ్ధి ముంచు;
నదిగాక దేహేంద్రి-యాదిభోగములు

ఆదియం దమృతమ-ట్లానంద మిచ్చి,
యాదట గరళమై - యతిఖేద మిచ్చు;

ఘనవిరాగము తొల్తఁ-గష్టమై తోఁచి,
యనుపమానానంద-మై యుండుఁ దుదను;

ఇది సుఖమో? లేక -యింద్రియభోగ
మది సుఖమో? దెల్పుఁ-డరమర మాని,

నానావిధంబుల-నాకుఁ జూచినను
జ్ఞాన వైరాగ్య భా-స్వరచింతనమున

నిఖిల భోగములను-నిరసించు సరణి
సుఖమిచ్చునంచుఁ దోఁ-చుచు నున్నదిపుడు.

తక్కిన యాశాప్ర-దంబు లన్నియును
గ్రక్కున లేని దుః-ఖము నిచ్చు, నెట్ల

నన్నను విత్తంబు-నాశచేఁ గూర్చి
యున్నవాఁ డేవేళ-నులుకు, నే లనిన

ధరను తా దాఁచిన-ద్రవ్యమెందున్నఁ
బొరినిఁ జోరకులును,-భూమీశ్వరులును,

మొదలైన పగతు లి-మ్ముగఁ [11]"బొంచి మించి
పొదివి యెక్కడఁ గొని-పోదురో? యనుచు

11.బొంచి పొంచి -వా.

మూఁకే ధనవంతుఁ-డులుకుచునుండు,
వారయఁగా వాని-కది సుఖం బగునె?

కదిసి యౌవనము సు-ఖం బిచ్చు ననిన
నది రక్త, మాంస, హే-యాస్థి చర్మములు

గూడి రూపములైన-కొమ్మల ముఖము
లాడాడఁ జూచి, మో-హభ్రాంతి వొంది,

తగఁ బెండ్లియాడి, వి-త్తము నపేక్షించి,
మగఁటిమిఁ జూపుచు,-మదమత్తు లైవ

ధనికుల యాచించి-ధనము లార్జించి,
తనభార్య కొప్పించి,-తమకించి దానిఁ

గలసి, స్వతేజంబుఁ-గరఁగించి విడిచి,
బలహీనుఁడై డస్సి-పామరుం డగుచు,

నందనులను గాంచి-నాటుగాఁ బెంచి,
యందున బహుసౌఖ్య-మబ్బె నటంచు

మురిసి, వారలమీఁద - మోహంబు నుంచి,
మఱి మఱి సంసార-మాయలో మునిఁగి,

సారార్థ సరణి వి-చారింపఁ దనకుఁ
దీఱక, పగలు రా-తిరి యదే జోలి

గా కాల మూరకే-గడపుచునుండి,
యాకాల మరుగఁగా,-నట జరాభార

కలితుఁడై రోగదుః-ఖంబుల చేతఁ
బలుమాఱు వగచుచుఁ-బడి లేవ లేక,

దేహంబుపై నాశ-దిగవీడ లేక,
మోహ లోభములచే-మూఢాత్ముఁ డగుచుఁ

'దరలి తాఁ బోయినఁ- దనయు, లిల్లాలు
వెఱవక యెట్లు జీ-వింతురో?' యనుచుఁ

జింతింపుచుండఁగాఁ-జేరువై మొనసి
యంతకాలము రాఁగ-నఁట మృత్యుదేవి

కనులకుఁ బొడఁగట్టఁ-గా, భీతి నొంది
తనుఁ దానె మఱువఁగా-దండికింకరులు

స్థూలమందుండిన - సూక్ష్మ దేహమును
కాల పాశంబుతోఁ-గట్టి కొంపోయి,

మొనసి యా కాలుని-ముందర నిడఁగఁ,
గని యముఁ డా పాప-కర్మి నచ్చోట

నారసి నిజకింక-రాళి కొప్పించి,
కాఱించి బహు నార-కంబులలోను

బడవైచి కొన్నాళ్లు-బాధించి, చాల
బడలించి, యట పుణ్య-ఫల మొక కొంత

గలిగియుండినను సు-ఖంబు నొందించి,
బలములై తగు పుణ్య-పాప శేషముల

తోడ ధారుణి మీఁదఁ- ద్రోయింప, మగుడి
వాఁడు దిగంబడి,-వాయుమార్గమున

జలదంబులోఁ జేరి-జలరూప మొంది,
మొలచు సస్యములందు-ముందుగాఁ జెంది,

పటిమతో బీజరూ-పముల ధరించి,
యటమీఁదఁ దానన్న-మై పూర్వఋణము

గలిగిన పూరుషు-గర్భంబు సొచ్చి,
యల వీర్య రూపమై-యతివగర్భమునఁ

జేరి,పిండంబై, వి-చిత్రావయవము
లారూఢిఁ బొడమి త-న్నావరింపఁగను,

గర్భగత జ్ఞాన-కలితుఁడై యచట
నర్భకుఁడై యుండి-యలమటల్ పడుచు,

వెడలు దారెఱుఁగక-వివశుఁడై దుఃఖ
పడుచు, నక్కడ నుండి-పదియవ నెలను

ధరణిపైఁ బడి, తన-తల్లియుఁ దండ్రి
పేరిమిఁ బోషింపఁ-బెరుగుచునుండి,

యవల బాల్యావస్థ-యౌవనావస్థ
లవని ననుభవించి,- యట వృద్ధుఁ డగుచు,

భోగేచ్ఛఁ జేసిన-పుణ్యపాపముల
తోఁగూడి క్రమ్మఱఁ-దొల్లిటివలెనె

పడిపోయి, పుణ్య,పా-ప ఫలంబు లచట
దడయక మోద, ఖే-దముల నియ్యఁగను

నాక నారకముల-నవ్య భోగమును,
[12]శోకం బనుభవించు-చును సాక్షి స్రుక్కి,

యెప్పటి రీతిగా-నిలమీఁదఁ బుట్టు;
నప్పుణ్యపాపంబు-లం దిందు నరుని

నెప్పుడు నెడఁ బాయ-కెల్లలోకములఁ
ద్రిప్పుటే కాని, ము-క్తినిఁ బొందనియవు.

బావిలో నేతము-బాన తా మునిఁగి
యా వేళనే జలం-బందుండి తాను

12. శోకం బనుభవించి సాక్షి స్రుక్కినను- వా.

గొని తెచ్చి భూమిపైఁ-గ్రుమ్మరింపుచును
మొనసి క్రమ్మఱ నందె-మునిఁగి లేచుచును

నుండు చందమున జీ-వుం డొకచోట
నుండక తిరుగుఁ గా-వున, జన్మకర్మ

మరణ [13]దుఃఖముల వే-మఱుఁ బొందుచున్న
నరులను జూచితే-నా మది భీతి

పుట్టుచునున్నది-పుణ్యపాపములు
పుట్టువులకు హేతు-భూతంబు లనుచుఁ,

గడువడి నిటు కాల-కర్మద్వయంబు
విడఁబడి పుట్టించు-విధి రుద్రముఖుల,

నడిపించు జగముల-నానా విధములఁ,
గడపట వరుసగాఁ-గబళించు, మరలఁ

బుట్టించుఁ, ద్రుంచు,నీ-భూరివిశ్వంబు
నెట్టనఁ గల్గి లే-నిది యగుఁ దుదను;

కావున నే రాజ్య-కాంక్ష శీఘ్రముగఁ
బోవీడి ముక్తినిఁ-బొందెద నింక,

నెక్కడి సంసార?-మెక్కడి ఘోర?
మెక్కడి జాడ? యి-దెక్కడి పీడ?

కామాది రిపు,లహం-కార చిత్తంబు,
లా మతి, మానసం, - బఖిలేంద్రియములు

13. దుఃఖము లవే మఱిఁ బొందుచుండు- వేం.

విషయముల్ తమ తమ-వృత్తుల తోడ
విషమగతుల మించి-వేధింపసాగె;

దానిచే హృదయంబు-దందహ్యమాన
మైనది, దానిఁ జ-ల్లార్చి, మీ రెఱిఁగి

యున్న సుజ్ఞానంబు-నుపదేశమిచ్చి
నన్ను రక్షింపకు-న్నను భుక్తి విడిచి

పూని నే మీపదాం-బుజముల చెంత
మేనుఁ దొఱఁగువాఁడ-మీయాన-' యనుచు

ఫాల మామౌనీంద్రు-పదముల మీఁదఁ
జాల హత్తించి, బా-ష్పంబులు కనుల

వెడలుచు నుండఁగా,- వేఁడి నిట్టూర్పు
విడువఁగా నమ్ముని- వేదనఁబొంది,

రాముని రెండు క-రంబుల నెత్తి,
ప్రేమతోఁ గూర్చుండ - బెట్టి లాలించి,

శిరమును చుబుకంబు-చెక్కిళ్లు నిమిరి,
పరమార్ద్ర హృదయుఁడై - పలికెనిట్లనుచు:

## * విశ్వామిత్రుని ధైర్యవచనములు *

'నాయన్న! రఘురామ!-ననుఁ గన్నతండ్రి!
నీయాత్మ కడతేఱు-నెళవు ముందుగను

నీయంతనే నీవు-నిశ్చయించితివి,
మాయా ప్రపంచ మ-ర్మంబు లన్నియును

దెలిసితి, విఁక నుప-దేశంబు సేయ
వలసినదేమి? స-ర్వము నెఱుంగుదువు;

కొదువ యే మన్నను-గురుముఖంబునను
విదితంబుగాఁ దత్త్వ-విజ్ఞాన సరణి

వినకయే తొలుత వి-వేకంబుచేత
ఘనవిరాగము నీకుఁ-గలిగియుండియును

అనుమాన మొందితి,-వంతియే కాని
జననుత! నీకు మో-క్షము గల్గు టరుదె?

మహిని ముముక్షు ధ-ర్మము బాల్యమందె
సహజంబుగా నీకు-సంభవించినది.

* శుకుని వృత్తాంతము *

ఇపు డిందు కితిహాస-మేను చెప్పెదను
నిపుణుండవై విను-నీరీతి శుకుఁడు

మొనసి తనంతనే-మోక్ష ధర్మముల
ననఘుఁడై తెలిసియు,-ననుమానమొంది

తన తండ్రియైన వే-దవ్యాసుఁ జేరి
వినయంబుతో [14] విన్న-వించె నిట్లనుచు:

'జనక! యీ మలినంపు-సంసార మెచట
జనియించె? నెవరి దీ-సంసారవాంఛ?

ముందఱ గతి యేమి?-మూఢ సంసార
మెందు లయంబొందు?-నెఱిఁగింపుఁ' డనుచుఁ

14. విన్నవించి యిట్లనియె - వేం.

బాద పద్మములపైఁ- బడి లేవకున్న,
బాదరాయణుఁ డెత్తి-పలికె ని ట్లనుచు:

'వినుము పుత్రక!-సూక్ష్మవిజ్ఞానసరణిఁ
గను మాత్మ బుద్ధి వి-కల్పన చేతఁ

గలుగు విశ్వం, బావి-కల్పనం బణఁగి
పొలిసినప్పుడు జగం-బులు కానరావు,

అవి గానరాకుండి-నపుడు సంసార
మెవరిదిగాక తా-నెపుడో నశించు,

నది నశించిన దేహ-మం దహంభావ
ముదయింప కణఁగిపో-వుట ముక్తి' యనుచు

వినిపింప, నంతయు-విని శుకయోగి
యనుమానమును వీడ-కందున్నఁ, జూచి

'వీని సంశయ మిందు-విడువలే' దనుచుఁ
దా నిశ్చయించి వే-దవ్యాసుఁ డనియె:

'శుక! యింతకన్న హె-చ్చుగ నే నెఱుంగ,
నిఁక నీవు చని మిథి-లేశ్వరుండైన

జనకుని నడుగు, నీ-సంశయం బతఁడు
సునిశితార్థముగఁ దీ-ర్చును, నీ వచటికిఁ

దప్పకపొ'మ్మంచుఁ-దయ దళుకొత్తఁ
జెప్పిన మిథిలేశుఁ-జేరె నా శుకుఁడు;

అప్పు డానంద మ-గ్నాత్ముఁడై లేచి
తెప్పున జనకుఁ డా-ధీరు నీక్షించి,

## * మిథిలేశుని పలుకులు *

హెచ్చుగాఁ బూజించి- 'యిచటికి మీరు
వచ్చిన పని యేమి?-వరయోగిచంద్ర!

చెప్పఁ డా పని నేను-చేసెద' ననఁగ,
నప్పుణ్యుఁ డావ్యాసు-నడిగిన రీతి

జనకుని నడుగఁగా-సంతసమంది,
విని యా నృపాలుండు- విశ్వాస మొప్పఁ

బలికె నిట్లనుచు 'నో - పరమయోగీంద్ర!
సులలిత చిత్పూరు-షుం డొక్కరుండు

దక్క నన్యము లేదు,-తత్త్వార్థ మింత
నిక్కంబు; నీవు దీ-నికి సంశయింప

వల, దాత్మ సంకల్ప-వాంఛ బంధంబు,
వెలయు సంకల్పంబు-విడుచుటే ముక్తి;

ఇది యథార్థము, సంశ-యింపకు మీవు,
ఏది దృశ్యముడిగి స-మ్మతిఁ బొందినావు;

పదిలంబుగా నిదే-పట్టి భావింప
మదియందె లయమొందు,-మఱి సంశయములు

నుదయింప, వదియె మనో-న్మని యగును,
సదమలచరిత! మో-క్షం బిదే సుమ్ము!

వేఱె మార్గం బింక- వెదకఁబోవలదు;
భూరిసంతోష సం-పూర్ణానుభవము

నొందు'మంచు వచింప,-నుప్పొంగి శుకుఁడు
మందస్మితాస్యుఁడై-మనుజనాయకుని

నానందముగఁ జూచి, - యరమర విడిచి
'నా నిశ్చయిం బదే!- నాతండ్రి మొదటఁ

జెప్పిన యర్థమే-సిద్ధంబుగాను
[15]చెప్పితి వవనీశ!-చిత్తసంశయము

తీఱె'నంచు వచించి-దిగ్గున లేచి,
యారాజు సెలవంది-యరిగి, యొక్కెడను

పరమైన నిర్విక-ల్ప సమాధి నుండి,
పరిపూర్ణుఁడై మోక్ష-పదమందె శుకుఁడు .

అని చెప్పి దయను వి-శ్వామిత్రమౌని
మనుకులోత్తముఁ జూచి-మరల నిట్లనియె:

'సకలజ్ఞ! శ్రీరామ-చంద్ర! తనంత
శుకుడు దెలిసినయట్ల-సూక్ష్మవిజ్ఞాన

సరణిఁ దెలిసితీవు,-సంశయార్థముల
మెరమెరఁ బొందనే-మిటి కింకమీఁద?

నఱలేక యుపశాంతి-యనెడు తోయమున
మఱువక యిపు డాత్మ-మలినంబు గడిగి

భూరి విశ్రాంతినిఁ -బొంది సుఖింపు,
మూరకే పరితాప-మొంద నేమిటికి?

అమర జ్ఞాతృజ్ఞేయ-మైన చిత్తరతి
క్రమమొప్పఁగా సమ-గ్రంబుగా భోగ

15. చెప్పితి పరమేశ! - వా.

సముదయానుభవంబు-శాంతమై యేక
శమమొందు, దాని ల-క్షణ మదే యగును;

విశ్వంబు సద్వస్తు-వే యగుఁ గనుక
నీశ్వర రూపమై-యింపొందుచుండు.

వరుస బంధము భోగ-వాసనచేత
నఱిముఱి దృఢతరం-బై వృద్ధిఁబొందు,

జగతిఁ దద్ భోగవా-సన శాంతమైనఁ
దగిలియున్నట్టి బం-ధము వీడిపోవు;

నిన్ను నీ వెఱుఁగుచు-నిఖిల రాజ్యంబుఁ
బన్నుగా జ్ఞానివై-పాలింపుచుండు!'

మని దృఢంబుగఁ జెప్పి,-యపుడు వసిష్ఠ
మునిని వీక్షించి 'రా-మునకు సత్కృపను

సలలిత బుద్ధి వి-శ్రాంతి వాక్యములఁ
దెలివిగా మీ రుప-దేశింపు-డిపుడు'

అనిన విశ్వామిత్రు-నా వసిష్ఠుండు
కనుఁగొని పూర్వమా-గాధిపుత్రుండు

తనకుఁజేసిన కీడు-దలఁప కా మౌని
యనుమతిచే శాంతుఁ-డై పూర్వ మజుఁడు

తనకుఁ జెప్పిన గూఢ-తత్త్వవాక్యముల
మొనసి తలంచి రా-మున కిట్టు లనియె:

## * విశ్వామిత్రుని ప్రేరణచే వసిష్ఠుఁడు శ్రీరామునకుఁ దత్త్వము నుపదేశించుట *

'రామాభిరామ! యో-రఘువంశసోమ!
ప్రేమఁ గౌశికుఁడు చె-ప్పినవాక్యములను

తగ వింటి, వేనునుఁ - దదనుసారముగ
విగతసంశయముగా - వినిపింతు వినుము!

సారవిహీన సం - సారంబు నందు
పౌరుషంబునఁ బొందఁ - బడును సర్వంబు,

విరివిఁ బౌరుషమే ద్వి - విధముగా నుండు
సరవి నుచ్ఛాస్త్రంబు, - శాస్త్రితం బనఁగ,

నందెన్న శాస్త్రిత - మర్థ సంప్రాప్తి
నొందఁ జేయుచునుండు, - నుచ్ఛాస్త్ర మనెడి 460

గురు పౌరుషంబు మి-క్కుటము తా నగుచుఁ
బరమార్థసౌఖ్యసం - ప్రాప్తి నొందించు;

వదలకుండెడి పూర్వ - వాసనచేతఁ
బదపడి శాస్త్రిత - పౌరుషం బొనర

జనియించి నప్పుడీ - జగతి నుచ్ఛాస్త్ర
ఘనపౌరుషంబుచే - గ్రక్కున దాని

నారూఢయుక్తిచే - నడ్డపెట్టుచును
ధీరతఁ జిత్త శాం - తినిఁ బొందు మనఘ!

అనభిజ్ఞచిత్తుఁడై - నటువంటివాఁడు
తనియక యజ్ఞాన - తప్తుఁడై యుండు; 470

నెందాక యజ్ఞాన - మిరవుగా నుండు
నందాఁకఁ గర్మంబు - లంటుచునుండు,

నెందాఁకఁ గర్మంబు - లెనయుచునుండు
నందాకఁ బుట్టుచు - నణఁగుచునుండు,

నెందాఁకఁ జన్మంబు - లెత్తుచునుండు
నందాఁక దుఃఖమ - గ్నాత్ముఁడై యుండుఁ;

గావునఁ దద్దుఃఖ - కంధి దాఁటుటకు
నావయై యుండు జ్ఞా-నస్వరూపంబు.

ఇటువంటి జ్ఞానంబు - నెఱిఁగెడికొఱకుఁ
బటుభక్తి దీపింపఁ - బరమదేశికుని

సేవించి. గురుశాస్త్ర - సిద్ధాంత మెఱిఁగి,
జీవుండు మోక్షంబుఁ - జెంది సుఖించు;

నా రీతిఁ గర్మమం - దంటక నీవు
సారవిజ్ఞానల - క్ష్యము నొందు రామ!

తుదలేని సంసార - దుఃఖంబు లణఁచి,
సదమలబుద్ధి వి-శ్రాంతిఁ బొందించి,

సంతోషకరమగు - సంపూర్ణతత్త్వ
మంతఃకరుణచేత - నబ్జసంభవుఁడు

నా కుపదేశించి - నాఁ డా క్రమంబు
నీకుఁ జెప్పెద' నన్న - నెమ్మది నొంది,

యా వసిష్ఠునిఁ జూచి - యంజలిఁ, జేసి
పావనాత్ముఁడు రామ - భద్రుఁ డి ట్లనియె:

*** రామభద్రుని ప్రశ్న – వసిష్ఠుని యుత్తరము ***

'ఏ కారణమున ము - నీంద్ర! పద్మజుఁడు
నీ కుపదేశించె - నిశ్చితార్థమును?

ఆ నిశ్చితార్థ మె - ట్లభ్యసించితిరి?
దీనుఁడనగు నాకుఁ - దెలుపవే!' యనిన

విని మునీంద్రుఁడు పల్కె - విమలం, బమృతము,
ననఘం, బనంతంబు, - నాదిమధ్యాంత

రహితంబు, సర్వపూ-ర్ణంబు, నిత్యంబు,
సహజంబు, సత్యంబు, - సచ్చిద్గగనము,

శుద్ధచైతన్యంబు - సుస్థిరతత్త్వ
సిద్ధాంతమై ప్రకా - శింపుచు నిండి,

యెక్కడఁ జూచిన - నెడమింత లేక
యొక్కవస్తువు నిల్చి - యుండు నెప్పటికి;

నది చంచలించియు - నచలమౌ చోట
నుదయించె విష్ణుదే-వుం, డమ్మహాత్ము

సదమలనాభికం - జమున విరించి
సదయుఁడై జనియించి - సకలభూతములఁ

బుట్టించె, నతని త - పోవిశేషమునఁ
బట్టుగా సర్వప్ర - పంచమ్ము వెలసె.

సరసభారతవర్ష - సంభవులైన
నరులు పామరులు, నా - నావిధాన్యాయ

కలితులు, లోభులు, - కాముకుల్, జడులు,
బలవిహీనులు, మోహ - పరవశుల్, శఠులు,

గురువంచకులును, మూ-ర్ఖులు, దాంభికులును,
పరధనాసక్తులు, - పరసతీరతులు

కావున బహునార - కములందు మునిఁగి
పోవుదు రని తన - బుద్ధి నూహించి,

శోకింపుచుండెడి - సుతులకై తాను
శోకించు జనకుని - చొప్పున నజుఁడు

చింతించి, జప, హోమ, - శీల, ధర్మములు,
వంతు కెక్కిన తపో - వ్రతములు జనుల

శాంతినిఁ బొందింపఁ - జాల, వందఱికి
సంతోషమిచ్చు సు - జ్ఞానం బటంచు

మది నిశ్చయించి, స - మ్మతముగా నన్ను
ముదమొప్పఁ దన మనం - బుననె సృజించె.

నపుడు బ్రహ్మజ్ఞాని - నై నేను పుట్టి
కపట ప్రపంచ సం - గతులలోఁ జొరక,

తెలివియౌ నను నేనె - తెలియుదు, నందు
వలన సద్గురుఁడు గా-వలె నను చింత

నా కందు లేకయు-న్న విరించి చూచి
'యీ కుమారుఁడు తత్త్వ మిలఁ దనంతటనె

తాను దెలిసి గురు-త్వంబు నామీఁద
నూనికగా నిల్ప-కున్నాఁడు. గురుఁడు

చెప్పని సద్విద్య - సిద్ధింప'దనుచు
నప్పు 'డజ్ఞాని వీ - వై, యిటుమీఁద

గురుభక్తి నెద నుంచు-కొని తత్కరుణను
మరల విజ్ఞానివై - మహి నుండు' మనుచు

శాపమియ్యఁగ, బ్రహ్మ - సత్తను మఱచి,
యా పట్ల నే నెవ్వ - రైనది మదికిఁ

దోఁచక యుండఁగాఁ, - దోయజోద్భవునిఁ
జూచి శుశ్రూష హె-చ్చుగఁ జేసి, మ్రొక్కి,

నిలిచి నే నెవ్వరు? - నీ వెవ్వ?రిపుడు
దెలుపవే! సద్గురు-దేవ!' యటంచు

నేను ప్రార్థింప మ-న్నించి విరించి
తా నందు సద్గురు-త్వమును వహించి,

సరగున నాకు సం-సార రోగంబు
హరియింప నౌషధం-బైన జ్ఞానమును

దేఁటగాఁ దా నుప-దేశంబుఁ జేసి,
హాటకగర్భుఁ డి-ట్లనె 'నోకుమార!

అరుదుగా శ్రమకారి - యగు క్రియాకాండఁ
గరుణతో బోధించు! - కర్మకారులకు,

నది మాని వైరాగ్య - మందుఁ జిత్తంబుఁ
గుదిరించు వారికిఁ -గొంకక నీవు

నేను చెప్పిన జ్ఞాన - నిష్ఠ బోధించి
యానంద మొందించు'-మని చెప్పెఁగనుక,

రహి నొప్పు భూతప-రంపరలందు
విహరింపు చుండుదు, - విజ్ఞాన పటిమ

వలనఁ గర్తృత్వాది - వాంఛల విడిచి,
యులుకక యూరకే - యుండి నిద్రించు

వాని, కైవడి దేహ - వాసన మఱచి,
మానసంబును గెల్చి - మతి శాంతిఁ బొంది,

కర్మఠులకుఁ గ్రియా - కాండ బోధింతు,
నిర్మలవైరాగ్య - నిష్ఠుల కెల్లఁ

దిరముగా జ్ఞానోప-దేశము సేతు;
నరసి సంసారినై - యం దంట కుందుఁ,

జేయఁగాఁ దగు పనుల్ - చేసియు, నొకటి
చేయనివాఁడనై - జీవింపుచుందు,

గుఱిగానలేని మూ-ర్ఖుండైనఁ గాని
గురుసేవఁజేసి యా-గురుతర జ్ఞాన

సరణిని వినుచున్న - సకలపాపములు
పొరిఁబొరి నశియించి - పోవుఁ బిమ్మటను,

అరయ మేధాశాలి - వై గురుమర్మ
మెఱిఁగి ముక్తినిఁ బొందు - మినకులోత్తమ!

సరససద్గురువాక్య - సరణి సచ్ఛాస్త్ర
మరసి, మనోనిశ్చ-యంబు, నాత్మైక్య

పరుఁడైన పురుషుండు - పరమందుఁజెందు.
ధరణీశ! వినుము తీ-ర్థస్నానములును,

మొనయుఁ, గాయక్లేశ-ములు, సతీసతులు,
ధనధాన్యములు, దేవ-తాసేవనములు

పురుషుని ముక్తినిఁ - బొందింపలేవు
తిరముగా మది నిరో-ధింపకుండినను,

నది నిరోధంబగు - నటువంటి రీతి
విదితంబుగా నీవు - విను మదె ట్లనిన

అమలిన మోక్ష గృ-హద్వారమందు
శమము, విచారంబు, - సంతోష, మలఘు

సాధు సాంగత్య మెం-చంగ నీ నాల్గు
బోధకారకములై - పొసఁగు పాలకులు

అందు శమం బెట్టి - దన్నఁ జెప్పెదను
పొందుగా విను రామ - భూపాల! పరులు

తనుఁ దిట్టి నప్పుడు -తా వారిమీఁద
నొనర నల్గక తిట్ట-కుండుటే శమము,

అట్టి నిర్మలశమం - బతిశయంబుగను
బుట్టి సంతోషముల్ - పొందించుఁ గనుక

సకల దుఃఖహరంబు - శాంత గుణంబు,
ప్రకట మోక్ష ద్వార - పాలుండు గాన

నందరి కన్న శాం-తాత్ముఁడే ధన్యుఁ,
డిందుకు సందియం - బించుక లేదు,

అల విచారం బెట్టి - దన్నఁ జెప్పెదను.
పొలపొంద శాస్త్రావ - బోధచేఁ బ్రబలి

ఖ్యాతిగాఁ బూర్ణమై - ఘనమైన బుద్ధి
చేతఁ గారణమును - స్థిరముగా నెఱిఁగి,

ధర నటువలెఁ జేయఁ -దగు పనులెల్ల
పరుఁడు తానై సేయ - బద్ధుడు కాడు,

తిమిరమం దణఁగదు - దీపప్రకాశ,
మమరఁ గల్గిన పుట్ట - దర్థంబు లేక

యెంతటి మఱుఁగైన - నెదురుగాఁ జూచి
సంతోషమిచ్చు వి-చార సద్దృష్టి,

ధీర! యీ సువిచారదృష్టి సంధింప
నేరిచి, యఁట మీఁద - నే ననువాఁడు

ఎవ్వఁడు? సంసార - మెవరిది? నేను
నెవ్వఁడనో యని - యిచ్చఁజింతించి,

చిరమైన నిజయుక్తి - చేతఁ దన్నెఱుఁగు
సరణి భావింప వి-చారమౌ, దీని

భావింప తద్ద్వారపాల కుడగును.
కావున రామ యీ-క్రమము భావించి

కాలగతులచేతఁ-గదిసి కీడులును,
మేలులు వచ్చిన - మిడికి యుబ్బకను

రెండును మది నొక్క - రీతిగాఁ గనుచు
నుండుట సంతోష-మో రామచంద్ర!

సంతోషమే సుఖసారమై యుండు,
సంతోషమే మోక్ష-సౌఖ్యంబు,దానిఁ

బరికింపఁదద్వార - పాలకుం డగును.
మఱియును విను రామ! - మనుజుండు గర్వ

విరహిత మతియై, వి-వేకియై, భోగ
నిరసనస్వాంతుఁడై, - నిస్పృహుం డగుచు,

జృంభణ మొప్ప హె-చ్చి యహంకరించు
దంభుల తర్క వా-దములలోఁ జొరక,

కోపతాపములను, - కుత్సితంబులను,
చాపల్యగుణములఁ - జాల వర్జించి,

జయకాంక్ష, జీవహిం-సల మాని, భూత
దయ గల పురుషుఁ డి-ద్ధ శాంతమూర్తి.

ఘనుఁ డట్టి సాధు సాం-గత్యంబుఁ జేయు
మనుజుఁడు తరియించు - మాయాంబునిధిని,

గనుకను సాధు సాం-గత్యంబు లోనఁ
బనుఎడ తద్ద్వార - పాలకుం డగును.

చిరముగా నిది యభ్య-సించినవారు
వరుసగా మోహార్ణ-వంబు దాఁటుదురు.

స్పష్టంబుగాఁ బర-బ్రహ్మోపదేశ
దృష్టాంత మీరీతిఁ - వెలియజేసితిని.

ధీరాత్మ! యిదియేక - దేశ సామర్థ్య
మారసి చూడు నీ-యంతరంగమున,

నమర నిరాకార-మగు బ్రహ్మమందుఁ
గ్రమముగా సాకార-కల్పన గలిగె.

తగఁ దాన దృష్టాంత - దార్ష్టాంతికంబు
లగుచు నెప్పుడుఁ బ్రమా-దాంతంబు లగుచు

ధర నొప్పు మూర్ఖ కు-తర్క వాదములఁ
జొరక సదా పరి-శుద్ధమై వెలుఁగు

శుద్ధచైతన్య మ-చ్చుగ భావమందు
సిద్ధాంతముగఁ జూచి - చింతింపుచుండు;

ధీర! నీ వందుఁ బొం-దెద వని కరుణ
నారూఢుఁడైన సంయమి- దృఢంబుగను

మొనసి రామునకు ము-ముక్షు ప్రకరణ
మనువొంద బోధించె-ననుచు వాల్మీకి

క్రమమొప్ప వివరింపఁ-గా భరద్వాజ
[illegible]

మఱియేమి చెప్పె స-మ్మతముగా నాకుఁ
దిరమైన దయతోడఁ-దెలుపవే!' యనుచు

నడుగ, భరద్వాజు-నాత్మలో మెచ్చి
యడర వాల్మీకి యి ట్లని చెప్పఁదొడఁగె:

'వినుము భరద్వాజ! - విజయ రాఘవునిఁ
గని వసిష్ఠుండు సత్-కరుణ ని ట్లనియె:

'ధరణీశ! యుక్తి యు-క్తములైన వాక్య
సరణి బాలుండైనఁ - జక్కఁగాఁ జెప్పె

[16]నేని నీ వాలించు - నిజముగా నెంచు,
మా నలినోద్భవుం - డైన నయుక్త

వచనముల్ చెప్పిన - వాంఛతో వినకు,
మచలుండవై సత్య - మాత్మ నూహించు;

మాకాశ జాఖ్యాన - మాదిఁ జేసికొని
ప్రాకటంబుగ దశో - పాఖ్యానములను

నీకుఁ జెప్పెద, నది - నెళవుగా, దెలియు
[17]మాకాశజము సూక్ష్మ - మై చోద్యముగను

మొదటఁ దోఁచక యుండి - మూలవస్తువును
తుద నాత్మ దృష్టికిఁ - దోఁపింపుచుండుఁ;

బొలుపొందఁ బ్రతిపత్తి, - భూతి, వేదనలు,
[18] నలయఁ బరోక్షంబు - నని చెప్ప నొప్పు

---

16 నే ని భావించు, నిజముగా నెంచు-వా.

17 మాకాశము నిజసూక్ష్మంబైన చోట - వా

18 నల యుపమోక్షంబు నని చెప్పనొప్పు - వా

నీనాల్గు నామంబు - లెనయ జీవుండు
పూని [19]సంవిత్ స్వరూ-పున మించి తనరు;

ఘన పదార్థ జ్ఞాన - కలితుఁడై యహము
నెనసి పూరుషుఁడన - నింపొందు నతఁడు

పరఁగ సంకల్పాది - భావంబులందు
విరివిగా నుదయించి - విపరీతమైన

జ్ఞానంబుచే మహా - జనిధితరంగ
ఫేన బుద్బుదములై - పెంపొందినటులఁ

దానె ప్రపంచమై - తగవెల్గుచుండుఁ
గాని, తదన్య మె-క్కడఁ బుట్టలేదు.

ఆ ప్రపంచము బంధ-మై యుండుఁ గనుక,
నాప్రపంచముఁ దన-యం దణంచుటయె

ముక్తి యనంబడు, - ముక్తికి వేఱె
యుక్తి లే దిది మహా-యోగి నిశ్చయము.

మనుజేంద్ర! తద్దృశ్య - మార్గంబు నీకు
వినిపించెదను నేను - విశదంబుగాను

కల రీతిఁ దోఁచు జ-గంబు లన్నియును
విలయ కాలము లందు - విరిసి నశించుఁ;

గల లన్ని యణఁగఁ జొ-క్కముగా సుషుప్తి
యలవడిన ట్లుండు - నంధకారమును

జలజాప్త, చంద్ర, న-క్షత్ర పావకుల
వెలుఁగు లెక్కడ లేని - వేళఁ దా నొకటె

19 సంవిత్ స్వరూపము మించి దనరు - వా

అవ్యక్త మచల మ - నాద్యమై నిండి
దివ్య చిన్మాత్రమే - దీపింపుచుండు,

నల చిత్తున నకు [20]ఋత-మాత్మ సద్బ్రహ్మ
మలఘు[21]సత్తామాత్ర - మని యార్య జనుల

చేతను వ్యవహార - సిద్ధికై వివిధ
పూత నామములఁ జె-ప్పఁట [22] కొప్పు నతఁడు

చెలఁగి యన్యుని పోల్కి - జీవాత్మuఁ డగుచుఁ
గలనా కలత్వ సం-కలితుఁడై చెలఁగి,

మానసంబున మహా - మాయయై మించి
తానె సంకల్ప బృం - దము లగుచుండు,

మొనసి తత్సంకల్ప - మున నింద్రజాల
మనఁగ నొప్పుచు విశ్వ - మంతయుఁ బుట్టు,

వనధివల్లఁ దరంగ - వారముల్, కనక
మున భూషణమ్ము లి-మ్ముగఁ బుట్టు కరణి

సత్యమైనటువంటి-సద్ బ్రహ్మమందు
నత్యంత నశ్వర-మగునట్టి సృష్టి

మనమై ప్రకాశించి - మాయాబలమున
మొనసి పృథగ్భావ-ముగఁగల్గు చుండు

సునిశితమైనట్టి - సూర్యప్రకాశ
మున నెండమావులు - మొనసి కన్పించు

కరణిఁ బరాత్మ ప్ర-కాశంబునందుఁ
బొరిఁబొరి విశ్వంబు -[23]పుట్టు నీరీతి

---

20 ఋతుమాత్ర సద్బ్రహ్మ - వా.

21 సత్తనుమాత్ర - వా.

22 [illegible] - మం.

23 [illegible] - వా.

ఘనతరోత్పత్తి ప్ర-కరణంబు నీకు
వినిపించెదను మఱి - విను మింక నొకటి.

## * ఆకాశజోపాఖ్యానము *

కరమర్థితోఁ బూర్వ - కాలమం దాత్మ
నరయ నాకాశజుఁ - డనఘవర్తనుఁడు

అల్లఘుఁ డాయుష్మంతుఁ - డను విప్రుఁడొకఁడు
గలఁడు, మృత్యువు వానిఁ-గదిసి కొంపోవ

వలె నంచు డగ్గఱ - వచ్చి తా నతని
బలము, తేజముఁ జూచి - భయమొంది, మదినిఁ

దలఁచె ని ట్లనుచు 'భూ-తంబుల నెల్ల
మెలపుగా నే దిగ-మింగుచుండుదును,

అటువంటి నాకు నీ - యవనీసురుండు
ఘటికుఁడై చిక్కఁ డె-క్కడివాఁ డితండు?'

అని వితర్కింపుచు - నంతకు కడకుఁ
జని మ్రొక్కి నిలిచి, యా-చందమంతయును

'విను మృత్యుదేవి! యా విప్రపుంగవుఁడు
వినిపింపఁగాఁ బ్రేత-విభుఁడిట్టు లనియె:

ఆకాశజుండు మ-హానుభావుండు
నీకుఁ జిక్కఁడు తపో-నిష్ఠ పెంపునను,

ఆయు వుండిన వారి - నదిమి చంపుటకు
నీ యత్న మున్నదే? - నెఱి వారి వారి

కర్మానుసరణంబు-గా గతాయువుల
నర్మిలిఁ గొనిపోదు - వంతియె కాని,

యే కర్మములు చేయ-కిరవొందినట్టి
యాకాశజునిఁ ద్రుంప - నలవియె నీకుఁ?

గోపతాపములచేఁ - గ్రూరాత్ములైన
పాపకర్ములను జం-పందగుఁ బొమ్ము!'

అనిన దండ్రికి మ్రొక్కి - యా మృత్యు వరిగె;
నన వసిష్ఠునిఁ జూచి - యా రాముఁడనియె:

'మునినాథ! యాకాశ-మునఁ బుట్టె విప్రుఁ
[24]డని యంటి, రతఁడు బ్ర-హ్మని తోఁచె, వాని

విశదంబుఁ జెప్ప-వే!' యన్న, నమ్మౌని
దశరథాత్మజుఁ జూచి - తగ నిట్లు లనియె:

'వసుధేశ! మృత్యుదే-వత కగపడని
యసమానుఁడే బ్రహ్మ-యగుఁ, బృథివ్యాది

భూతవిరహితుఁడై - పొసఁగి యాకాశ
మేతీరుగా నిండు - నెల్ల దిక్కులను

నా రీతిగాఁ దా ని-రాకారుఁ డగుచు
భూరి సంకల్ప సత్ - పూరుషుఁ డయ్యె;

అరయఁగా నతఁ డజుఁ - డాది మధ్యాంత
విరహితుం డాద్యుండు - విమలుండు నగుచుఁ

గలలోన నొక వంధ్య - గన్న పుత్రకుని
వలెఁ గల్గి తా దేహి- వలెఁ దోఁచుచుండుఁ,

దెలిసితే పరమాత్మ - దేహిగాఁ' దనఁగ
నల రామచంద్రు డి-ట్లనె: 'నోమునీంద్ర!

---

24 దనఁగ నాతఁడు బ్రహ్మమని తోఁచె, దాని - వా.

అరయ భూతంబుల - కాతివాహికము,
తెఱఁగొప్ప నాధిభౌ-తికమన రెండు

తనువులు గల, వా వి-ధాత కా రెండు
నొనరంగఁ గలవొ? లే-వో?' యన్నమౌని

పలికె నిట్లని 'భూత-పటలి కారణము
వలనఁ బుట్టఁగఁ దను - ద్వయము ఘటించె,

ఘనకారణాత్ముండు - గాక, విజ్ఞాన
మెనయఁగా నాతివా-హికుఁ డయ్యె నజుఁడు;

గనుక జీవుండు సం-కల్ప పూరుషుఁడు
తనుతర చిత్తమా-త్ర స్వరూపుఁడును

వెలయు సృష్టి, స్థితి, - విలయకారణుఁడు,
మొలచు మనోరూప-మును, స్వయంభువును

తానె యై సృష్టి వి-స్తారంబు సేయుఁ
గాన నీ తోఁచు జ-గంబు లన్నియును

మొనసి మనోమయం-బుగఁ జూడు రామ!'
యనిన 'మనోరూప - మన నెద్ది? దాని

సరణిఁ జెప్పు' మటంచు - జలజాప్తకులుఁడు
మఱువక యడుగ న-మ్మౌని యి ట్లనియె:

'జననాథ! విను మాత్మ - సంకల్పసరణి
మన మనంబడుఁ గాని - మఱివేఱె కలదె?

సంకల్ప జాలముల్ - సంకీర్ణ మగుచుఁ
బొంకంబులై మనం - బుననె వసించుఁ,

గావున మదికి సం-కల్పంబులకును
దావలమగును, భే-దములే; దవిద్య

యగు మనంబు మలంబు, - నంధకారంబు
నగుచు సంకల్పాఖ్య - లగుచుండు, వాటి

వలన జగంబులు - వర్ధిల్లు చుండుఁ,
జెలువారి యవి నశిం-చిన వేళలందు

గగనాది భూతసం - ఘములు లయంబు
లగు, నందుఁ జిన్మాత్ర-మంతట నిండి

యగణితముగ నేక-మై వెల్గు చుండుఁ,
దగ జగద్ద్రష్టయై - తనరు నాత్మకును

నెనవుగా నీవును - నేను జగంబు
లను దృశ్య సత్త యు-న్నట్టి వేళలను

తలకొని కేవల-త్వము లేక నుండు,
నల దృశ్య సంభ్రమం- బణఁగిన తఱినిఁ

ప్రతిబింబ రహిత ద-ర్పణము చందమున
హితమొప్ప ద్రష్టృత్వ - హీనమై నిండి

ఘన కేవలాత్మ యొ-క్కటి వెల్గుచుండు;
మొనయు చిదాకాశ-మున మానసంబు

అనిశంబు తాన స-దాకృతి యగుచుఁ
గను మూసి నిద్రించు - కాలంబులందుఁ

గనిన స్వప్నంబుల - కైవడిగాను
పెనుచు లోకములను - భేదరూపముల

నటువంటి లోకంబు - లణఁగెడి వేళ
స్ఫుటముగాఁ గ్రమ్మఱఁ - బుట్టెడి వేళ

శాంతమై గ్రుంకని-జలజాప్తుకరణి
నంతట నవశిష్ట-మై నిల్చియున్న

యజరుఁ డనామయుఁ- డాదిదేవుండు
నజుఁ డనంతుఁడు పర-మాత్ముఁ డీశ్వరుఁడు

సర్వకాలంబును - శాశ్వతుఁ డగుచు
సర్వవిశ్వమును ము-చ్చటగఁ జేయుచును,

నన్నియుఁ జేసి, చే-యనివాఁడు నగుచుఁ
బన్నుగా నంతటఁ - బరిపూర్ణుఁ డగుచు,

నరయఁగా వాఙ్మన - సాతీతుఁ డగుచుఁ
బరమమోక్షస్వరూ-పకుఁ డగుచుండు;

నతనికి నాత్మ ము-ఖ్యాభిధానములు
ప్రతిభతోఁ గల్పింపఁ - బడు నదె ట్లనినఁ

దొలుత వేదాంత వా - దులు బ్రహ్మ మనుచుఁ,
బొలుపొంద సాంఖ్యులు - పూరుషం డనుచు,

విజ్ఞానవిదులు భా-వించి నిక్కముగఁ
బ్రజ్ఞాన మేనని -పల్కఁగా, మఱియు

శూన్యమతస్థులు - శూన్యమే ననుచు
ధన్యమౌ శుద్ధ చై-తన్యంబునకును

నెనలేని నామంబు-లీ ప్రకారముల
మొనసి కల్పింతు, రా - మూలతత్త్వంబు

జలజాప్త చంద్రన- క్షత్ర పావకుల
కలఘుగ్రహంబుల - కమిత తేజములఁ

దా నిచ్చి వానిచే - తను దాను వెలుఁగ,
కా నిర్మల స్వప్ర-కాశత్వమునను

వెలిఁగి, సూర్యాదుల - వెలిఁగింపుచుండుఁ;
బొలుపుగా స్మర్తయు, - భోక్తయు, భర్త,

ద్రష్ట, ఋతంబునై - తా నన్ని యెడల
నిష్టంబుగా నుండి - యెచట నంటకను

ఆరయ దేహస్థుఁ-డై, దాని కెపుడు
దూరమై తానె చి-త్తును, సత్తు నగుచుఁ

బొలుపుగా స్త్రీపున్న - పుంసక లింగ
ములు గాక, యింతకు - మూలమై యుండు

అతని దేహంబునం - దమితాబ్జజాండ
వితతులు పుట్టుచున్ - విరియుచు నుండు

ఆ యనంతుఁడు విశ్వ - మంతయుఁ జేసి
'సేయకయే నిర్వి - శేషమై యుండు'

నని తత్త్వనిశ్చయం - బా రాఘవునకు
మనమొప్పఁ జెప్పి - యమ్మౌని యి ట్లనియె:

'అరయఁగా [25] నఖిలేతి - హాససారంబు
పరమమాకాశజో-పాఖ్యాన మగును,

అనుభవంబుగ దీని - నాలించు వార
లనఘ! జీవన్ముక్తు - లై సుఖింపుదురు.

ఇలను జీవన్ముక్తు - లెట్టి వా? రనిన
బలియు రాగ, ద్వేష - భయములు లేక,

నాకాశమును బోలె - నత్యచ్ఛ మగుచుఁ,
బ్రాకటంబుగ నన్ని - పనులు చేయుచును,

---

25 నిది యితిహాససారంబు - వా.

ఎల్లకార్యములందు - నేవేళ నాత్మ
చల్లనై తగునట్టి - శాంతి వహించి,

పొరిఁ [26]బదార్థములందుఁ - బూర్ణుఁడై, గర్వ
విరహితుఁ డగుచు వి-వేకియై నట్టి

వాఁడు నిక్కముగ జీ-వన్ముక్తుఁ డగును.
పోఁడిమిగా నట్టి - పుణ్యాత్మకుండు

కాలవశంబునఁ - గాయంబు విడిచి
వాలాయమైన జీ-వత్వంబు నణఁచి

పరమాత్మ యందుఁ ద-ప్పక పొందు; నదియె
మురువు మీఱ విదేహ - ముక్తి యటంచుఁ

బలుక నొప్పు' నటంచుఁ బట్టు గాఁ జెప్పి
పలికె నమ్ముని, యీ యు-పాఖ్యానమందు

నల పరమాత్మ మా-యా మనోరూప
కలితుఁడై జగములఁ - గల్పించినట్టి

సరణిఁ జెప్పంబడె; - సాత్త్వికి మాయ
కిరవైన దుర్ఘట - హేతుత్వ మహిమ,

మఱి జగత్తునకును - మాయికత్వమును
తరమిడి యెఱుగంగఁ - దగునట్టి లీల

చరితంబుఁ జెప్పెదఁ - జక్కఁగాఁ దెలియు
మరు దది యెట్లన్న - నాలించి వినుము!

---

26 పరార్థములందు - వా.

## * లీలో పాఖ్యానము *

కమనీయ సామ్రాజ్య - కలితుఁ డనంగ
నమరెడు పద్మకుఁ-డను మహీపతికి

నలర భార్యామణి - యైనట్టి లీల
వలనొప్పఁగా సర-స్వతినిఁ బెక్కేండ్లు

కడఁక నుపాసింపఁ-గా వాణి వచ్చి
పొడసూప, లీల తె-ప్పున లేచిమ్రొక్కి

వినుతులు పెక్కు గా-వింప, నవ్వాణి
'వనిత! నీ కిపు డేమి - వర మిత్తు' ననఁగ

నీ లీల పలికె 'నా - కన్న ముందుగను
తాలిమి లేక నా - ధవుఁ డొకవేళఁ

[27]దెప్పునఁ గాల గ-తినిఁ జెందెనేని
యొప్పి నాయింట [28]జీ - వుం డుండు నట్టి

వర మీయు, మదిగాక - వరుఁడు దేహంబు
దొరఁగిన తఱి నాకుఁ - దోడుగా నీవు

వచ్చి నాపతిఁ బ్రోవ - వలె' నన్న వాణి
మెచ్చి యి ట్లనియె 'నో- మెలఁత! నీవిభుఁడు

తనువు వీడిన వేళఁ - దడయ కా క్షణమె
పనిఁబూని సుమమంట-పంబుఁ గల్పించి,

యందు నీ పతి నుంచి - యపుడె పుష్పములఁ
బొందుగాఁ బైనఁ గప్పుము, దానఁ దనువు

27 గప్పి తెప్పునఁ గాల గతి నొందెనేని - వా.

28 జీవుండున్న యట్టి - వా.

కందక కుందక - కాంతితో నుండు
ముందరఁ దత్ప్రాణ-ములు వచ్చు మరల,

బ్రదికి యీరాజె నీ-భర్తయై యుండు,
నిది నమ్మియుండు మో - యింతి!' యటంచు

నా లీల కెఱిఁగించి - యరిగె నవ్వాణి,
మేలు గోరుచు లీల - మెలపుగాఁ బతిని

కలిసి యుండఁగ, నంత - కాలంబు రాఁగ
నల పద్మభూపాలుఁ - డంగంబు విడిచి

చనఁగ నా లీల పు-ష్పముల మంటపము
పనిఁబూని నిర్మించి - పతిదేహ మచటఁ

బెట్టి, పైఁ బూలు గ-ప్పించి, కన్నీరు
పెట్టి, వాణినిఁ దాను - బేర్కొనఁగానె

వచ్చి సరస్వతి - వర పీఠమందుఁ
జెచ్చెరఁ గూర్చున్నఁ, - జేదోయి మొగిచి

కనుల బాష్పము లొల్కఁ-గా లీల భార
తినిఁజూచి పలికె 'నో - దేవి! మద్విభుఁడు

ఎచ్చటి కరిగెనో - యెఱుఁగఁ దద్దేహ
మిచ్చటి నుంచి, నీ - వెఱిఁగించినటులఁ

జేసితి, నిఁక నేమి - సేతు? మత్పతినిఁ
బాసి ప్రాణము లెట్లు - భరియింతు నేను?'

అని యేడ్చుచుండఁగా - నాదరం బెసఁగ
నెనసిన నెనరుతో - నిట్లనె వాణి

'ఓ లీల! క్లేశంబు - మపసంహరింపు!
[illegible] మెంతటివారు - గడవంగా లేరు,

పుట్టినవారెల్లఁ - బోవుట నిజము,
నెట్టనఁ దిరముగా - నిల్వ రెవ్వరును,

కలలవంటిది యీ జ-గంబులో రీతి;
తెలిపెద నెట్లన్నఁ - దేటగా వినుము!

నానాశరీరముల్ - నశియించి పోవు,
నూని శాశ్వతముగా - నుండు జీవుండు.

ఆ విధమెల్ల నీ - వరుదుగాఁ జూడఁ
గా వలసినఁ జూతు - గాక! నీ కిపుడు

తిరముగా జ్ఞానోప-దేశంబుఁ జేతు
నరసి భావించు చి-త్తాకాశ మొకటి,

యనుపమంబైన చి-దాకాశ మొకటి,
యొనరంగ నాకాశ - మొకటి యీ మూఁడు

గల; వివెప్పుడు నిరా-కారంబు లగుచు
నలరఁగా నొండొంటి - నంటక యుండు

*జగతివే యాకాశ - శబ్ద వాచ్యంబు
లగును; చిత్తాకాశ - మందు నాకసము

నందుఁ బొందకనె చి-దాకాశ మొప్పు,
నందుఁ జిత్తాకాశ - మను దాని యందు

గడఁకతో వృత్తి[29] వి-కారంబు లుండు,
నడరార నాకాశ - మందుఁ బూర్ణతయు,

జడత గలిగియుండు; సతత మా రెంటి
కెడమై వికారత్వ, - మిల జడత్వమును

---

*'జగతిన్ + ఇవే' - అని పదవిభాగము.

29 యే కాలంబు లుండు - వేం.

బొరయక తా స్ఫురత్ - స్ఫూర్తులు గలిగి
యిరవొఁ జిదాకాశ - మెట్లన్న వినుము !

ఒక దేశమందుండి - యూరకే మఱియు
నొకదేశమునఁ బొంది - యుండఁగా, రెంటి

నడుమ నేదేశ మె-న్నఁగ రాక వృత్తిఁ
బొడముట లేక సం-పూర్ణమై యుండు

నమలచిదాకాశ - మన నొప్పు నదియె.
క్రమముగా నీవు సం-కల్పంబు మఱచి,

యా చిదాకాశంబు - నాత్మ భావించి
చూచి దృశ్యము లన్ని - శూన్యంబు లగుట

తెలిసితే బ్రహ్మమం-దే పొందఁగలవు.
వలనుగా నిపుడు మ-ద్వరముచేఁ బతిని

నీవు చూతువు గాక! - నేఁ జెప్పినట్లు
భావించు'మని వాణి - బ్రహ్మలోకంబుఁ

జేరె; నిక్కడ లీల - చిత్తవృత్తులకు
దూరమై, నిర్లేప - తుర్య సమాధి

యందుండి పరమాత్మ - యందు వేగముగఁ
బొంది, నిజేశుండు - పూఁ బాన్పుమీఁదఁ

బదియు నాఱేండ్లైన - ప్రాయంబుతోడఁ
బదిలుఁడై యుండఁగా - భావించి చూచి,

మదిని భారతిని స-మ్మతముగాఁ దలఁచె;
సదయాత్మయై వేగ - శారద వచ్చి

ముందర నిలువఁగా - మ్రొక్కి పీఠంబు,
నందుంచి లీల యి-ట్లని విన్నవించె:

తల్లి! గీర్వాణి! నా - ధవునకు సృష్టి
వల్ల వేఱొక సృష్టి - వచ్చె వింతగను,

ఈ జాగ్రత భ్రాంతి - యే?'మని యడుగ
నా జలజాక్షి కి-ట్లనియె గీర్వాణి

'అతివరో! మృతిఁ జెంది-నట్టి నీ యాత్మ
పతి పూర్వ జన్మ *వి-భ్రాం తీవు గనిన

యది విప్రదేహమౌ, - హరిణాక్షి! రెండ
వది రాజదేహమై - వసుధఁ బాలించి,

యీ దేహమం దుండి - యేఁగి వేవేగ
నా దేహమునఁ జొచ్చె - నద్భుతంబుగను.

ఆ రీతిఁ జెప్పెద - నాలించి తెలియు!
మారూఢమైన చి-దాకాశమందు

మానిత సంసార - మంటప ముండు,
దానియం దొక శైల - తటమున నొక్క

పట్టణంబున నిజ - భర్తతోఁ గూడి
పట్టుగా నొక్కవి-ప్రవరేణ్యుఁ డుండి,

యల కొండక్రింద మ-హా వినోదములు
బలముఁ జూపుచు నొక - పార్థివేశ్వరుఁడు

అలరుచు మెకవేట - లాడఁగాఁ జూచి
తలఁచె ని ట్లనుచుఁ జి-త్తమున 'నీ రాజు

పగిది నెన్నడు భూమిఁ - బాలింతు?' ననుచు
వగచి, చింతను బొంది - వాఁ డందుఁ దనువుఁ

---

[illegible]

బడవైచి పద్మ భూ-పాలుఁడై పుట్టె;
నడలుచు నతని భా-ర్యామణి మేనుఁ

బాసి లీలాఖ్యతోఁ - బ్రభవించి నీవు
భాసురాత్మకుఁడైన - పద్మభూపతికి

నిల్లాలవైతివి, - యిష్టభోగముల
నెల్లవా రెఱుఁగ భూ-మేలు చుండితిరి.

మొనసి బ్రాహ్మణ దేహ-ములు మీరు విడిచి
యెనిమిదినా ళ్లయ్యె, - నిచ్చట మీరు

పొడమి డెబ్బది యేండ్లు - భోగేచ్ఛ మీఱఁ
బుడమి యేలితిరి యి-ప్పుడు రాజతనువు

వీడిన దిన మందె - విను పదాతేండ్ల
వాఁ డయ్యె'. నని మఱి - వాణి యి ట్లనియె:

'ఆ విప్రుభార్య నీ - యటువలె నన్ను
వావిరి నర్చించి - వరయుగళంబు

నడుగ నిచ్చితి. విప్రుఁ - డానాఁడు తనువు
విడిచియు, నా యిల్లు - వెడలి పోకుండెఁ

గాన, మీ యిరువురి - కాపురమెల్లఁ
బూని బ్రాహ్మణ గృహం-బున నున్న దిపుడు.

అరయఁ బునర్జాతుఁ-డైన భూవిభుని
గురుతర సంసార - గోష్ఠి నీయింట

నిలిచియున్నది'యని - నిశ్చయంబుగను
పలుకఁగా విని లీల - భారతి కనియె:

'అక్కట! జనని! బ్రాహ్మణవర్య జీవ
మెక్కడ వచ్చి మా - యింటిలోఁ జొచ్చె?

వా౦ డేడ? మే మేడ? - వన, గిరుల్ దిశలు
నేడ? నవెల్ల మా - యింట నె ట్లణఁగె?

నిమ్మాడ్కి వచియింప - నేల? యిచ్చోట
నమ్మ! యీ వాక్యంబు-లన్ని దబ్బఱలు.

కుదురైన సర్పకో - టరమందుఁ బిదపఁ
బదపడి సురదంతి - బంధింప బడియె,

బలమొప్ప నణువులో - పలనుండు సింహ
ములతోడ మశక మి-మ్ముగఁ బోరి గెలిచెఁ,

గమలబీజంబులోఁ - గనకాద్రి యున్న
నమర భృంగము మ్రింగె - ననిన చందంబు

గా వచియింప కె - క్కడిమాట'?లనఁగ
నా వాణి లీల కి - ట్లనియె 'నెన్నడును

నే దబ్బఱాడను, - నీచేత నియతి
భేదన సేయ న -భేద మాత్మీయ

మందిరమందు బ్రా-హ్మణుని జీవాత్మ,
పొంది యున్నది, యిది - బొంకు గా దతివ!

ఆవిప్రుఁ డున్న మ-హారాష్ట్ర మాత్మ
భావింప గగన రూ-పంబగుఁ గనుక,

గగనాత్మకుండై ప్ర-కాశించి, యన్ని
యగణితుఁ డగుచుఁ దా - నందుండి చూచు;

నానాఁటిదేహంబు - లందున్న తలఁపు
లీనాఁడు మఱచితి, - రిద్దఱియందు

మనముల వేఱె - సం-స్మరణలు పుట్టె;
వనజాక్షి! జాగ్రద-వస్థలు దలఁచు

తలఁపు లన్నియును జి -త్తమున వసించి
కలలందు సుఖము, దుః-ఖమును జీవునకుఁ

బరిపరి విధములఁ - [30] బాపపుణ్యముల
సరణులఁ దోఁపించి, - జాగ్రదవస్థ

మరల వచ్చిన [31]నన్ని - మాయంబులైన
కరణిని మరణంబు - గలిగిన వేళ

బొందిలో మును పుండి - పుణ్యపాపముల
నిందుఁ జేసిన వెల్ల - నెనసి వెన్నాడి

చనఁగ, లింగశరీర - సహితుఁడై స్వర్గ
మున మహాసుఖము ని - మ్ముగ నారకముల

యందు దుఃఖము పూర్వ - మవనిపైఁ గలఁ
జెంది తా ననుభవిం-చిన చందములను

ననుభవించిన మీఁద - నవనిపై మరల
జనియించి, పరలోక - సౌఖ్యదుఃఖముల

మఱచుచు సంసార - మాయలోఁ దగిలి,
పరువడి పుణ్యపా-పంబులు చేసి,

చని పుట్టు, నిటువంటి - చావు, పుట్టుకలు
కినిసి జీవునకుఁ గ-ల్గిన చందమునను

గనిపించు నజ్ఞాన - కలితులై నట్టి
మనుజున'కని చెప్పి - మరలనిట్లనియె:

'ముదితరో ! సంకల్ప - ముకురంబు పోలెఁ
గుదురు [31A]చిదాకాశ - కోటరమునను

---

30 బాప పుణ్యాను - వా

31A చిదాకాశ కోశ కోటరము

31 నందు మాయంబులైన - వా

నందొప్ప నంతఃస్థ-మై యుండు భూమి,
యందెన్నఁ బరమాణు - వనఁ దోఁచు నాత్మ

యందుఁ దద్రూపమై -నట్టి మనంబు
నందు సర్వజగంబు - లద్భుతంబుగను

గనఁ బ్రతిభాసాత్మ - కంబులై యుండు'
నన విని లీల యి-ట్లనె సంశయమున

'జనని! యావిప్రుండు - చనిపోయి నేటి
కెనిమిదినా ళ్లంటి, - విచ్చట నాకు

నెన్నఁగా డెబ్బది - యేం డ్లయ్యె, నిట్టు
లున్న కలఁకఁ దీర్పు - మోతల్లి ! ' యనిన

విని వాణి పలికె నో - విరిఁబోణి ! నిజము
పనుపడ నాలించు - ప్రతిభాసకన్న

నల దేశ కాలముల్ - హ్రస్వముల్, దీర్ఘ
ములు లేవు, చిద్రూప-మున కన్న వేఱె

ప్రతిభాసలే; దట్టి - ప్రతిభాసవిధము
సతి! విను మెట్లన్నఁ - జంద్రచంద్రికల

కరణి భేదా భేద - కలితంబు లగుచుఁ
బరమచిత్తును చిత్ప్ర - భాసలు వెలుఁగుఁ;

జిత్తానఁ [32]బ్రతిఫలిం-చిన కారణమునఁ
జిత్తు జీవాత్ముఁడై - సృష్టితోఁ దగిలి

మరణ మూర్ఛలఁ బొంది - మదిఁ బూర్వ సరణి
మఱచి, క్రమ్మఱఁ బుట్టి - మాయచేఁ జిక్కి

32. ప్రతిభవించిన కారణమున -శ.

కలఁ గాంచి మేల్కొన్న - కైవడిగాను
వలనుగా నన్యభా-వన నొంది, తాను

నాధేయ మగుచు నా - కాస్థూల దేహ
మాధార మనుచు దే-హాభిమానమునఁ

దనకు వీరలు తల్లి-దండ్రు లటంచు
గునిసి భార్యా పుత్ర-కులు వా రటంచు

మించి, కొందఱు శత్రు - మిత్రు లటంచు
నెంచి, వివేక వి-హీనుడఁయినందు

చేఁ బ్రపంచము దోఁచు - సిద్ధమైనట్ల,
ఈ ప్రపంచము కల్ల, - యీ భ్రాంతు లెల్ల

విడువుము! జీవుండు - వివిధ దేహములఁ
బడవైచుచును ప్రాఁత - బట్టల విడిచి

క్రొత్త బట్టలఁ గట్టి - కొనిన చందమునఁ,
జిత్త విభ్రాంతిచే - జీర్ణంబులైన

తనువుల విడిచి నూ-తనశరీరముల
నొనరంగ ధరియింపు-చుండు, వానికిని

నెందఱు తలిదండ్రు, - లెందఱు భార్య,
లెందఱు నందను, - లెందఱు హితులు,

శాత్రవు లెందఱు - చర్చింప, నీకు
మాత్ర మీపురుషుండు - మగఁడయ్యె ననుచు

భ్రాంతి నొందుచు దుఃఖ - పడక, నీ యాత్మ
నంతరంగంబునం - దరసితి వేనిఁ

బొలుపార స్త్రీ పున్న - పుంసకలింగ
ములు గల్గ వాత్మ కి-మ్ముగ నెన్నఁటికిని,

కావున నీవు ని-క్కము నెఱింగినను
నీవు స్త్రీయును గావు, - నెఱి బూరుషుఁడవు

గావు, నపుంస కా-కారంబు గావు,
భావింప నీకొక్క - పతి లేఁడు, నీవు

పద్మభూపాలుని - భార్యవు గావు,
పద్మాక్షి! నీ విట్టి - భ్రాంతి వర్జించి

పరమాత్మ నే నని - భావింపు' మనుచుఁ
బరిపరివిధముల భారతీదేవి

చెప్పినఁ, దనుఁ దానె- చింతించి లీల
యప్పుడి ట్లనియె 'నో - యమ్మ! గీర్వాణి!

నీవు చెప్పిన రీతి - నిశ్చయంబయ్యె,
నావిప్ర మిథున ము - న్నట్టి సజ్జకును

నను ఁగొనిపొ'మ్మన్న - నగుచు నద్దేవి
మనమున భావించి - మరల ని ట్లనియెఁ:

'దరుణి! యప్పరమ చై-తన్య చిద్రూప
సరణిని నీవు ని-శ్చయముగా నాత్మ

భావించి, తత్స్వ రూ-పంబున నైనఁ
బోవచ్చు, నావిప్ర-పుంగవుఁ జూడఁ

గావచ్చు. నీ స్థూల - కాయంబుతోడఁ
బోవుట దుర్లభం-బుగ నుండుఁ గానఁ

బరఁగఁ జిత్త స్వరూ-పమును ధరించి
తెఱఁగొప్ప నాధి భౌ-తిక శరీరంబు

నారసి ధ్యానింప-నపుడు మావంటి
వారి కెల్లను జిర - వాసనచేత

బలవంతముగఁ గనఁ - బడునట్టి వాస
నలు తనుత్వము నొంది-నను శరీరమునఁ

దగ నాతివాహిక - త్వం బుదయించుఁ
బగలైనఁ, దపన తా-పంబున మంచు

కరిగి నీరంబైన - కైవడిగాను
సురుచిరంబైనట్టి - శుద్ధసత్త్వంబుఁ

దఱచుగాఁ జిత్తను - తనువాసనయును
వరుసగాఁ గన నాతి - వాహికం బగును.?

నన విని లీల యి-ట్లనియె 'నీ జ్ఞాన
మెనసి నే సాధించు - టెట్లొకో? యనుచు

ననుమాన మొందఁగా - నా వాణి పలికెఁ
'దనుమధ్య! విను పర- తత్త్వ చింతనము

ధన్యతాప్రదమగు, - తత్కథాశ్రవణ
మన్యోన్య బోధనం, - బతిశయశాంతి

పనుపడిన తదేక - పరత యభ్యాస
మనఁబడు, దృశ్యంబు - లన్ని నశ్యములు

గా మదిఁగని కర్మ - కాదు లందఱును
బామరు లని వారి - [33]పథములఁ బోక

యూరకే యుపశాంతిఁ - బొందిన రీతి
నా రూఢమైన బ్ర-హ్మానుసంధాన

సరణి యటంచు ని-శ్చయముగాఁ జెప్పి,
సరిప్రొద్దు వేళ ని-శ్చలతరజ్ఞాన

---

ఫలఁ బోక వేం.

దేహంబుతో భార-తీ దేవి, దివ్య
దేహంబుతో లీల - దిగ్గున లేచి

గ్రక్కున గగన మా-ర్గంబున కెగసి
యక్కఱగా లీలఁ - బద్మజాండ మండలముఁ

బటుతీవ్రముగ నెడఁ - బాసి యా యిరువు
రట పోవఁగా నొక్క - యద్రిపైఁ బురము

వేవేగఁ గని, యందు - విప్రమంటపము
భావించి యిరువు రా-పంథను బోయి,

అచట రెండవ స్వర్గ - మందుఁ బొదివికొని
ప్రచురమై తగు పూల - పానుపు మీఁదఁ

బవళించి యుండిన - పద్మభూపాలు
శవముతో నొప్పిన - సదనంబుఁజేరఁ

గాను, దత్పతి వారిఁ - గని మ్రొక్కి, వాణి
నానందముగఁ జూచి యంఘ్రు లర్చించి,

యందున్నఁ, జూచి యి-ట్లనె వాణి 'నృపతి!
పొందుగా నిపుడు నీ - పూర్వ జన్మములఁ

దలఁపు' మటంచు మ-స్తకముపై హస్త
జలజంబు నిడఁగ, నా - జననాయకునకు

మనమునం దంటిన - మాయ దొలంగె;
ననఘుఁడై, విజ్ఞాని-యై పూర్వజన్మ

సరణిఁ దాఁ దెలిసి యా-శ్చర్యంబు నొంది
'సరవి నహో! మహా - సంసారమాయ!

గెంటక దివ్య యో-గినుల సత్కృపను
గంటి' నంచుఁ దలంచి - గరములు మొగిచి,

పలికె ని ట్లనుచు 'నో - భామినులార!
వెలయుచుండిన మేను - విడిచిన దినమె

నాకు షోడశహాయనము - లయ్యె, మఱియుఁ
బ్రాకటకార్యముల్, - బంధుమిత్రాది

జనులును దోఁచిరి - స్వాంతమం'దనిన
విని వాణి యా భూమి - విభునకిట్లనియె:

'అలవడు మోహ మూ-ర్ఛానంతరమునఁ
గలిగెఁ దత్స్మృతి నీకుఁ - గలఁగన్నకరణి,

నాలోకమును బాసి - యరుగ ముహూర్త
కాలమై యింతలో-గా విచిత్రముగ

మఱియు వేఱే విభ్ర-మం బుదయించె,
నరయఁగ ఘననిభం - బగు మనమందు

విను తగ వ్యవహార - విభ్రమకృతము
ననఁగ నొప్పఁగ నందు - నల ప్రతిభాస

పుట్టె, షోడశ వర్ష-ముల వాఁడ వైతి,
విట్టిరీతిఁ దలంప - నిలఁ గల యందుఁ

దగు ముహూర్తమున న-బ్దశతంబును నైన
పగిదిఁ దోఁచుచునుండుఁ-బటు మాయ వలన,

దానికైవడి జాగ్ర-త భ్రాంత మిదియుఁ,
కాని నిశ్చయమనఁ - గా రాదు నృపతి!

యలపరమార్థంబు - నందుఁ బుట్టుటలు,
పొలియుటల్ నీటి బు-ద్బుద వికారములు;

నిరుపాధికుఁడ వీవు - నిర్లేపనుఁడవు,
పరమభోగ స్వరూ-పకుఁడవు నీవు

అన్నియుఁ గనుచుండు - వన్నియుఁ గనవు,
నిన్ను నీ వెఱిఁగిన - నీ కన్య మగుచుఁ

గనిపించు వస్తు వె-క్కడ నైనలేదు.
తనర బాలకుఁడు భే-తాళభూతమును

గని మరణాంతదుః-ఖము నొందు కరణి,
మనుజేంద్ర! యదిగాక - మరుమరీచికలఁ

గాంచి మృగములు త-త్కాంతిఁ దోయముగ
నెంచి, ద్రావను బరు-గెత్తుచందమున

ననవరతంబన - త్తైన ప్రపంచ
మును సత్తుగా నెంచి - మూఢు లయ్యెదరు.

సత్తుగా దీ ప్రపం-చం బన త్తనుచు
నత్తఱి సకల వే-దాంతమర్మములు

చెప్పి విద్వాని దివిఁ-జేరి, యా యిరువు
రొప్పుగాఁ జూచుచు-నుండి రంతటను.

ఆ విదూరథుఁడు నం-దాత్మతత్త్వమును
భావింప నంతలోఁ - బరరా జొకండు

బలముతోఁ బద్మ భూ-పాలుని మీఁద
నలిగి కయ్యముఁ జేసి - యతని వధించె:

నప్పుడు వాని దే-హంబులో నుండి
తెప్పున నొక సూక్ష్మ - తేజంబు వెడలి:

గ్రక్కున గగనమా-ర్గంబున కెగిరె:
నక్కడఁ జూచుచు-న్నటువంటి వాణి

పదపడి లీలతోఁ - బలికె ని ట్లనుచు
'ఇదె చూడవే లీల! - యింతకు మున్ను

మనలతో భాషించు - మనుజనాయకునిఁ
బనిఁబూని యన్యన్న - పాలుండు ద్రుంచె;

వాని తేజంబిదే - వచ్చి యాకసము
నూని పై కెగిరిపో-వుచు నున్నదిపుడు

చూడు' మనుచుఁ - జూపుచును వాణి లీల
తోడఁ బోవ, విదూర - ఘుని జీవరేఖ

రహిమీఱ సర్గ ప-రంపరలందు
సహజంబుగాఁ బొంది, - చనిచని మఱియు

గురుతర బ్రహ్మాండ - కోటులయందు
మెఱయుచును బరిభ్ర - మించి, యా మీఁద

మరల దిగంబడి - మహిమీఁద వ్రాలి,
యిరవుగా మును పద్మఁ - డేలిన పురముఁ

జేరి యిల్లిల్లుఁ జొ-చ్చియును, వెళ్ళియును
వారక పద్మ భూ -వరుని మందిరముఁ

గనుఁగొని యట కేఁగి - క్రమ్మఱఁ బద్మ
మనుజేంద్రు తనువులో - మాయగాఁ జొచ్చి

వెలుఁగ, నప్పద్మభూ - విభుఁడు నిద్రించి
కలఁగాంచి లేచిన - కైవడిగాను

ఆవులింపుచుఁ గన్ను - లప్పుడు దెఱచి
లేవఁగాఁ, జూచి యా - లీల సంతోష

కలితయై భారతి - ఘనమహామహిమఁ
దలఁచి నుతింపుచుఁ, - దత్పతి కడకుఁ

దొలఁగ కాశారద - తోడఁ దా వచ్చి
నిలువ, లీలను జూచి - నృపుఁ డిట్టులనియె:

'మానిని! యీ పుష్ప - మంటపస్థలము
నే నెన్నఁ డైనను - నిర్మించలేదు,

ఈ లక్షణం బేమి? - యెఱింగింపు' మనఁగ
నా లీల నడచు వృ-త్తాంతంబు లెల్ల

వినిపింప, విని రాజు - విస్మయ మొందె
అనుపమకరుణతో - నా నృపాలునకు

జ్ఞానోపదేశ మ-చ్చటఁ జేసి, వాణి
పూని లీలను జూచి - పొసఁగ దీవించి,

గ్రక్కున సత్యలో-కంబున కరిగె;
ఇక్కడ లీల ని-జేశ్వరుఁ గూడి

యెనుబదివేల యేం-డ్లిష్టభోగముల
ననుభవింపుచు నుండి - యట ముక్తులైరి.

మానవేశ్వర! మనో - మాయావశమున
నూని కనంబడు-చున్న విశ్వంబు

పొలుపార లీనమై - పోవుట జనులు
తెలిసికొందు రటంచుఁ - దీటగా లీల

కథఁ జెప్పితిని ని-క్కము లన కవలి
కథ విను!' బ్రహ్మ మ-ఖండచిన్మయము,

పరిపూర్ణ, మమలంబు, - భావనాతీత
పరమాత్మతత్త్వంబు - భావింప నదియె

యచలమై సర్వ దే-హములందుఁ బొంది,
ప్రచుర నిర్వాత దీ-పము భంగి నుండు;

నదె జీవకళ యని - యాత్మ భావించు!
వదలక సంసార-వాసన నదియె

గణుతి కెక్కుచు నహం - కారమై నిలిచి,
యణువట్ల సూక్ష్మమై - యగ్ని కణంబు

బహుకాష్ఠములఁగూడి - ప్రబలింప, నందు
బహువిస్ఫులింగముల్ - ప్రభవించు కరణి

నాయహంకారాణు - వం దనేకములు
గా యహం కారాణు - గణములు గలిగె;

ఘనమైన యాద్యహం-కారమే ప్రకృతి
యన, మాయ యన, మనం - బనఁగాననేక

నామ రూపముల నా - నా ప్రపంచముగను
దా మించి వికసించి, - తన కాదియైన

పరమాత్మతత్త్వంబు - భావింపనీక
మఱుఁగు తానై నట్టి - మానసమందుఁ

బొలుపుగా నీ జగం-బులు విస్తరించుఁ,
గలల చందంబునఁ - గనిపించు. నణఁగు

నల జీవులకుఁ బర-మాత్మ కైక్యంబు
గలిగిన చందంబు-గాను జీవాత్మ

చిత్తరూపముఁ దాల్చి - చేష్టింప. నవలఁ
జిత్తంబు ప్రబలించి - సృష్టి గల్పించె:

సదమల చైతన్య - సాన్నిధ్య పటిమ
నొదవి విశ్వము పుట్టు. - నుండు. నశించు;

ఆ పరమాత్మ తా - నణఁగ దెన్నఁటికిఁ.
గాపట్య జగములే - గలుగు. లయించుఁ

గాన, నంతటి కాది - కారణ మాత్మ;
దానిని నీవుగాఁ - దలఁపు శ్రీరామ!

## * కర్కటికోపాఖ్యానము *

ఇపు డొక యితిహాస - మేను జెప్పెదను
చపలత నొందక - చక్కఁగా వినుము!

అర్కకులేశ! యీ - యవనీతలమునఁ
గర్కటి యనెడి - రక్కసి గల దొకతె,

అది హిమ శైలోత్త - రారణ్యములను
గదిసి చరింపుచుఁ,-గనఁబడినట్టి

జనుల ననేకులఁ - జంపి భక్షింపు
చును. దిరుగుచు మహా - క్షుద్రాత్మయైన

పాపరాక్షసి, పుణ్య - పరిపాకకాల
మా పట్ల రాఁగఁ దా - నాహార ముడిగి,

శాంతిచే జీవహిం-సలఁ జేయ రోసి,
యాంతరంగిక దృష్టి - నాత్మ భావించి

కనుచు వెయ్యేండ్లు ని-ష్కర్షగాఁ దపము
నొనరింప. నటుమీఁద - నొక్క నాఁ డజుఁడు

దాని చెంతకు వచ్చి - తరుణి! నీ తపము
నేను మెచ్చితి, శాంతి - నిలిచె నీ మదిని;

కూడు విడిచిపెట్టి - ఘోరతపంబు
నీడ చేయక, లేచి - యేగి యెందైనఁ

బాపకర్ములఁ జంపి - భక్షింపు' మనుచు
నా పద్మజుఁడు దాని - కప్పుడు చెప్పి

చనియెఁ; నంత సమాధిఁ - జాలింప కతివ
పనిఁబూని నిర్వికల్ప సమాధియందుఁ

దెగువ మీఱ ననేక - దివ్యవత్సరము
లగణిత మతి నుండి, - యట లేచి పోయి,

యాఁకలి మునుపటి - యట్ల పుట్టఁగను
వీఁకతో మనుజుల - వెదకుచు నొక్క

యడవిలో నడిరేయి - నరుగుచునుండి,
విడఁబడి మెకముల - వేఁటాడి యెదురు

వచ్చుచున్న కిరాత - వరునిఁ, దన్మంత్రి
నచ్చుగా నీక్షించి - యార్భటింపుచును

పదరి పల్కెఁ' గిరాత-పతి! నిన్ను, మంత్రి
నదిమి చంపి భుజింతు - నాఁకలిదీఱ,

నటుచావరేని నే-నడిగిన ప్రశ్న
లిట మీఁదఁ జెప్పఁడ - వెట్లన్న వినుఁడి!

పాయక మితి లేని - పద్మజాండంబు
లేయణు వందుండు - నింపుసొం పెసఁగఁ?

గదిసి యనేక సం-ఖ్యల బుద్బుదములు
వదలక యే మహా - వార్ధిలో నుండు?

నాది ననవకాశ - మైన యాకాశ
మేది? తా నరయఁగా - నేమియు లేక

యించుక గలవస్తు - వెయ్యది గలదు?
చాంచల్యసంసార - సౌఖ్యంబు లనెడి

జాడలఁ జరియించి - చలియింపకున్న
వాఁడు నెవ్వాఁడు? స-ర్వంబునం దెపుడు

ఘనముగా నుండియుఁ - గడముట్టఁ జూడ
నొనర నుండక వెల్గు - చుండు నెవ్వండు?

ధరను చేతన నొంది - తా నెవ్వఁ డయ్యె?
నరయ నెవ్వఁడు మింట - నద్భుతంబుగను

జిత్తరువును వ్రాసెఁ - చిత్ర వర్ణముల?
సత్తైన సూక్ష్మ బీ - జంబులో స్థూల

వృక్షం బణఁగి నట్లు - వివిధ ప్రపంచ
మక్షయ మగుచు నే - యణువులో నుండుఁ?

బ్రాకటంబుగఁ బృథ - గ్భావమై యెపుడు
నేకమై తగువస్తు - వెయ్యది? ద్రవము

నుదకంబు నొకటిగా - నుండుచందమున
వదలక యే రెండు - వలెఁ దోఁచి యొకటి

యగుచు నుండెడి దెద్ది? - యని వితర్కించి
పగటుతో నడుగ న-ప్పడఁతి వాక్యములు

విని, భీతిలక జన-విభుఁ డాత్మమంత్రిఁ
గనుఁగొని 'దీని వా-క్యముల కర్థములు

దెలుపు' మటన్న మం-త్రి వివేకయుక్తి
కలితుఁడుగానఁ గ-ర్కట కిట్టు లనియె:

'అతివ రాక్షసి! మమ్ము - నడిగిన ప్రశ్న
లతిరహస్యములు వే-దాంత గూఢములు

కావునఁ జెప్ప శ-క్యంబు గా, దైన
భావించి చెప్పెదఁ - బట్టుగా వినుము!

సదమల బ్రహ్మంబు - సత్య, మనంత
మది, వాఙ్మనో తీత, - మాకాశనిభము

నగుచుండు, నటువంటి - యాత్మాణువందు
తగ నజాండములు వి-స్తారంబు లగుచుఁ

బొడముచు బుద్బుదం-బుల మాడ్కి నణఁగు,
నడరార మఱియు న-త్యద్భుతం బగుచుఁ

బ్రవిమలాకాశమై - బాహ్యంబులేని
యవకాశమై చిన్మ - యంబౌచు నిండి,

యద్వయం బై యిది - యది యనరాదు,
తద్వస్తుసంతతి - దాననే కలిగెఁ;

గ్రమ మొప్పఁగాఁ దత్ప్ర-కాశత వలన
నమరి చేతనుఁడైన - యతఁ డభేద్యుండు

గనుక స్వశీల సం-కలితుఁడై యుండి,
యనుపమాత్మాకాశ - మం దీజగములఁ

దనతలంపుననె చి-త్తరువుగా వ్రాయు,
ననఘాత్ముఁడై నట్టి-యతని తలంపు

వలననే సర్వ వి-శ్వము దోఁచెఁ గనుక
వెలయు నీ విశ్వంబు - వేఱుగా, దన్ని

తానె యగుటఁ జేసి - తన కన్య వస్తు
వేనాఁటికినిఁ గల్గ, - దింత కాశ్రయుఁడు

నగువాఁ డొకఁడు నిశ్చ-యంబుగా నుండు,
నగణితసద్రూప - మగుచుండుఁ గనుకఁ

బరమాత్మ గలఁడని - పండితోత్తములు
చిరతరప్రజ్ఞతోఁ - జెప్పఁగా నొప్పు'

నని మంత్రి కర్కటి - కాత్మ నిశ్చయము
వినిపింప, నది వాని - వినుతించి, యతని

దొరను సంతోషంబు - తోఁ జూచి 'నీవు
నెఱిఁగిన రీతి నా-కెఱిఁగింపు' యనఁగ

విని యమ్మహీపతి - వేడ్కగా దానిఁ
గని యిట్టు లనియె - నఖండయుక్తులను

'వినవె కర్కటి! సర్వ - విశ్వంబు మిథ్య,
యని యెఱింగిననె మ-హాత్మునిఁ దెలియ

వచ్చు, సంకల్ప వి-వర్జితుండైన
హెచ్చుగానే స్వామి - నెద నుంచవచ్చు.

మెఱయు నే స్వామి యు-న్మేష నిమేష
సరణి నంతయుఁ బుట్టి - సమయుచునుండు,

ఘననిగమాంత వా-క్యంబు లేదైవ
మును గొప్పగా నెంచి - మొనసి నుతించు?

గురుతర బ్రహ్మాండ - కోటుల నిండి
తిరముగా నుండి యే - దేవుండు దృష్టి

విషయంబు గాకయే - వెలుఁగుచు నుండు,
ఝష ఫష లేక యీ - సచరాచరములు

లలన! యెదేవు లీ - లను బ్రభవించి
బలసి వర్తిలు నదే - బ్రహ్మమౌ నింతి!

విశ్వాత్ముఁడై సర్వ - విశ్వంబుఁ జేసి,
విశ్వంబు తానయై - విశ్వంబుఁ గనుచు

విశ్వేశ్వరుం డన - వెలుఁగుచున్నట్టి
శాశ్వతాత్మబ్రహ్మ - సన్మాత్రసత్య

[34]వాక్య ఫణితి నీవు - వరుసగా నడుగ
నైక్యానుసంధాన - మబ్బె మా'కనుచుఁ

బలికిన సంతోష - భరితాత్మ యగుచు
నలరి కర్కటి యిట్టు - లనియె నోనృపతి!

యహహ! మీ వాక్యంబు - లమృత తుల్యములు
సహజసుజ్ఞానభా-స్వరములు గాన,

మీరు పుణ్యాత్ములు - మీదయన్ జ్ఞాన
మారూఢమై, సంశ-యములఁ దీర్చినది,

యానంద మొదవె నా' - కన విని వాఁడు
దాని కిట్లనియె నో - దానవి! నీవు

పనిఁబూని వికృత రూ-పము మాని సౌమ్య
తనువుతో వచ్చి మా - స్థలమునం దుండు!

సతి! నీకు వస్త్రభూ-షణముఖ్యవస్తు
వితతుల నిత్తు, మా - వీడులయందుఁ

జరియింపుచున్న రా-జద్రోహమతులఁ,
బరఁగు చోరుల, మహా - పాపకర్ములను,

జెనఁటులఁ జంపి భ-క్షింపుచు నుండు'
మని చెప్పి మంత్రితో - నా నృపాలుండు

తనగృహంబున కేఁగెఁ;- దదనంతరమున
జనపతి చెప్పిన - సరణి దప్పకను

దనపూర్వ దారుణ - తను వది వీడి,
ఘన సుందరాంగియై - గంధ, మాల్యములు,

34. వాక్యార్థమును - వా

చేల, భూషణము లి-చ్చిన ధరింపుచును
మేలిమి నా నృపు - మేడలం దుండుఁ.

బాపకర్ములఁ జంపి - [35] భక్షింపుచుండు,
నాపట్ల నుండక - యరిగి హిమాద్రిఁ

జేరి, యందు సమాధిఁ - జేసె' నటంచు
నా రామచంద్రున - కావసిష్ఠుండు

పనుపడఁ గర్కటి - ప్రశ్నోత్తరముల
మన మొప్పఁగాఁ జెప్పి - మరల ని ట్లనియె:

'జనవర! నీకును - సంసారసుఖము
తనియ కున్నట్టి చి-త్త విలాసములను

గలుగు రాగాది వి - కార దోషములఁ
జెలువార్చి రోసిన - చిత్తమే మరల

విమలమై, సంసార - విభ్రమ మొక్క
సమయమం దణఁగక - చపలించెనేని

తెప్పున సుజ్ఞాన - దృష్టి సంధించి
యప్పు డాచాపల్య - మణఁపుచు నుండు;

మినతేజ! యిఁక నొక్క - యితిహాస మేను
వినుపింతు నెట్లన్న - విమల చిచ్ఛక్తి

సువిలాసమున మను-జుల నిశ్చయంబు
ప్రవిమలంబై జగ-ద్భ్రాంతి నణంచు,

అది యె ట్లనినఁజిత్త - మను బాలకుండు
పాదువౌ ప్రపంచమన్ - భూతమున్ గాంచి

35. భక్షించి కొనుచు

వెఱచుచున్నటువంటి - వేల గురుండు
'సరసాత్మ! యిది ప్రపం-చ పిశాచ మనుచు

'భయము నొందకు, మీ ప్ర-పంచంబు బ్రహ్మ
మయ'మని చెప్పఁగా, - మది భీతి విడిచి

యరసి చిత్తార్భకుఁ - డానంద మొందు
కరణి నీ కిఁక నొక్క - కథ వినిపింతు.

## * ఇందుపుత్రోపాఖ్యానము *

అది యెట్లనిన నిందుఁ-డను భూసురుండు
కదలక సతితోడఁ - గైలాసమందుఁ

బరమేశుఁ గూర్చి త-పముఁ జేసి శివుని
వరమునఁ బదిమంది - వరపుత్త్రకులను

గాంచి, కొన్నాళ్లుండి, - కాలవేగమునఁ
బంచత్వమునఁ బొంది - పడిపోవ, నతని

సతి యగ్నిలోఁ జొచ్చి - సమయఁగా, వారి
సుతు లందఱును జూచి - శోకించి, తాము

సేయఁగాఁదగు క్రియల్ - చేసి, యా మీఁద
నా యగ్రజుడుఁ దమ్ము - లందఱిఁజూచి

తల్లినిఁ దండ్రినిఁ - దలఁచి పేర్కొనుచుఁ
దల్లడింపుచు నేడ్చు - తమ్ములఁ బిలిచి

'యేల యేడ్చెదరు? మీ - రెంత యేడ్చినను
జాలిచే జనకుండు - జనని క్రమ్మఱను

వచ్చి మీశోకంబు - వారింపఁ గలరె?
ఇచ్చట వగవక - యేమైన వరము

లఱలేక మీరు న-న్నడుగుఁ డ'టంచుఁ
గరుణ మీఱఁగఁ బల్కఁ-గాఁ దమ్ము లనిరి:

'అన్న! [36] గోపగు నూరి - యధికారి కొదవు
నున్నత పదవి మా - కొసఁగు' మటంచు

నడుగఁగా 'నది స్వల్ప - మది, మీకు వలవ,
దడర నింకేమైన - నడుగుఁ' డటంచుఁ

బలుకఁగా, 'సామంత - పదవి మా కొసఁగు
[37] మలర నిప్ప'డటన్న - 'నది యేటి పదవి?

ఇఁక మఱేమైన నే - నిచ్చెద' ననినఁ
'బ్రకటమై తగు రాజ - పదవి ని'మ్మనిన

'విని యది మీకేల? - వేఱె వరంబు
మొనసి న న్నడుగుఁ-డి మ్ముగ' నన్న వారు

'సకల రాజన్య శా-సనుఁడైన నృపతి
యకలంక పద మియ్యు' - మనఁగ, 'నశ్వరము

అరాజపదమేల?' - యన, నింద్రపదము
గౌరవంబుగ వేడఁ-గా, నతం డనియెఁ:

'దగఁ బ్రజాపతికి సి-ద్ధముగా ముహూర్త
మగువేళఁ జెడిపోవు - నయ్యింద్రపదవి,

కావున మీ రది - కాంక్షింపవలదు,
వేవేగ నడుగుఁడీ! - వేఱొక్క వరము'

అనవుడు వారు 'క-ల్పాంతరంబులను
ఘనమై లయింపని - గతినీయు' మనిన

వాయగ్రజుండు 'క-ల్పాంతరంబులను
మాయక వెలుఁగు బ్ర-హ్మపదంబు మీకు

36. గోపుగ నూరి యధికారి కొలఁ ది - వా
37. మలయ కిప్పడటన్న - వా

నిచ్చెద' ననఁగ, న-దే రీతి మాకు
హెచ్చుగాఁ బ్రాపించు? - నెఱిఁగింపు' మనిన

దయను ద జ్యేష్ఠుండు - తమ్ములఁ జూచి
నయముగా నిట్లనె - నానా జగములఁ

బుట్టించు బ్రహ్మను - బుద్ధిచేఁ జిక్కఁ
బట్టి ధ్యానించి, త-త్పద మందవచ్చు'

నని చెప్పి, తమ్ముల - నందఱఁ దోడు
కొని చని యొక దిక్కు - గురుశుచిస్థలినిఁ

జేరి, పద్మాసనా - సీనులై బ్రహ్మ
నారూఢిగా చిత్త-మందు భావించి,

యమరులఁ బుట్టించు - నటువంటి బ్రహ్మ
లము తా మనుచు నిశ్చ-లత్వంబు నొంది,

తముఁ దామె చూచుచుఁ - దప మాచరింప,
నమితామౌ వర్షశీ-తా తపవాత

ములచేతఁ దద్దేహ-ములు నాశ మొందె;
నలఘు దివ్యాంగంబు - లా పదిమంది

ధరియించి, తాము వి-ధాతలై వేఱె
పారిఁ బొరి జగములఁ - బుట్టింపఁ, జూచి

మొదటి బ్రహ్మైశ్వర్య - మునఁ బొంది తలలు
కదలించి యూఁచె, నీ - క్రమము భావింపఁ

జిత్తమే కర్తయ్యె - సృష్టి కంతటికిఁ,
జిత్తమే జీవుఁడై - చేష్టింపుచుండు;

నది యెట్టు లనిన బ్ర-హ్మల మని వారు
పదిమంది చిత్తముల్ - పట్టి భావించి

భావనా సిద్ధిచే - బ్రహ్మలై దేహ
భావన మఱచి రో - పార్థివాధీశ!

దేహవాసనలఁ బొం-దిన దేహి మరల
దేహమే దాల్చు, ముక్తినిఁ బొందలేఁడు;

ఆత్మ వాసన నొంది-నటువంటి దేహి
యాత్మయం దైక్యమౌ' - నని వసిష్ఠుండు

చెప్పిన, నూహించి - శ్రీరామచంద్రుఁ
డప్పు డిట్లనియె 'దే-హమున, కందున్న

జీవునకును వేరు - సిద్ధమై యుండు,
నావిధంబుగ నుండి - నప్పటికైనఁ

గాయంబు సుఖము, దుః-ఖంబు జీవునకు
నా యా యెడం గల్గిన-ట్లుండకున్నె?

హిత మొప్పఁజెప్పు ము-నీంద్ర!' యటంచు
నతిభక్తితో రాముఁ - డడుగ, వసిష్ఠ

మౌని యి ట్లనియె 'నో-మనుజేంద్ర! దీని
కే నొక యితిహాస - మెఱిఁగింతు వినుము!

### * కృత్రిమేంద్రోపాఖ్యానము *

అరయ 'నింద్రద్యుమ్నుఁ - డను వానిభార్య
మెఱయుచుఁదగు పైఁడి - మేడపై నుండి,

యొకవీథి నొకచోట - నొక విటకాని
సుకుమారదేహుని ( - జూచి మోహించి,

కలయఁ గోరుచు నుండఁ-గా, నానృపాలు
కొలువులో నితిహాస-కుఁడు చేరి మదినిఁ

దలఁచి ప్రస్తావోచి-తంబుగా మున్ను
బలభేది గౌతము - భార్యను గూడి

చనిన వృత్తాంత మా - జననాయకునకు
వినిపింప, నది తాను - విని రాజపత్ని

తనమది నిటు తాను - దలఁచె 'నహల్య
మొనసి యింద్రునిఁ బొందె - మునిని వంచించి,

యటువంటి పెద్దల - ట్లెరఁట! పూర్వ,
మిట పాపభీతి నా - కేల? యహల్య

నేను నీవిటకాఁడు - నిర్జరేశ్వరుఁడు
గా నిర్ణయించి, యా - ఘనునిఁ బొందెదను

నాకేమి భయ? మని - నడి రేయి పోయి,
జోకగా మును తాను - చూచినవిటునిఁ

గలిసి వేడ్కల నుండఁ-గాఁ, బొంచిపొంచి
వలనుగాఁ దలవరుల్ - వారి నిద్దఱిని

గనుఁగొని, దండించి, - గ్రక్కునఁ దోడు
కొనిచని, యొకదిక్కు - కూర్చుండఁ బెట్టి,

క్షితిపతి కావార్త - చెప్పిన, లేచి
యతిభీషణాకారుఁ-డై వారిఁజేరి

కఱకఱిఁ గొట్టింపఁ-గా, వారు మోహ
పరవశులై మోహ - బాధ లాత్మలకు

తోఁచక యందుఁ బొం-దుకు నొండొరులను
జూచుచుఁ, బలుమారుఁ - జొక్కుచు, హావ

భావవిలాస వి - భ్రమవికారములఁ
గావింపఁ జూచి, యా-గ్రహముతో నృపుఁడు

కొంకక మతి మతి - కొట్టింప, నగుచు
శంకింప కిరువు రా-జనపతిఁ జూచి

పలికిరి ట్లనుచు 'భూ-పాల! మా మైత్రిఁ
దెలియక కొట్టించి-తివి, శరీరములఁ

గోయించినను నొప్పి - కోపంబు, భయము,
కాయాభిమానంబు - గలుగ, దెట్లనిన

సరసమౌ దేహ వా-సన నెడఁ బాసి
వరమనోవాసనా - వశులమై కలిసి

యుండఁగా, నీ విప్పు - డొట్టి దేహముల
దండించి కొట్టింపఁ - దగ ద దెట్లనినఁ

జిత్తమే హేతు వా - సృష్టి కంతటికిఁ,
జిత్తంబు లేకయే - సృష్టి యె ట్లగును?

నారయ భూజల - తాదులన్ జగము
సారెకు హత్తి ర-సంబైన కరణిఁ

దనువులయందుఁ జి-త్తము ప్రకాశించి,
తనియక పను లిట్ల-తానె గావింపఁ

గాను, జడములై న - ఘటముల నీవు
పూని కొట్టించినఁ - బోవునే కినుక?

తను వణంగినను జి-త్తము దేహశతము
లను దాల్చు, విడుచు, మూ - లముగఁ దా నిల్చుఁ;

దాఁ దాల్చి విడిచిన - తనువులకొఱకుఁ
దాఁ దాపపడువె చి-త్తం బేదనైనఁ?

జిత్త ధర్మముల ల-క్షించి నీ వెఱుఁగు
మిత్తతి నీకోప మేల నీ?' కనిన

విని, వారి నా యూరు - వెళ్లఁ గొట్టించి,
మనుజేశ్వరుండు స-మ్మతిఁ బొందె; నంత

వారి ద్ధ ఱరిగి, య-వ్వలఁ గోర్కె తీఱఁ
గూరిమితోఁ గూడి - కొన్ని యేం డ్లుండి

తనివొంది, యట మీఁదఁ - దనువులు విడిచి,
మొనసిన సుజ్ఞాన-మున సిద్ధులైరి'.

అని చెప్పి మరల ని-ట్లనె వసిష్ఠుండు
'జననాథ! వినవయ్య! - సకలదేహులకు

నరయఁగా రెండు దే-హము లుండు, నందుఁ
దెఱఁ గొప్పఁగా మనో - దేహంబు క్షిప్ర

గతి చలనంబు, నా - క్రమముగా స్థూల
మతిశయ మాంసమ - యంబుగా నుండు;

నన విని రాముఁ డి-ట్లనె 'నో మునీంద్ర!
మనము జడంబును, - మతి యమూర్తమును,

పొరిని సంకల్ప ప్ర-భూతమై యుండి
ధరను దేహము నెట్లు - ధరియించి యుండు?'

నన వసిష్ఠుం డిట్లు - లనియె: 'నో రామ!
విను మనంతంబును, - విమల, మద్వయము

నచలంబు నగు పర-మాత్మ సంకల్ప
ఖచితమే మన మన-ఁగా నొప్పుచుండు.

తిరముగా బ్రహ్మోప - దేశమో నొక్క
నరసేతి హాస మా -శ్చర్యంబుగాను

శ్రీ మహితాత్మ! నేఁ - జెప్పెద' ననుచు
నా మౌని వర్యుఁ డి-ట్లనియె వెండియును.

## * చిత్తోపాఖ్యానము *

చొరవగా నే దిక్కుఁ - జూచినఁ గాని
యరుదుగా నూతేసి - యామడలంత

నిడు పెడల్పును గల్గి - నెరసియున్నట్టి
యడవిలోపల సహ-స్రాక్షులు, వెయ్యి

కరములు గల భీమ - కాయుండు మించి
పరిఘలఁ దనమేను - పలుమాఱు తానె

నఱికి కొంచును నాశ-నంబును బొంద
క రఁటు లుండిన తోఁట - కరిగి కరంజ

వనములోఁ జేరి, య-వ్వల నూతిలోన
మునిఁగి గ్రక్కున లేచి, - మునుపటిరీతిఁ

గదళికావనములోఁ - గాఁ బ్రవేశించి,
పదపడి మేనెల్లఁ - బగుల నడంచి

కొనుచున్న, నేను గ-న్గొని 'యంతఁ గటికి
తనమున నడిచికోఁ - దగ'దని పట్టి

వారింప, నెలుఁగెత్తి - వాఁ డేడ్వ, ' నేడ్వ
కూరకుండు' మటంచు - నూఱడింపఁగను,

నతఁడు నవ్వుచు, మేను - హస్తంబు లెత్తి
ప్రతిఘుతో ఖండించి - పాఱవైచినను,

నది చూచి వెఱఁగొంది - యావలఁ జనఁగఁ,
గదిసి భయంకరా - కారుఁడం దొకఁడు

తనమేని కండలు - తానె ఖండించి
కొనుచున్నఁ జూచి 'యీ - ఘోరకృత్యంబు

వలదు నిలుపు' మటన్న - వాఁడు నామీఁద
నలిగి, తిట్టుచుఁజని - యంధకూపమునఁ

బడియె, నం దిటువంటి - ప్రజలను పెక్కు
పొడఁగంటి నో రామ! - భూపాల! నీకు

నీ కథాతాత్పర్య - మెఱుఁగరా, దేను
వీఁకతో, జెప్పెద - విను మ దెట్లనిన

సరవి నరణ్యంబు - సంసారఘోర,
మిరువురు పురుషులం - దెవ్వరటన్నఁ

గన మానసౌఖ్య,ల - క్కరములు పరిఘ
లనినవి ధీవృత్తు - లగుచుండు, మఱియుఁ

బొలుపారు ప్రహరణం-బులు పాపదుఃఖ
ములు, నంధకూపంబు - మొగి నిరయంబు,

అరఁటితోఁ టన్నది - యమరలోకంబు,
మఱి కరంజములన - మనుజసంఘములు,

ఎలమి శాస్త్రవివేక - మేను భావింప
నల భోగశైథిల్య - మగుచుండుఁ, జిత్త

పరితాపమగు వాని - ప్రబల దుఃఖంబు,
సరసహాసం బాత్మ - సంతోషసుఖము,

తలఁప నమంగళ - త్యాగం బనంగ
విలసిత మైనట్టి - వృత్తి నాశంబు,

ననువాఁడు కోపించి-నది నాస్తికత్వ'
మని పితామహుఁడు ము -న్నతికృపతోడఁ

దేటగాఁ దన కుప - దేశించినట్టి
మాటల వరుస రా - మక్షితీంద్రునకు

మచ్చిక నెఱిఁగించి - మౌని యిట్లనియె:
హెచ్చుగా మోక్షంబు - నిశ్చయింపుచును,

నొనర నాత్మ వివేక - మొకకొంత గలిగి
యును, భోగములు మాని - యును, బాహ్యసంగ

మును బాసి సంశయ-ముల వీడలేక,
పనుపడి నిర్వాణ - పద మొందలేక,

స్థిరమోక్ష పదమొందఁ - దివురుచందంబు
పరితాప మనఁబడు - భావించి చూడ

జ్ఞానయోగము నొంది - సర్వంబు రోసి,
పూని మనోలయం-బు నొనర్చునదియె

హత్తిన యానంద -మని చెప్పఁబడును
చిత్తమే పురుషుండు, - చిత్తమే ప్రకృతి,

చిత్తమే సంసార - సృష్టి యటంచుఁ,
జిత్తమందే నీవు - చింతించి తెలిసి,

మొనసి చిత్త త్యాగ-మును జేసి సౌఖ్య
మును బొందు రామ! యి-మ్ముగ సర్వశక్తి

పర, మద్వయము, సర్వ - పరిపూర్ణ, మజము,
పరమాత్మయును, బర - బ్రహ్మ మనంగఁ

దగి, సర్వ భూత వి -తానంబులందు
నగణితమై యుండి - యంతట నుండు;

పకల దేహములందు - శక్తి రూపమున
సకలంకమై మాన-సము వెల్గుచుండు

అలఘు చరిత్ర! నీ-వది యేది? యనిన
విలసిత ప్రజ్ఞతో - వినుము! చెప్పెదను,

లలి మించునాత్మకు - ల్లాస శక్తియును,
బొలుపొందు నా బ్రహ్మ-మునకుఁ జిచ్ఛక్తి,

సలిలంబునకు ద్రవ - శక్తి, యగ్నికిని
అలరు దాహకశక్తి, - యా కసమంటి

నలువొప్పు వాయువు-నకు స్పందశక్తి,
యల గగనంబున - కతి, శూన్య శక్తి,

కొన వినాశనమున-కును లయశక్తి
యును గల్గుచుండు; మ-యూర్వంబు తరువు

పై నుండ నీళ్ళ లో-పల దానినీడ
కానవచ్చిన రీతి-గా, సూక్ష్మమగుచు

వెలయు బీజంబులో - విపుల వృక్షంబులు
పొలుపొందు చుండిన - పోలికగాను

సలలిత స్థూల సూ-క్ష్మ స్వరూపముల
వెలుఁగుచు నుండు నీ - విశ్వ మంతయును.

అలరారు దేశ కా-లాది వైచిత్రి
వలన సస్యంబులీ - వసుమతి మీఁదఁ

బరమాత్మ బలముచేఁ - బండు, నశించు;
నరయఁగా వృద్ధి క్ష-యంబులు లేక

ఫలితార్థమగు పర-బ్రహ్మ సాన్నిధ్య
బలముచేఁ జిత్తంబు - బహువిధ సృష్టి

గావించు, లేనివి - గలిగించుఁ, బ్రోచు,
భావింపఁ దాఁ గనఁ-బడ; దందులకిపుడు

ఒక యితిహాసమే - నొగి వినిపింతు
నొక రాజుపుత్రకు - నొకదాది చాల

గారవింపుచు నొక్క - కథ వినిపించె
నా రీతి యెట్లన్న - నరుదుగా వినుము!

## * బాలకోపాఖ్యానము *

అరయఁగా నతిశూన్య - మైన పట్టణము
నిరవొంద నొక్కరా - జేలుచు నుండు,

వానికి ముమ్వురు - వరసుతుల్ గలరు,
గాని యం దిరువురఁ - గనలేదు తల్లి,

ఒకఁడు గర్భంబునం - దుదయింపఁ, డట్టి
యకలంకపుత్రకు - లాకాశ వనముఁ

జేరి, యచ్చటను పూ-చి ఫలించు వృక్ష
వారంబులను గాంచి - వా రందు నిలిచి,

యపుడొప్పు మెకవేఁట - లాడి రటంచు
విపరీత కథఁ జెప్ప, - విని బాలకుండు

నిజ మనుకొనినట్లు - నీవు లోకముల
నిజ మని చూడక, - నిస్పృహత్వమున

సంకల్పముల మాని. - సారెకుఁ బొడము
శంకల నణఁచి, ని-శ్చలశాంతిఁ బొందు!

సంకల్పములు చిత్త - సంభవంబులుగ
నంకితంబుగఁ జూడు, - మవి నీవు గావు;

కడఁగి తాఁజేయు సం-కల్పంబుచేత
నడరారఁగా బద్ధుఁ-డగు మూఢ జనుఁడు;

ఘనుఁడు తాఁ జేయు సం - కల్పంబువలన
ననఘాత్ముఁడై ముక్తుఁ-డగు నిశ్చయముగ.

సరవి నెన్నఁగ నస - త్సంకల్పములను
మఱచి, సత్సంకల్ప - మతి నొందు మీవు,

అతిబాల్య కాలంబు - నందు విజ్ఞాన
రతుఁడవై గాఢ వై-రాగ్య మొందితివి;

కనుక బద్ధుండవు - గావు, బద్ధుండ
నని చింతఁ జేతురే?- యర్కకులేశ!

సరస మనో విలా-సము బంధ మగును;
మెఱయఁ దన్నిరసన - మే ముక్తి యగును.

లలినిఁ దన్మాన సో - ల్లాసవైభవము
వలన గోష్పదమంత - వసుధ యోజనము

కరణిఁ దోఁచును, క్షణ-కాలంబుఁ జూడఁ
బరువడి బ్రహ్మ క-ల్పం బగుచుండు;

నొక నిదర్శన మిందు - కూహించి నీకుఁ
బ్రకటించి చెప్పెద - భావించి వినుము:

### * లవణ శాంబరికోపాఖ్యానము *

అవని మహోన్నతం - బగు పురమందు
లవణుం డనెడు రాజు - లలి నొక్కనాఁడు

చదురునఁ గొలువున్న - సమయమం దతని
కెదుట నిల్వంబడి - యింద్రజాలికుఁడు

మాయలఁ బన్నుచున్ - మంత్రింప, సభ్యు
లాయెడ మోహితు-లై చూడఁగాను

నొనరఁగా రెండు ము-హూర్తముల్ రాజు
కను మూసి నిద్రించి - కలఁగాంచి లేచి

తనమంత్రివరులతోఁ - దగ నిట్టు లనియె:
'ఘనులార! నే నొక్క కలఁ - గంటి నిపుడు

అది యెట్టు లన్న ఘో-రారణ్యమునకుఁ
బదపడి తురగంబు-పై నెక్కి చనఁగ,

నప్పు డాఘోటక - మడవిలో నన్ను
దెప్పునఁ బడవైచు - తెఱఁగున మించి

పరుగెత్తఁగా, నేను - ప్రాణభీతినను
తరుశాఖ వేగ హ -స్తంబుతోఁ బట్టి

వ్రేలియాడఁగ వాజి - విడఁబడి యుఱికె,
నాలోన సూర్యోద-యం బయ్యెఁ; నంతఁ

వనచేని కాఁపున్న - తండ్రి కన్నంబుఁ
గొని యా వనము దారి - గులుకు మిటారి

యగు నొక్క చండాలి - యరుదేరఁ జూచి
'దిగువకు మెల్లగా - దించవే! నన్ను

నీ'వనగాఁనది - నేర్పుగా ఱాళ్లు
వేవేగఁ దెచ్చి యా - వృక్షంబు క్రింద

నెత్తుగాఁ బేర్చి, పై - కెక్కి నన్బట్టి
మెత్తగా దించిన, - మెచ్చి నేదానిఁ

గామించి, వరియించి, - కలిసి, యచ్చోట
నా మాలదానియం - దమరఁగా సుతుల

నలుగురిఁగని, కొన్ని - నాళ్లు పోషింప,
నలజడి పొడమఁగా - నాలుబిడ్డలను

దోడ్కొని వలసతో -దూరాటవులకుఁ
గడు వేగఁ జని, కొంత - కాల మందుండఁ

గాను, బిడ్డలు, నాలుఁ - గ్గాలవేగమున
మేనులు విడువఁగా - మిడికి, దుఃఖంబు

చే సహింపఁగ లేక - చిచ్చులో దుమికి,
యాసమయంబునం - దదరి మేల్కొంటి,

మహి నిది శాంబరీ - మాయాకృతంబు,
సహజమైనటువంటి - స్వప్నంబుగాదు;

అలరు మనోమాయ - లఖిలమర్త్యులకుఁ
గలిగించు దుఃఖ మీ - కరణి నటంచు

రెఱుఁగఁగా నందున్న - యింద్రజాలికుఁడు
మఱియందు నిల్వక - మాయమై చనియె;

వెఱఁగంది సభ్యులా - వింత భావించి,
యెఱిఁగి యాభూపాలు - నీక్షించి యనిరి:

'జననాథ! వీఁ డింద్ర - జాలియై యున్న
ధనము గైకొనక యం-తర్ధాన మొంది

చనునె? జగద్విలా - సం బిట్టి దనుచు
జనులకుఁ జూప ని - చ్చటికిఁ దా వచ్చి

మెఱసిన వాఁ డని - మిషదూత గాని,
నరుఁడనఁ గూడ, ద - నంత రూపముల

నలరుచున్న పరాత్ముఁ - డాఢ్యుఁడై తాను
నొలయక, మాయా మ-నోరూపములను

దా తాల్చి సకల భూ-తములకు భ్రమల
ఖ్యాతిగా నీరీతిఁ - గల్పించు చుండుఁ;

గావునఁ జింతింపఁ - గా నేల? యనుచు
భూవరునకు వారు - పొసఁగఁ జెప్పి' రని

పలికి, క్రమ్మఱ రామ-భద్రునిఁ జూచి
'జలజాప్త కులదీప! - స్వల్పకాలమునఁ

జాలఁగాఁ బెక్కేండ్లు - జరిగిన యింద్ర
జాలంబుగాని, ని-శ్చయ మనరాదు,

చింతించి యెంత చే-సిన మనోమాయ
లంత హెచ్చుచు నుండు, - నణఁచిన నణఁగు

నలువొప్ప సంయమ-నంబున శాంతి
గలుగుఁ, దచ్ఛాంతిని - గట్టిగాఁ బట్టి

మదిని నిరోధించి, - మానితజ్ఞాన
మెద నుంచి, ధ్యాన స-మేతుఁడై దినము

మఱువక ధ్యానమన్ - మంథాచలమున
నరసి సంసారతో - యధినిఁ గలంచి

విడిచి, సంకల్పముల్ - విడిచి, భోగేచ్ఛ
విడనాడి, సంసార - వృక్షమున్ ద్రుంచి,

యల మనోవ్యాధుల - కౌషధం బగుచు
వెలసిన వైరాగ్య - విభవంబు నొంది,

చిరతర సచ్ఛాస్త్ర - శిక్షచేఁ జిత్త
మఱి ముఱి మెత్తనై -నప్పు డేమఱక,

యెఱుకతో నినుమును - నినుముతోఁ ద్రుంచు
కరణిని సుజ్ఞాన - కలితచిత్తంబు

చేత నీ వజ్ఞాన - చిత్తముం ద్రుంచు!
ఖ్యాతిగాఁ బౌరుష - కలితేప్సితముల

వదల కనుభవింప - వలె నన్న చిత్త
మదియె కోరుచునుండు - నణఁచిన నణఁగుఁ

గావునఁ, జిత్త వి-కారధర్మముల
భావించి, వానికిఁ - బరుఁడవై యుండు'

మని మఱికొన్ని ర-హస్యముల్ దెలుప,
విని రాముఁ డమ్ముని - విభునకి ట్లనియెఁ:

'దొడరి తామర నోలి - తోఁ బర్వతములఁ
బడనీడ్చి బంధించు - పగిది విశ్వమును

దెరలక తాను బం-ధించె నవిద్య,
వెఱఁగైన దీ రీతి - వినవిన, లవణ

కుతలాధిపతి తన - కొలువులో నుండి
యతికష్టముల నొంది, - యవల మేల్కాంచి,

మఱి యేమి చేసి స-మ్మతిఁ బొందె?' ననఁగ
వరమునీంద్రుండు భూ - వరున కి ట్లనియె:

'పరువడి లవణ భూ-పాలపుంగవుఁడు
సురుచిరమతి రాజ - సూయాధ్వరంబు

నూని సేయఁగఁ బురు - హూతుండు చూచి
తా నోర్వఁజాల కా -ధరణీంద్రుకడకుఁ

దనదూత నంప,న-త్తఱి వాఁడు లవణ
జనపతిసభ నింద్ర - జాలంబు పన్ని

యావేళ నతని మో-హాంధునిఁ జేసి
వేవేగఁ జనియె, న-వ్విధ మేల? యనిన

నది విను! రాజసూ - యాధ్వరకర్త
పదియును రెండేండ్లు - ప్రబల దుఃఖముల

ననుభవించుట నిజ- మటుగాన, నతఁడు
తనియ కాద్వాదశా-బ్దముల దుఃఖంబుఁ

గన ముహూర్తద్వయ - కాల మా కష్ట
మనుభవించిన మీఁద - నంతఃపురంబుఁ

జేరి, యా స్వప్న వి-చిత్రంబు మఱువ
కారట పడుచుండి, - యమ్మఱునాఁడు

కలలోనఁ దాఁ గన్న - కాననంబునకు
బలములతోఁ దాను - పయనమై పోయి,

యాకలలోఁ గాంచి - నట్టి చందములు
వీఁకతో నిజముగా - వేవేగఁ జూచి,

యది యెవ్వరికిఁ - జెప్ప 'కక్కటా!' యనుచు
మదిఁ జింత నొంది, యా-త్మపురంబుఁజేరి,

యట సుఖస్థితి నుండె - నా లవణుండు
పటుతరావిద్యా ప్ర - భావ మిట్టిదియె!

జగతి నసత్యంబు - సత్యమై తోఁచు
నగణితాత్మక! యిది - యద్భుతం' బనిన

విని రామచంద్రుండు - వెఱఁగు నొందుచును
మనము సంశయ మొంద - మరల ని ట్లనియె:

'కలలోన లవణుండు - గనిన చిహ్నములు
నిలుకడగా నందు - నిలిచి యె ట్లుండె?

ఈ వింత దెలుపు ము-నీంద్ర!' యటన్న
నా వసిష్ఠుం డిట్టు - లనియె నవ్వుచును:

'విను రామచంద్ర! యవిద్య - పెం పిదియె!
కని యిది, యది యని - గణుతింపరాదు;

కలది లేదనిపించుఁ, - గలుగనిదానిఁ
బెలుచ నిశ్చయ మని - పింపుచునుండు.

ఘనతపోధనుఁడైన - గాధివర్తనము
విన నది యిట్టిదే - వెనుకఁ జెప్పెదను,

నలిని జాగ్రద్వా స -నలు నిక్కములుగఁ
గలలోన నిజములై - కనిపించి, మరల

మేలు కొన్నపు డవి - మిథ్య గావలయు
నాలవణుండు ప్ర-త్యక్షంబుగాను

మఱునాఁడు చూచిన - మాయయే? మనినఁ
గరమొప్ప వింధ్య పు - ష్కర దేశములను

బరఁగఁ జండాల - సంస్పర్శనుం డొక్క
నరపతి పురములో - నంగనఁ బడును,

భావి కార్యముల స్వ-ప్నములు సూచించుఁ
గావున, లవణుని - కల నది దోఁచె,

జగతిని దీని కా-శ్చర్య మేమిటికి?
నగధీర! వినుము జ్ఞా-నం బజేయంబు,

వరుస నాపాదించు - వస్తుసత్తతను
వెఱఁగేల? నజ్ఞాన - విధ మిదే సుమ్ము!

ఆవింత లనృతంబు - లంచు భావించు!
వావిరి బహువస్తు - వరమధ్యమముల

యందుఁ గేవల గగ - నాభమై నిండి
యెందు నెవ్వరికిఁదా - నెదురుగాఁ గానఁ

బడక, తెలివిలేక - భావనగాక
జడత లేకుండెడి - సద్రూప మెద్ది?

అది నీవుగాఁ గని మానంద మొందు,
పొదువుగా నా బ్రహ్మ-మున నాదియందుఁ

జిత్తంబు పొడమెను - చేష్టాకరముగఁ,
జిత్తమందే పుట్టెఁ - జింతనంబులును,

సటల చింతనముల - సవికల్ప జాల
పటిమ జనింపఁ, బ్ర-పంచంబు నభము

నందు నీలిమ దోఁచి - నటువలెఁ దోఁచి,
యెందును శూన్యమై-యే నిజంబుగను

గనఁ బడుచుండుటటే - గాని, యథార్థ
మని దానిఁ జూడకు, - మాత్మనే చూడు!

సంకల్పజాలముల్ - చాలింప, నపుడు
కొంకక చిత్తంబు - కుదిరి తా నణఁగుఁ

జిత్తం బణంగినఁ - జి త్తన్నియెడల
సత్తై వెలుఁగుఁ జంద్ర - చంద్రికకరణి,

నని లవణుచరిత్ర - మరుదుగాఁ జెప్పి,
మునిపతి మరల రా-మున కిట్టు లనియెఁ:

### * అజ్ఞానభూమికాసప్తకము *

బొలుపొందు నజ్ఞాన - భూమిక లేడు
కల,వవి యెట్లన్నఁ - గ్రమముగా బీజ

జాగ్రత్తు, మఱియును - జాగ్రదవస్థ,
జాగ్రదతిశయంబు, - జాగర స్వప్న

మును, మఱియును స్వప్న-మును, స్వప్నమందు
జనియించు జాగ్రత్తు - సరవి సుషుప్తి

యనఁబడు నిఁక వీటి - కర్థ మె ట్లనిన
విను! చిత్తునకు నాది - విమలచేతనము

నై వెలుంగుచునుండి - నట్ల చిత్తార్థ
జీవత్వ భజన కం - చితముగా నమరి,

భేద బీజంబగు - బీజజాగ్రత్త,
అది భూమిక యిదె - యన నొప్పు, తెలివి

యను దాని కది నూత - నావస్థ యగును;
మనుజేంద్ర! యిదియె నా - మందిరం బనుచు, 1890

నా దేహమిది, వారు - నా వా రటంచుఁ
బాదుగా విశదమై - ప్రాగ్భావమునను

జనియించు నెఱుకయే - జాగ్రదవస్థ
యనఁబడు: రెండోది - యను భూమి కదియె;

నే, నతఁ, డితఁ డంచు-నిగుడి, జన్మాంత
రానుభవము నొంది - నటువంటి యెఱుక

చంద మెన్నఁగ మహా - జాగ్రత్త యగును,
పొందుగా మూఁడవ - భూమిక యిదియె:

ఊరక యొకచోట - నుండి, భోగముల
సారెకుఁ గోరుచు - సంతసించినది 1900

యలఘు మనోరాజ్య - మనఁబడు, నదియె
పొలుపుమీఱఁ జతుర్థ - భూమిక యయ్యెఁ;

జెదరెడి మరుమరీ - చికయందు జలము,
నదియుఁ గాకను శుక్తి - యందు రౌప్యంబు

కల దంచు నివి యాది - గా వృథా భ్రమల
కలవడుటే స్వప్న - మని చెప్పఁబడును,

పారి నిది పంచమ - భూమిక యయ్యె;
అతీముతీ బహుకాల - మరిగి రాకుండి,

మరల వచ్చిన వాని - మఱచి, యవ్వలను
సరవి నెఱుంగుటే - స్వప్న జాగ్రత్త,

భూమీశ! విను షష్ఠ - భూమిక యిదియె;
కామాకరంబు లీ - క్రమము లన్నియును

వరుసగా నీ ష-డవస్థలఁ దొరఁగి,
కరఁగుచు భావి దుః-ఖములఁ దలంచి,

యచలుఁడై చింతించు - నదియె సుషుప్తి;
ప్రచురాత్మ! యిదియె స-ప్తావస్థ యగును.

అట్టి యవస్థామ-హాంధకారమునఁ
బట్టు దోఁచక జీవ - పటలి మునుంగు;

## * జ్ఞానభూమికాసప్తకము *

జననాథ! యివియె య-జ్ఞానభూమికలు.
'విను జ్ఞానభూమికల్ - వివరింప నేడు

గల, వవి యెట్లన్నఁ - గ్రమముగా నీకుఁ
దెలియఁ జెప్పెదఁ దేట - తెల్లంబుగాను

వసుధపై బహుపుణ్య - వాసనచేతఁ
బొసఁగ జనించిన - బుద్ధిమంతుండు

తనమదిలోఁ దానె - తలఁచు ని ట్లనుచు
'జనియించి యీఘోర - సంసారవార్ధి

మునుఁగుట కే నేల - మూఢుండ నైతి?'
ననుచు, వైరాగ్య శాస్త్రా - భ్యాసి యగుచుఁ,

గడఁకతో సాధు సాం -గత్యంబుఁ జేసి,
యడర గాఢవిరక్తుఁ - డగుట శుభేచ్ఛ

యననొప్పు, నిది చూడ - నాది భూమిక యె;
జనవర! వైరాగ్య - శాస్త్ర విచార

సరణుల మఱువక, - సజ్జన మైత్రి
యురుభక్తితోఁ జేయు - చుండెడిరీతి

పొదువుమించు విచార - భూమిక రెండ
వది యిదె యగుచుండు - వసుధాతలేంద్ర!

ఈ రెండు భూమిక - లెక్కిన మీఁద
దారుణ విషయబృం - దంబును రోసి,

తనమననము తను - త్వంబు నొందుటయె
తను మానసాఖ్యచేఁ - దనరి మూఁడవది

యన నొప్పు భూమిక - యగుచుండు; మఱియు
ననఘుఁడై యీ మూఁటి - నభ్యసింపుచును,

సకలవాంఛల వీడి - సత్యాత్మనిష్ఠ
సకలంకుఁడై చింత - లన్ని వర్జించి,

జననుతుఁ డగుటయే - సత్త్వసంప్రాప్తి
యన నొప్పు భూమిక - యగు నాలుగవది;

యీ నాల్గిఁటను మది - నిరవుగా నుంచి,
తాను నిస్సంగుఁడై - తత్త్వచింతనము

వదలక యెపుడు స - త్త్వస్థితి నుండి
నదియె సంసక్తినా - మాంకితం బగుచుఁ

బొలుపొందుపంచమ - భూమిక యనుచుఁ
బలుక నొప్పుచునుండు - భానుకులేశ!

పొగడొందు నియ్యేను - భూమిక లెక్కి
యగణితాత్మారాముఁ-డై చలింపకను

అనిశంబు బాహ్య మ-ధ్యాంతరంబులను
మొనసి యన్యపదార్థ-ములు లేమి దెలిసి,

పరమార్థ మెఱిఁగి ని - ర్భరుఁడైన రీతి
నరసి చూచినఁ బదా - ర్థాభావసిద్ధి

యన నొప్పుచుండు: నీ - యాఱు భూమికల
ఘనతరగతుల ని-ష్కర్షగా నెఱిఁగి,

తన కన్యమైన య-ర్థము లేని దెఱిఁగి,
పనుపడి తగుతత్త్వ - భావైకనిష్ఠ

నొదవిన యెఱుక యం - దూహించి చూడ
నది తుర్యగాగతి - యన నొప్పుచున్న

సప్తమభూమికై - శాంతమై మించి
సప్తాశ్వగతిఁ బ్ర-కాశంబుగా నుండుఁ;

దుద కెక్కు నిటువంటి - తుర్యగావస్థ
వదల కుండెడిది జీ - వన్ముక్తి యగును;

మురువుమీఱ విదేహ - ముక్తి యనంగఁ
దెఱఁగొప్పఁ దుర్యగా - తీతమై యుండు.

నమలాత్మ! సప్తమం - బగు తుర్యగాఖ్య
నమరు భూమిక కెక్కి - నటువంటివారు

అనఘు లాత్మారాము - లధ్యాత్మవేత్త
లనుపమానులును, మ-హానుభావులును

జననుతుల్ వారు సం-సారసౌఖ్యముల
ననుభవింపుచునుందు - రంటి యంటకను,

సుఖదుఃఖరసముల - సుళ్లలోఁ బడక
నిఖిలకార్యంబుల - నిరసింతు రెపుడు;

మా యాగుణములందు - మన్నలు గాక
సేయఁగాఁ దగుపనుల్ - సేయుచుండుదురు;

మరులు పట్టిన వారి - మాడ్కి మాటలను
మఱతురు, బాలుని - మాడ్కి నుండుదురు;

పట్టిన నిర్వాణ - పద మిదే యనుచు
నెట్టనఁ దెలియు మో - నృపకులోత్తంస!'

అని రామచంద్రున-కా వసిష్ఠుండు
ఘనతరోత్పత్తి ప్ర-కరణంబుఁ జెప్పె'

నని భరద్వాజ సం-యమికి వాల్మీకి
వినిపించె నా కథ - విశదంబుగాన

## * ప్రకరణాంతద్విపద *

ఇది సోమనాథ వి - శ్వేశ్వరస్వామి
పదపద్మ భక్త సు - బ్రహ్మణ్య యోగి

చరణాంబుజాత ష -ట్చరణాయమాన
పరిపూర్ణనిత్య స - ద్భావనిమగ్న

మానసాంబుజ వెంగ - మాంబికారచిత
మై, నిత్యమై, సత్య - మై, ధన్యమైన

సామార్థసార సు - జ్ఞానవాసిష్ఠ
రామాయణం బను - రమ్యసద్ద్విపద

యందు సారంబగు - నాదిప్రకరణ
మందమై విమల మో - క్షాకరం బగుచు

శ్రీ తరిగొండ నృ - సింహుం డనంగ
ఖ్యాతిగా వెలయు వేం - కటరాయ! నీదు

పదయుగళికి సమ - ర్పణమయ్యె; దీని
సదమలులై వ్రాసి - చదివిన వినిన

నరులు తాపత్రయా - ర్ణవము తరించి,
పరమైన నిర్వాణ - పదము నొందుదురు.

భూచక్రమున నిది - పురుషార్థ మగుచు
నాచంద్ర తారార్క-మై యుండుఁగాత!

## -: ఆదిప్రకరణము సమాప్తము :-

## ద్వితీయ ప్రకరణము

శ్రీతారకోల్లాస! - శేషాద్రివాస!
శ్రీతరిగొండ నృ-సింహ! ధూతాంహ!

విన్నవించెద నది - వినుము వాల్మీకి
పన్నుగా దెల్పె ను-త్పత్తి క్రమంబు,

తప్పక విని భర-ద్వాజుండు మరల
నప్పు డిట్లనియె 'మ-హాగురు దేవ!

శ్రీరాఘవునకు వ-సిష్ఠుండు మరల
నే రహస్యముఁ జెప్పె - నెఱింగింపుఁ'డనిన

నలర వాల్మీకి యి-ట్లనె 'భరద్వాజ!
తెలియఁ జెప్పెద నది - తేటగా వినుము!

శ్రీరాఘవుండు వ-సిష్ఠు నీక్షించి
యారూఢభక్తి ని-ట్లనె 'నో మునీంద్ర!

చిత్తమందే సర్వ - సృష్టి పుట్టుటయుఁ,
జిత్తవృత్తులు విస-ర్జించుట ముక్తి

యగుటయుఁ జెప్పితి- రానంద మొదవె;
నగణిత చరిత! కృ-తార్థుండ నైతి.'

ననిన వసిష్ఠుఁడి - ట్లనియె వెండియును
'జననాథ! యీ ప్రపం-చము మానసమున

జనియించి, యందుండు, - సంసార మాత్మ
నెనసి యున్నటువలె - నిలఁ జిత్తమునకుఁ

గనిపింపుచుండుఁ; ద-త్కథ వినిపింతు
విను చిత్రవర్ణముల్ - వెదకిన లేక,

కొమరొప్పఁగాఁ జిత్ర - కుఁడు లేక మింట
నమరి చిత్తరు వుండి - నటువలె, నిదుర

లేకయే కలవచ్చు - లీల, నద్దమునఁ
బ్రాకటంబుగఁ గన - బడు నీడవలెను,

సతతప్రకాశమౌ - స్వచ్ఛాత్మయందుఁ
బ్రతిబింబ మగుచుఁ బ్ర-పంచంబు దోఁచుఁ

గనుకఁ బ్రపంచంబు - కల్లగా నెఱుఁగు,
మనుపమాత్మనుజూడు - మంతరంగమునఁ,

జపలాత్ములై ప్రపం-చముఁ జూచు మనుజు
లపరిమితాఘ దే-హములఁ బొందుదురు;

జననాథ! దీనికి - సాదృశ్య మొకటి
వినిపింతు, నెట్లన్న - విప్రపుంగవుఁడు

### * శుక్రోపాఖ్యానము *

విమలుండు భృగుఁడు - వివేకభావమున
నమితమందర పర్వ-తారణ్య మందుఁ

దప మయుతాబ్దముల్ - తగఁ జేయ, శుక్రుఁ
డపుడు తండ్రికి సేవ ల-మరఁ దాఁ జేయ

వలసి, యందుండి వి-శ్వాచి యనంగఁ
జెలువొప్పు నప్సర - స్త్రీని వీక్షించి,

మోహించి మదనాస్త్ర-ముల కోడి, నైజ
దేహ మయ్యడవిలోఁ - దెప్పున విడిచి,

యతిముతి సూక్ష్మదే-హంబుతో నెగసి,
మరులొంది దాని వి-మానంబుఁ జేరి,

తెఱఁగొప్పఁగా దివ్య - దేహంబుఁ దాల్చి,
నెఱవాది యగుచు దా-నినిఁ గూడి, యవల

సొలసి జన్మాంతర - సుఖ దుఃఖ సరణి
నలజడిఁ బడుచుండె - నందందు, నిచట

నలర నాభృగుని మ-హాతపోబలము
వలన శుక్రాంగంబు - వనములో వ్రాలి

యున్నఁ దద్దేహంబు - నుగ్ర జంతువులు
పన్నుగాఁ గని, - పట్టి భక్షింపకుండె;

వలనొప్ప నట దివ్య - వర్ష సహస్ర
ములకు సమాధి ని-మ్ముగ వీడి, భృగుఁడు

శుక్రాంగమును జూచి - శోకించి, మించి
యాక్రోశచిత్తుఁడై - యంతకుమీఁదఁ

గోపంబు రెట్టింప, - ఘోరమై నట్టి
శాప మియ్యఁదలంచు - సమయంబునందు

నదరుచు మహిష వా-హన మెక్కి వచ్చి,
పదరెడి భృగుమౌని - పజ్జను నిలిచి,

పలికె ని ట్లని దండ-పాణి 'మునీంద్ర!
లలిమీఱఁ బెద్ద కా-లముఁ జేసినట్టి

తపమెల్లఁ జెడుటకై - తామసబుద్ధి
నిపుడు శాపంబు నా-కియ్యఁ బూనుచును

ఈ కరణినిఁ గన్ను - లెఱ్ఱఁ జేసితివి,
నీ కపకారంబు - నేఁ జేయలేదు;

పదరి నా కిపుడు శా-పం బిత్తు ననిన
నెదిరించి ప్రతిశాప - మిచ్చెద నీకు,

విను నేను మును పది-వేవురు రుద్రు
లను, లక్షవిష్ణువు-లను, బద్మజాండ

కోటులఁ బట్టి ద్రిమ్మ-గుదుఁ గాన, మిమ్ముఁ
బోఁటి విప్రులు నాకు - భోజ్యముల్ గారె!

ఇంత తపముఁ జేసి - యీనాఁటికైన
శాంతిఁ బొందవు ము-నీశ్వర! మదిలోనఁ,

గుదురు చున్నటువంటి - క్రోధంబు నణఁపు,
మది యెట్టు లనిన నె-య్యంబుతో వినుము!

సొరిది చిత్తము పూరు-షుండు, తత్కృతము
పొరి బుద్ధి యనఁబడు, - బుద్ధికృతంబు

నల యహంకారమై - యభిమతకృత్య
ముల నొనరించు ని-మ్ముగ నటు గనుక,

సంతతంబును జిత్త - శాంతే సమస్త
శాంతి' యటంచు నా - శమనుండు పలుక,

విని భృగుముని చాల - విన్ననై, యమునిఁ
గని యిట్టు లనియె ' ని-క్కడ శుక్రుఁ డుండి

తను విందుఁ బడవైచి - తర్లినచంద
మును నాకుఁ దెల్పు' మి-మ్ముగ నన్న యముఁడు

తా నిట్టు లనియె 'నో-తాపసప్రవర!
నీవందమం దిందు - నిలిచి శుక్రాప

వేయు చుండఁగ, మీరు - చిరకాల మెచట
మాయను గెలిచి స-మాధి యందున్న

సమయంబునందు వి - శ్వాచి యనంగ
నమరు దేవాంగన - యాకాశమందుఁ

జనుచుండఁగాఁ జూచి - చాల మోహించి,
తనతను విందుంచి, - తరలి యందొక్క

దివ్యదేహముఁ దాల్చి, - ధీరుఁడై మించి,
నవ్యభోగముల నా - నళినాక్షి నెనసి,

పెద్దకాలం బుండి - పిమ్మట నతఁడు
నద్దయితను బాసి - యువనిపై వ్రాలి,

యురుశోణపురము నం - దొక్క భూసురుని
వరసుతుఁడై పుట్టి, - వసుధ నత్తనువు

విడిచి, కోసలదేశ - విభుఁడై జనించి,
పుడమిఁ బాలించి, య-ప్పుడు శరీరంబుఁ

దటుకున విడనాడి, - దండకాటవినిఁ
బటిమ మీఱఁ గిరాత-పతియై జనించి,

అప్పు డాదేహంబు - నవనిపై వైచి
తెప్పున జాహ్నవీ - తీరంబునందు

నావల నొక రాజ - హంసయై పుట్టి,
యా వీటఁ జరియించి - యా దేహ మచటఁ

బడవైచి, పిమ్మటఁ - బౌండ్రదేశమునఁ
బుడమిపై నినవంశ-మునఁ బుట్టి, మరల

జనులను బాలించి, - చని సాళ్వదేశ
మునఁబుట్టి యచ్చోట - ముఖ్యుఁడై పెరిఁచి,

యౌవరంగ పౌర మం-త్రాన దేశముల
జనులకుఁ జేయుచుఁ - జరియింపుచుండి,

యవనినిఁ దద్దేహ - మట విసర్జించి,
యవల విద్యాధరుఁ-డై జనియించి,

రహి నొప్పు నలకాపు-రంబందు నుండి,
విహరించి యా బొంది - విడిచి, పిమ్మటను

మఱియొక్క మౌని కు-మారుఁడై పుట్టి,
యఱిముఱి సర్వేంద్రి-యముల నడంచి,

తివిరి సరస్వతీ - తీరంబునందుఁ
బ్రవిమలుం డగుచుఁ ద-పముఁ జేసి, తనువు

జగతిపైఁ బడవైచి, - సౌరదేశమున
మగుడఁ దానొక్క సా-మంతుఁడై పుట్టి,

కొంతభూ మేలుచుఁ - గొన్నియేం డ్లుండి,
యంతటఁ దద్దేహ - మచ్చట విడిచి,

క్రమ్మఱఁ బోయి త్రి-గర్త దేశమున
సమ్మతంబుగ మహా - శైవుఁడై పుట్టి,

లలితుఁడై బహు శిష్యు-లకు నుపదేశ
ములు చేసి, తద్దేహ-మును విసర్జించి,

చనియా కిరాతదే-శమున నొక్కెడను
గొనకొని యొక వేణు - గుల్మమై పుట్టి,

చని, యొక భూమిలో - శ్వానమై తాను
జనియించి, యందుండి - చని, యొక్క చోట

హరిణమై యుదయించి - యా శరీరమును
ధరణిపైఁ బడవైచి, - తాళవృక్షమునఁ

బసచెడ నొక పెనుఁ-బామై జనించి,
వసుధఁ దత్తనువును - వాల్చి, యామీఁదఁ

జని తమాలమహీ జ - జాల మధ్యమున
వనకుక్కుటంబయ్యె; - వాఁ డివ్విధమున

సారె కీగతి బహు - జన్మంబు లెత్తి,
ధారుణి మీఁదఁ ద-త్తనువుల విడిచి,

యతిదుఃఖభాజియై - యాత్మ వివేక
గతి మది న్మఱచి, గం-గాతీరమందు

భూసురోత్తమునకుఁ - బుత్రుఁడై పుట్టి,
వాసుదేవాఖ్య న-వ్వలఁ దపోవేష

కలితుఁడై నిలిచి, [1]య - క్కడ తపంబునను
వెలుఁగుచు నెను మిది - వేలేండ్ల నుండి

అచట నున్నాఁడు మ-హాయోగివలెను
సుచరిత్ర! యిఁక వానిఁ - జూచెద ననినఁ

జూపెద, నీ విష్ణు - సుజ్ఞాన దృష్టి
దీపింపఁ జేయుచు - దివ్యదేహమును

ధరియించి ర'మ్మన్నఁ - దపసి యా రీతి
నరుదైన దివ్య దే-హంబునుఁ దాల్చి,

తెప్పున భాగీర-థీతీరమునకు
నప్పు డయ్యమునితో - నరిగి, వా రచటి

కతికృశీభూతాంగు-లై శుకుకడకు
హిత మొప్పఁ జనఁగ వాఁ - డెదురుగా వచ్చి

మ్రొక్కఁగా, నతనికి - మోక్షమార్గంబుఁ
జక్కఁగాఁ దెలుప, సు-జ్ఞానియై యతఁడు

1. మర్కట తపంబునను- వేం.

తనజన్మదుఖముల్ - దలఁచుచు వగచి,
యొనసిన భక్తి న-య్యిరువురఁ జూచి,

పలికె ని ట్లని 'నేను - బహుజన్మదుఃఖ
ములఁ బొంది యలసితి - మోహంబుచేత,

మున్ను మీ సాన్నిధ్య-మున నుండ కరిగి,
యన్ని దుఃఖసుఖంబు - లనుభవించితిని,

ఎఱుక చిన్మాత్రమై - యెల్ల దిక్కులను
మెఱయుచు నున్న దే-మి కొఱంత లేదు

కనుఁగొంటి ముక్తి మా-ర్గంబు, మత్పూర్వ
తనువులోఁ జేరి మీ - తనయుండ నగుచుఁ

జెదరక మీ సేవఁ - జేసెద' ననిన
వదలని కృప మీఱ - వా రిద్ద ఱతని

వెంటఁ దోడ్కొనిపోయి, - వింతగా నేల
నంటి కృశీ భూత-మైన దేహమును

జూపఁగాఁ జూచి, యా - శుక్రుఁ డీతనువు
నాపట్లఁ బడ వైచి, - యంతకు వరము

చేఁ బూర్వతనువులోఁ - జేరి యచ్చోట
దీపింపఁగాను ద - ద్దేహంబు లేచి

తన తండ్రి చెంత య-థా ప్రకారముగ
నొనర సుఖస్థితి - నుండఁగాఁ జూచి,

శమనుండు నిజనివా-సంబున కరిగె;
నమితసంతోషాత్ముఁ - డయ్యె భృగుండు.

అని శుక్రు వృత్తాంత - మా వసిష్ఠుండు
మనుజేంద్రునకుఁ జెప్పి మరల ని ట్లనియె:

'విను రామ! సంసార - విభ్రమ వ్యథలు
మనమునందే పుట్టు - మాయ నీ కిపుడు

తెలియుట కిది చెప్పి - తిని, మానసమును
నిలిపి శాంతిని బొంది, - నెమ్మది నుండు!

చెలఁగి వివేకంబు-చేఁ జిత్తశాంతి
గలుగ, సంసార దుః-ఖ మణంగిపోవు;

నిలను వివేక వి-హీన చిత్తునకుఁ
గలుష సంసార దుః-ఖము వృద్ధిఁబొందు;

సతతంబు నాత్మ వి-చారంబు సేయు
నతని చేతోవృత్తు-లణఁగి నశించు;

వడిగొన్న సంసార - వాసన మరలఁ
బొడమినయపుడు తె-ప్పునఁ దా విరాగ

మతినొంది, సంసార-మనిన వర్జించి,
హిత మొప్పఁ దన్నుఁ దా-నెఱుఁగు చుండఁగను

సరవి సంసార వా-సన మూషకములు
కొఱికిన వలరీతిఁ - గ్రుస్సి నశించు;

తెరలి మనోగ్రంథి - తెగు, నటు మీఁదఁ
బరమ విజ్ఞాన స్వ-భావంబు మించి

నిత్య ప్రసన్నమై - నిండుచునుండుఁ;
బ్రత్యక్ష మీ యను-భవము భావించు

నట్టి యోగాభ్యాసి - యైన పూరుషుని
పట్టిన కరుణకు - బ్రహ్మాదిసురలు

తగుపాత్ర లగుదు; రం-తటి యోగివర్యుఁ
డగణిత చరితుఁడై - యన్ని దిక్కులను

కనులు స్వభావంబు-గాఁ జూచుపగిది
ఘనతరంబగు చిత్త - గతిలేక తాను

చేయఁగాఁ దగుపనుల్ - సేయుచునుండు;
నా యోగి యెఱుకతో - నఖిలభోగములఁ

దెలిసి భోగించి తృ-ప్తిని బొందు, దురిత
ములు వాని నంటక - మురిగి నశించు;

నారీతి యె ట్లన్న - నఖిలేంద్రియములు
చోరకులై తన్నుఁ - జొక్కింపవచ్చు

సమయమం దతఁ డతి-జాగరూకతను
భ్రమయ కాచోర స్వ - భావంబు లెఱిఁగి,

తొలఁగ కాచోరుల-తో మైత్రిఁ జేసి,
కలసిన ట్లుండి భో-గములను జెంది,

గెంటక తన్ను బొం-కించు కామాది
కంటకులను దాను - గాంచి వంచించి,

వాని నెల్లను దన - వశముఁ జేసికొని,
వాని కెందును దాను - వశుఁడు గాకుండు.

అది యెట్ల నన్న మ-హాబధిరుండు
పొదువుగా దారులఁ - బురముల, నదుల

నూరకే గనుచుఁ బో-వుచునుండుఁగాని,
వా రందుఁ బలికెడి - వార్తలు వినని

గతిఁదనప్రారబ్ధ - కర్మశేషముల
నతినిస్పృహుండునై - యనుభవింపుచును

నరయ జీవన్ముక్తు - డగుచుండి, తుదను
మురువు మీఱ విదేహ - ముక్తుఁడై, నభము

నభమందుఁ గలిసియు-న్న విధంబుగాను
శుభకర పరమ వ-స్తువునందుఁ గలియుఁ;

గావున నిప్పు డే-క్రమముననైన
నీ వింద్రియములను - నిగ్రహింపుచును

ధీర సంసార వా-ర్ధిని దాఁటవలయు;
నారీతి చేయ క-హంకారభావ

కలితుఁడవైన దుః-ఖములు ప్రాప్తించు.
ఇల నిందు నితిహాస - మెఱిఁగింతు వినుము!

*** శంబరోపాఖ్యానము ***

జననాథ! పూర్వంబు - శంబరాసురుఁడు
పనిఁ బూని చతురంగ - బలములఁ గూడి,

'శక్రాది దివిజుల - సమయింతు' ననుచు
విక్రమాటోపంబు - విపులంబు గాఁగ,

ననిమిషావళితోడ - ననిఁ జేయు వేళ
మొనకు నిల్వక వాని - ముఖ్యబలంబు

విఱిగి డాఁగినఁ జూచి, - విపులదుఃఖమున
మఱియును వాఁడు దా-మ, వ్యాళ, కటులఁ

బుట్టింపఁగా, వారు - భూరిశౌర్యమున
నట్టహాసంబుతో - ననిఁ జేసి, సురలఁ

దఱుమ, దేవతలా వి-ధాతను జేరి,
శరణని శంబరు - సామర్థ్య మెల్ల

వినిపింప, విని ధాత - విబుధులఁ జూచి,
పనిఁబూని యొక్క యు-పాయ మూహించి,

పలికె ని ట్లనుచు 'శం-బరుని మీ రిపుడు
గెలుచుట కొకయుక్తి- గెంటక వినుఁడి!

వాఁడు కయ్యము సేయ - వచ్చిన వేళ
నాడాడ డాఁగుచు - నళికిన రీతిఁ

బోరాడుచుండుఁ, డ-ప్పుడు విజయాశ
నా రాక్షసునియం ద-హంకార గుణము

పొడము, నందున వారు - పొలిసి పోవుదురు;
జడియక చనుఁడన్న - శక్రాదు లరిగి,

పొరిఁ బొరి దానవుల్ - పోరాడు తఱిని
వెఱచిన రీతిగా - విబుధు లందందు

డాఁగుచుఁ బోరుచుం-డఁగ దానవులకు
వేగ నహంకార - వికృతి జనించె;

నాయహంకృతిచేత - నఖిలరాక్షసులు
నా యమరుల కోడి - యరిగి ' రటంచు

ముని దెల్పఁగాను రా-ముఁడు వెఱఁగంది,
మనమున నూహించి - మరల ని ట్లనియె:

'కలుష దామ, వ్యాళ, కట - నామ భటులు
నిలను బరాత్మ యం-దెటు గల్గి?' రనిన

మౌని యి ట్లనియె 'దా-మ' వ్యాళ, కటులు
పూని యద్భుతముగాఁ - బుట్టు టె ట్లనిన

వెరవొప్పఁ జెప్పెద - విను సూక్ష్మమతినిఁ
బరమాత్మ విప్రతి - భాతి మాత్రంబె

గాని, సత్యంబులు - గా విది చెప్పఁ
గా వేల? రామ! త-క్కక వీవు, వేను

నసుట లసద్భావ - మగు నాత్మ రూప
మునఁ గల్గునాభాస-ముగఁ జూడు, మదియె

జీవశక్తి యనంగఁ - జెలరేఁగి, త్రివిధ
భావవిస్ఫూర్తిచేఁ - బ్రభవించి మించి,

తనువు లనేకముల్ - ధరియించు, విడుచుఁ
గనుక, నాభాసాత్మ - కం బింత యనుచుఁ

దెలిసి, జీవత్వంబు - ధిని వీడి, జ్ఞాన
బలముచేఁ జిత్పర - బ్రహ్మమై యుండు;

నెఱుఁగని యహమర్థ - మిల నెద్దియైనఁ
బరువడి మలిన రూ-పముతోఁ జిదాత్మ

యందుఁ బొం దెఱిఁగిన - యహమర్థ మొనరఁ
బొందుగా బ్రహ్మమై - పూర్ణమై వెలుఁగు;

మొనసి తదహ మెన్న - మూఁడులోకములఁ
గనఁబడుఁ ద్రివిధ ప్ర-కారముల్గాను:

అందు బ్రహ్మంబు తా-నని యహంభావ
మొందిన యహమర్థ - మున్నతోన్నతము,

పరఁగ నీశ్వరుఁడు ప్ర-పంచంబునందుఁ
బరమాణు పూర్ణుఁడై - భాసిల్లుచుండు,

నతనికి దాసుండ - నను నహమర్థ
మతులితోత్తమ మగు, - నా రెండు విడిచి,

తనువు, నింద్రియములు - తా నను నహము
జనియింప నది కని-ష్ఠం బగుచుండుఁ;

గడపటి కీ యహం-కార్యతయంబు
విడిచిన ధన్యుండు - విమలనిర్వాణ

పదమందుఁ జెందుఁ, ద-ప్పదు నిశ్చయంబు.
కదిసియుండెడి యహం-కారంబు నణఁచి

ముందు భీమాదులు - ముక్తులైనట్టి
చందంబుఁ జెప్పెదఁ - జక్కఁగా వినుము!

### * భీమాద్యుపాఖ్యానము *

మనుజేంద్ర! నాడు దా-మ,వ్యాళ,కటులు
మొనయు నహంకార-మున బలాయువులఁ

దాము గోల్పడి దేవ-తల కోడి రనుచు
సామంబుతో మళ్ళి - శంబరాసురుఁడు

అమలాత్ములను నిర-హంకారమతుల
నమితసుశాంతుల - నధ్యాత్మ విదులఁ

బుట్టింప, జలధి బు-ద్బుదముల మాడ్కిఁ
బుట్టి యద్భుతముగాఁ - బురుహూతముఖులఁ

దఱిమి జయించి సం-తసము దీపింపఁ
బరమపదంబునఁ - బ్రాపించి రపుడె.

పరఁగ దుర్వాసనా - బద్ధ మానసము
సరస సుజ్ఞాన వా-సనచేతఁ గ్రాఁగి,

సతతంబు విమలమై - శాంతినిఁ బొందు,
నతిశయంబగు సమ్య-గాలోకనంబు

చే చిత్త మణఁగు నా-ర్చిన దీపమట్ల,
నీ చంద మిపుడు నీ - కేను చెప్పినది

యేలన్న నీ విశ్వ - మెల్ల మాయికము
గా లక్ష్యమునఁ జూతుఁగా - కంచుఁ దామ,

భీముల కథలఁ జె-ప్పితి' నన్న రాముఁ
డా మునిఁ గాంచి 'వి-శ్వాతీతమైన

పరమాత్మయందీ ప్ర- పంచ మేరీతి
నిర వొందు?' ననఁగ ము-నీంద్రుఁ డి ట్లనియె:

'నమలాత్మ! రామ! చి-దాకాశమందు
భ్రమకాకరంబై ప్ర-పంచ మంతయును

ఊరకే యెండమా-వులయందు నీళ్ళు
పాఱిన గతిఁ గనం-బడు మృగంబులకు,

నటువలెఁ దనయాత్మ - నంటిన మదము
పటిమ నన్యుఁడ నని - భ్రమ నొంది దేహి

మఱపను నజ్ఞాన మహి - మంబు చేత
నరయనేరక యాతఁ-డతఁడు గాకుండు,

వెలయు దీపము నందు - వెలుఁగున్న కరణిఁ,
దెలియ భానునియందు - దివమున్న రీతి,

పొసఁగఁ జిత్తున జగం-బులు దోఁచుచుండు;
అసమాన చరిత! నీ - వంతరంగమున

భావింపుచుండు మీ - పరమ రహస్య
మే వేళ' ననిన ము-నీంద్రు నీక్షించి

పలికె శ్రీరాముఁ'డో - పరమ మునీంద్ర!
నెలవుగా క్షీరాంబు-నిధి తరంగముల

వలె నుండు మీ సార - వాక్యముల్ వినఁగ
నలఘు సుజ్ఞానోద-యం బయ్యె మదిని,

నడర జ్ఞానోదయం-బైయున్నఁ గాని
గడియగడియకుఁ జీఁ-కటియును వెలుఁగు,

వలనుగాఁ జలి, యెండ - వర్ష మేఘంబు
గలిగించు చందంబు-గా నా మనంబు

గలిబిలి చేసి సం-కల్ప వికల్ప
ములను బుట్టించు, ని-ర్మూలంబుగాదు;

అరయ ననంతంబు - నప్రమేయంబు,
పరము, నేకమును, స-ర్వము నైన బ్రహ్మ

యందు సృష్టి లయంబు-లగు వికారంబు
లెందుకు జనియించె? - నీ హేతు వేమి?

యనిన వసిష్ఠుఁ డి-ట్లనె రాముఁ జూచి
'యనఘ! యథార్థ వా-క్యార్థంబు లగుచుఁ

దనరు పూర్వాపరా-ర్థ నిరూపణలకు
మొనసి చూడ విరోధ-ములు గల్గ వెందు,

సుజ్ఞానదృష్టిచే - సూటిగాఁ జూడ
నజ్ఞానభావంబు - నంట్టి మనంబు

రూపింప విద్యా స్వ-రూపమై వెలుఁగు;
నాపట్ల నస్త్ర మ-య్యస్త్రంబు చేతఁ,

గ్రమముగా గరళ మా - గరళంబు చేత
భ్రమ చెడ ఖండింపఁ-బడినచందమున

ననుమాన విరహిత-మై యున్న సూక్ష్మ
మనముచేత మనంబు - మడియుచునుండు,

వెలయు ననాది య-విద్య యేరీతిఁ
గలుగునో యనుచింత - కడముట్ట విడిచి,

నిరతంబు పరతత్త్వ - నియతి నవిద్య
నతిమాత్రఁ జెఱుచు టి-ట్టను విచారంబు

నీ యాత్మ యందుంచు - నెలవెందు లేక
నా యవిద్య నశించు-నపుడు తజ్జనన

కారణ మాత్మకుఁ - గనిపించు' ననిన
శ్రీరాముఁ డనియె 'నా-జీవుండు మించి

తా మనోరూపంబుఁ - దాల్చి విరించి
ధామంబు నొందు వి-ధం బెట్లు? లనిన

మౌని యి ట్లనియె 'బ్ర-హ్మ శరీర మొందు
మానిత చరితంబు - మది నిల్పి వినుము!

అరయఁగా దేశ కా-లాదులు లేక
వరుసగాఁ జూచిన - వస్తు భేదంబు

లేక యంతట నొక్క - లీలగా నుండి
యాకాశనిభమగు - నాత్మతత్త్వంబు,

అదియె బ్రహ్మ శరీర - మనఁబడుచుండు;
వదలక యుండెడి - వాసనావశము

చేత జీవుం డగు, - జీవునివలన
నాతతంబుగ సంశ-యాత్మకంబైన

మదిగల్గి, దాని ని-ర్మలశక్తియందుఁ
గదిసి శబ్దోన్ముఖా - కాశాదిభూత

సముదయం బుదయింప, - సకల ప్రపంచ
మమితమై గనుపట్టె - నాకాశమందు,

ననలకణమురీతి - నాద్యహంకార
ఘనబుద్ధి బీజ సం-కలిత దేహంబు

కనుపట్టె పుర్యష్ట-కంబను పేర
మొన నూవుచును భూత-ముల హృదబ్జముల

మెలఁగుచు నుండు తు-మ్మెదరీతి నందు,
బలసి పిమ్మట మనో-భావ వేగమున

లలిమీఱ బిల్వ ఫ-లంబు చందమున
సొలయక బళువుగా - స్థూలమై యదియె

చెలువొప్పఁ గరఁగి పో-సిన పైఁడి బొమ్మ
వలెఁ బ్రకాశించి, య-వ్వల నాకసమున

మొనసి తత్త్వరూప-ముల వెల్గుచుండుఁ;
దనరఁగా వాని కూ-ర్ధ్వంబు శిరంబు,

నుదరంబు మధ్యంబు, - నొగి హస్తములును,
ముదమొప్పఁదగు పార్శ్వ-ములు, పాదములును

చాల నధఃప్రదే-శముగాఁగ నిట్లు
కాలవశంబునఁ - గాయమై నిలిచి

గణుతి కెక్కుచు బుద్ధి - ఘనసత్త్వ ముఖ్య
గుణములు తనయందు - గుమికూడి మెఱయఁ

దరమిడి లోక పి-తామహుండైన
పరమేష్ఠి యుదయించుఁ, - బరమార్థమైన

యతనికి జన్మ ల - యంబులు గల్గ;
వతిశయ మిథ్య లై-నట్టి భావనల

చేతనే గల వంచుఁ - జెప్పఁగాఁబడును.
ఖ్యాతిగా నటుగానఁ - గర్మ సంసార

కలిత తృష్ణా భుజం-గంబును ద్రుంచి
యలఘు సౌఖ్యము నొందు - మాదిత్యకులజ!

మొనయు నజ్ఞానాంశ-ములు సతీసుతులు,
ధనధాన్య ముఖ్య సంప-దలుగాఁ దలఁచి,

మొనసి తత్సుఖ దుఃఖ-ముల మది రోసి
నను సదా నిశ్చలా-నందంబు కుదురు;

అరయఁగా మూర్ఖాత్మ - లగువారితలఁపు
లఱి ముఱి మోహ శో-కాబ్ధుల మునుఁగు;

నటువంటి తలఁపులే - యతివివేకులకు
ఘటిత వైరాగ్యసౌ-ఖ్యంబు పుట్టించి

జననాథ! చేఁ దప్పి - చనినట్టి కార్య
మునకుఁ జింతింప, కి-మ్ముగ దాని విడువు

మల కాలవశమున - నబ్బిన సౌఖ్య
ముల నీ వనుభవించు - మోహివిగాక,

కలిగెడు సుఖము. దుః-ఖము మిథ్య లనుచుఁ
దెలియ నేర్చిన మహా-ధీర చిత్తుండు

ఆ సుఖదుఃఖంబు - లందంటి యంట
కీసూర్యుఁ డున్నట్ల - యింపొందు చుండు.

నొకవేళ శివునిచే - నుదయించు సృష్టి,
యొకవేళ నజునిచే - నుద్భవం బగును,

నొక వేళ విష్ణు దే-వునిచేతఁ గల్గు,
నొక యెడ మునులచే - నుత్పన్న మగును,

నొక తఱిఁ గమల మం-దుదయించు బ్రహ్మ,
యొక వేళ జనియించు - నుదకంబునందు,

నొక కాలమునఁ బుట్టు - నురుతరాండమున,
నొక వేళఁ బొడమునీ - వ్యోమంబునందు,

నొక వేళఁ దరులతా-యుత యగు భూమి,
యొక వేళ నరులతో - నొప్పు నిద్ధాత్రి,

యొక వేళ గిరులచే - నొగిఁ బ్రకాశించు,
నొక వేళ భూమి తా-నొక్కటే యుండు,

నొక వేళ మొఱప రా-ళ్లుండు నెల్లెడల,
నొకవేళఁ గనకమై - యొప్పు నిద్ధాత్రి,

యొక వేళ నాకాశ - ముదయించు మొదట,
నొక వేళ యీ భూమి - యుదయించుఁ దొలుత,

నొక వేళ నాది యం-దుదకంబు పుట్టు,
నొక వేళ పావకుఁ - డుదయించు మొదట,

నొక వేళఁ దొలి వాయు - వుద్భవం బందు,
నిఁక నెన్ని చెప్పు ద-నేక చిత్రములఁ

బ్రకటమై తోఁచుఁ బ్ర-పంచ మీరీతి
నొక బ్రహ్మపుట్టు వే-నొనరఁ జెప్పితిని;

అమితంబులైన బ్ర-హ్మల పుట్టువులను
గ్రమముగా నెవరును - గణుతింపలేరు.

నిక్కంబుగా నిది-నిర్ణయం బనుచుఁ
జక్కఁగా సృష్టి ము-చ్చట చెప్పఁదరమె?

మానవేశ్వర! జగ-న్మాయా స్వరూప
మేను జెప్పెద నది-యె ట్లన్న వినుము!

## * దాశూరోపాఖ్యానము *

అనఘాత్మ! దాశూరుఁ డను - ముని తండ్రి
చనిపోవఁగాఁ జూచి - జనకునికొఱకు

నెలుఁగెత్తి దాశూరుఁ - డేడ్వ నవ్విధము
తెలిసి తెప్పున వన - దేవత యటకుఁ

జని 'జనించిన వారు - చచ్చుట నిజము
గనుక, నీవింక దుః-ఖంబును విడువు'

మని యూఱడింపఁగా, - 'నౌఁ గాక!' యనుచుఁ
దనతండ్రి కట సేయఁ - దగిన కర్మములు

సుస్థిరమతిని దా - శూరుండు చేసి,
యస్థిరంబు శరీర - మని తాఁ దపంబు

సేయ సంకల్పించి - క్షితి నుండ రోసి,
యాయెడ నొక్క వృ-క్షాగ్రంబుఁ జేరి,

యతిశయంబగు తప - మం దాచరింప,
నతనికిఁ బ్రత్యక్ష-మై హుతాశనుఁడు

వరముల నియ్యఁగా, - వాఁ డటు మీఁద
మురిపెంబుతో జన్న-ములు చేయఁదలఁచి,

పరమభక్తిని వన-స్పతిని గుఱించి
పరఁగఁ బదేండ్లు త-పం బాచరించి,

మదిలోన యజ్ఞ సా-మగ్రినిఁ గూర్చి,
సదమల మతిని ని - ర్జరుల కర్పించి,

కొమరొప్ప నర, హయ-గో మేధయాగ
సముదయంబులు నిజ - స్వాంతంబునందె

తా నాచరింపఁ, ద-త్త్వ జ్ఞాన మాత్మ
లోనె ప్రకాశింప, - లోక జాలముల

నిరసించి, యట మీఁద - నిస్పృహుం డగుచుఁ
బరమైన నిర్విక-ల్పసమాధి నుండె.

అలరుచు నంతట - నతనిధన్యతను
దెలియుటకై వన-దేవత యతనిఁ

జేరి తా వందనాల్ - చేసి నుతించి,
'ధీర! దాశూర! నా-దెసఁ గృపనుంచి

'యిపుడు నా కొక పుత్రు-ని మీ్మయకున్న
నపరిమితాగ్నిలో-నైనను జొచ్చి

తనువు నీ కర్పింతుఁ - దక్కక యిచట'
నన విని నవ్వుచు - నమ్మహామహుఁడు

తనచేతికమల మా-తరళాక్షి కిచ్చి,
'వనిత! మాసమునకు - వరపుత్రకుండు

గలుగు, న న్నిట బలా-త్కారంబు చేసి,
యలరుచు సుతుని నీ - వడిగితి గాన,

జనియించు సుతుఁడు వి - జ్ఞాని యౌ'ననిన
విని యది పలికె 'నో - విమలాత్మ! నాకు

సుజ్ఞాని యైనట్టి - సుతుఁడు గల్గినను
ప్రజ్ఞాసమేత! నీ - పద సేవ చేయ

నే వాని నీ చెంత - నిలిపెద' ననుచు
నా వనదేవత - యట మ్రొక్కి పోయి,

మాసంబునకు సత్కు-మారునిఁ గాంచి,
యా సుతుఁ గొని చని - యచలాత్మ యగుచు

మ్రొక్కి, యా దాశూరు - మున్నిడి పలికె:
'నిక్కంబుగా వీని - నీ సేవ కొఱకుఁ

గని మీ కొసంగి, తి-క్కడ వీనిఁ బ్రోవు'
మని పుత్రు నందుంచి - యరిగె నద్దేవి.

ఆవల దాశూరుఁ - డాపుత్రకునకు
వేవేగ వేదాది - విద్య లన్నియును

నఱలేక చెప్పి, వే-దాంత రహస్య
మెఱిఁగింప నొక్క నాఁ-డి ట్లని పలికె:

'ఓవరపుత్ర! నీ - కొకకథ నేను
భావించి చెప్పెదఁ - బట్టుగా వినుము!

అది యెట్టు లనిన స్వో-త్థాభిధానుండు
సదమలచరితుండు - సమ్యగాకార

కలితుఁ డాతఁడు - చేయు కార్యముల్ దుఃఖ
ములు నగుచు ననేక-ములు సముద్రమునఁ

బుట్టు తరగలట్ల - పొడముచు నుండు,
నట్టి రీతుల శక్య - మగుచుండ నతఁడు

సరవిని విహరణ - క్షమకై త్రితనువు
లఱిముఱి ధరియించి - యలరుచు నుండుఁ;

దలకొని యమ్మూఁడు - తనువులు లోక
ములయందు నిండి యి-మ్ముగ నుత్తమంబు

ననఁగను, మధ్యమం బ-నఁగఁ, గనిష్ఠ
మనఁగఁ గలుగుచుండు; - నా స్వోత్థనామ

ధేయుండు నెపుడు త-ద్దేహత్రయమును
బాయక యుందందుఁ - బక్షిచందమునఁ

నురవడిఁ జరియింపు - చుండె'నటంచు.
సురుచిరమతినిఁ దా-శూరుండు దెలుప,

విని యాకుమారుండు - వెఱఁగొంది, యతని
కనియె ని ట్లనుచు స్వో-త్థాభిధానుండు

'ఎవ్వఁడు దేహంబు - లెన్ని ధరించె?
నెవ్విధంబునఁ జరి-యింపుచు నుండె?

దేటగా వివరించి - తెలుపుఁ ' డటన్నఁ
బాటించి యమ్ముని - ప్రవరుఁ డి ట్లనియె:

'విను పుత్ర! సంసార - విభ్రమ చక్ర
మనఁబడునది దీని - యం దనేకములు

గా వస్తువితతులు - గలుగుచు నుండుఁ,
గావున సచ్చిదా - కాశంబునందుఁ

బూనిన సంకల్ప - పూరుషుం డనంగఁ
దాన జనింపుచుఁ - దా లీన మగుచు

వేడుకల్ చూపుచు - వెలుఁగుచునుండు,
వాఁడగు సర్వ వి-శ్వమటంచు నెఱుఁగు!

హరిహర విధి సురేం-ద్రాదు లందఱును
బొరి వాని యవయవం-బులుగా నెఱుంగు,

మతిశయ సత్యలో-కాది లోకంబు
లతని నివాసంబు-లగుచుండు, మఱియు

వాని తలంపున - వనజసంభవుఁడు
పూని జనించె న-ద్భుతవిశేషముల,

నిట్టి సంకల్ప మ-హీపాలకుండు
మట్టు మీఱుచు నథ-మంబు, నుత్తమము

ననఁగాను, మధ్యమం-బనఁగ నొప్పుచును
దనరుచున్నటువంటి-తామస, సత్త్వ,

రాజసగుణ శరీ-రంబులు మూఁడు
మోజుగాఁదాల్చు ని-మ్ముగ న దెట్లనిన

సరవినిఁ దామస-సంకల్ప మహిమ
నఱిముఱిఁ గ్రిమికీట-కాదులైనట్టి

జననంబు లొందును,-సత్త్వ సంకల్ప
మున వివేకశరీర-ములను ధరించు;

సారెకు రాజస-సంకల్ప మహిమ
నారయ మూఢ దే-హముల ధరించు;

మొనసి యీ సంకల్ప-ములు మూఁడు విడిచి,
తనలోని పరమాత్మ-తత్త్వంబుఁ దెలియఁ

గోరు, సంకల్పంబు-కొనసాఁగి పొడమ
నారూఢిగాఁ బొందు-నయ్యాత్మయందు,

సరసాత్మ! సర్వ వి-షయ జాలములను
నిరసించి విడిచిన - నిర్మల మనము

చేతనే  మనమును - జెదరిపోనియక
యేతీరుగానైన - నెఱిఁగి బంధించి,

పట్టుచు మఱి మఱి - బాహ్యాంతరములఁ
బుట్టెడి సంకల్ప-ముల వీడు' మనిన

విని యక్కుమారుండు - వేగ ని ట్లనియె:
'జనక! యీ సంకల్ప - జాల మెచ్చోటఁ

గలుగుచునుండు? నే-గతి వృద్ధిఁ బొందు?
విలయ మెట్లగు? నది - వివరింపు' మనినఁ

దనయుని మన్నించి-దాశూరుఁ డనియె:
'విను మా యనంతంబు - విమల, మద్వయము

ననఁదగు పరమాత్మ - కాదికాలమున
జననమైనట్టి సం-సారోన్ముఖతయె

అవిరళసంకల్ప - మగు, నదె ట్లనిన
[2]లవమాత్ర మగు చిదు-ల్లాస పరాత్మ

రూపింప నజడస్వ-రూపమై మింటఁ
జూపట్టు జలదంబు - చొప్పున మించి

దట్టమై తానె చి-త్తం బగుచుండుఁ;
బట్టుగా మాయా ప్ర-పంచ భావనకుఁ

గన వ్యతిరిక్తంబు - గాఁ దోఁచుచుండు,
ననుపొందఁగా బీజ - మంకురంబైన

గతిఁ బ్రపంచంబు సం-కల్పమే యగును.
ప్రతిభ నీ సంకల్ప - భావన తనకుఁ

దానె గల్గుచుఁ దనం-తనె వృద్ధి యగుచుఁ
దానె యణఁగు నీటి - తరఁగలరీతిఁ,

గాన దీన సుఖంబు - గలుగ దెన్నటికిఁ,
బూని మహాదుఃఖ - ములను బుట్టించుఁ

గావున నీవు సం-కల్ప భావనలఁ
బోవీడి సుఖమొందు - పుత్ర! యె ట్లనిన

మొనసిన సంకల్ప-ములు నశించినను
మునుపు పుట్టు ప్రయత్న-ములు గల్గవల,

2. లవమాత్రమగుచు నుల్లాసంబు నాత్మ-వా.

వరుస భావన నభా-వంబు చేసినను
గరఁగి సంకల్పముల్ - గళితంబు లగును;

కడను సంకల్పముల్ - గళితంబులైన
నెడలేని సంతోష - మిరవొందు మదిని,

జనన మొందెడి యస-త్సంకల్పములను
మొనసి సత్సంకల్ప-మున నిగ్రహించు!

మనముచే మనమును - మడియించు మవలఁ,
గనినను నీకు దు-ష్కరముగా దెద్ది'

యనుచు దాశూరుఁడి-ట్లని కుమారునకు
వినిపించెఁ బరమైన - 'వేదాంత' మనుచు

మునిదయ మీఱ రా-మున కెఱింగించి,
మనము రంజిల్లఁగా - మరల ని ట్లనియె:

'ఇలను మనోజాల - మిట్టిది యనుచుఁ
దెలిసి ధీరతను వ-ర్తింపుచునుండు!

లీలగాఁ దుద మొదల్ - లేదు కాలమున,
కేలాగుఁ జూచిన - నిదమిత్థ మనుచు

నెఱుఁగ శక్యంబుగా, - దెన్న నూఱేండ్లు
నరుఁడు జీవించు ని-ర్ణయముగా ననుచుఁ

బట్టుగా వేదంబు - పలుకుచునుండు;
నట్టినియతి దప్పు, నర్థకాలంబు

బ్రదికి యుండుట దుర్ల-భంబుగా నుండు;
ఇది నాది, నే నని - యెల్ల మానవులు

వదలక సంసార - వనధిలో మునిఁగి
సదమల జ్ఞాన వి-చారంబు లేక

కాలమృత్యువు నోటి - కబళంబు లగుచు
భూలోకమున గిట్టి - పుట్టుట సుఖము

కా దని, వైరాగ్య - కలితాత్ములైన
వేదాంత వేత్త లే - విధమున ధరను

మెలఁగుచుండుదు రట్ల - మెలఁగుచునుండు!
కలుగ వావల జన్మ - కర్మ దుఖములు;

అంతరాస్థ నణంచి, - యట సేయుపనుల
నెంతని విడువక, - యెఱుక దప్పకను

సేయఁగాఁ దగుపనుల్ - చేయుచుండినను
మాయలే కణఁగు, చి-న్మయ మగునంత;

నిచ్చలేకయె రత్న - మెపుడు తనంత
స్వచ్ఛమై వెలిఁగెడి - చందంబుగాను

నణురూపమై పర-మాత్మునియందు
గణుతి కెక్కుచును లో-కములు తమంత

నే తాము లీలగా - నెరసి వెలుంగు,
నాతతంబుగ నాత్మ - యందుఁ గర్తృత్వ

మును, నకర్తృత్వ మి-మ్ముగఁ దోఁచుచుండుఁ;
గనుఁగొను నాసలే - కనె చేయుచుండుఁ,

గనుకను దాఁ - గర్త గా, దొక కర్త
యొనరంగఁ దనచెంత - నుండుటఁజేసి

పూని కార్యముల నె-ప్పుడు చేయు నెడలఁ
దాను గర్త నటంచుఁ - దలఁపక సేయఁ,

దగు కార్యములు చేసి - తాఁ గర్త ననక
జగతి నిర్లేప సం-జ్ఞను బొందవలయు;

నటు గాకయుండిన - నంతటి కేను
ఘటకుండ నని నీవె - కర్తృత్వ మొంది,

సకలకార్యములను - సమబుద్ధిచేత
వికలత లేక వి-వేకివై నడుపు!

మొలచు రాగద్వేష-ముల మోదఖేద
ముల యందుఁ బొంద, కి-మ్ముగ నెప్పుడైన

లలిని సంకల్ప జా-లంబు నణంపఁ,
జెలువొప్ప సమతచేఁ-జిత్తు దీపించు

గాన, నకర్తృత్వ - కర్తృత్వములను
మాని, మనోలయ - మార్గంబు నొంది,

నీవు సుఖింపుచు - నెమ్మది నాత్మ
భావించినంతటఁ - బరిపూర్ణమగును.

తనువు తా నను నహం-తను విచారింప
సునిశితంబుగఁ గాల - సూత్రనారకము

గాన వీడందగు - ఘటము నే ననుట,
మానవేశ్వర! యొక - మర్మంబు వినుము!

అంతకు నేఁ గర్త - ననియైనఁ దలఁపు,
మంతకుఁ గర్త కా-నని యైనఁ దలఁపు,

మింతటికినిఁ గర్త - యెవఁడు? నే నెవఁడ?
నింతింత యనఁగూడ - దీ వింత యనుచు

నైనఁ దలఁపుచుండు, - మస్థిరంబైన
మేను నే ననకు సు-మీ! రామ! దేహ

వాసన బంధమౌ, - వరుసగా సర్వ
వాసనా క్షయము జీ-వన్ముక్తి యనుచుఁ

దెలిసి, యావలన ము-క్తినిఁ గోరవలదు,
వలనొప్పఁగా మనో - వాసనావళినిఁ

బరిహరింపుచు మహా - పావనసత్త్వ
వరగుణస్నేహాది - వాసనలందుఁ

దగులుచు వర్తించి, - తద్వర్తనముల
దిగనాడి యట మీఁద - ధీరత మీఱఁ

బొసఁగ నంతట శాంతిఁ - బొంది, యామీఁద
నసదృశ చిన్మాత్ర - మందు సుఖించి,

మఱి మనోబుద్ధి స-మన్వితం బగుచు
మెఱయు వాసన నటు - మీఁద వర్జించి,

తఱచైన చిర సమా-ధానంబుచేత
నెఱుకకు నెఱుకగా - నేకాగ్రమతినిఁ

దెలిసితి వెద్ది య-దిన్ వీడు మవల,
విలసితంబగు మనో - వృత్తినిఁ జేసి

మొలచు నఖిల దృశ్య-ముల వీడినపుడు
చెలువొప్ప నేది విశే-షించునో చూడ

నది మోక్ష మనఁబడు; - నాగుఱి యందుఁ
గుదిరిన ధన్యుండు - గురుఁ డనందగును;

ఆ గురుతర పుణ్యుఁ-డటు జ్ఞాన, కర్మ
యోగముల్ మరలఁ జే-యుచునున్న మేలె,

చేయకుండిన మేలె - సిద్ధించు నతని,
కే యెడఁ గొదువలే - దినకులోత్తంస!

నిలుకడ యైనట్టి - నిర్లేపయుక్తి
గలవాని సంసార - కాంక్ష గోష్పదము

వలె నుండి యణఁగు; న-వ్వల లేపయుక్తి
గలవాని సంసార - కాంక్ష మహాబ్ధి

వలెఁ బొంగి కడపట - వాని ముంచు' నని
పలికి క్రమ్మఱ ముని -ప్రవరుఁ డిట్లనియె:

### * ఉపదేశోపాఖ్యానము *

'జననాథ! యిఁక నొక - సరణిఁ జెప్పెదను
విను మది యెట్లన్న - విబుధ దేశికుని

తనయుండు కచుఁ డాత్మ - తత్త్వసమాధి
నొనరంగఁ గూర్చుండి - యుండి, యానిష్ఠఁ

జాలించి లేచి, వి-శ్వంబు నీక్షించి,
యాలోచనంబుగా - నంతరంగమునఁ

దలఁచె ని ట్లనుచు 'భూ-త ప్రపంచమున
వెలుఁగుచుఁ బరమాత్మ - వేఱుగా కెల్ల

దిక్కులఁ బూర్ణమై - దీపించె, నేన
నిక్కమై యంతట - నిండి యున్నాఁడ:

నెక్కడఁ బోవుదు? - నిఁక నేమి సేతు?
నొక్క పరబ్రహ్మ - మున్న దే నగుచుఁ

గనుకఁ దదన్య మె-క్కడ లే'దటంచుఁ
దన యనుభవముచేఁ - దాఁ బూర్ణుఁ డయ్యెఁ;

నని కచువృత్తాంత - మమర వసిష్ఠ
ముని తెల్పి, మరల రా-మున కిట్టు లనియె:

'ఎవ్వఁడు సత్త్వంబు - నెనయుచునుండు
నవ్విమలుఁడు వాఁడ - యనిశంబు కనక

కమలంబు రీతిఁ బ్ర-కాశింపుచుండు'
నమరఁ గోరఁడు కోర్కె, - లాత్మయం దెపుడు

మొనసి రమించు, ని-మ్ముగఁ జంద్రబింబ
మున శైత్యగుణము గ్ర-మ్ముచునుండు కరణి

నా యోగి హృదయమం - దమల శాంతంబు
పాయక యుండు; న-ప్పగిదినిఁ జిత్త

శాంతిఁ బొందుము రామ-చంద్ర! యీ బాహ్య
చింతల నొందక, - చెలఁగి సుఖించు!

ఓరామ! యిది రహ-స్యోపదేశంబు,
సారంబుగా నెంచు - స్వాంతమం' దనుచుఁ

దెఱ గొప్ప నీద్విస్థి-తి ప్రకరణము
కరుణను విజయ - రాఘవునకుఁ దెలియ

నా వసిష్ఠుఁడు చెప్పె - ననుచు వాల్మీకి
ప్రావీణ్యశాలి భ-రద్వాజ మునికి

మనము రంజిలఁ జాల - మన్నించి పొసఁగ
వినిపించె నత్యంత - విశదంబుగాను.

## * ప్రకరణాంతద్విపద *

ఇది సోమనాథ వి-శ్వేశ్వర దివ్య
పదపద్మ భక్త సు-బ్రహ్మణ్యయోగి

చరణాంబుజాత ష-ట్చరణాయమాన
పరిపూర్ణ నిత్య స-ద్భావ నిమగ్న

మానసాంబుజ వెంగ-మాంబికా రచిత
మై, నిత్యమై, సత్య-మై, ధన్యమైన

సామార్థ సార సు-జ్ఞాన వాసిష్ఠ
రామాయణం బను - రమ్యసద్ద్విపద

యం దెన్నగా ద్వితీ-యప్రకరణము
అందమై విమలమో-క్షాకరం బగుచు

శ్రీతరిగొండ నృ-సింహుం డనంగ
ఖ్యాతిగా వెలయు వేం-కటరాయ! నీదు

పదయుగళికి సమ-ర్పణ మయ్యె; దీని
సదమలులై వ్రాసి - చదివిన, వినిన

నరులు తాపత్రయా-ర్ణవము తరించి,
పరమైన నిర్వాణ - పదము నొందుదురు.

భూచక్రమున నిది - పురుషార్థ మగుచు
నాచంద్ర తారార్క-మై యుండుఁగాత!

## -: ద్వితీయప్రకరణము సమాప్తము :-

## * తృతీయ ప్రకరణము *

శ్రీతారకోల్లాస! - శేషాద్రివాస!
శ్రీతరిగొండ నృ-సింహ ! ధూతాంహ!

విన్నవించెద నది - వినుము వాల్మీకి
పన్నుఁగాఁ [1]దెల్పిన - పరతత్త్వ సరణిఁ

దగ విని యాభర-ద్వాజుండు పొసఁగ
మగుడి యి ట్లనియె రా-మక్షితీంద్రునకు

'నవల వసిష్ఠసం-యమి మఱియేమి
వివరించి చెప్పె నో - విమలాత్మ?' యనిన

మెఱసిన దయను వా-ల్మీకి యి ట్లనియె:
'వరగుణయుత! భర-ద్వాజ! రాఘవునిఁ

జూచి వసిష్ఠుఁ డ-చ్చుగ నిట్టు లనియె:
'ఈ చరాచర విశ్వ-మెల్ల మనంబు

చేతఁ గల్పితమై ప్ర-సిద్ధమౌ సరణి
ఖ్యాతిగా వింటివి - గద రామచంద్ర!

నలువొప్ప నుపశమ-న ప్రకరణముఁ
దెలిపెద నెట్లన్నఁ - దేటగా వినుము!

### * జనకోపాఖ్యానము *

జనక భూమిభుఁడు - రాజ్యంబు సేయుచును
మనమున మోక్ష ధ-ర్మంబును మఱచి

చరియించు నపుడు వ-సంతకాలంబు
సరసమై రాఁగ, నా-జననాయకుండు

ఒకనాఁటి నడిరేయి - నుల్లాస మెసఁగఁ
బ్రకటంబుగా నిజబలములఁ గూడి,

1. జెప్పిన - వేం.

వనవిహారముఁ జేసి - వచ్చుచుండఁగను,
ఘనతమాల మహీ జ-గణమధ్య మందు

సిద్ధపురుషులు భా-షింపుచుండఁగను
సద్ధర్మరతుఁడైన - జనకుఁ డచ్చటికి

నరుగ, నదృశ్యాంగు-లై వారు తమలో
పరతత్త్వసారాను - భవవాక్యములను

దలఁచి, ప్రస్తావోచి-తంబులుగాను
పలికిరి: మఱి యందుఁ - బ్రథమసిద్ధుండు

'కనఁబడు వస్తువుల్ - గనుచున్న వాని
ఘనయోగమున నాత్మ - ఖండంబు గాక,

యమలమై నిశ్చల-మగునట్టి జ్ఞాన
మమర భావింతు మ-దంతరంగమున,

నదియుఁగాక యభీష్ట-మగు పదార్థంబు
విదితమై యబ్బిన - వేళ జనించు

నానంద మరయ బ్రహ్మా-నంద మనుచు,
దాని భజింతు సి-ద్ధంబుగా' ననుచుఁ

దెలివిగాఁ బల్కెఁ; ద్వి-తీయ సిద్ధుండు
'సలలిత ద్రష్టృ, ద-ర్శన, దృశ్యములను,

దద్వాసనలను సి-ద్ధంబుగాఁ బాసి,
విద్వన్నుతంబునై - విమలంబు నగుచుఁ

తనివి నిచ్చుచు, నాది - దర్శనాభాస
మన నొప్పు నాత్మ నే - ననిశంబు దలఁతు;

నదరారఁ గలదు లే-దను పక్షయుగము
నడుమ వసించి, ని-ర్ణయముగా నన్ని

చెదరక పొడగానఁ - జేయుచునుండు
నది యెద్ది, దాని నే - నాత్మ భావింతు;

సాకార మనియు, ని-రాకార మనియు,
నాకట శూన్యంబు - నని నిశ్చయించు

జన మతంబులను ని-శ్చయముగా విడిచి,
యనఘ సద్రూప చి-దాకాశ మెద్ది?

దాని నే నని చూతుఁ - దప్పక' యనుచు
నానిర్మలుఁడు పల్కె;- నవలఁ దృతీయ

సిద్ధుండు తనలోనఁ - జింతించి 'పరమ
సిద్ధాంత మైనట్టి - చిద్వస్తు వొకటి

వెలుఁగు, నవ్వెలుఁగులో - వెలుఁగు కన్వెలుఁగు
నలరి నేను దలంతు - నంతరంగమున

నడరార' నని పల్కె; - నావల మఱియుఁ
దొడరి చతుర్థ సి-ద్ధుఁడు 'పరమాత్మ

తనువులయం దీ వి-ధంబుగా నిలిచి
కనిపింపుచుండఁగాఁ-గానక వేఱె

దేవుళ్ల వెదకుచుఁ - దిరిగెడి మనుజు
లే విధంబునఁ దరి-యింతురో?' యనుచుఁ

బలికె; నీనలుగురి - పలుకు లాలించి,
కలఁక నొందుచు జన - కక్షితీశ్వరుఁడు

తనమదిలోఁ దానె - తలఁచె ని ట్లనుచు
'ఘనతర మోక్షమా-ర్గంబును మఱచి

యుంటి; నిక్కడ సిద్ధు-లుపదేశ మిచ్చి
రొంటిగా నొకవస్తు - వున్నది యనుచు,

నా వస్తు వేను మ-దంతరంగమున
భావించి నిర్వాణ - పదము నొందెదను.

అక్కట! దేహేంద్రి-యాది ప్రపంచ
మెక్కడ వచ్చె? నా - కిది యేల నింక?'

నని యాత్మయందె మ-హావిరాగంబు
పెనఁగొనుచుండఁగా - భేదంబు మఱచి,

తాను నందొక కొంత - తడవు సమాధి
గా నుండి, తనుఁ దాను - గని లేచి, మరలఁ

బురిఁ జేరి, సుజ్ఞాన - పూర్ణుఁడై, రాజ్య
మిరవు, నాసక్తి లే - కేలుచు, నన్ని

పనులందు నిర్లేప - భావుఁడై, దినము
లనువొంద నడిపించు - నాదిత్యు కరణి

నదర నిర్లేపుఁడై - యఖిలకార్యముల
నడిపించుచుండె నా - నరనాయకుండు.

పరువడి నాకాశ - ఫలపాకసరణి
నెఱుక నొందుచు మిథి-లేంద్రుఁ డెల్లపుడు

మహిని నహంకార - మమకారములను
సహజంబుగా వీడి - సమచిత్తుఁ డయ్యె;'

నన విని శ్రీరాముఁ-డమ్మునీశ్వరునిఁ
గని యిట్టు లనె 'నహం-కార గుణంబు

విడుచుట కష్ట మీ - వివిధ దేహములు
పడి నాశ మొందిన-ప్పటి కీయహంత

మొనసూప కణఁగునేమో కాని, తనువు
లొనరుచుండినయప్పు - డుండక చనునె?'

యని రాఘవుఁడు సంశ-యము నొంది పలుక,
విని మునీంద్రుఁడు రామ-విభున కి ట్లనియె:

'అనఘాత్మ! విను ధేయ - మన, నేయ మనఁగఁ
దనరారు రెండు వి-ధముల వె ట్లనిన

ఈ పదార్థములు నా-కిష్టంబు లనక,
యా పదార్థంబులం - దాసక్తి విడిచి,

తా నూరకే చేయఁ-దగు పను లెల్ల
మానక సేయుచు - మమత వర్జించి,

సమబుద్ధిచే సర్వ - శాంతుఁడై యున్న
నమరు ధేయ త్యాగ - మగు, నవ్విధంబు

నెనవుగా సర్వంబు - నే నను బుద్ధి
జనియింప సకల వా-సనలు లయించు.

స్వాంతబుతో దేహ - సంబంధ మెడలు
నంత నా విధము నే - య త్యాగ మగును.

కాయ మే నను నహం-కార వాసనల
నే యెడలను పొంద - కిల విసర్జించి,

కర్మవాసనలను - కడముట్ట విడిచి,
నిర్మలస్వాంతుఁడై - నిఖిల మే ననుచు

నచలాత్ముఁ డగుట నే-యత్యాగ మగును.
ప్రచుర నేయత్యాగ - భావన నొంది,

సంపూర్ణదృష్టిచే - సర్వ మీ వగుచు
నింపుమీఱ సుఖింపు - మినకులోత్తంస!

వెలికార్యములయందు - వివిధ కర్తృత్వ
ముల నొంది నడుపు మి-మ్ముగ రాజ్యపదము,

అనిశ మాంతర్యంబు - నందుఁ గర్తృత్వ
మున నొంద కానంద-మును బొందుచుండు;

మెలపుగాఁ గొందఱు - మిత్రు లటంచు,
చలముతోఁ గొందఱు - శత్రులటంచుఁ

దలఁపక, వస్తు స-త్తను విచారించి,
యలరి బంధువు లంద-ఱంచు భావించి,

కలఁత నొందక సదా - ఖండభావమునఁ
జెలఁగుచు, సంతోష - చిత్తుండ వగుము;

తొడరు నహంకృతి - దుఃఖంబు, దాని
విడుచుటే సుఖ, మింక - విను మొక్క సరణి

## * పుణ్యపావనోపాఖ్యానము *

ధరణిఁ బూర్వము దీర్ఘ-తముఁ డను మౌని
వరసుతుల్ పుణ్య, పా-వను లనఁ గలరు;

అం దగ్రజుఁడు పుణ్యుఁ - డమల విజ్ఞాని
సందడిం బడక సం-సారంబు విడిచి,

లలితుఁడై విజన స్థ-లమున సమాధి
సలుపుచుండఁగ, వాని - జనకుండు కాల

గతి నొంది పడిపోవఁ - గాఁ, బావనుండు
మతిని దుఃఖించి, బ్రా-హ్మణులతో నందుఁ

దనతండ్రి కటఁజేయఁ - దగు క్రియల్ చేసి,
జనకున కేడ్చి య-చ్చట నిల్వ కరిగి,

యన్నను వెదకుచు - నడవిలోఁ దిరుగు
చున్న, నందొక చోట - నుండి పుణ్యుండు

కనఁబడఁగాఁ జూచి , - కనలి పావనుఁడు
తన తండ్రిఁ బేర్కొని - ధరణిపై వ్రాలి,

పొరలి యేడ్వఁగఁ జూచి, - పుణ్యుండు వచ్చి,
కరుణమీఱఁగ రెండు - కరముల వానిఁ

గుదురుగాఁ దా నెత్తి - కూర్చుండఁ బెట్టి,
వదనంబు నిమిరి, య-వ్వల నిట్టు లనియె:

'తమ్ముడా! నీ విందుఁ - దండ్రినిఁ దలఁచి,
యిమ్మాడ్కి నేడ్చిన - నిచటికి మరల

వచ్చునే? యమ్మహా - వర తపోధనుఁడు
హెచ్చు బోధస్థితి - నిరవుగాఁ బొందె;

నతని శరీరంబు - నాత్మలోఁ దలఁచి
మతిఁజెడ నీ వేడ్చు - మాత్రమే కాని,

యిందున సుఖము లే-దించు కంతైన,
నెందఱు తలిదండ్రు - లీవఱ దనుకఁ

గలి గేగిరో? వారి - గణుతింపఁదరమె?
తెలివినొం, దేడ్వక - ధీరత్వ మెసఁగ

విను! మహంకృతి చేత - విస్తీర్ణమగుచు
మొనసెడి మోహ - సముద్రంబులోను

సొలయ కెప్పుడు శుభా - శుభ సుఖదుఃఖ
ములు ఫేన బుద్బుదం-బులమాడ్కిఁ బొడము,

చెదరెడి మరుమరీ-చికయందు జలము
కదలుచున్నటు దోఁచి, కడపట మిథ్య

యగునట్టి భ్రాంతి కి-ట్లగపడి నీవు
పొగుల నేటికి? శాంతిఁ - బొందు రక్తాస్థి

కలితమైనట్టి యీ - ఘటపంజరమున
నిలుచుటె? ట్లని, దాని - నిరసించుకొనుచు,

ననిశంబు నీవు నే - నను భేదబుద్ధి
నెనయక, యంతట - నెఱుక పూర్ణముగ

నిండియున్నది, యదే - నీ వని తలఁపు
చుండు! వివేకివై - యుపశాంతిఁ బొందు!

మొదటి యహంకార-మున మమకార
ముదయింపుచుండుఁ గా-వున నవి నీవు

విడువు' మటన్న వి-వేకంబు లేక
యడలుచు నుండఁగా, - ననుజునిఁ జూచి

పలికె నాపుణ్యుఁ'డో పావన! యిపుడు
గలిగి పోయిన తండ్రి - కాయంబుఁ దలఁచి

మొనసి యేడ్చిన రీతి - మును జన్మ జన్మ
మునఁ గని పెంచి నీ - ముచ్చటఁ జూచి

ధర వ్రాలిపోయిన - తల్లిదండ్రులకుఁ
బొరిని నీ వేడ్వు మి-ప్వ డదెట్టు లనిన,

నొక యద్రిశృంగ మం-దొక సింహమునకుఁ
బ్రకటంబుగా నీవు - ప్రభవించినావు,

పొలుపగు దాశార్ణ - భూతలమందుఁ
దెలివి లే కీవు కోఁ-తికిఁ బుట్టినావు,

సరవిఁ దుషార దే-శమున భూపతికి
నరుదుగాఁ బుత్రుండ-వై పుట్టినావు,

అల పౌండ్రదేశంబునం-దటమీఁద
నలువొప్పఁ గాకంబు-నకుఁ బుట్టినావు,

పొలుపొంద హైహయం-బున మదదంతి
కలరి నీ వేనుఁగు-వై పుట్టినావు,

కరఁగుచు నవలఁ ద్రి-గర్త దేశమున
నురుఖరగర్భమం-దుదయించినావు,

సురఘుం డనెడు వాని - సుతుఁడవై పుట్టి,
యిరవొంద సాళ్వ భూ-మేలు చుండితివి.

కటకటా! యి ట్లనే-క శరీరములను
పటు వేగమున నీవు - పక్షిచందమున

సంచరించితి వట్టి - జననీజనకుల
నెంచి, నీ వీతండ్రి-కేడ్చినరీతి

వారికి నేడ్వఁగా - వలదె? యజ్ఞాన
మీరీతి విడువలే - వే మందు నిన్ను?

ధరణిఁ బూరుషునకుఁ - దల్లిదండ్రులును
బొరి ననంతంబులు - పొలసి పోవుదురు,

మురువొప్ప వన పత్ర-ములు రాలిపోవు
కరణి వ్రాలుచునుండుఁ - గాయముల్ పెక్కు,

లీ తల్లిదండ్రులు, - నీ బంధు మిత్రు,
లీ తనువులుఁ జూడ - నెపుడు శాశ్వతమె?

నీవు శోకింపకు! - నెమ్మది నొంది
పావన! విను మింకఁ - బరతత్త్వ సరణి,

మొనసిన యజ్ఞాన-మునఁ బుట్టు శోక
మును దత్త్వ విజ్ఞాన-మున నివారించు

మది నహంభావంబు - మానిన, శోక
ముదయింప కణఁగి పో-వుచునుండు, మేను

నే ననునది మాని, - నే నను తెలివి
నే నని భావించి, - నిను నీవు చూడు'

మౌని పెక్కు విధముల - నాత్మతత్త్వంబుఁ
బనిఁబూని పుణ్యుండు - పట్టి చెప్పినను,

విని, పావనుఁడు తెలి-విని బొంది, యవలఁ
దనుఁ దాను భావించి - తత్త్వ విజ్ఞాన

కలితుఁడై, సకల దుః-ఖంబుల మఱచి,
యలఘు జీవన్ముక్తుఁ-డయ్యె' నటంచు

వరుసగాఁ బుణ్య పా-వనుల వృత్తాంత
మెఱిఁగించి, క్రమ్మఱ - ని ట్లనె మౌని

'యో రామ! విను ధర - నొక్క రొక్కరికి
సారసత్పుణ్యాతి - శయమున విషయ

వాసన లణఁగు, స-ర్వవిరక్తి గలుగు;

## * బలి ఉపాఖ్యానము *

నీ సరణిని మఱి - యితిహాస మొకటి

పనిఁబూని విను! - తొల్లి బలిచక్రవర్తి
పనుపడ ధాత్రినిఁ - బదికోట్ల యేండ్లు

పాలించి, యట పుణ్య - ఫలపరిపాక
కాలంబు రాఁగ, భో-గములను రోసి,

వరుసగాఁ దనకుఁ బూ-ర్వము తనతండ్రి
యెఱుకకై యుపదేశ - మిచ్చిన వాక్య

సరణిఁ దలంచి, య-చ్చట నుండి పోయి,
సరసాత్ముఁడగు నిజ - జనకునిఁ జేరి,

పాదపద్మములకు - భక్తితో మ్రొక్కి,
వేదాంత సూక్తుల - వినఁగోరి పలికె:

'జనక! యీ సుఖదుఃఖ - జాలముల్ పొడమ
ననిశంబు మూలమై-నట్టి దేశంబు

ఏది? యవిద్య, నీ - యీషణ త్రయము
నాదరణము సేయ - కణఁప విశ్రాంతి

పుట్టెడిచో టెద్ది? - భూరి సత్కరుణ
నట్టి చందంబు నా - కానతిం'డనిన

విని, విరోచనుఁ డతి - విశ్వాస మొదవఁ
దనసుతు నీక్షించి - తగ నిట్టు లనియెఁ:

'గొడుక! చిదాకాశ - కోణకోటరము
కడువింత యగుచుఁ బ్ర - కాశింపుచుండు,

నందు బ్రహ్మాండ కో-ట్లణఁగి వర్తించు,
నం దెన్న భూతంబు - లైదును లేవు,

అచటఁ దేజోమయుఁ - డాఢ్యుఁ, డవ్యయుఁడు,
సుచరిత్రుఁడైన రా-జు వెలుఁగుచుండు,

నతనిని యుక్తిచే - నఖిలకార్యముల
హిత మొప్పఁగాఁ బెంప, - హెచ్చింపఁ ద్రుంపఁ

గా నేర్చినటువంటి - ఘనమంత్రివరుఁడు
పూని యం దుండు నె-ప్పు'డటంచుఁ దెలుప,

నల బలి పల్కె ని-ట్లనుచు 'నో జనక!
కలకాల మలఘు ప్ర-కాశమై మించి,

వెలసి యాధివ్యాధి - విరహితం బగుచు
నలరు దేశం బెద్ది? - యది యెట్టి దరయఁ?

జెచ్చెర నేమిటి - చే నందుఁ బొంద
వచ్చు? నానృపుఁ డెట్టి - వాఁడు? తన్మంత్రి

యనెడు ధీరుం డెవ్వ? - డానతిం'డనఁగ
నెనసి విరోచనుం - డి ట్లని పలికె:

అనఘాత్మ! యొక దేశ - మనుటయే కాని,
ఘనతరంబైన మో-క్షస్థాన మదియె,

భూరిసద్గుణ పరి-పూర్ణుఁ డవ్యయుఁడు
నా రా జనఁగఁ బర-మాత్ముఁ, డా ఘనుని

వరమంత్రి చిత్త, మీ - వ్యాపారగతినిఁ
దఱచుగా నింద్రి యా-ర్థములఁ బాలించు,

నరుదుగా నంతటి - కధికారి యగుచు,
నఱిముఱి నెవరి యం-దా పరమాత్మ

కడఁజేరనియక మా-ర్గంబున కడ్డ
పడి యావరించి, ప్ర-పంచమం దుండు,

నతని గెల్వక, నప్ప-రాత్మునిఁజేర
సతత మెవ్వరికిని - శక్యంబు గాదు;

గానఁ జిత్తమును త-క్కక గెల్వవలయు,
నానియమం బిప్పు - డమరఁ జెప్పెదను

విను విరాగంబు, వి-వేకంబు, శాంత
మును, బరమజ్ఞాన-మును గల్గెనేని

చిత్త శాత్రవునిఁ ద్రుం-చి పరాత్మచెంత
నత్తఱిఁ జేరుదు - లార్యు, లీయుక్తిఁ

దప్ప నేమిటను జి-త్తము గెల్వఁ గూడ,
దిప్పరమరహస్య - మెఱిఁగి వర్తింపు!

బలి! విను ధరణి న - ప్రాజ్ఞుం డనంగ,
నలరు నల్ప ప్రాజ్ఞుఁ-డనఁ, బ్రాజ్ఞుఁ డనఁగ

మువ్వురు గల; రందు - మొనసి యప్రాజ్ఞుఁ
డెవ్వేళలను విష-యేంద్రియసుఖము

మరగి వర్తించు, స-న్మార్గంబునందుఁ
జొరక, విరక్తులన్ - జూచి హసించుఁ,

దలఁపున శాస్త్ర చిం-తన మొకపాలు
గలుగఁగా నంతలో - గర్వింపుచుండు,

వాని చిత్తము కర్మ - వాసనచేత
నూనదు మోక్షేచ్ఛ - నొకవేళ నైన,

నమర నల్పప్రాజ్ఞుఁ - డగు వాఁడు ధనము
విమలుఁడై కూర్చుచు - విద్వజ్జనులకు

వరుసగా నొసఁగుచు, - వారి సాంగత్య
మిరవుగాఁ జేయుచు, - నింద్రియ విషయ

సరణుల రోయుచు, - సాధు మార్గముల
నెఱుఁగుచు, మోక్షేచ్ఛ - నెనయుచుఁ, గ్రమము

గా తత్త్వ విజ్ఞాన - కలితాత్ముఁడగుచు
నాతత మోక్షార్హుఁ - డగును నానాఁట;

నతులిత ప్రాజ్ఞుఁడై - నటువంటి పురుషుఁ
డతిశయుఁ డన నొప్పు, - నతఁడు చిత్తమునఁ

దలఁచిన యంతనే - తాను వైరాగ్య
కలితుఁడై, సకలభో-గముల వర్జించి,

గొనకొని సద్ధ్యాన - గురుపూజలందు
మొనయుచు వర్తించి - మోక్షంబు నొందు'

నని తత్త్వవిజ్ఞాన - మావిరోచనుఁడు
వినిపింపఁగా, బలి - విని సమ్మతించి,

యచట నున్నట్టి శు-క్రాచార్యుఁ జూచి,
ప్రచురభక్తిని మ్రొక్కి - పలికె 'నో గురుఁడ!

నే నన నెవ్వండు? - నీ వన నెవఁడు?
ఈ నిఖిలం బెట్టి? - దెఱిఁగింపుఁ' డనఁగ

నక్కడ బలికి శు-క్రాచార్యుఁ డనియె:
నెక్కువ మాటల - కిది వేళగాదు,

అతివేగమున దివి - కరుగంగ వలయు,
హితమొప్ప మును పెద్ద-లెల్ల శోధించి

మిక్కుటంబుగఁ గని - మెచ్చుకొన్నట్టి
నిక్కంబు విను రజ-నీ చరాధీశ!

యొక్కయుక్తినిఁ దత్త్వ - మున్నంత నీకుఁ
జక్కఁగాఁ జెప్పెద - సర్వంబు నందుఁ

జిక్కి చిక్కక యుండుఁ - జిన్మాత్ర మంత
కెక్కువ యగువస్తు - వెక్కడ లేదు;

అదియె నీవును, నేను, - నఖిలవిశ్వంబు.
ఇది యథార్థము సంశ-యింపకు మీవు;

ఇది నిశ్చయింపక - యెల్ల మార్గములఁ
జెదరిపోయిన వాఁడు - చేసిన వెల్ల

విరివిగా బూదిలో - వ్రేల్చు హవిస్సు
కరణినిఁ బడిపోవు, - గతి నియ్య దనఘ!

కదిసిన చిచ్చేద్య - కలితుఁడు బద్ధుఁ,
డది మాని తనుఁ జూచు - నతఁడు ముక్తుండు;

కావున సతత మ-ఖండ భావమున
నీవు నిన్ గనుఁగొంచు - నెమ్మది నుండు!'

మని చెప్పి దివమున - కరిగె శుక్రుండు.
దను జేశ్వరుండు త-త్త్వ జ్ఞాన నిష్ఠ

మఱువక ప్రణవార్థ - మంత్రంబులోని
గురుతరార్థంబు ని-క్కువను దా నెఱిఁగి

గతకర్ముఁడై నిర్వి-కార భావమున
జిత చైత్య చేతక - చేతనుం డగుచు,

విలసిత శాంతుఁడై - విశ్రాంతిఁ బొంది,
తలఁపుచుండెడి వానిఁ, - దలఁపును, దలఁపఁ

బడువానిఁ దా నెడఁ-బాసి యేకముగఁ
గడలేని నిర్వాణ - గతి నొందె' ననుచు

బలియుపాఖ్యాన మే-ర్పడ రాఘవునకుఁ
జెలువొప్పఁ జెప్పి వ-సిష్ఠుండు మరలఁ

బలికె ని ట్లని ' యిట్టి - పరమవిజ్ఞాన
మల యీశ్వరాను గ్ర-హంబుచేఁగాని

యెవరికిని లభింప - దీయర్థమందుఁ.

* ప్రహ్లాదోపాఖ్యానము *

బ్రవిమలుఁడై నట్టి - ప్రహ్లాదుఁ డాత్మఁ

దాను విచారించి, - తనుఁ దాను దెలియు
టేను చెప్పెద నది - యె ట్లన్న వినుము!

హరిభక్తుఁడైన ప్ర-హ్లాదుఁ డాచక్రి
నఱలేక సంతత - మర్చింపుచుండి,

'పరమాత్మ విశ్రాంతి - పర్యంతమైన
పరమవిచారంబుఁ - బరముగా నాత్మ

యెనయఁ బ్రకాశించు-నే యెల్ల యెడల',
నని నాకు బోధించె - నంబుజాక్షుండు;

అది యెట్టిదో? నేను - నరయ నెవ్వఁడనొ?
పదపడి సృష్టి వి-భ్రమము నెట్టిదియొ?

ఏది యంగీకార? - మెయ్యది కృత్య?
మేది నేఁ దెలియుదు? - నెక్కడఁ బోదు?

నడర భావింప నీ - యఖిల భూతములు
జడములే కాని, య-జడములు గావు,

కావున నిది యాత్మ - గాదు, నా కన్య
మీ విశ్వ మని మది - నెఱుగంగ వలయుఁ,

బొరి జడం బనిల వి-స్ఫురణ, మనిత్య
మరసి భావించిన - నసదుద్భవంబు

గాన, దేహంబు ని-క్కంబుగా నేను
గాను, నే నెవఁ డనో - గణుతించి చూడఁ?

బసమించునట్టి శ-బ్ద, స్పర్శ, రూప,
రస, గంధ, గుణము లా-రయ నేను గాను,

అల మనో బుద్ధి చి-త్తా హంకృతులును
నెలవుగా భావింప - నే నవి గాను;

ఎఱుకయై యన్నిటి - నెఱుఁగుచు నుండు
సురచిర చిత్పూరు-షుండను నేను,

భావింపఁగా సర్వ - పరిపూర్ణ మగుచుఁ
దావలంబుగఁ బర-తత్వంబు నేను,

నాపరతత్త్వ మం - దఖిలేంద్రియములు
దీపింపు జగములు - దీపించుచుండు,

నల పరబ్రహ్మ మే-నైనందు వలన
నలువొప్పఁగా నేను - నా మానసమున

నాకు మ్రొక్కెదఁ జిదా - నంద స్వరూప!
శ్రీకరానంతాత్మ ! - చిరకాలమునకు

నీవు నే నైతిని - నేను నీవైతి,
వీ విధంబున భేద - మించుక లేదు,

గనుక నే నాకు మ్రొ-క్కందగుఁగాన,
మొనసి నాకే నేను - మ్రొక్కెద ననుచుఁ,

దనలోనె భాషించి, - తనుఁ దానె మఱచి,
పనుపడ నిర్విక-ల్ప సమాధియందు

నచలుఁడై పంచస-హస్ర వత్సరములు
లుచిత వృత్తిని నిల్చి యుండె, నంతటను

ప్రాకటంబుగ రాజ్య - పరిపాలనంబు
లే కుండినందున, - లేచి చోరకులు

లోఁగక పాతాళ - లోకంబుఁ జెఱుప
సాగిరి, ధర్మంబు - సమసె నానాఁట,

నావిధం బెఱిఁగి మ-హాను భావుండు
శ్రీవిష్ణు దేవుండు - చిరకృప మీఱఁ

బక్షివాహన మెక్కి-ప్రహ్లాదు చెంత
కక్షీణతేజోమ - యాంగుఁడై వచ్చి

కదలక మెదలక - ఖండ సమాధి
వదలని ప్రహ్లాదు - వరనిష్ఠఁ జూచి,

ప్రేమతో జలద గం-భీర భాషలను
వే మాఱుఁ బిలిచిన, - విని లేవకున్న,

హరి దిశల్ ఘూర్ణిల్ల - నలఘు శంఖంబు
పొరిఁబొరి వరుసగాఁ - బూరింపు చుండె;

సరసమై శ్రీ స్వామి - శంఖారవంబు
విరివిగాఁ బ్రహ్లాదు - వీనులలోనఁ

జొచ్చి మేల్కొల్పఁగా - సూక్ష్మలక్ష్యంబు
నచ్చట విడిచి, ప్ర-హ్లాదుండు చక్రి

చాలఁ బూరించెడి - శంఖారవంబు
మేలిమిగా విని - మేఘనాదంబు

విని చొక్కు ఘనకేకి - విధమునఁ జొక్కి,
ఘనుఁడైన హరి నర - గన్నులఁ జూచి,

యప్పటికైన దే-హస్మరణంబు
తెప్పున రాకున్నఁ - దెలిసి మాధవుఁడు

తనలోనె నగుచు న-త్తఱినిఁ బ్రహ్లాదు
కనుదోయి నిమురుచుఁ - గరుణ ని ట్లనియె:

'ఇదియేమి బాలక? - యేను ని న్నిందుఁ
బదపడి పిలిచినఁ - బలుక కున్నావు'

ననుఁ జూడు ననుఁ జూడు - నాదిక్కుఁ జూడు'
మని బుజ్జగింపఁ, బ్ర-హ్లాదుండు కనులు

చక్కఁగాఁ దెఱచి యా - స్వామినిఁ జూచి,
మ్రొక్కి, కరంబులు - మొగిచినిల్చినను,

సంతోషమునఁ జూచి - చక్రాయుధుండు
వింతగా నతనిఁ దా - వీక్షించి పలికె:

'దనుజనాయక! నీవు - తనువు నలంపఁ
బనిలేదు, నీ వతి - ప్రజ్ఞ దీపింపఁ

బట్ట భద్రుండవై - పాతాళ లోక
మిట్టట్టు చెదరిపో - కేలుచునుండు !

గతనేయ హేయ సం-కల్పుఁడ వగుచు
హిత మొప్ప నిన్ను నీ-వెఱిఁగిన వెనుక

నీమేను కలిమిలే - మెంత మాత్రంబు?
కామాది శత్రువ-ర్గంబు నణంచి,

నీవు జీవన్ముక్తి- నియతినిఁ దనువు
తో విమలుండవై - తుదముట్టఁగాను

నరమర లేక క-ల్పాంత పర్యంత
మిరవొంద నీ రాజ్య - మేలుచునుండు!

మిను లొక్క మాటు ప-న్నిద్దఱుఁ బొడమ,
రనుపమ శైలంబు - లణఁగ వొక్కటను,

జగము లన్నియు నొక్క - సమయంబునంద
పొగిలి నశింపవు - పుణ్యాత్మ! నీవు

ఘటము నింత నలంపఁ-గారణం బేమి?
ఇట మీఁద విషయంబు, - లింద్రియంబులును

జొరఁబడి వేధించు - సుఖదుఃఖములును,
గర మనురాగంబు, - కర్మవాసనలు,

నిరతంబు బొంకించి - ని న్నంటకుండు
వరము లిచ్చితి లెమ్ము - వత్స! నీ వింక,

అళుకుచు మూఢుండ - నని తనుఁ దాను
తెలియక యూరకే - దీనుండ ననుచుఁ

బామరుండగు వాఁడు - బ్రతుకుట కన్న
భూమి మీఁద నణంగి - పోవుట లెస్స;

పటుతరాశాపాశ - బద్ధుఁడై చిత్త
మటునిటు నీడ్వఁగా - నలమటంబడుచు

ధర శమం బొందక - తామసుండైన
పురుషుఁ డుండుట కన్నఁ - బోవుట మేలు;

దనుజేంద్ర! సర్వభూత స-ముండు నగుచుఁ
దనివొంద నాత్మబో - ధనిమగ్నుఁ డగుచుఁ

దొడరు నహంకార - దూరుఁడై శాంతి
నెడఁబాయ కెల్లపు - డెఱుకతో నుండు

విమలచిత్తునకు జీ-విత మొప్పు నిలను,
భ్రమల నెల్ల నణంచి - బ్రహ్మానుభవము

సేయుచుండెడి నీకుఁ - జింత యేమిటికిఁ?
బాయక నీ రాజ్య - పదముఁ బాలింపు'

మని యొప్పఁ జెప్పి, ప-ద్మాక్షుండు కృపను
పనిఁ బూని యతనికిఁ - బట్టంబు గట్టి,

యొనరంగ సఖియింపు - చుండు' మటంచు
దనుజారి యవల నం-తర్ధాన మొందె.

అన విని శ్రీరాముఁ - డపుడా వసిష్ఠ
మునిని వీక్షించి యి-మ్ముగ నిట్టు లనియె:

'పనుపడి యత్యంత - పరిణతంబైన
దనుజాధివిభుని చి-త్తము పాంచజన్య

ఘనరవం బెసఁగ నే - కరణి మేల్కొనియె?'
నన వసిష్ఠుం డిట్టు - లనె 'రామ! వినుము

ధర నది యెట్లన్న - దగ్ధ బీజంబు
కరణి జన్మాంకుర - కారిణిగాక,

వరయోగి విమల హృ-ద్వనజంబునందు
సరసమై శుద్ధవా-సన గల్గియుండు,;

నది పావనియు, నది - యధ్యాత్మవతియుఁ,
బొదువగు నిత్య ప్ర-బుద్ధయై పొసఁగి,

మొనసి యనేకాబ్ద - ములకై నఁ జెడక,
యెనసి తత్తను వాశ్ర-యించి, యొక్కొక్క

కాలంబు నందుఁ బ్ర-కాశించి, బాహ్య
మాలోకనము సేయ - నాకరం బగుచు,

విలసితమైన సం - విత్తత్త్వపటిమ
తెలివిగా వృద్ధిఁ బొం-దింపుచునుండుఁ

గావునఁ జక్రిశం-ఖనినాద మెరిగి,
యావేళ మేల్కాంచె - నసురనాయకుఁడు.

అనఘ! సంసారమా-యకు నవమాన
మనునది లేదు, ని-త్యముగాదు, లేక

కలిగియున్నటు దోఁచుఁ - గావున, దాని
నలరారు చేతో జ-యంబున నణఁప

వచ్చు, మఱేమిటన్ - వారింపరాదు.
హెచ్చుచునుండు న - దెట్లన్న వినుము!

అరుదుగా లవణు వృ-త్తాంతంబుఁ బూర్వ

## * గాధి ఉపాఖ్యానము *

మరసి చెప్పితి, నిప్పు-డటు వంటి గాధి

చరితంబుఁ జెప్పెదఁ - జక్కఁగాఁ దెలియు;
మురునిష్ఠ నాది దే-వుండైన హరిని

ధ్యానించి గాధి గో-దావరి నీట
పూని యుగ్రతపంబుఁ - బొసఁగఁజేయఁగను,

నతనికిఁ బ్రత్యక్ష-మై చక్రి 'వరము
హితమొప్ప నడుగు నే - నిచ్చెద' ననిన

ముఱియుచు నాగాధి - మ్రొక్కి 'నీ మాయ
నెఱిఁగెడి యావరం - బీవె లక్ష్మీశ!'

యన విని హరి గాధి-కా వర మిచ్చి
చనె, నట కొన్ని వా-సరములు జరిగెఁ;

దదనంతరమున గో-దావరి నీట
ముదముతో నా గాధి - మునిఁగి యచ్చోట

నలువొప్ప నఘమర్ష-ణముఁ జేయు తఱిని
వెలయ గాధికిఁ జిత్త-విస్మృతి పొడమఁ,

దనయింటిలోఁ దన - తనువును వీడి,
చని వేగ హూణ దే-శమునఁ జండాల

భామ గర్భమునందుఁ - బ్రభవించి పెరిఁగి,
యా మీఁదటను బెండ్లి - యాడి, బిడ్డలను

గని పెంచుచుండఁగాఁ - గాల వేగమునఁ
దన బిడ్డ, లిల్లాలు - తనువుల వీడి

చనినట్టి జాలిచే - సైరింపలేక
కనలుచు, నవల న-క్కడనుండ కరిగి

పోయి, తెప్పునఁ గిర-పురిఁ జేరియుండె;
నా యవనీశ్వరుఁ - డచట దేహంబు

పడవైచి చనఁగ, న-ప్పార్థి వేంద్రునకుఁ
గొడుకు లేకున్నఁ, ద-త్కుల మేలుటకును

దగిన వాఁ డెవఁడని - తాము చింతించి,
తెగువ నారాజు మం-త్రి జనంబుఁ గూడి

మొనసి పట్టపుగజ-మును నలంకార
మొనరఁ గావించి, పు-వ్వులదండఁ దొండ

మున నుంచి విడిచి, రి-మ్ముగ నదిపోయి
తనముందరికి వచ్చు - ధరణీసురులను,

వరరాజకులజుల, - వైశ్యశూద్రులను
దఱుముచుఁ జనిచని - తా నొక్క చోట

నాలుబిడ్డలఁ బాసి - యడలు చున్నట్టి
మాలని మెడఁ బుష్ప-మాలిక నుంచె.

నపుడు మంత్రులు మొద-లైనట్టి వారు
కపటంబుఁ దెలియక - గజముపై వాని

నెక్కించుకొని చని - యిలఁ బ్రోవ నతని
నక్కడ తాము ప-ట్టార్హునిఁ జేసి

కొలిచి యుండఁగ, వాఁడు - కొంకింత లేక
చలితాత్ముఁడై రాజ - సతులను గూడి,

పనిఁ బూని వేడ్క నేఁ-బది యేండ్లు రాజ్య
మొనరంగఁ బాలింపు-చుండె నొప్పగను.

అట హూణ దేశంబు - నందుండి మాలఁ
డట కొక్కఁ దరుదెంచి - యా దొరం గాంచి,

తొలఁగక పూర్వ బం-ధుత్వంబు నందుఁ
దెలుపఁగా నెఱిఁగి, మం-త్రి పురోహితాది

మనుజులు దెలిసి, 'యా - మాలనిఁ దెచ్చి
ఘనముగాఁ బట్టంబుఁ - గట్టినకతనఁ

బాప మందఱికినిఁ - బ్రాపించెఁ గనుక,
నీ పాపమును నీఁగ - నిందఱ మగ్ని

యందుఁ బ్రవేశింత' - మని నిశ్చయించి,
యందఱు గుమిగూడి - యగ్నిలోఁ బడిరి.

అదిచూచి చండాలుఁ - డైన యా ప్రభువు
'కొదికి యందఱు తన-కొఱ కగ్నిలోనఁ

బొలిసి పోయిరి, తాము - భూమిలో నుండ
వలయునే' యనుచుఁ బా-వకునితో వాఁడు

తానును దుమికి య-త్తఱిఁ దెలివొంది,
యానీట నున్న దే-హంబుతో లేచి,

'కటకట! యిటువంటి - కష్ట దుర్దశల
కిటువలె లోనైన - దేమొకో? నాల్గు

గడియలలో నింత - కర్మదుఃఖములఁ
బొడఁగంటి, నిట్టి య-ద్భుత మేమి చెలఁగె!

గహనంబులందు వ్యా-ఘ్రము నిజేచ్ఛలను
విహరింపుచుండెడి - విధమున సకల

మానవుల నశక్తి - మాయలోఁ ద్రోసి,
యూని తా భ్రమ పెట్టు-చుండుఁ జిత్తంబు'

అనుచుఁ దలంచి ని-జాశ్రమంబునకుఁ
జని, గాధి చింతించు - సమయంబునందుఁ

బురిని వింతగఁ గీర - పురి నుండి యొక్క
ధరణీసురుఁడు గాధి - దగ్గఱఁ జేరె;

ఆ విప్రవరుఁ జూచి - యా గాధి పూజఁ
గావించె; నటు మీఁద - గమముగాఁ గీర

పురవాసు లందఱుఁ - బొలిసిన విధము
వరుసగాఁ జెప్పిన - వార్త లన్నియును

విని గాధి యది తన - వృత్తాంతముగను
మనమున భావించి, - మఱునాఁడు పోయి,

కరఁగుచుఁ దాఁ గలన్ - గన్న మార్గమున
సరగున హూణ దే-శముఁ బ్రవేశించి,

యచ్చటఁ దల్లియు - నాలు బిడ్డలును
జచ్చినచోట్లు ని-శ్చయముగాఁ జూచి,

పోయి చెచ్చెరఁ గీర - పురమందుఁ జేరి,
యాయెడఁ దనకొఱ - కనలంబులోన

నాపురజను లంద-ఱణఁగుట గాంచి,
తాపమొందుచును వి-ధాతచేఁతకును

గడు వెఱఁనొంది, య-క్కడి నుండి కదలి,
తడయక క్రమ్మఱఁ - దావచ్చి యవలఁ

జెలువార నలసిన - సింగంబు రీతి
నలసి, పూర్వాశ్రమ - మందుండ కరిగి,

తక్కక యొక శైల - తటమందు నిలిచి,
యొక్కఁడౌ విష్ణుదే-వునిఁ గూర్చి తపము

సలుపుచు నుండఁగా - జలజాక్షుఁడతని
కలరారఁ బ్రత్యక్ష-మయ్యె, నాహరినిఁ

గని లేచి నమ్రుఁడై - గాధి తా మ్రొక్కి
మొనసి కరంబులు - మొగిచి యి ట్లనియె:

'ఓ నలినాక్ష! నే - నుదకమధ్యమున
నూని స్నానముఁ జేయు-చుండఁగా నాల్గు

గడియలలో బహు-కాలదుఃఖముల
చెడి తేర కనుభవిం-చిన కర్మ మేమి?

ఈ చిత్త విభ్రమం - బేల జనించె?
నోచక్రి ! తెలుపవే ! - యున్న దున్నటుల'

ననవుడు విని విష్ణుఁ-డా గాధి కనియె:
'వినువిప్ర! నీ వది - విశదంబు గాను

నెలమిని భూమ్యాదు - లీ చిత్తమునకు
వెలిగాక యచటనే - విరివిగా నుండు.

మనమున నవ్విభ్ర-మస్వప్న గతుల
ననుభవించితివి. నీ - వఖిలకృత్యములఁ

దలఁచి కల్పించు చి-త్తమునకుఁ జూడ
నిలను జండాలత్వ - మెందైనఁ గలదె?

శ్వపచత్వ మొందిన - సరణి నీమదికి
విపరీతముగఁ దోఁచు - విధమున, నతిథి

గనిపించె, మఱియు - నక్కడ హూణ దేశ
మునను చండాలత్వ-మునఁ బొంది నీవు

నగమందుఁ జేరి, నా - నాత్మ విభ్రాంతి
తెగువగా విడిచి, య-దే విచారముగఁ

దప మాచరించి త-త్త్వజ్ఞాని యగుచు
నిపుణతచేఁ బొందె - నిర్వాణపదము.

శ్రీహరి ధ్యానంబు - చెడక భక్తులను
మోహాబ్ధి దాఁటించి - ముక్తిఁ బొందించు'

నని, గాధివృత్తాంత - మా వసిష్ఠుండు
మనము రంజిలఁ జెప్పి - మరల ని ట్లనియె:

'ధరణీశ ! రామ! చి-త్తజయౌషధంబు
సరసమై సంసార - జాడ్యంబు నణఁచు;

వేరె వెరవుచేత - విడువ దారోగ,
మారయ వృద్ధియౌ - నటుగాన, నందు

అంటక చిత్తంబు - నణఁచునుపాయ
మొంటిగా నూహింపు - చుండఁగావలయు;

మెలపుగాఁ గ్రిందటి - మీఁదటి కాల
ములఁ గల్గు సుఖదుఃఖ-ములఁ దలంపకయ

మానుచుఁ, దగ వర్త-మాన కాలమునఁ
బూనిక ననుభవం-బునకు వచ్చినది

యనుభవింపుచు బాహ్య-మందు వర్తింపు
చును, నిజాంతర్య భా-సుర లక్ష్యమందుఁ

బొంది సూక్ష్మంబైన - బుద్ధియం దమరఁ
జెందినఁ జిత్తంబు - చిత్పద మొందుఁ;

గ్రమముగా భోగ సం-కల్పముల్ విడిచి,
మమతాహముల మాని, - మది చల్లనైనఁ

జిరతర భావనా - సిద్ధి నీ యాత్మ
నెఱుకకు నెఱుకయై - యింపొందుచుండు;

తొడరెడి చిత్తవృ-త్తులు నశింపకయ
విడువదు సంసార - విభ్రమం బెపుడు.

### * ఉద్దాలకోపాఖ్యానము *

తన రారఁ బూర్వ ము-ద్దాలకుం డనెడు
మునిపుంగవుఁడు చిత్త-మును గనిపట్టి,

పనిఁ బూని శిక్షించి - పరమందుఁ జెందె;
ననిన శ్రీరాముఁ డి-ట్లనె 'మునినాథ!

గొనకొని యుద్దాల-కుఁడు నిజచిత్త
మును గెల్చి సంతోష-మున ముక్తుఁడైన

తెఱఁగు నా కతికృపఁ - దెలుపవే!' యనినఁ
జిఱునవ్వు నవ్వి వ-సిష్ఠుఁ డి ట్లనియె:

'అనఘాత్మ! యుద్దాల - కాఖ్యచే నొప్పు
ముని గంధమాదన-మున కేఁగి, యచట

ఘనతరంబుగ వివే-క స్వాంతుఁ డగుచుఁ
దనలోనఁ దా నిట్లు - దలఁచె 'నంతటికిఁ

బరమ ప్రధానమై - ప్రాప్తమైనట్టి
సరసప్రకాశ మె-చ్చట నుండి చూతు?

నే నెన్నటికి దుఃఖ - నీరధిఁ గడచి,
యానంద మొందుదు?' ననుచుఁ జింతించి,

గ్రక్కున సకల సం-కల్పముల్ విడిచి,
యక్కడఁ బద్మాస - నాసీనుఁ డగుచు

హరినిఁ గుఱించి మ-హా నిష్ఠమీఱఁ
జిరతర తప మొప్పఁ-జేయుచు నుండె;

నప్పు డతని చిత్త - మాధ్యానపటిమ
నెప్పుడో విడిచి తా-నేమేమొ తలఁచి,

క్రోఁతికైవడిఁ దిరు-గుచునుండు టెఱిఁగి,
యా తాపసుఁడు రోష - మగ్గలింపఁగను

ఆ చిత్తమును బట్టి-యంతరంగమున
నా చక్రధరుని పా-దాబ్జంబులందు

నిలిపి బంధించిన, - నిగుడి చిత్తంబు
తలఁపు లేమో తాను - దలఁపుచు, విషయ

వాసనలను గూడి - వర్తించి, మరల
నా సంయమీశ్వరు - నచట వంచించి,

తక్కక పక్షి చం-దమున బాహ్యమున
దిక్కుల నెగురుచుం - దిరుగుచు మించి,

యొకవేళ నభమునం - దుదయార్కు పగిదిఁ
గకవికఁ జేయుచుఁ - గనిపించుచుండు;

నొకవేళ గగన మ -ట్లూరక యుండు,
నొకవేళ శూన్యమౌ, - నొకవేళ నుఱుకు;

నొకవేళ స్థిరముగా - నుండిన ట్లుండు;
నొకవేళ యోజన - లూరకె చేయు;

నీవిధంబున నిల్వ - కెగురు చిత్తమును
భావించి, యచ్చోటుఁ - బాసి యాతపసి

భూమిఁ బరిభ్రమిం - పుచును జరించి,
యా మీఁద నొక్క నాఁ - డందొక దిక్కు

తెరలు చిత్తంబు ను-ద్దేశించి తాను
పరుఁడై వివేకించి - పలికె ని ట్లనుచు:

'అక్కట చిత్తమా ! - హరియందు నిలువ
కెక్క డికో తేర - కేఁగుచున్నావు,

ధరను మాయా సంప-దల విచారించి,
కరఁగి నీవేమి సౌ-ఖ్యముల నొందెదవు?

కామంబు లతిదుఃఖ-కరము లటంచు
ధీమంతులగువారు - తెలిసిన వేళ

నీ ప్రయత్నంబులు - నిరసింతు. రప్పు
డీ ప్రపంచముతోడ - నేఁగెద వీవు,

ఇంతలోన నిట్టి - హింసలఁ బెట్టి
నంతట నీ కేమి - యబ్బె సౌఖ్యంబు?

శాంతామృతముఁ గ్రోలి - సంతసింపకను
వింత వింతలు చూపు - విషయసౌఖ్యముల

మరగి నీ వరుగు టి-మ్మహిని సంతాన
తరు వాశ్రయింప, కా - తపకాలమందు

మరుభూమిలోఁ జైత్ర - మధ్యాహ్నముననుcontributions
చరియింపు చుండెడి - చందంబుగాదె?

మురియుచుఁ బాతాళ-మున నుండు, మింటఁ
దిరుగుచు నుండు మే-తెఱఁగున నైనఁ

దఱుచైన శమనామృ-తంబు గ్రోలకను
దొరకదు నీకు సం - తోష మెందునను,

మొనసిన కల్మిలే-ములు దలంపుచును
పనిఁబూని సుఖదుఃఖ - పరవశత్వమునఁ

జొక్కి స్రుక్కుట మాని - సుస్థిరజ్ఞాన
మొక్కటి సంతోష - మొసఁగు నటంచుఁ

దెలియలే వైతి విం-ద్రియముల కెపుడు
వలనుగా దాసుని-వలె మెలంగుచును,

పరువడిగా శ్రోత్ర - భావంబు నొంది,
మురిసి ఘంటా నాద-మును విని చొక్కి,

యుడుగక వేఁటకా - డొడ్డిన వలను
బడు జింక గతిని లోఁ-బడకువే మనస!

చర్మభావము నొంది - సంస్పర్శ సుఖము
నర్మిలిఁ గోరి మ-హా గజేంద్రుండు

కరిణితో నెరయ న-క్కడఁ బర్వుఁ బాఱి
యరిగి యచ్చటి యోద-మందుఁ దాఁగూలు

కరిణిని సంసార - గహన కూపమునఁ
బరువడి నెఱిదప్పి - పడకువే మనస!

వదలక రసనభా-వము నొంది యెఱ్ఱ
నదిమి మ్రింగెద నంచు - నరిగి, గాలమును

మ్రింగి చచ్చినయట్టి - మీనంబు పగిదిఁ
బొంగుచు రుచిఁ గోరి - పొలయకే మనస!

నేత్రభావము నొంది - నిగుడుచు మీన
నేత్రలు మొదలుగా - నెఱయు దృశ్యముల

యం దాసపడి యగ్ని - నణఁగిన మిడుత
చందంబుగా నీవు - చావకే మనస!

పనుపడి నాసికా-భావంబు నొంది,
ఘన సుగంధముఁ గోరి-కమలమధ్యమునఁ

జెఱయున్న భృంగంబు - చెలువునఁ గర్మ
చిరవాసనలయందుఁ-జిక్కకే మనస!

మెఱయు జింకయుఁ, గరి,-మిడుత, మీనంబు,
నరయఁగా భృంగ మి-ట్లాశలఁ బొంది,

యొక్కటొక్కటిచేత - నొకటొక టణఁగు:
నక్కట! యిటువంటి - యైదింద్రియముల

నెనసియుండంగ నీ-వెటు తరించెదవు?
చెనఁటుల పొందు వ-ర్జింపవే మనస!

అటువంటి వాసన-లన్ని బంధకము,
లిటువంటి రీతుల - నెఱిఁగి, వైరాగ్య

చింతన సతతంబుఁ-జేసిన నీవు
శాంతిఁ బొందెదవు ని-శ్చయముగా మనస!

ఈవఱ కేను ని-న్నెఱుఁగక భ్రమసి,
నీవె నే ననుకొని - నీవు గావించు

పనులు నేఁ జేసిన-పను లంచుఁ దలఁచి,
నిను వేఱుఁగాఁ. జూడ-నేరకుండితిని;

సతతమందున నీవు-శాంతిఁ బొందకను
హితశత్రు వగుచు న-న్నేఁచుచుండితివి.

పరమాత్మ నంతట-భావించి చూచి,
నిరుపమ ప్రజ్ఞతో-నిన్ను మ్రింగెదను;

మఱి కరి మ్రింగిన - మారేడు పండు
కరణి నాలో నీవు - కరఁగి పోయెదవు.

కావున నీవు సం-కల్పముల్ విడిచి,
శ్రీవిష్ణురూపంబుఁ - జెందక మించి,

యవయవకలిత దే-హము న్నాశ్రయించి,
యవిరళంబుగ నాత్మ-యందున్న నిన్నుఁ

గని పట్ట శక్యంబు-గా దెవరికైన,
నని నిక్కుచుంటివా? - హరికటాక్షమునఁ

జిక్కితి విపుడు నా-చేత, బొంకించి,
యెక్కడఁ బోయెద - వింక మీఁదటను?

సకలప్రపంచంబు - సత్తాస్వరూప,
మకలంక, మద్వయ - మని నిశ్చయించి,

యా యాత్మ నే నైన - యప్పుడు వేఱె
నీ యత్నములు సాగు - నే వెఱ్ఱిమనస!

అలరుచు దేహేంద్రి-యములు నే ననుచుఁ
దెలియుచుండెడి తెల్వి - తేటయై తుదను

ఆ పరబ్రహ్మమై - యంతట నిండి,
దీపించు నారీతి - తెలియనీయకను

అజ్ఞానవైరి ని-న్నలమటఁ బెట్టెఁ;
బ్రజ్ఞచే నటువంటి - పాపాత్ముఁ బట్టి,

తునుమాడి యధిక సం-తోషంబు నొంది,
యనిశంబు నీ వాత్మ-యందుండు మనస!

నిన్ను నే నెఱుఁగుదు - నిశ్చయంబుగను,
నన్ను నీ వెఱిఁగిన - నాత్మ విభ్రాంతి

విడువు, మటంచు వి-వేకంబు మదికిఁ
బొడకట్టి, బహువిధం-బుల బోధసేసి,

విడువక, యటమీఁద - విషయేంద్రియముల
కెడము తానై ప్రేమ - ని ట్లని పలికె:

'నెలవుగాఁ దనకుఁ దా-నే బంధకంబుఁ
గలిగించుకొని, యందుఁ- గడపటఁ జిక్కి,

కరఁగిచచ్చు పసిండి - కాయలోఁ బురుగు
కరణి నాశాపాశ - కలితదుఃఖముల

ననుభవించితి రింద్రి-యములార! మేలు
వినుఁడు ! నేఁ జెప్పెద - విషయవాసనలఁ

బొందక, వైరాగ్య - బుద్ధితోఁ గూడుఁ
డందున్న సుఖము మీ - కబ్బు నిక్కముగ'

ననుచు నింద్రియముల - కాప్తవాక్యముల
వినిపించి, యటమీఁద - విషయవాసనలఁ

గని యిట్టు లనె' నింకఁ - గరణంబులందుఁ
జుణుఁగుచు మీరింకఁ - జొచ్చి వేధింప

వలవదు, దృఢముగా - వైరాగ్య బుద్ధి
నిలఁగూడి వర్తింపుఁ, - డిందున మీకుఁ

గలుగు సౌఖ్యం'బని - గట్టిగాఁ జెప్పి,
తొలఁగని యజ్ఞాన - ధూర్తు నీక్షించి

పలికె ని ట్లని 'త్రాటఁ - బా మున్నకరణి
నలఘు పరబ్రహ్మ - మం దుండి నీవు

విపరీతములు చూపి - వెఱపింపుచుంటి,
విపుడు నీమూలంబు - నెఱిఁగితి; నిన్ను

గావను, సుజ్ఞాన - ఖడ్గంబు నెత్తి
యీ వేళ నినుఁ ద్రుంచి - యిలపై నణంతు'

నని ప్రతాపింపుచు - నజ్ఞానధూర్తు
ననఘుఁడై ఖండించి,-యచలాత్ముఁ డగుచు

నట శుచి స్థలినిఁ బ-ద్మాసనమందు
ఘటికుఁడై కూర్చుండి - కనుఁగవ మోడ్చి,

ధారాళముగ మారు-తమును రేచించి,
పూరించి కుంభకం-బున నిల్పి, మదిని

నెఱిఁగి ప్రాణములతో - నింపొందఁ గూర్చి,
పరఁగ హృదగ్నినిఁ - బ్రబలింపఁ జేసి,

కాయ మా యగ్ని క-క్కడ సమర్పించి,
మాయ నడంచి ని-ర్మల భావుఁ డగుచు,

సరవి నాధారాది - చక్రషట్కంబుఁ
గర మొప్ప దాఁటి, శృం-గాటకమందుఁ

గదలక నాసికా - గ్రంబుపై దృష్టిఁ
గదియించి. నడిమి మా-ర్గంబునఁ బోయి,

కర మర్థితో దీర్ఘ - ఘంటారవంబు
మొఱయు సహస్రార - మునఁ జేరి, యవల

చలమున నూరక - శ్రమ నొందు ప్రాణ
ములు చేతనామృత-మున శాంతికొఱకుఁ

బొంది, తదాకాశ-మున దోఁగి చాల
నందు సంపన్నంబు - లయ్యె నయ్యెడను;

మనము నంతర్బాహ్య - మధ్యంబులందు
ననఘమై, పరిపూర్ణ-మై నిండియున్నఁ

బరతత్త్వమునఁ బొంది - పరమసంతోష
భరితమై వెలి చలిం-పక నిల్చియుండె.

తపసియు హృదయాగ్ని - దగ్ధ దేహంబు
నపుడు బోధామృత - మం దుంచి, శాంతిఁ

బొందించి, చక్రిరూ-పు ధరించి, శమము
నొంది, కొన్నాళ్లట్ల - యుండి, పిమ్మటను

గ్రమ మొప్పఁగా నిర్వి-కల్పసమాధి
నమరఁగా సాధింప,- నంతరంగమునఁ

బరఁగఁ దోఁచిన ప్రతి - భాసల నాత్మ
కరవాలమున వేగ - ఖండించి వైచి,

భ్రమపెట్టు తద్వి క-ల్పనముల నెల్లఁ
బ్రమదంబుతో నెడఁ-బాసి, యామీఁద

నమలమై నట్టి హృ-దాకాశమందుఁ
గమలాప్త చంద్ర ప్ర-కాశముల్ గప్ప

నమరు నజ్ఞాన గా-ఢాంధకారమును
సమయించి, మీఁది తే-జంబును గాంచి,

ఘనతరమైనట్టి - కమలాకరమున
మొనసి చొచ్చిన గజం-బు విధంబుగాను

మొనసూపు తత్తేజ-మును దునుమాడి.
యనువొందఁ దేజో, మ-హాంధకారంబు

లను మోహ, నిద్రల-నటు దాఁటి, యోగి
వినుత మైనటువంటి - విశ్రాంతిఁ బొంది.

సరసత ధ్యానాను - సంధానపటిమ
నఱిముఱి ధన్యమై, - యచలమై, మఱియు

విమలమై, యాత్మ సం-విత్పరిస్పంద
నముచేతఁ గనకంబు-నవ్యభూషణము

తానై వెలుంగు చం - దంబున విశ్వ
మై, నిరుపమ చిన్మ - యత్వంబు దాల్చి,

తడయక యాత్మ చి - త్తమున నైల్యంబు
విడిచి, చిత్తంబును - విడనాడి, శుద్ధ

చిత్తస్వభావ మం-చితముగాఁబొందె;
నత్తాపసుండు బో-ధానురక్తినను

వలనుగా వాసనా - వర్జితుఁ డగుచు
నల చిదంబర రూప-మై ప్రకాశించి,

యనుపమపరమామృ - తార్ణవ మందు
మునిఁగి, తద్రూప మి - మ్ముగ విడనాడి,

యరుదుగా నిదమిత్థ - మనరానిచోట
మఱియును సత్తా స - మానత నొంది,

వరపరమానంద - వార్ధి తా నగుచుఁ,
బరఁగ నిర్వాత దీ-పము భంగి నిలిచి,

భాసురచిత్ర రూ-పము మాడ్కిఁ జేష్ట
బాసి, చలింపక - బ్రాహ్మణోత్తముఁడు

అల ఘనానంద ప-ద్మాకరమందె
యలఘుచిన్మయ హంస-మై యొప్పుచుండె.

ఆ రీతిఁ జిరకాల - మందున్నఁ జూచి,
యోరుపు చాలక - యురువిచిత్రములఁ

దొడరి చూపుచు దేవ-దూతలు మించి,
కడువడి యోగ వి-ఘ్నములు సేయఁగను,

నా యతిశాంతుఁడై-యచ్చోటు విడిచి,
పోయి యొక్కొకదినం-బొక్కొక చోట,

నొకచోట నొకమాస, - మొకవత్సరంబు,
నొకచోటఁ బెక్కేండ్లు - నుండి పోవుచును,

శాంతుఁడై తాపసా-శ్రమములయందు
వింత వింతల నొప్పు - విపినంబులందు

వలనొప్ప విమలజీ - వన్ముక్తుఁ డగుచు,
నలుఁగక యిచ్ఛావి-హారియై తిరిగి,

అలఘు చిత్తత్వ ఘ-నా భ్యాసములను
బొలుచు నా చిత్తును - బొంది యా మీఁదఁ

జెలఁగు చిత్సామాన్య - చిదనుభవంబు
వలన నుద్దాలక - వరయోగివరుఁడు

నలిని సత్తాసమా-నతఁ బొందె' ననఁగ
నలరి రాఘవుఁ డిట్టు-లనియెఁ గ్రమ్మఱను

'మౌనీంద్ర! సత్తాస-మానత యెట్టి?
దానతీయుఁ'డటన్న నమ్ముని పలికె:

'అనఘాత్మ! తన కన్య - మైనది మిథ్య
యనుభావనను జిత్త - మణఁగఁగా నపుడు

సహజమైనట్టి చి - త్సామాన్యమునకు
మహనీయ సత్తా స-మానత గలుగు,

మొదటి సంశయ భయ-ంబు లణంగునట్టి
పదమందుఁ జెంది ప్ర-పంచగేహమున

లలితుఁడై కొంతకా-లంబు వర్తించి,
యలఘు శాంతినిఁ - బొంది, యచలసమాధి

యందుండి, తద్దేహ - మట విసర్జించి,
యెందులఁ గొదువ లే-కిరవైన బ్రహ్మ

పదమందుఁ బొందె నా-బ్రాహ్మణోత్తముఁడు;
కొదుక కీ యుద్దాల - కుని చరిత్రంబు

వినిన మానవు లతి - విమలాత్ము లగుచు
ఘనముక్తి మార్గంబుఁ-గని సుఖింపుదురు.

ధరణీశ! నీవు ను-ద్దాలక మౌని
కరణి నిన్నే నీవు - గనుచు, విశ్రాంతి

నొంది, యుత్తమమైన - యున్నతపదము
నందు వర్తింపుచు - నానంద మొందు'

మనిన మౌనికి మ్రొక్కి - యా రాఘవుండు
మనమున నూహించి - మరల ని ట్లనియె:

'మునినాథ! సంసార - మున నుండి యొక్కఁ
డనఘుఁడై సుజ్ఞాని - యగుచు విశ్రాంతిఁ

బొంది సంసార ము-ప్పగఁ జేయుచుండు,
మందతన్ విడిచి స - మాధిఁ గావించు;

నటుగాక మఱి యొక్కఁ - డారణ్యములను
పటువిరాగమునఁ బ్ర-పంచధర్మముల

మఱచి, యే వేళ స-మాధిఁ గావించు;
నరయ నయ్యిద్దఱి-యం దధికుండు

ఎవఁ?డన్న నవ్వి ము-నీంద్రుఁ డిట్లనియె:
'అవనీశ! చెప్పెద - నా రెండు గతుల

విను మెట్టు లనిన వి-వేకాత్ముఁ డగుచుఁ
గొన మొదల్ గని, సర్వ-గుణ సమూహంబు

జడమంచు, నాత్మ య-జడమంచుఁ దెలిసి,
యడరఁ దదాత్మ తా-నని నిశ్చయించి,

యాంతరంగిక దృష్టి - ననవరతంబు
శాంతుఁడై చిత్త వి- శ్రాంతి వహించి,

పనుపడు దృశ్య ప్ర-పంచంబు మిథ్య
యని తాను ధ్యానించు-నటువంటివాఁడు

హాయిగా సంసారి - యై యున్న నేమి?
పోయి తపోవనం-బున నున్ననేమి?

కొఱఁత లే, దతఁడు ము-క్తుం డెచ్చ టున్న,
నరుదుగా సంసారి-యగు యోగి కెపుడు

ధర నిరుపాధి చే-తశ్శీతలత్వ
మిరవగుటం జేసి-యెపు డరణ్యమున

ఘనతరవైరాగ్య - కలితుఁడై, యోగ
మొనరించి, విమలుఁడై-యుపశాంతుఁడైన

యతనికి, నతనికి - నరసి చూచినను
గతియొక్కటే, రెండు - గతులు గా వనఘ!

లలినిఁ జేతశ్శీత - లత్వంబు మదిని
నిలువక చలియించె - నేని, యేమఱక

మఱి హఠయోగ స-మాధిఁ గావించి,
పారినిఁ దచ్ఛాంతినే - పొందఁగావలయు,

నమరి యనంతంబు-లగు చిత్తతాండ
వము లెల్ల నుపశాంతి - వలననే కాని,

మఱి వేఱె గతి నవి - మాన్పఁగా రాదు,
సరవి నందున శాంతి - సాధింపవలయుఁ;

తరమిడినట్టి శాం-తగుణంబు చేత
మఱి మఱి చిత్త స-మాధాన మొదవు.

అంతటి యోగికి - నఖిలవాసనలు
శాంతంబులగు; సర్వ - సముఁ డగు నతని

మది బాహ్య మందే క్ర-మంబున నున్న
నది చిన్మయంబై స-దానంద మొందు.

సందేహరహితుఁడై, - శాంతుఁడై, మమత
యందంటి, యంటక - యచలాత్ముఁడైన

ఘనుఁ డింటిలో నున్న - గహనమందున్నఁ
గనుఁగొన నా రెండు - గతు లొక్క సమమె;

వలనుగా నిట్టి స-ద్వాసన నొంది,
చెలఁగు చిత్తం బేమి - చేసినఁ గాని,

సేయనిదే యగు. - సిద్ధ మీవాక్య;
మీ యర్థమున సంశ-యింపకు మీవు.

ఆసల రోసి ని-రా సక్తి నొందు
భాసురజ్ఞానాను-భవముచే స్వల్ప

వాసనఁ గలిగిన - వరచిత్త మన్ని
చేసి. చేయనిదియై - చిత్తులో నణఁగు:

అల మానసము దూర - మరిగి యం దొకటి
నలరఁగా ధ్యానించు-నట్టి కాలమునఁ

దనువందు వెల్గు నా-త్మసుఖంబు, దుఃఖ
మొనర నెఱుంగక - యూరక యుండుఁ

గావున, సకల వి - కారముల్ మదిని
నా విమల చిదాత్మ - కంట దెద్దియును;

నావిధ మెట్లన్న - నమర స్వప్నమున
బావిలోఁబడి లేచి - బాగ మేల్కొనిన

వాని యంగములకు - వచ్చునే హాని?
మానవేశ్వర! దాని-మర్మ మె ట్లనిన

మనమున నెద్ది స-మ్మతముగాఁ జేయ
కునికి సమాధాన - మూహించి చూడఁ

జెలువొప్ప నిరతంబు - చిత్తశాంతంబు
గలుగు ధన్యునకు జ-గంబు భావింప

సతతంబు చల్లనౌ, - శాంతంబు లేని
యతనికి దావాగ్ని-యై తోఁచు జగము;

కావున శాంతమే - గావలె నరున,
కే విధంబుననైన- నిది నిశ్చయంబు.

ఇయ్యర్థమున నిపు - డితిహాస మొకటి
నెయ్యంబుతో విను - నేను చెప్పెదను.

### * సురఘూపాఖ్యానము *

సురఘుం డనెడు రాజు - సుస్థిరుం డగుచు
నఱిముఱిఁ దగు నిగ్ర - హానుగ్రహముల

ధరణి నేలుచు రాజ్య - తంత్రంబు నడుప,
మురువొప్ప సుఖదుఃఖ-ములను జిత్తంబు

పరిభూతమైన న-ప్పార్థివేశ్వరుఁడు
తరమిడి తనలోనె - తా నొక్కనాఁడు

తలఁచె ని ట్లనుచు 'మో-దంబు. ఖేదంబు
వలయు, నక్కఱలు నా-వలె భూజనులకుఁ

గలుగుట తెలియ కా-గ్రహము చూపుచును
తిలలఁ బీడించెడి - తిలయంత్ర మట్ల

పీడించుచుంటిని - పేదల నెల్ల;
నేఁడాదిగా శాంతి - నేఁ బొందవలయు;

నాకట్టి శాంత మె-న్నటికి లభించు?
నే కరణిఁ దరియింతు - నేను?' నటంచుఁ

దనలోనె తాను వి - తర్కించి, రాజ్య
మొనరఁ బాలింపక, - యురుచింత నెనసి

యుండఁగా, నంతలో - నొక్కనాఁ డటకు
మాండవ్యుఁ డనియెడు - మౌనిపుంగవుఁడు

వచ్చిన, నమ్మౌని - వరునకు మ్రొక్కి,
హెచ్చుగాఁ బూజించి - యెంతో నుతించి,

తనమదిలోఁ జింత-దాఁచ కంతయును
వినిపింప, నమ్మౌని - విభుఁ డిట్టు లనియె:

'ధరణీశ! విను మహం-తను, కామములను,
మురువొప్ప మమకార - మును విసర్జించి,

నీయాత్మ నీవెయై - నిఖిలరాజ్యంబు
సేయుచు నుండు, మీ-చింత యేమిటికిఁ?

దన యుపాయమున, య-త్నమున నీహార
మున నుండు లతచంద-మున మానసంబు

తన విలాపము వీడి - తనియుచు నుండుఁ,
దనవిచారమున నం-తర్మనోమలిన

మును దన్నుఁ బొందక - ముఱిగి నశించు:
జననంబు నొందుచుఁ - జచ్చుచు మరలఁ

బుట్టుచు గిట్టుచు - భూరిదుఃఖముల
నట్టిట్టు జుఱుఁగుచు - ననుభవింపుచును,

కడతేఱలేక, దుః-ఖసుఖాబ్ధులందుఁ
బడి పొరలుచునుండు - ప్రజలను జూచి,

భయము నొందుచు - వారిపంథలఁ బోక,
జయ మొంద నిలుచు భా-స్వరవస్తువందు

మదిని నిల్పు, మహంత - మమత ని న్విడుచుఁ;
జెదరక యుపశాంతిఁ - జెందుచు, జనులఁ

బాలింపు చుండు ని-ర్భరముగాఁ, జింత
యే?' లని చెప్పి ము-నీశ్వరుం డరిగె.

సురఘుఁ డావల నతి - సూక్ష్మభావమున
నెఱుక తా ననుచు, - దేహేంద్రియవిషయ

తతి జడం బగునది-తానుగా ననుచు,
నతిశయ బ్రహ్మరు - ద్రాది దేహముల

యం దనేకంబు లై-నట్టి రత్నముల
యందొక సూత్ర ము - న్నట్టి చందమున

వెలుఁగుచుండు చిదాత్మ - వేఱుగా దనుచుఁ
దలఁచి యన్నిటికినిఁ - దా పరుం డగుచు,

నల సుఖ దుఃఖ ద్వ-యాతీతుఁ డగుచు,
నెలమిఁ గుటుంబియై-యే కాకి యగుచు,

నెఱి దయాకరుఁడు నై-నిర్దయుం డగుచుఁ,
జిరతరంబుగ యోగ-సిద్ధినిఁ బొంది,

తొడరి నిరాసక్తి-తో రాజ్యపదము
నుడుగక పాలింపు - చుండఁగా, నటకుఁ

బరిఘుం డనెడు మహీ - పతి రాఁగ, సురఘుఁ
డరుదుగాఁ బూజించె, - నా పరిఘుండు

అతనిచే సత్కృతుఁ-డై యటమీఁద
హితము రెట్టింపఁగా - ని ట్లని పలికె:

'ధరణీశ! నీకుఁ ద-త్త్వజ్ఞానసరణి
తిరముగాఁ గుదిరిన-దే మానసమునఁ?

దలఁపున నిస్పృహ-త్వము నొంది ధరను
నలినిఁ బాలింపు చు-న్నాఁడవే నీవు?

పటుతర నిర్విక-ల్పసమాధినిష్ఠ
యెటువంటి? దాచంద - మెఱిఁగింపు' మనిన 1070

నా వేళ సురఘుఁ డి-ట్లనె 'నో మహాత్మ!
పావననిర్విక-ల్పసమాధి నిష్ఠ

చంద మెట్లనినను - సర్వభోగముల
యం దనాసక్తుఁడై - యచలాత్ముఁ డగుచు

నలరుచుఁ, గాల క-ర్మానుసారముగ
వలనుగాఁ దాఁ జేయ - వలయు కార్యముల

నాసక్తి లేక బా-హ్యమునందుఁ దాను
జేసి, తా నొక్కటి - చేయలే దనుచు

నంతరంగంబునం-దతినిస్పృహతను
శాంతరసము నించి - సంతోషి యగుచు, 1080

మఱియు నహంకార - మమకారములను
బొరయ, కంతట పరి-పూర్ణమై నిండి

యున్న చిద్వస్తువు - నూహించి కాంచి,
యన్నిటికి నతీత - మైన చిద్వస్తు

సత్త తానై శీత - శైలంబు మాడ్కిఁ
జిత్త విశ్రాంతినిఁ-జెంది యున్నదియె

పట్టైన నిర్వికల్ప సమాధి యగును.
నెట్టన నటుచేయ - నేరనివాఁడు

క్రమముగా సకల యో-గములు చేసియును
శమ మొందకున్న మో-క్షసుఖంబు లేదు.'

అనుచు 'జీవన్ముక్తి' - యను శబ్దమునకుఁ,
దనివిఁ బుట్టించు 'సం-తశ్శీతలత'కుఁ

గలిగిన యర్థముల్ - క్రమముగా నపుడు
విలసితసూక్తుల - వినిపింపఁగాను,

విని పరిఘుఁడు చిత్త వి-శ్రాంతి నొంది,
గొనకొని యతని పీ-డ్కొని చనె; నంత

సురఘుండు తనుఁ దాను - చూచుచు, రాజ్య
మిరవుగా బహుకాల - మేలుచునుండి,

కొనకు విదేహము - క్తుం డయ్యె; నిట్లు
ఘనుఁడైన సురఘుని - కథ విన్నవారు

పరమవిజ్ఞాన సం-పన్నులై, ముక్తి
నఱలేక పొందుదు' - రని వసిష్ఠుండు

ఘనముగా విజయరా - ఘవునకుఁ జెప్పి,
మనము రంజిల్లఁగా - మఱల ని ట్లనియె:

'రక్తిచే జిత్తవి - శ్రాంతి లేకున్న
ముక్తిఁ బొందుట కష్ట-ము తలంచి చూడ'

హింసాస్పదంబును - హేయమౌ దేహ
సంసారమును వీడ - శక్యంబు గాదు;

ఇనకులోత్తమ! రామ! - యీ యర్థమందు
వినిపింతు నొక కథ -విను మ దెట్లనిన

## * హాస, విలాసోపాఖ్యానము *

లలితులు హాస, వి-లాసు లిద్ద ఱనఁ
గల రన్నదమ్ము-లగ్రజుఁడు హాసుండు,

అనుజుఁ డొప్పు విలాసుఁ-డతఁ డొక్కనాఁడు
ఘనుఁడైన హాసునిఁ - గాంచి యి ట్లనియె:

'ఓ యన్న! యెఱుఁగంగ-నుచితమైనట్టి
నీ యాత్మ తత్త్వంబు-నీ వెఱింగితివె?

తక్కక పరమబో-ధము జనించినదె?
చక్కఁగా బుద్ధి వి-శ్రాంతి నొందితివె?

గురునిష్ఠ గల నీకుఁ-గుశలమే?' యనుచు
నరమరలేక యి-ట్లడుగ, హాసుండు

విని యిట్టు లని పల్కె - 'విపినంబులందుఁ
బనిఁబూని విపుల త - పముఁ జేయు నిన్ను

మొనసిన నాపుణ్య-మున నేఁడు గంటి,
ననఘ! సంసారమం-దలమటంబడుచు

వారక వర్తించు - వారికిఁ గుశల
మే రీతిఁ గలుగు? న-దెట్లన్న వినుము!

ఎందాఁకఁ బరమాత్మ - నెఱుఁగక యుండు
నందాఁక జిత్త ల-యంబు గాకుండు,

నెందాఁక సంసార - మెనయుచునుండు
నందాఁక నీ యాశ-యణఁగి పోకుండు,

నెందాఁక సమబుద్ధి - యిరవుగాకుండు
నందాఁక నుదయింప - దాత్మ సద్బోధ,

కావునఁ గుశల మె-క్కడ గల్గు? పరమ
పావనజ్ఞానసం-ప్రాప్తి లేకున్న?

మనుజులు సుఖదుఃఖ - మగ్నులై పుట్టు
చును, గిట్టు చుందు రె-చ్చోటులనైన,

నిలుకడఁ గానరు, - నీచసంసార
కలితులై యుందు; - రొకానొకఁ డాత్మ

తత్త్వంబుఁ గని, విర-క్త స్వాంతుఁ డగుచు
సాత్త్వికుండై ఘోర - సంసారజలధిఁ

దన వివేకంబుచే-దాఁటి సుఖించు.'
ననుచు వేదాంత ర-హస్యవాక్యముల

వివరించి తెల్పఁగా, - విని విలాసుండు
నవిరళభక్తితో - నన్నకు మ్రొక్కి,

పరమవిజ్ఞాన సం-పన్నుఁడై, ముక్తి
సురుచిర మతి విలా-సుఁడు పొందె' ననుచు

శ్రీరాఘవునకు వ-సిష్ఠుండు కరుణ
నారసి వినిపించి, - యవల ని ట్లనియె:

'అనఘాత్మ! దేనియం - దభిలాష లేక
మనము వైరాగ్య ని - ర్మగ్నమై యున్న

వలనుగాఁ బ్రారబ్ధ- వశమునఁ గూడి
చలన మొందించు సం - సారమందున్న

స్వాంత మా బంధ సం-శ్రయముగా కెపుడు
శాంతిఁ బొంది సుఖించు - నద్వస్తువందుఁ.

బనిఁబూని యు-గ్ర తపంబుఁ జేయుచును
వనమునం దుండిన - వానిచిత్తంబు

ఇరవొంద నాసక్తి - నెనసి యుండినను
కర మర్థి నది బంధ - కంబగుచుండు;

నెఱి నిది దేహంబు-నే దేహి ననెడి
యెఱుక లేకయ దేహ-మే నంచు భ్రమయు

జనునకు సంసార - సంగంబు బంధ
మని చెప్ప నొప్పు నో-యవనీశచంద్ర!

శారీరసుఖదుఃఖ - సరణులు రెండు
నారయఁ బరమాత్మ - యందు వింతలుగఁ

దనరార నారోపి - తంబులై యెపుడు
తనియని చిత్తబం -ధకములై యుండు;

సర్వపూర్ణంబైన - సత్యాత్మదృష్టి
సర్వకాలము మాన - సమునందు నిలిచి

యున్నను బంధంబు - లూడుఁ, జిత్తంబు
పన్నుగ నాపర - బ్రహ్మమం దణఁగు.

కావున నీవు న-ఖండాత్మసుఖము
భావింపు మొకటిగాఁ - బార్థివాధీశ!

వలనొప్ప సంసక్తి - వంధ్య యనంగ.
నలరారఁగా నవం-ధ్య యనంగఁ గలరు;

అందు వంధ్య యనంగ - నమరు నాసక్తి
పొందుగా సంసార-ము జనింపఁ జేసి

భావింపఁ దాను ని-ష్ఫలయై మెలంగుఁ,
దావలమగు నవం - ధ్యాసక్తి ముక్తి

దాయినియై, మహా-ధన్యత నిచ్చు.
నా యాత్మ విజ్ఞాన - మందనేరకను

అఖిలవస్తుజము తా-నై వంధ్య సక్తి
సుఖము నీయక మను-జుల రౌరవాది

నరకంబులను ముంచు - నానావిధముల,
సరవి నవంధ్య భా-స్వరవివేకాది

సద్గుణ సమితిచే - శాంతి వహించి,
చిద్గగనము నందుఁ - జెంది వర్తించు;

నట్టిశక్తినిఁ బంక - జాక్షుండు చెలఁగి
పట్టుగా జగములఁ - బాలింపుచుండు.

అదిగాక బ్రహ్మరు-ద్రాదు లందఱును
వదలక తచ్ఛక్తి వశులైరి; మఱియు

మొనసిన భవపాశ - ములఁ ద్రెంచివైచి,
మనమున దేహాభి-మానంబు మఱచి,

స్థిరబుద్ధిగల వాఁడు - చిద్రసమందు
కరఁగి జలంబులోఁ - గలిసిన యుప్పు

పగిదినిఁ గలియు నో-భానుకులేశ !
జగతి నెన్నఁగ జడా - జడముల నడుమ

సరసమై వెలుఁగు దృ-క్సంధి మధ్యమున
నరయఁగాఁ బరమాత్మ - యైయుండు నెద్ది,

యరయఁగా విమలప-రాత్మ యటంచు
నిరతంబు కాండోప - నిషదర్థ మమరఁ

దెలియు తత్త్వజ్ఞులా - తెఱఁగు తేటగను
దెలుపుచు నుందురు - ధీయుక్తి మెఱయ;

సరసమై దృఢదర్శ - సంయుక్త మగుచు,
నరయఁగా ననుభూత - మగుచును మఱియుఁ

దెలియఁగాఁ బారమా-ర్థికసుఖం బెద్ది
యలరార నది బ్రహ్మ - మన నొప్పుఁగాని,

వేఱె బ్రహ్మం బెద్ది - వెదకి చూచుటకు?
నా రవిబింబంబు - నాక్రమించుకొని

వనదంబు దట్టమై - వనజాప్తుకళను
గనఁబడనీయని - కరణిఁ జిత్తంబు

ఆ నిర్మల బ్రహ్మ - కడ్డమై నిలిచి
తా నుండుకొని పరా-త్మను గననియదు;

గానఁ దోఁచదు సదా - ఖండాత్మవస్తు,
వా నీచచిత్తంబు - నదిమి పట్టుకొని,

యా యఖండ బ్రహ్మ - మందు లయంబు
జేయుటే మోక్షంబుఁ - జెందుటగాని.

మోక్షంబు పాతాళ - మున, మింట, దిశల,
నీ క్షోణిమీఁద లే-దిది నిశ్చయంబు.

ఆస లన్నియు లయ - మైనదే ముక్తి ;
యీ సత్తఁ గనిన యో-గీశ్వరుం డిలను

జారపురుషునిపై - స్వాంత ముంచుకొని,
భూరియాశను నిజ-పురుషుని మైత్రి

వదలక హావభా-వవిలాసములను
బదపడి తాఁ జూపు - పగిది నాఘనుఁడు

ఆసలు గల వాని - యటువలెఁ బనులు
చేసి, వాటిని నిర - సింపుచు, నంత

రంగంబునందుఁ బ-రాత్మ సౌఖ్యమును
పొంగుచు ననుభవిం-పుచు నుండు నెపుడు;

ప్రారబ్ధ మనుభవిం-పఁ దలంచి యతఁడు
వారక సంసారి-వలె నటించినను,

నలఘు సూర్యుఁడు చల్ల - నైననుగాని,
యలఁ జందురుం డుష్ణుఁ - డైననుగాని,

మొగి నగ్నిశిఖ లధో - ముఖములు గాని,
యగణితాత్మ సుఖంబు - నంటిన యోగి

పొలుపారి విస్మృతిఁ - బొందఁ' డటంచుఁ
బలికిన విని రామ-భద్రుఁ డిట్లనియె:

'ఓ మునీశ్వర ! యూర - కుండక చిత్త
మేమిటఁ జలియించు? - నేమిట నిలుచుఁ?

గరుణ నాచిత్తరో-గమ్ము హరించు
పరమౌషధంబుఁ జె-ప్పందగు' ననిన

విని వసిష్ఠుఁడు పల్కె - 'విను రామచంద్ర!
ఘనమైన చిత్తరో-గమునకు రెండు

గల వౌషధములు: యో-గ మనంగ నొకటి,
యలఘు తత్త్వజ్ఞాన - మన్నది యొకటి

యున్నది విను యోగ - ముఱుకు చిత్తమును
పన్నుఁగాఁ బిగఁబట్టి - బంధింపనోపు;

పరమ విజ్ఞాన మా-పరమవస్తువును
సురచిరప్రజ్ఞచేఁ - జూపఁగా నోపు.

నది యెట్టు లనినఁ బ్రా-ణాపానయుగళ
ముదయించి చరియింపు-చున్న చిత్తంబు

చలియింపుచుండు, ను-చ్ఛ్వాస, నిశ్శ్వాస
ములను నిల్పినఁ జిత్త - మును నిల్చుఁ; జిత్త

చలనం బణంగిన - సంసార ముడుగు;
నల పూరకము మొద-లైనట్టి పవన

ధారణసేయఁ జి-త్తంబు నిరుద్ధ
మై, రయంబున నిల్చు - నంతరంగమునఁ

దనచిత్త ధారణ-ధ్యాన సమాధి
పనుపడినప్పు డా-ప్రాణవాయువులు

కదలక యంతరం-గమున నెమ్మదినిఁ
గుదురుచునుండు యో-గులకు, వెండియును

ప్రణవశబ్దార్థంబు - భావించి, దాని
గణుతించుకొనుచు నే-కాంతంబునందు

సురుచిర జ్ఞాన సు-షుప్తి నొందినను
జరిగిపోయెడి మది - చలనం బణంగు.

మఱియు నీ వింక నొక్క - మర్మంబు వినుము !
మురువొప్పఁగాఁ దాలు - మూలాంత మగుచు

గురుతరంబుగఁ గంఠ - కోట రాగ్రమున
కరుదుగా స్థూల జి-హ్వాగ్రమున్ జొనిపి.

యదనుగా సూక్ష్మజి - హ్వాగ్రంబుతోను
కదియించి మధ్య మా-ర్గంబు నందున్న

తనుతర విమల రం-ధ్రమునఁ బ్రాణముల
నొనరంగ నడిపింపు - చుండినఁ బ్రాణ

చలనం బణఁగుఁ, జిత్త -సంచార ముడుగు,
నలఘు యోగానంద - మబ్బుచు నుండు,

నిది యోగ మనఁబడు; - నిదియునుగాక
సదమలమైన వి-జ్ఞానయోగంబు

వినిపింతు విను జగ - ద్వితతియుఁ, జిత్త
మును, దద్వికల్పన-ములు లయంబైన

తఱి నవశిష్టమై - తా నెద్ది నిలుచు
నరయ నదే జ్ఞాన -మని చెప్ప నొప్పు;

జనవర! యటుగాన - సర్వంబు బ్రహ్మ
మనియెడి యెఱుక ప-దార్థదర్శిత్వ

మగు యోగమునకు, బ్ర-హ్మజ్ఞానమునకుఁ
దగు నిదర్శనము సి-ద్ధముగఁ జెప్పెదను.

## * వీతహవ్యోపాఖ్యానము *

విను వీతహవ్యుఁడన్ - విప్రపుంగవుఁడు
ఘనతర వైరాగ్య - కలితుఁడై, విపిన

భూమినిఁ జేరి, య - ద్భుతనిష్ఠఁబూని,
యేమఱక సుశాంతి - నెనసి, తామసము

విడిచి, యంతర్బాహ్య - విషయకృత్యముల
నడఁచి, నిర్మలమైన - యంతరంగమునఁ

దలఁచె నిట్లనుచు 'బ్ర-త్యాహార మెంత
సలుపు చుండినఁ-జిత్తచలనం బణంగి

పోక, లోలోఁ జలిం-పుచు నున్న దిపుడు,
నేకరణి నణంతు- నింకఁ జిత్తమును?'

అని విచారింపుచు - నప్పుడా చిత్త
మును బిగఁబట్టి, యి-మ్ముగ దాని కనియె:

'చిత్తమా! చలనంబుఁ - జెందక నీవు
సత్తా స్వరూపమై, - సర్వమై, సర్వ

సాక్షియై, యచలమై, - సంపూర్ణమైన
యక్షీణ పరమాత్మ - యందు సంతతము

నిలిచి యుండితివైన - నీకు సుఖంబు
గలుగు, జడములైన - కరణజాలములఁ

గూడి న న్నింకఁ జి-క్కులఁ బెట్టనేల?
వీడు మయ్యింద్రియ - విషయసఖ్యమును,

అరయ నతీంద్రియం - బై, పూర్ణమైన
పరమాత్మతత్త్వంబు - భావింపుచుండు'

మని బుద్ధిఁ జెప్పుచు - నపుడు చిత్తమును
గని పట్టి హృదయ పం-కజమందు నిలిపి,

గురువింధ్య పర్వత - గుహఁ జేరి, యచట
నఱి ముఱి సిద్ధాస-నా సీనుఁ డగుచుఁ,

గనుదృష్టి నాసికా - గ్రంబుపై నుంచి,
తనువును నిక్కించి, - తలఁపుల నెల్ల

మఱచుచు, నచల స-మాధి యందున్న
తఱి వీతహవ్యుని - తనుమధ్యమందుఁ

జరియించు ప్రాణముల్ - శమ మొందె. నిట్లు
పరమైన నిర్వి క - ల్ప సమాధి నొంది

యున్న, నందొక్క ము - హూర్తంబు కరణి
నెన్న మున్నూ ఱేండ్లు - నిలమీఁదఁ జఱిగె:

ఘనమైన భూమిపం-కంబులో నతని
తను వణంగక యున్న-తా వేర్పఱిచి.

కనఁ గూడకుండ నీ-కరణిఁ దపంబు
నెనసి, యాధన్యుఁ డం-దిరవుగా నుండి,

మొనసి మున్నా అబ్ద - ముల మీఁద మేలు
కొని, పూర్వజన్మ స-త్క ర్మ వాసనలు

బలములై యతనికిఁ - బ్రత్యక్షరూప
ములుగాను మానస - మునఁ గ్రమంబునను

దోఁచుచు నుండఁగాఁ - దొలఁగక యతఁడు
నా చోట నన్నిటి - నానందముగను

మొనసి మనోరాజ్య - మున సర్వమొనర
ననుభవింపుచునుండె - నది యె ట్లయనినఁ

గనులందుఁ బొడము జా - గ్రత్స్వప్నయుగళ
మును, నమ్మనోరాజ్య -మును నను మూఁడు

గలుగుచునుండు నె - క్కడనైన, మాన
వుల యా క్రమము లిప్పు - డూహింపు మీవు,

తెలివితో నన్నిటిన్ - దెలిసి, కాఁపురము
సలుపుచు నుండుటే - జాగ్రదవస్థ;

నెఱయు నింద్రియములు - నిదురలో నణఁగ,
నరసి యాంతరవిష - యములలోఁదగిలి

పొలుచుఁ జిత్తము రమిం - పుచు నుండురీతి
యలరు స్వప్నావస్థ - యనఁబడుచుండు;

నెఱుక గల్గియు, బాహ్య - మెఱుఁగక మఱచి,
మురిసి పురోభూత - ములు గాకయు న్న

గురువస్తు వితతులఁ - గూడి మానసము
పురిని లోలో సుఖిం -పుచునుండురీతి

నరయ మనోరాజ్య - మనఁబడుఁగాని,
విరివి రెట్టింప నా - వీతహవ్యుండు

హృదయగతంబున - నింపు సొంపెసఁగఁ
గదలక రజతన - గ ప్రాంతమందుఁ

ప్రకటితమగు కదం-బక తరుచ్ఛాయ
నకలంకుఁడై నిల్చి - యచట నూఱేండ్లు

తప మాచరించి, యిం-ద్రపదంబు నాత్మ
నపుడు కామించి, వి-ద్యాధరుం డగుచు

శతవత్సరంబులు - చరియింపుచుండి,
హితమొప్ప నేనుమా-ర్లింపుసొంపెసఁగఁ

గాలుఁడై, యవల నా - ఖండలపదముఁ
బాలింపుచును భోగ-భాగ్యసౌఖ్యముల

ననుభవింపుచు నుండి, - యావల నరిగి,
పనిఁబూని శివుచెంతఁ - బ్రమథుఁడై యుండె.

వారక ప్రతిభాస - వలన నీరీతి
సారెసారెకు బహు - జన్మసౌఖ్యములఁ

బొరిఁబొరి ననుభవిం-పుచు వేడ్క నుండి,
మరలఁ దత్పూర్వ జ - న్మమును దలంచి,

కలఁగాంచి మేల్కొన్న - కైవడి గాను
తెలివొంది యతఁడు మ - దిన్ వెఱఁగొంది,

యలరుచు వీతహ - వ్యాభిధానంబు
కలిగిన తను వింత - కాలంబునకును

సమయక యిచ్చోట - శాశ్వతం బగుచు
నమరి యున్నది గదా! యని సంతసించి,

పంకంబులోఁ బూడి - పడియున్న మేను
నింక నైనను మీఁది - కెత్తెద ననుచుఁ

దాఁ బ్రయత్నముఁ జేసి-తనువు పైకెత్తఁ
గాఁ బ్రయాసై తోఁపఁ-గా, దాని విడిచి,

అతఁ డంతఁ బుర్యష్ట - కాంగంబుతోడఁ
బ్రతిభ మీఱఁగ లేచి, - పవనుఁడై సూర్య

నారాయణునిఁ జేరి-ననుఁ బింగళాఖ్య
నారూఢుఁ డగు దూత - నబ్జబాంధవుఁడు

పనుపఁగాఁ జని నేలఁ-బంకమధ్యమున
మునిఁగి యున్నట్టి య-మ్ముని శరీరమును

గుదురుగాఁ బెకలించి - కొని చని, చాల
ముదముతో సూర్యుని - ముందర నిడఁగ,

నాదిత్యుఁ డా వీత - హవ్యు నీక్షించి,
'నీ దేహమున నీవు - నిలువు' మటంచు

నానతిచ్చిన వీత - హవ్యుఁ డా మేను
నూని ప్రవేశించి, - యున్నతుఁ డగుచు

ముదమంది సంగని-ర్ముక్తుఁడై, మమత
వదలించి విడిచి, జీ-వన్ముక్తుఁ డగుచు

స్వచ్ఛమనస్కుఁడై, - సర్వస్థలముల
నిచ్ఛా విహారుఁడై - యెఱుక నేమఱక,

యనఘుఁడై దశసహ - స్రాబ్దముల్ గడపి,
కినిసి విదేహము-క్తినిఁ బొందఁ దలఁచి,

లలితుఁ డేకాంత - స్థలమందుఁ జేరి,
చెలఁగి శుద్ధాసనా-సీనుఁడై యుండి,

తనలోనె తాను వి- తర్కించి, రాగ
మును, ద్వేషమును జూచి - మొనసి యి ట్లనియె:

'రాగమా! ద్వేషమా! - రాతిరి, పగలు
నీ గతి మున్ను న - న్నెనసి మద్విపుల

వైరాగ్యవహ్నిచే - వాఁడిపోయితిరి;
మీ రిఁక నైన న - మ్మిన చోటులందుఁ

జేరి సుఖింపుఁడు! - చింతచే నన్ను
గాఱింప నేల? శీ - ఘ్రంబుగాఁ జనుఁడు!

అంచిత పంచేంద్రి - యములార! నేను
పంచినగతినిఁ ద - ప్పక సంచరించి,

యలసితి రింక, మీ - రనువైన యెడల
నలుగక చనుఁడి! నె - య్యమున న న్విడిచి;

పరువు లెత్తుచు నీవు - పరమాత్మసుఖము
మఱపించి నాకు నీ - మాయలఁ జూపి,

విషమగతులయందు - విడువక త్రిప్పు
విషయ సౌఖ్యము!నన్ను - విడిచి పొ మ్మిఁకను;

నెఱసిన దుఃఖమా! - నీ చేతఁ జిక్కి,
పరితాపమునఁ బొంది, - పాపసంసార

నిరసనం బొనరించి, - నీదయవలనఁ
బరమైన నిర్వాణ - పద మేను గంటి;

నా కుపకార మా - నాఁడు చేసితివి,
నీకు మ్రొక్కెదను నీ - నెలవున కేఁగు!

నే నిన్ను విడిచిన - నీ వొంటిగాను
బోనేర నని యింకఁ - బొగుల నేమిటికిఁ?

జక్కఁగా నేఁగి సం - సారుల చెంత
మక్కువ నుండు! నా - మాలిమి విడువు!

దండంబు నీకు, నా - దగ్గఱ నిలిచి
యుండక చను మింక-నో తల్లి! తృష్ణ !'

యనుచు నంతఃకర-ణాది గుణాళి
నొనర వీడ్కొల్పి, తా-నుపశాంతిఁ బొంది,

యున్నతుఁడై ప్రణ - వోచ్చారణంబుఁ
బన్నుగాఁ జేయుచుఁ, - బై జ్యోతి నాత్మఁ

గనుచు, సంకల్ప వి-కల్పాదివివిధ
తనుధర్మవితతి నం-తర్బాహ్యములను

బొడమనీయక నిజ - బుద్ధియం దణఁచి,
యడరారఁ బ్రణవాంత-మైన నిశ్వాస'

తంతువుతోఁ గూడి - తన్మాత్ర వితతి
నంతఃకరణమునం - దరసి, యవ్వలను

తనివిఁ బొందిన విశ్వ - తైజసావస్థ
లను దాఁటి, మెల్ల మె - ల్లఁగ లోని తిమిర

పటలంబు నణఁగించి, - ప్రాజ్ఞసంబంధ
పటుతర తేజమున్ - భావించి యణఁచి,

సరవినిఁ దమము, తే - జంబు నులేక,
యరుదుగా శూన్య మై - నటువంటిచోటుఁ

గని, దానిఁ బాసి, త - క్కక సూక్ష్మమైన
మనముచే మనము నే - మఱక ఖండించి,

బడలక చిద్వస్తు - పదము నీక్షించి,
తొడరి నిమేష చ - తుర్థ భాగమునఁ

బరఁగఁ జంచలతను - బాయు మారుతము
కరణినిఁ జైత్య మ-క్కడ విసర్జించి,

నెనవుగా సతతైక - నిష్ఠితం బగుచుఁ
దనరిన శాంతి ప-దమునందుఁ బొంది,

తుదఁగని మేరుప్థి - తుండై సుషుప్తి
పద మవలంబించి, - పటుతీవ్రగతిని

ఆ వరయోగి తు - ర్యానంద మొందె.
ఈ విధంబున నపు - డిల నిరానంద

పరుఁడు, సదానంద - భరితుండు, స్వచ్ఛ
విరహితుఁ, డటుగాక - విపులస్వచ్ఛుఁడును,

మఱియుఁ జిన్మయుఁడుఁ, జి - న్మయుఁడునై యిట్లు
నిరవొప్పఁగా నేతి - నేతి వాక్యములఁ

జెలఁగి యుపన్య సిం - చిన వేళఁ దుదను
దెలియ వాఙ్మనసా - తీతమై, సర్వ

పరిపూర్ణమగు పర - బ్రహ్మంబునందు
విరివిగాఁ గలిసె నా - వీతహవ్యుండు.

ఆ పరాత్ముని నిశ్చ - యం బది యనుచుఁ
దోఁపక, శూన్య వా-దులు శూన్యమనఁగఁ,

దరమిడి బ్రహ్మవే - త్తలు బ్రహ్మ మనఁగ,
వరుసగా విజ్ఞాన-వంతు లందఱును

విరివి నా బ్రహ్మంబు - విజ్ఞాన మనఁగఁ,
బొరి సాంఖ్య యోగులు - పూరుషుఁ డనఁగ,

నిలసిద్ధ యోగీంద్రు - లీశ్వరుం డనఁగఁ,
జెలఁగి శైవులు సదా-శివుఁ డాత్మ యనఁగ,

లలిఁ గాలవిదులు కా-లమె బ్రహ్మ మనఁగఁ,
దొలఁగ కాత్మార్థవం-తులు చిదా త్మనఁగ,

రహిఁ దాదృశులును నై-రాసతత్త్వ మన,
మహి మాధ్యమికు లెల్ల - మధ్యమం బనఁగ,

ననిశంబు సమచిత్తు - లగువారు సర్వ
మును బ్రహ్మ మనఁగ నా-మూల తత్త్వంబు

అగుణమై, సర్వసి-ద్ధాంతసమ్మతము
నగుచు నన్నియును దా-నై వెల్గులకును

వెలుఁగై, యనంతమై, - వేరొండు లేక
యలఘు పరబ్రహ్మ - మంతట నుండు.

విమలుఁడై ముప్పది - వేలేండ్లు యోగ
మమర సల్పిన వీత - హవ్యుండు తుదకు

నా పరమాత్మ తా - నయ్యె నటంచు
భూపాలునకుఁ గృపా - బుద్ధి దీపింపఁ

జెప్పి, క్రమ్మఱ నా వ-సిష్ఠుఁ డి ట్లనియెఁ:
'దప్పక విను రామ - ధరణీతలేంద్ర!

ఆనందముగ వీత - హవ్యుని చరిత
మూని యాలింపుచు - నుండెడివార

లఖిల పాపవిముక్తు - లై, పరమాత్మ
సుఖము నొందుదు' రంచు - సూటిగాఁ జెప్పి,

'జనవర! చిత్తోప - శమనవాక్యములు
విను'మన్న రామ భూ-విభుఁ డిట్టు లనియెః

'అమర జీవన్ముక్తు - లాత్మార్థ విదులు
నమలాత్ములైన మ-హాయోగులకును

నరుదైన గగన యా-నాదిక సిద్ధు
లిరవొందఁ గలుగని-దే?' మంచు నడుగ,

విని, ముని పల్కె నా-విధ మెట్టి దనిన
'విను రాఘవేశ్వర! - విశదంబుగాను

ఘనములై తగు నభో-గ మనాది సిద్ధు
లనువొందఁ గలిగిన - నది ముక్తి గాదు,

తనరారు ద్రవ్యమం-త్రక్రియాశక్తు
లొనరంగఁ గల్పింపుచుండు సిద్ధులను,

నట్టి సిద్ధులఁ గోరి - నటువంటివాఁడు
పట్టుగాఁ బొందఁడు - పరమైనముక్తి,

ఆత్మజ్ఞు లా సిద్ధు-లం దాస విడిచి,
యాత్మయందు సుఖించి, - యవల మోక్షంబుఁ

జెందుచుందురుగాని, - సిద్ధుల డెంద
మందుఁ గోరరు, కొంద-అవి గోరుకొంద్రు:

తనరారు ద్రవ్యముల్, - తంత్ర యంత్రములు,
ఘనమంత్రములు, క్రియల్, - కాలశక్తులును

సిద్ధులఁ బుట్టించి - చిత్రముల్ చూపు;
సిద్ధాంతమగు ముక్తిఁ - జెందెడు పనికి

నవి యంతరాయంబు - లగుచుండుగాని,
ప్రవిమలంబగు మోక్ష - పద మందనియవు.

**ఆ రీతి యేమన్న - నట్టి సిద్ధులకు**
**గౌరవంబులు చాలఁ - గలుగుచునుండు,**

**సారె సారెకుఁ బ్రజా-సంగంబు గలుగు,**
**భూరిదురాశలు - పుట్టు నందునను,**

నప్పు డహంకార - మతిశయం బగుచు
ముప్పిరి గొనుచుండు, - ముక్తి మార్గంబుఁ

జూడనీయవు గాన- క్షుద్రసిద్ధులను
వేడుకగా నైన - విమలాత్మవిద్య

గలవారు సిద్ధులఁ గాంక్షింప రెపుడు,
పొలుపొంద నుపశాంతిఁ - బొందు చుండుదురు.

అన విని రాముఁ డి - ట్లనె 'మునినాథ!
ఘనయోగు లిల బహు - కాల మంగముల

విడువ కుండుదు రట్టి - విధ మెట్టు?' లనినఁ
బుడమి జేనికి మౌని - పుంగవుం డనియె:

'లలితాత్మ! విను మని - లంబు సారెకును
జలియింప నాయువు - సమయు నందునను

బడు శరీరంబులు, - పవనంబు బయలు
వెడలనియ్యక లోన - విసువక నిలుపు

యోగుల కెల్ల నా - యువు వృద్ధిఁ బొందుఁ,
గాఁగ వారి ల బహు - కాల ముండుదురు'.

అన విని శ్రీరాముఁ - డమ్మునీశ్వరునిఁ
గని యిట్టు లనియె 'నో - ఘనపుణ్యచరిత!

అలఘు విజ్ఞానో ద - యమునఁ జిత్తంబు
విలయంబు నొందిన - వేళ మైత్ర్యాది

సుగుణసమూహ మె - చ్చోట జనించు?
నగణితచరిత! నా - కానతిం' డనిన

ముని యిట్టు లనియె ని - మ్మగ 'రామచంద్ర!
వినుము నీ వారీతి - విశదంబుగాను

అనఘాత్మ! చిత్తల - యమునందు రూప
మనఁగ, నరూపంబు-నన రెండు గలవు;

అందు జీవన్ముక్తి-యగు నరూపంబుఁ
బొందుగాఁ గన్న, రూ-పు విదేహముక్తి;

యలఘు జీవన్ముక్తుఁ - డంగంబుతోడ
మెలఁగుచుండుటఁ జేసి - మేలును, కీడుఁ

గలుగఁగా సుఖదుఃఖ - కలితమై మనసు
చలనంబు విడువక - సంసారనామ

భూరివృక్షమునకుఁ - బ్రోదిగా నుండు;
నీరీతి భావింప - నిది చిత్తసత్త,

దీని సంక్షయ మేను - దెల్పెద వినుము!
పూని పర్వతము గా-డ్పునఁ జలింపకను

నిలిచియుండినరీతి - నెఱి సుఖదుఃఖ
ములు గల్గినప్పుడి - మ్ముగ హెచ్చుతగ్గు

నొందక, శాంతుఁడై - యుగ్రభావమునఁ
జెంద కున్నది గదా - చిత్తలయంబు!'

'అటువలెఁ జిత్తల - యంబైన వెనుక
నెటు గుణంబులు గల్గు? - నెఱిఁగింపుఁ' డనిన

'జ్ఞానస్వరూపమై - చలనంబు లేని
మానస మలఘుని-ర్మలబుద్ధి చేతఁ

బూని తద్ జ్ఞాన మొ-ప్పగ నిశ్చయించు,
మానసమే సత్త్వ - మయ మగుచుండు;

నా రీతి యెట్లన్న - నాలించి వినుము!
సారవిహీన రా-జసతామసములు

పొలుపు లేక నశించి - పోయినయపుడె
బలమరి చిత్తంబు - పలుచనై తగ్గి,

చలియింపకుండఁగా, - సత్త్వగుణంబు
నిలిచి యచ్చటనుండు - నిర్మలం బగుచు;

నల సత్త్వగుణమునం - దపుడు మైత్ర్యాది
లలితగుణంబులె-ల్లను గల్గుచుండు.

జ్ఞానస్వరూపమై - చలియింపకున్న
మానసం బాత్మలో - మగ్నమైయుండి

యందు జీవన్ముక్తుఁ - డగు యోగివరుని
యందు మైత్ర్యాది మ - హాసద్గుణముల

నూరక పుట్టింపు - చుండు వేడుకను
వారక యట్టి జీ - వన్ముక్తుఁ డవల

మదము నొంది విదేహ - ముక్తుఁ డవల
మది యతిస్వల్పమై - మతితోడఁగూడి,

యా విమలాత్మయం - దపుడు లయించి
పోవుఁ గావున, గుణం - బులు పుట్ట వవల,

నల సరూపమనోల - యంబు భావింప
నెలమి జీవన్ముక్తి - యిది యన నొప్పు,

నదియుఁగాకను స్వరూ - పాస్పదంబైన
హృదయంబు నాశమై, - యిదియది యనుచుఁ

దెలియఁగూడనిది వి - దేహముక్తి యగు;
నల రజంబును, తమం - బను గుణద్వయము

విలయమై పోయిన - వెనుక శేషించి,
తొలఁగక సకల స - ద్గుణ సార మగుచు

స్థిరముగా నున్న సా-త్త్విక‌ విశేషంబు
మురువుమీఱ విదేహ - ముక్తియం దణఁగు;

సారెకు మారుత - స్పందవాసనలు
ప్రేరేపుచున్న నిం-ద్రియముల మీఁది

జ్ఞానంబు రాక ని-శ్చలవృత్తి నున్న
నా నిర్గుణ బ్రహ్మ-మయ్యెద వీవు.

వినుము రాఘవ! వేద్య - వేదనోల్బణత
లొనరఁగాఁ బుట్టింపు - చుండుఁ జిత్తంబు

మోసపుచ్చు ననర్థ - మూలమై లేని
యాసలు పుట్టించు, - నటుగాన దాని

లయముఁ జేసిన మోక్ష - లాభంబు గలుగు;
భయము లణంగు, ని-ర్భయ ముదయించుఁ;

గావునఁ జిత్తవి-కారంబు నణఁపఁ
గావలె నని మున్ను - కమలజాత్మజులు

సనకాదు లాచిత్త - సంరంభ ముడుప
ననిలధారణ సేతు - రది యెట్ల యనిన

మొనయు ప్రాణాయామ-మున సదాధ్యాన
మున యుక్తికల్పిత-ముల యోగములను

అనిలనిరుద్ధమౌ-నపుడు లక్ష్యమును
తనయందె నిలుపఁ జి-త్తము శాంతిఁ బొందు,

దాన విజ్ఞాన సు-స్థైర్యంబు గలుగుఁ,
బూని వృత్తి జ్ఞాన - భూతమైనట్టి

యనుభూతి వాసన-నంటి చలింప
కొనరినఁ బ్రకటచి-త్తోత్పత్తి పదము

వినుము వాసనలచే - విడువంగఁ బడక
మొనయు పూర్వాపర - ముల విచారముల

జననమొందు పదార్థ - సక్తియే వాస
నని చెప్పఁదగుచుండు - నదె యాత్మయందు

నూనికగా నిల్చి - యున్న సంసృతులు
నేనాఁటికైనఁ బో, - విట్టి వాసనలఁ

దగిలిన పురుషుఁ డే - ద్రవ్యంబుఁ గని
మొగి నాత్మ ననిశంబు - మోహింపుచుండుఁ;

బదపడు వాసనా - భ్యాసంబుచేత
నిదియె పుట్టను, గిట్ట - నిల హేతు వగుచుఁ

దెలియఁగా హేయపా -థేయమై చాల
నలరు జాగ్రద్భావ - మణుమాత్రమైనఁ

దొడరి చిత్తమునందుఁ-దోఁచని యపుడు
పొడమదు మానసం-బు దలంచి చూడ,

రహిఁ గర్మ వాసనా-రహితమైనపుడు
మహి నొప్పు పరమశ-మప్రదంబైన

యల మనోలయమగు-నది యెట్టు లనినఁ
దెలిపెద విను రామ! - తెల్లంబుగాను

బలములై మారుత - స్పందన వాస
నలు గల్గు, నట్టు లె-న్నంగ నా రెండు

మొనయుబీజాంకుర-ములు మానసమున
కనఁగ నొప్పుచునుండు - నమ్మూటి కొనర

జనవర! యీ ప్రపం-చము బీజ మగును;
గనుకఁ దద్వేద్యసం-గతి విసర్జింపు,

మటుమీఁద నిర్మూల - మైనట్టి వృక్ష
మటువలె సర్వంబు - నణఁగును రామ!

సంవేద్యమునకు ని - శ్చయము భావింప
సంవిత్తు బీజ మెం - చఁగ నవి రెండు,

కరమొప్ప నూనె లే - కను నూలులేని
కరణి నొండొంటి నే-కడ వీడకుండు

నల విషయ జ్ఞాన - మతి దుఃఖములకు
నిలయంబుగా నుండు - నెఱిని నిర్విషయ

మైనట్టి సుజ్ఞాన - మమలమై యాత్మ
కానంద కారణ - మై వృద్ధిఁబొందు'

ననిన శ్రీరాముఁ డి - ట్లనె 'జాడ్యరహితుఁ,
డనఘుండు. నిర్విష - యజ్ఞాని యైన

వానికి మఱి జడ - త్వముఁ బొందు టేమి?
యాన తియ్యు'ఁడటన్న నమ్ముని పలికె:

అరయ సర్వావస్థ - లందు నిర్వాణ
సరణిని భావించు - శాంతచిత్తుండు

అవనిపై నెన్ని కా - ర్యములయందున్న
నవిరళ నిర్విష - యజ్ఞాని యగును;

ధరణీశ! మఱి సర్వ - ధర్మవాసనలు
పొరి ఁబొరి నశియించి - పోవఁగా, నతఁడు

బాలుని గతి, మూఢు - పగిది, నున్మత్తు
పోలికఁ జిత్సుఖం - బునఁ జొక్కుచుండు;

బలియు సంవిత్తు - కా బ్రహ్మసదంశ
మలఘు బీజము దాని-యం దది వెలుఁగు,

నది యె ట్లనన~ దేజమందుఁ బ్రకాశ
ముదయించుకైవడి - నొప్పు సంవిత్తు.

విను విశేషాంతర - విముఖమై, మఱియు
ననుపమసన్మాత్ర-మై యనాదరము

నగుచును, బహురూప-మై, యేకరూప
మగుచు నున్నదియే మ-హా బ్రహ్మసత్త

యై, కల్పనాశూన్య-మై, యాద్య మగుచు
నాకారవిరహిత-మై యనాద్యంబు

నై రమణీయ మై-నట్టి సామాన్య
సారసద్భావ భా-స్వరవస్తుసత్త

యందు బీజంబు లే-దచట సంవిత్తుఁ
బొందితే మఱి రాక - పోకలు లేవు,

హేతువులకు నెల్ల - హేతుసార మిది,
హేతువు మఱి దాని - కింక లే దదియె

ఆదిసారము, దీని - కన్న సారంబు
లేదు గావున నిదే - లెస్స భావింపు,

చలనంబు తా-పౌరుష ప్రయత్నమున
నలఘు బలంబున - నఖిల వాసనల

వడి నణఁగించి త-త్త్వజ్ఞుండ వగుచు
నడరారఁగా నక్ష-యాత్మ పదంబు

నిరుపమ ప్రజ్ఞతో - నిమిషమాత్రంబు
నఱలేక పొందిన - నది యుత్తమంబు,

వరచిత్తలయమును - వాసనాహరణ,
మరయఁ దత్త్వ జ్ఞాన - మనఁగ నిమ్మూఁడు

కలిగియుండెడిది దు-ష్కరమగు; నైనఁ
దెలిపెద నది నీకుఁ దేటగా నిపుడు

పరఁగ ధీయుక్తినిఁ - బౌరుషస్థితిని,
విరళమౌ భోగేచ్ఛ - విడువు, మిమ్మూఁడు

నీ వభ్యసించిన - నిరుపమంబైన
పావనపూర్ణ చి - త్పదము నొందెదవు.

చెలఁగి యీ మూఁ డభ్య - సింపని మూఢుఁ
డళుకుచు జన్మ స-హస్రంబులకును

బామరుఁడగుఁ గాని, - పర మొంద నేరఁ,
డేమని చెప్పుదు? - నెవ్వానికైన

మొదట నేఁ జెప్పిన - మూఁడు సాధనము
లుదయించి యొక కాల - మొప్పుచుండినను,

వాఁడు ముక్తుం డగు - వరుసగా నట్టి
మూఁ డెన్న నొకజన్మ - మునఁ గల్గ కొకటి,

యొక్కటి జనియింపు - చుండిన ముక్తి
నిక్కంబుగాఁ గల్గనేర - దందాఁకఁ

జెదర కభ్యాసంబుఁ - జేయ నొక్కొకటి
తుదగాని తుచ్ఛసి - ద్ధుల నిచ్చుచుండుఁ,

జెలఁగి యిమ్మోఁ డభ్య - సించు ధన్యునకుఁ
గల వాసనామనో - గ్రంథు లణంగుఁ,

దనువు నిత్యం బని-దలఁచుచుండుటను
దనయందుఁ గల పర - తత్త్వభావనను

ననిశంబు నిస్సంగుఁ - డగుచు నుండుటను
జనియించు వాసనల్ - సమయుఁ, జిత్తంబు

శాంతిఁబొంది యణంగు, - సకలార్థములకు
నంతఃకరణమునం-దంటి యున్నట్టి

సంగంబు హేతువు - సకలార్థములకు,
సంగంబు నిలయంబు - సంసృతి కెల్ల,

సంగంబు మూల మా-శాలతావళికి,
సంగమే యాపద్ద-శల కెల్ల నెలవు,

సంగవర్జనము మో-క్షము, సంగవిరతి
మంగళ ప్రదము, జ-న్మవినాశకరము,

కలిమిలేములను, సు-ఖము దుఃఖములను
గలుగఁ జేయుచునుండుఁ గలుషమైనట్టి

వాసన యనునది - వసుధాతలేంద్ర!
వాసిగా నిలను జీవ-న్ముక్తులైన

జనులందు హర్ష వి-షాదవిరహిత
యనఁగ నొప్పుచును జ-న్మాంకురహారి

యగు శుద్ధవాసన - యమలమై నిలిచి,
యగణిత మోక్ష సౌ-ఖ్యంబు నొందించు.

అతిమూర్ఖులగు వారి - యందు దట్టముగ
సతతంబు మలినవా-సన నిల్చి, మరలఁ

బుట్టించి గిట్టించి - పొగిలింపుచుండు,
నట్టి వాసన నొంచ - రాత్మార్థ విదులు;

కా దని సుఖము దుః - ఖంబు గల్గినను
మోదఖేదాబ్ధుల - మునుఁగుచుండకను

పొలుచు నాశల వృద్ధిఁ - బొందనీయకను
పలుమఱు సంపదా - పదలు వచ్చినను

జిగురొత్తు సమబుద్ధి - చే వానియందుఁ
దగులక తగిన ప్రా-ప్త పదార్థములను

ననుభవింపుచు నుంటి - వైనను. నీవు
అనఘ! నిస్సంగుఁడ-వై సుఖించెదవు.

* ఆకాశగత్యభావాఖ్యానము *

ఆకాశగత్యభావా - ఖ్యానసరణి
నీకుఁ జెప్పితి రామ! - నృపకులోత్తంస!

తెలివొందు, మీయుప - దేశంబువలన
నలఘుచిత్త మణంగు, - నాత్మానుభవము

చక్కఁగా నగు, నుప-శమన ప్రకరణ
మెక్కువగాఁ జెప్పి - తిపుడు నీ' కనుచు

జననాయకున కుప-శమనప్రకరణ
మనువొంద బోధించె - ననుచు వాల్మీకి

తప్పక యాభర - ద్వాజ సంయమికి
నప్పుడు బోధించె - నానందముగను.

## * ప్రకరణాంతద్విపద *

ఇది సోమనాథవి-శ్వేశ్వర స్వామి
పదపద్మ భక్త సు-బ్రహ్మణ్యయోగి

చరణాంబుజాత ష-ట్చరణాయ మాన
పరిపూర్ణ నిత్య స-ద్భావ నిమగ్న

మానసాంబుజ వెంగ - మాంబికారచిత
మై, నిత్యమై సత్య-మై ధన్యమైన

సామార్థసారసు-జ్ఞానవాసిష్ఠ
రామాయణం బను - రమ్యసద్ద్విపద

యం దెన్నఁగాఁ దృ - తీయ ప్రకరణము
నందమై విమల మో - క్షాకరం బగుచు

శ్రీతరిగొండ నృ - సింహుం డనంగ
ఖ్యాతిగా వెలయు వేం - కటరాయ! నీదు

పదయుగళికి సమ - ర్పణమయ్యె, దీని
సదమలులై వ్రాసి - చదివిన, వినిన

నరులు తాపత్రయార్ణవముఁ దరించి
పరమైన నిర్వాణ - పదము నొందుదురు.

భూచక్రమున నిది - పురుషార్థ మగుచు
నా చంద్రతారార్క - మై యుండుఁగాత!

## -: తృతీయప్రకరణము సమాప్తము :-

## చతుర్థప్రకరణము

శ్రీతారకోల్లాస! - శేషాద్రివాస!
శ్రీతరిగొండ నృ - సింహ! ధూతాంహ!

విన్నవించెద నిదీ - వినుము వాల్మీకి
సన్నసైగల నుప-శమనక్రమంబు

తనియఁ జెప్పఁగ, భర-ద్వాజుండు మరల
ననియె ని ట్లని 'యో మ-హా గురుదేవ!

చిరకృప నమ్మౌని - శ్రీరాఘవునకు
మఱి యేమి చెప్పె స-మ్మతముగా?' ననుచు

నడర భరద్వాజుఁ - డాసక్తి నవల
నడుగ, వాల్మీకి యి-ట్లనె ' నోకుమార!

శ్రీరఘుపతిని వ-సిష్ఠుఁడీక్షించి,
యారూఢకరుణ ని-ట్లనియె నోరామ!

వెలయ నేఁ జెప్పిన - వివిధార్థములకు
వలనైన ఫలము జీ-వన్ముక్తి యగును,

నమరు దేహంబులం - దహమిక దృశ్య
సమితి యా త్మనుచును - జపలాకరముగ

నెందాఁకఁ ద్రవ్యాళి-నెనసి వర్తింపు
నందాఁకఁ జిత్తంబు - నందు విభ్రాంతి

తఱచగు చుండు, నం-తర్ముఖుం డగుచు.
మురువు చూపెడి జగం-బులను జిదగ్ని

యందె తృణములట్ల - నాహుతిచేసి,
సందేహ ముక్తుఁడై - శాంతాత్ముఁ డగుచుఁ

బట్టుగాఁ దను దాను - భావింపుచుండి,
నట్టి సంయమిచిత్త-మందు విభ్రాంతి

కలుగ దెన్నటి' కన్నఁ - గాకుత్స్థతిలకుఁ
డలరి వసిష్ఠ సం-యమి కిట్టు లనియె:

'సద్గురువర్య! మీ - సత్కటాక్షమునఁ
జిద్గగనానంద - సీమలోఁ జేరి,

వసుధపై నేను జీ-వన్ముక్తి పదము
పసమీఱఁ బొందితిఁ; - బ్రాణధారణము

సేయు నుపాయంబుఁ - జెప్పవే!' యనిన
నా యతీశ్వరుఁ డిట్టు - లనియె' నో రామ!

వినుము చెప్పెదను నది - విశదంబు గాఁగ
ననిలధారణ మంచు - నన్నది యొకటి,

ఘనతరజ్ఞాన యో-గం బన నొకటి
యనువొందఁగాఁ గల-వని మున్ను నీకు

బోధించియుంటి, ని-ప్పుడు నేను మరల
నా ధారణాయోగ -మమరఁ జెప్పెదను

తడఁబడు దేహశో-ధనఁ జేసి మలము
కడిగి, రేచక, పూర-కములు, కుంభకము

గావింపుచునికి యో-గంబగు; నాత్మ
నేవేళ భావించి - యెఱుకకు నెఱుక

గాను దలంచి య-క్కడ సుఖించినదె
జ్ఞాన యోగంబగు; - శంభుండు మున్ను

అనిలధారణ చేయు - టతికష్ట మనుచు
ఘనమనో ధారణా - క్రమమున సిద్ధి

గలుగుటన్ జ్ఞానయో-గము సూక్ష్మముగను
విలసిత సూక్తుల - విరచించి యుంచె;

తగునధికారి భే-దముల నారెండు
నగు యోగముల ధన్యు - లభ్యసింపుదురు;

అనిలధారణ చేయు-నపుడు లక్ష్యమున
మన మొప్ప నిలిచి స-మ్మతిఁ బొందుచుండుఁ,

దలకొని ఘనమనో-ధారణ చేయ
నలరి మనముతోడ - ననిలంబు నిలుచు;

వాయుధారణ సేయు-వానికి ధరణి
నాయువు బహువృద్ధి - యగుచుండుఁ, దొలుత

సాధించునపుడు క-ష్టం బగుఁగాన,
భూధవ! నీకు నే-ర్పుగను విజ్ఞాన

యోగంబుఁ జెప్పితి; - యుక్తితో దీని
బాగొప్ప సాధించి - పరమాత్మ వగుము.

రహిమీఱఁ బ్రాణధా-రణఁ జేయువారి
మహిమంబుఁ జెప్పెద - మది నిల్పి వినుము!

*** భుశుండోపాఖ్యానము ***

పొలుపొందు మేరువు - భూరిశృంగమునఁ
గళగల పద్మరా-గపుఝురిం గల్ప

తరు వొప్పుచుండు వి-స్తారమై, యందుఁ
గరమొప్ప దక్షిణ - స్కంధమధ్యమున

గురుతరంబుగ నొక్క - కోటర ముండు;
నిరవొంద దానిలో - హేమవల్లరులఁ

జాపట్టు నింట భు-శుండుఁ డన్ ఘనుఁడు
తాపస శ్రేష్ఠుండు, - తత్త్వార్థవిదుఁడు,

వీతరాగుఁడు, కాల-వేది, శ్రీమంతుఁ,
డాతత విశ్రాంతుఁ, - డధిక శాంతుండు,

ఆయువుగల పుణ్యుఁ - డనఘవర్తనుఁడు
వాయసశ్రేష్ఠుండు - వసియించి యుండు.

అతనిఁ జూచుటకు నే - నరుగఁగా, నెదుట
నతిశయ్య వృక్షమం - దల్లి దట్టముగఁ

దెఱఁగొప్ప బంగారు - తీఁగెల కొనల
సరసంబులైన పు-ష్ప ఫలంబులందుఁ

గలకల ధ్వనులతోఁ - గలసి క్రీడించు
లలిత విహంగ జా-లములఁ జూచుచును,

అలఘు సహస్ర ద-ళాబ్జనాళములఁ
జెలరేఁగి మెక్కుచుఁ- జిందు ద్రొక్కుచును,

వనజాతభవునకు - వాహనం బగుచుఁ
దనరారుహంస సం-తతులఁ జూచుచును,

నటుచనఁ జన నంజ-నాద్రి సమాన
పటుతర దేహంబు, - పక్షయుగంబు,

ఘనతీవ్రతుండంబు - గలి, గిరువంక
లను వృద్ధకాక జా-లంబులు గొలువ,

నచట సుఖాసీనుఁ-డైన భుశుండు
నచలాత్ము నీక్షించి - యంచుకుఁ బోయి

నిలిచిన, ననుఁజూచి - నెనరుతో లేచి,
నలువొప్ప విహితాస-నమున న న్నుంచి,

యుచితవృత్తిని నిల్చి-యుండఁగా, నట్టి
యచలితాత్ముని గాంచి - యచటఁ గూర్చుండ

నియమించి, యాఘను - నెమ్మోముఁ జూచి,
దయపుట్ట వాయసో-త్తమున కి ట్లంటి:

'ఓ కాకపుంగవ! - యో పుణ్యచరిత!
యేకాలమందు నీ - విలను బుట్టితివి?

నీకుఁ దత్త్వజ్ఞాన - నిష్ఠ యె ట్లబ్బె?
నీ కాయు వెంతయ్య - నెఱి నేటివఱకు?

నీ కాంచనాద్రి యం-దిర వెవ్వఁ డిచ్చె?
నే కార్యములను నీ - వెఱిఁగి యుండుదువు?

ఆ కథ లెల్ల నీ - వరమర విడిచి
నాకుఁ దెల్పు' మటన్న-నగి' భుశుండుండు

పలికె ని ట్లని 'ముని - ప్రవర! నా చంద
మెలమి నె ట్లనిన మీ - కెఱిఁగింతు వినుడు!

అల పూర్వకాల మం-దంబికావిభుని
విలసితోత్సవము సే-వించు వేడుకలఁ

గర మొప్పుచుండెడి - కైలాసగిరికి
సరసమానసలైన - సప్తమాతృకలు

మనము లుప్పొంగఁగా - మచ్చికల్ మీఱఁ
జను మార్గమున సర-స్వతివాహ మగుచుఁ

బొలుచు హంసికకును - బొరి నలంబుసకు
నలరార వాహనం - బగు కాకమునకుఁ

బుట్టితి, పుట్టిన-ప్పుడె నన్నుఁ జూచి,
పట్టైన కరుణ నా - భారతీదేవి

యిట్టి బ్రహ్మజ్ఞాన - మిచ్చి రక్షించె;
నట్టికాలంబునం-దలరి మాతండ్రి

యీ కోటరమున న-న్నిరవుగా నుంచె;
నాకాలమున నుండి - యమర నిచ్చోట

నిలిచి యుండంగ న-నేక కల్పాంత
ములు, బహుమను కాల-ములు పోయె' ననిన

విని యిట్టులంటి నే - వెఱఁగొంది యంత
'మునులు, యోగులునైన - మొనసి కల్పాంత

సమయంబులం దుండ - శక్తులుగారు,
విమలాత్మ! యెట్లు జీ-

అనిన భుశుండుఁ డి-ట్ల
జననుతచరిత! యీ-శ్వ

గడవ నెవ్వరికి శ-క్యము
గడనుఁ గల్పాంతర - కా

బొలుచు పృథివ్యాది -
నలఘురుద్రుండు ల-యముఁ జేసినపుడు

అతులిత తేజోమ-యంబైన భూత
వితతియం దేను ప్ర-వేశించి, యవల

మొనసి యాయారూప-ములను ధరించి,
యొనర నానందింపు - చుందు నెమ్మదిని'

ననిన నే నప్పు డి-ట్లంటి భుశుండ!
విను నీవు పరతత్త్వ - విదుఁడవు గాన

ఆ విలయంబులం-దణఁగి పోకుండి
యేవేవి చూచితి? - వెఱింగిపు' మనిన

సురుచిరాత్మకుఁ డా భు - శుండుఁ డి ట్లనియె:
'వరమునివర్య! త-ద్వార్తలు వినుము!

అరయఁగాఁ బెక్కేఁడు - లవనీతలంబు
నరశూన్యమై యుండె - నానాముఖముల,

మురువొప్ప వన శైల-ములు భస్మమయ్యె,
నరుదుగా సూర్య చం-ద్రాగ్ను లణంగె,

మూఁడు లోకములను - ముంచెఁ దోయంబు,
క్రోడమై హరి మహా - క్రూరుఁ డైనట్టి

హేమాక్షు నణఁగించి - యిల నుద్ధరించె,
నీ మహామహిమంబు - నేను బాల్యమునఁ

గనుఁగొనుచుంటిఁ ద-క్కక, యిదిగాక
గొనకొని మున్నెడ -గురు వసిష్ఠులను,

చెలువొప్ప నేను వీ-క్షింపుచుండితిని,
సొలయ కష్టమ వసి-ష్ఠుఁడవైన నిన్నుఁ

గనుఁగొంటి నొకమాఱు - గగనంబునందుఁ,
బనిఁబూని యొకమాఱు - పవనంబు నందు,

ననువొంద నొక్కమా-ఱనలంబు నందు
నొనరంగ నొక్కమా-ఱుదకంబు నందు,

నొకమాఱు ధరణియం,- దొకమాఱు మఱియుఁ
బ్రకటమై తగు మహా - పర్వతమందు,

మొనసి మహత్తత్త్వ - మున నొకమాఱు,
ననఘాత్ముఁడగు బ్రహ్మ - యం దొకమాఱు,

నురుతరప్రజ్ఞతో - నుద్భవం బొంది,
చరియింపుచుందువు - సకలలోకముల,

నరయ నీ జన్మంబు - లద్భుతలీల,
లరు దవి యటు లుండె, - నవిగాక నేను

అల చక్రి నూఱు బు-ద్ధావతారములు,
నలరార నూఱు క-ల్క్యవతారములును

ధరియించినవి గంటి, - ధ్వర నిదిగాక
తెరలి ముప్పదిమార్లు - త్రిపురముల్ గూలె,

దక్షమహాధ్వర - ద్వంసం బణంగె,
నక్షరకలిత వే-దావళు లరిగె,

బహుశాస్త్రవితతులు, - బహుపురాణములు,
బహుళేతిహాసముల్ - పరువడి నేఁగె,

నలువొప్ప రామాయ-ణములు పె క్కరిగె,
సలలిత మోక్ష శా-స్త్రములగు గ్రంథ

లక్షలు నుదయించె, - లలిని వాల్మీకి
శిక్షచే, నితరుల - శిక్షచే, వ్యాస

మౌనిచే ఘనులైన - మనుజులచేతఁ
బూని రామాయణం - బులు, భారతాది

వరకథ లుదయించె - వసుమతి మీఁదఁ,
దరమిడి రామావ-తారంబు లెన్నఁ

బరఁగ భవిష్య దు-ద్భవముతోఁ గూడ
నరయఁ బంద్రెం డయ్యె, - నదియునుఁగాక

యిరవొంద శ్రీవిష్ణుఁ - డింక మీఁదటను
ధరియింపఁదగు నవ-తారంబుతోడ

మహినిఁ గృష్ణావతా-రములు పదాఱు
సహజంబుగా నగు - సంయమి శ్రేష్ఠ!

ఇట్టి జగద్భ్రాంతి - కేనాఁటి కవధి
పుట్ట, దేనేమి చె-ప్పుదు నింకమీఁద?

నీ వడిగిన వెల్ల - నిశ్చయంబుగను
నే వినిపించితి, - నీ వింక నేమి

వినవలతు?' వటన్న - విశ్వాస మొదవ
నొనర నే ని ట్లంటి - 'నో వాయసేంద్ర!

'పరఁగఁ బుట్టుచు గిట్టు - ప్రాణు లేరీతిఁ
జిరజీవు లగుదురు? - చెప్పవే! తెలియ'

నన వాయసేంద్రుఁ డి-ట్లనె 'మునినాథ!
వినుము చెప్పెద నిది - విశదంబుగాను,

అరయఁగా దోషంబు - లను మౌక్తికముల,
నఱిముఱి వాసన-లను తంతువులను
వరుసగాఁ గూర్చి, య-వ్వలఁ గూర్చుసరణి
మఱచి యూరక - యున్న మదిగలవానిఁ

బట్టదు మృత్యు వే - పట్టుననైన,
నట్టి చందం బెట్టు? - లనినఁ జెప్పెదను.

వినుము పావనమును, - విమలం బనేక
మును, చిన్మయము, సౌ-ఖ్యమును నైన పరమ

పదమునం దెవ్వని - భావనచేతఁ
గుదిరి చిత్తము గరం-గుచు నుండు, నట్టి

వాని నమ్మృత్యు దే-వత పట్ట వెఱచుఁ,
బూనిన సంసార - భోగవిచార

కర్మమూలములైన - కామాదిరిపుల
**మర్మముల్ గని, వాని - మర్దించి విడిచి,**

తనువులోఁ బ్రాణ చిం-తనఁ జేయుచున్న
ఘనుల మృత్యువు పట్టఁ-గా నోడి యుఖుకు,

మొనసిన బహుదుఃఖ-ములను హరించు
తనప్రాణ చింతనే - తనసఖి యగుచు

నానంద మొందించు - నటువంటి సరణి
నేను చెప్పెద నది - నెలవుగా వినుము!

పాదుగా నుండెడి - ప్రాణంబు వెలిని
ద్వాదశాంగుళులంత - తరలి యడంగు,

నిదె రేచకంబగు - నిదె నిశ్చలతను
గదియ బహిః కుంభ-కం బగుచుండు,

నదియె క్రమ్మఱ హృద-యంబులోఁ జొచ్చి,
కదలకుండినఁ బూర-కంబగు నదియె.

ఘనతరాంతర కుంభ-కత్వంబు నొంది,
తనియని భంగి నాం - తర్యమం దనిల

చింతనం బది ప్రాణ - చింతనం బగుచు
సంతోషకరమగు - సహజంబుగాను,

నిందె చలింపక - యెవ్వరు నిలిచి
యుందురో వారు మ-హోన్నతు లగుచు

నతిశయశుద్ధ బు-ద్ధాత్మ లభిన్న
మతులై యెఱుక గల్గి - మనియుందు రిలను,

గన బహిరంతర్ము - ఖములందుఁ బ్రాణ
మునునై, యపానంబు - మొనసి వర్తించు,

నట్టి రెంటినిఁ గూర్ప - నా రెంటినడుమ
నెట్టనఁ జిత్తంబు - నిలిచియుండినదె

గుఱియైన కేవల - కుంభకం బనుచు
వరయోగు లగువారు - వచియింతు రిలను,

మఱియుఁ బ్రాణము పొడ-మక యపానంబు
నఱిముఱి నణఁగంగ - నపు డెద్ది ప్రబలి

సత్తుగా నిలుచుఁ దద్ - జ్ఞానస్వరూప
ముత్త మోత్తమముగా - నూహించి, దాని

యం దైక్యమై, నిశ్చ-లానందపదము
నొంది, యందుఁ జలింప-కుండు మనంబు.

అట్టి ప్రాణసమాధి - యం దంటి, సతత
మట్టిట్టు చనక చి-దాకాశమందె

శాంతిచేఁ జిత్త వి-శ్రాంతినిఁ బొంది,
యాంతర్యసౌఖ్యంబు - ననుభవింపుచును

వసుధ భూతము, భావి - వర్తమానముల
విసువక కర్తనై - వీక్షింపుచుందు;

నలఘు సుఖంబులం - దాపదలందుఁ
గలుగు సౌఖ్యమును దుః-ఖమును బొందకను

సరవి నెన్నఁగ సర్వ - సముఁడనై మఱియు
వరసత్త్వభావభా-వనుఁడనై యెపుడు

చిరజీవినై ప్రకా-శించి యిం దుందుఁ
బరమ మునీంద్ర! నా - బ్రతు కిట్టి' దనిన

విని భుశుండునిఁ జూచి - 'విమలాత్మ! నీవు
ఘనకాలవేదివి - గాంభీర్యమతివి

పరతత్త్వరతుఁడవు - పావనాత్ముఁడవు
నిరతసంతోషివి - నీ చరిత్రములఁ

దలపోయ నతివిచి-త్రములు గావునను,
సలలిత విశ్వభూ-షణముగా నమరి,

‘తనివిఁ, బొందుచు సదా-త్మసుఖాతిశయము
ననుభవింపుచు నుండు-మయ్య! నీ విచట’

ననుచు వాయసయోగి - నచ్చట వీడు
కొని నేను వచ్చితిఁ - గుతలంబునందు

నానందముగ భుశుం - డాఖ్యాన మెవరు
పూని విన్నను వారు - భూరిచిత్ప్రదము

నందుఁ బొందుట కర్హు-లగుచు జీవింతు;
రిందుకు సందియం - బించుక లేదు.

అలభుశుండునివలె - ననిలధారణము
చెలఁగి చేసినఁ జిరం-జీవు లయ్యెదరు.

నే నుండు యోగముస్ - మెచ్చక కొంద
ఱానందకరమగు - నట్టి విజ్ఞాన

యోగసాధనముఁ జే-యుదు, రందువలన
రాగదోషములు దూ-రము లగుఁ గానఁ,

గాయంబుపై నాశ - గలుగ, దందులను
వాయుధారణఁ - జేసి వసుధ జీవింప

నాస కొందఱు ప్రాజ్ఞు-లదియేల? యనినఁ
గాసిల వచ్చి యె-క్కడనైన నరుఁడు

అలసి నిద్రించి లిం-గాంగంబుతోడఁ
గలలను జెంది సు-ఖంబు, దుఃఖంబు

బొరిఁ బొరి ననుభవిం-పుచు దిశలందుఁ
జరియించు, నొకదిక్కు - శాశ్వతంబుగను

నిలువలేఁ,డాజీవు-నికి సంస్మరణము
దలఁప మనోభ్రాంతి - దము, మది దీర్ఘ

రమణమై తగుచిత్త - రాజ్యం బటంచు
నమర భావించు మీ - వంతరంగమున,

నిలలోన నీ స్థూల - మిరవుగా నుండ
వలె నంచు మదిలోన - వాంఛింపనేల?

జనియించువా రెల్లఁ - జచ్చుట నిజము,
కనుకఁ జచ్చుటకు దుః-ఖము నొందవలెనె?

అల రాగదోషంబు - లనెడి భుజంగ
ములు మనోబిలములో - మొనసి వసించి

కలచఁగా, మోక్షమా-ర్గంబు చొప్పడక
చలియింపుచుందురు - చాల మానవులు.

సరసులై సకలశా-స్త్రంబులు చదివి,
సరవిని రాగరో-షముల నణంపఁ

జాలని వాఁడు సు-స్వాదు వస్తువుల
నోలి మోయుచు గంధ - మూహింపలేని

ఖర మనఁదగు, వానిఁ - గాల్పనే తండ్రి!
అరయఁగా నటుగాన - నతిభయదంబు

ఘనధైర్యఘాతి, మం-గళ రహితంబు
ననఁబడు హృత్స్పృశా-చావేశ మణఁచి,

యేనాఁడు చెడక య - హీనమౌ చిన్మ
యానందమునఁ బొందు - మయ్య! శ్రీరామ!

వాయసేంద్రునివలె - వాయుధారణముఁ
జేయుట విజ్ఞాన - సిద్ధియౌ టరుదు,

కావున నిర్వాణ - గతి నీయఁదగిన
దేవతార్చన రీతిఁ - దెల్పెద వినుము!'

అని యావసిష్ఠ సం-యమి రాఘవునకు
వినిపించి, క్రమ్మఱ - వేడ్క ని ట్లనియె:

## * శివపూజోపాఖ్యానము *

'అనఘ! గంగాతీర - మందు నేఁ జేరి,
యనలాంబకుని భక్తి - నాత్మ నర్చించి,

కనువిచ్చి చూడ శం-కరుఁడు నాముంద
రనె నిల్చియుండె, నా - రాజశేఖరునిఁ

బ్రత్యక్షముగఁ - జూచి, ప్రాంజలి నగుచు,
నత్యంత భక్తి ని-ట్లంటి 'నో దేవ!

హర! మంగళప్రద, - మజ్ఞానదోష
హరణ మైనట్టి దే-వార్చన సరణిఁ

దెలుపు' మన్నను మహా- దేవుఁ డి ట్లనియె;
విలసితయుక్తిచే - విను మోమునీంద్ర!

కలిగిన హరిహరుల్ - గారు దేవతలు,
తెలిసి  చూచినఁ జిత్త-దేహరూపులును

గా, రకృతిమము, న-ఖండ, మద్వయము
నై రమ్యమగు వస్తు-వగు తొలివేల్పు,

ఆకాశమునఁ బుట్టి - నట్టి భూతము ల
నేకముల్ గాఁగ నం-దే యకల్పితము

గాక, యంతట సదా - ఖండమైనట్టి
శ్రీకర చిత్సత్త - శివుఁ డన నొప్పు;

నామూల మెఱుఁగక - యజ్ఞానులైన
పామరు లాకార - భావపూజలను

అరసి చేయుచు నుందు - రామడదూర
మరుగంగ లేక యా - ఱామడపోయి

నిలిచి, యావలఁ జన - నేరనివాని
వలె ఘనభక్తి భావను-లయ్యు, మరల

నపరిమితపరాత్ము - నరయ నోపకను
చపలులై దారు పా-షాణాదివివిధ

రూపపూజలు చేతు-రు ధరిత్రి మనుజు,
లా పరబ్రహ్మంబు - నాత్మ భావించి

తెలియ; రా బ్రహ్మమం-దే సర్వభూత
ములు బుద్బుదములు స-ముద్రంబులోను

గలిగి యణంగిన - కరణి రూపములు
చెలఁగి పుట్టు నణంగుఁ - జిద్వస్తువందె,

గానఁ దద్వస్తు వా-కారంబు గాదు;
లేని రూపములు గ-ల్గిన రీతిఁ దోఁచు,

నరయ ననంత క-ల్పాంతరతతులు
తెరలి యా వస్తువం-దే లయ మొందు;

నంతటఁ జిత్సత్త - నర్చించుటకును
శాంతిబోధయు, సర్వ - సమత పుష్పములు

గా సమర్పించి, య-ఖండభావనను
వాసిగా నర్చించ-వలె నంతెగాని,

యాకార పూజ లా-త్మార్చనం బగునె?
ప్రాకటంబుగఁ బరా - త్పరము, నద్వయము,

ననుపమంబు, నబాహ్య, - మమల, మచ్యుతము
ననఘు, మఖండంబు, - నానంద మొందు.

రహిని బాహ్యయు నాంత-ర యనంగఁ బూజ
విహితంబుగా రెండు - విధములై యుండు,

నిందు బాహ్యార్చనం - బెట్ల నటన్న
నందెన్న సర్వ భా-వాంతరస్థయును

శమితకళయు సద - సత్తు లనంగ
నమరు సామాన్యస-త్తైనసంవృత్తి

సత్తయొక్కటి మహా-సత్త్వ భావంబు
నత్తఱిఁ బొంది తా-నయ్యె దేవుండు,

మౌనీంద్ర! బహుశక్తి - మయుఁ డయ్యె నతఁడు
గానఁ దచ్ఛక్తి త-క్కక యాదినుండి

విదిత ప్రవృత్తి ని-వృత్తులఁ బొందు
నది పరాశక్తియు - నాదిశక్తియును

దెలివియ జ్ఞాన శ-క్తియుఁ, గ్రియాశక్తి,
యలరు నిచ్ఛాశక్తి, - యాకర్తృ శక్తి

యాదిగాఁ గలుగు న-నంత శక్తులును
బ్రోదియై జగములఁ - బుట్టించె, నందుఁ

జపలయై యుల్లాస - శక్తి సంసార
మపరిమితముఁ జేసి - యాడుచునుండు,

సరవి నంత నిరోధ - శక్తి సంసార
మురు పరాక్రమమున - నుపసంహరించి,

యట్టి కృత్యంబుల - కాధార మగుచుఁ,
బట్టుగా భాసకా - భాసకం బగుచు,

నగుణంబు సంవిస్మ-యంబు ననంగఁ
దగి నిండియుండు నం-తశ్చిత్ప్రకాశ

మే పూజ్యమై తాను - మెఱయుచునుండు
నా పరమాత్మ స-ర్వాత్మ యె ట్లనినఁ

గడలేని తత్పరా-కాశ కందరము
నడతారఁగా నాసి - కాదికాకాశ

కోశాంఘ్రితలము ది-క్పూర్ణంబులై ప్ర
కాశించు బాహుసం-ఘంబు లనేక

వనజజాండములన-వారిగా దాఁచ
ననుకూలమైన మ-హాకుక్షి గలిగి,

వెలుఁగు నద్దేవుండు - విశ్వరూపకుఁడు
నలఘు సంవిన్మయుం-డఖిల పూర్ణుండు

నైన దేవున కుప-హారముల్ వలదు,
ధ్యానంబు శీతల-త్వము నమృతంబు

తెలివి, తదేక బు-ద్ధియుఁ, బ్రమోదంబు,
చలన రాహిత్యంబు, - సత్త్వంబు ననెడి

యాత్మీయదివ్య పు-ష్పార్చన సేయ
నాత్మ సంతుష్టుఁడై - యానంద మొందుఁ;

బరమధర్మం బిది - పరమయోగంబు
పరమాత్మ నీరీతి - భావించి చూడ

నెఱుకకు నెఱుకయై - యెల్ల దేహములఁ
బరిపూర్ణుఁడై నిండి - బహుశబ్దములను

విలసితప్రజ్ఞచే - వినును, శీతోష్ణ
ములఁదాఁ దెలియుచుండు, - మొనసి రూపములఁ

గనుఁగొనుచుండు, త-క్కక షడ్రసములఁ
గొను, గంధములను మూ-ర్కొను, నిద్రఁ జెందు,

మరల మేల్కొనుఁ బల్కు - మైత్రిని నెఱపు,
నిరవొందు నియతాత్మ - నే వేళ మదినిఁ

బూని ధ్యానించుటే - పూజ; తదన్య
మైనట్టి పూజ యే-లా చిదాత్మునకు?

అలపూజ పదియు మూఁ-డైన నిమేష
ముల యంతకాల మి-మ్ముగఁ జేసినట్టి

ధ్యానశీలునకు గో-దాన ఫలంబు
మానితంబుగఁ గల్గు, - మఱియొక్క దినము

పరిపూర్ణముగఁ జేయు - పావనాత్మకుఁడు
పరమధామమునందుఁ - బ్రాపించియుండు;

భావింప నిది యెల్ల - బాహ్యపూ జగును.
తావలమైన యం-తఃపూజ వినుము!

నిత్యంబు, నచలంబు, - నిర్వికారంబు,
సత్యంబు, సగుణంబు, - సర్వాత్మకంబు,

అమిత, మాకాశ శి - వాత్మకం బజము,
విమలంబు, పరమ సం-విన్మయ పూర్ణ

లింగంబు నర్చించు - లీల యె ట్లనిన
మంగళప్రద చిత్స-మాధి సౌఖ్యమును

తాను పొందినది యం-తః పూజ యగును.
మౌనీంద్ర! యిఁక నొక్క - మర్మంబు వినుము!

స్థితుఁడు, నిర్గతుఁ,డుదా-సీనుండు, జడుఁడు,
గతభోగి, యోగి, య-ఖండ సుషుప్తి

యుతుఁ డవ్యయుం డద్వ-యుం, డజరుండు,
నతి జాగరూకుఁ,డ - నాచారుఁ డజడ

సత్తాస్వరూపుఁ డెం-చఁగ నేనె, నాకుఁ
జిత్తదృక్చక్షులు - సేవించుసతులు,

అలఘు విశ్వంబు నా-కర్పించు మనము
తలఁపులచే నొప్పు - దౌవారికుండు;

వెల యఖండజ్ఞాన - వివిధవృత్తులును
పొలుపొందు నాకు స-ద్భూషణావళులు,

అమితంబులగు నా గృ-హంబుల కెల్ల
నమరియుండు దశేంద్రి - యములు వాకిండ్లు,

ఆరీతి నారూప-మగు నీకు నాకు
వేఱుగా దాత్మ భా-వించి చూచినను,

గావున సమబుద్ధి - గలవాఁడ వగుచు
నీవు న న్నర్చించు - నిస్పృహత్వమున,

నట్టి మదర్చన - కన్యంబు లగుచుఁ
బుట్టి యుండెడి ద్రవ్యపుంజ మేమిటికి?

నలరగాఁగామనం-బను పూజ యొకటి
కలదు, చెప్పెద నది - క్రమముగా వినుము!

పరమాత్మనగు నన్ను - భావించి మదికిఁ
బరఁగఁ దోఁచిన - పుష్పభక్ష్యాన్నపాన

వితతులు కల్పించి, - విశ్వాస మొదవ
ప్రతిదిన మర్పింప - భావనాసిద్ధి

యగుచుండు, నిట్టి యా-త్మార్చనార్హంబు
లగునట్టి భక్ష్య భో-జ్యాది వస్తువులు

సమబుద్ధి శాంతర - సముచేఁ దిరస్కృ
తములగు నటుగానఁ - దత్త్వార్థ మెఱిఁగి,

కలనాకలిత దేశ - కాలకర్మముల
వలనఁ బ్రాప్తములైన - వస్తువులందుఁ

దలఁగని యాశ చే-తను, సుఖదుఃఖ
ములచేత విభ్రమం-బునఁ బొందకుండు!

తెలిసి జ్ఞానార్పిత - దేహనాయకుఁడ
వలరి నీ వగుచుండు - మమలాంతరంగ!

భూమిలో నిటువంటి - పూజలు సేయు
నామహాత్మునకు నే-నఖిల దేవతలు

నొనర సేవకులమై-యుందు. మాఘనుఁడు
తనుఁ దా నెఱిఁగి, పర-తత్త్వంబు నొందుఁ:

గలమాడ్కి లేనిదై - కలిగిన ట్లెపుడు
బలముగాఁ దోఁచు ప్ర-పంచ మంతయును

దఱచి యాభాసమా-త్రంబుగా నెఱుఁగు,
మఱి యది యెట్లన్న - మరు మరీచికల

యం దుదకం బుండి-నటు దోఁచి, లేని
చందంబుగాఁ బ్రపం-చం బ త్మయందుఁ

గనిపించిన ట్లుండుఁ - గడను లేకుండు,
ననిశ మజ్ఞాని యై-నటువంటి వాఁడు

మొనసి తద్భ్రాంతిలో - మునుఁగుచునుండుఁ,
గనుక మూఢాత్ముఁడై - కష్టదేహముల

ధరియించు, విడుచుఁ, ద-త్త్వము గనలేఁడు,
పరికింప నటువంటి - భ్రాంతచిత్తునకుఁ

దెలివిగా నాత్మోప-దేశంబు సేయఁ
దలఁచు టె?ట్లనిన ని-ద్రను గలయందుఁ

గనిన పురుషునకుఁ - గన్యక నిత్తు'
నని తలంచుట గాదె? - యని యవ్విధమున

నెనసి నా కుపదేశ - మిచ్చి రక్షించి,
మొనసి తిరోధాన-మును బొందె శివుఁడు.

ఈ రీతి హరుఁ డాన - తిచ్చిన పూజ
లారాధులైన సం-యములును, నేను

జిరతరనిష్ఠతోఁ - జేయుచునుందు,
మరయఁ బ్రాప్తములగు - నర్చనంబులకుఁ

బొరిబొరి విఘ్నముల్ - పొసఁగినవాని
మెరమెరఁ బడరాదు, - మిక్కిలి పూజ

యదియంచు దృఢనిశ్చ-యంబుతో నున్నఁ,
బదపడి తద్దోష - పటలం బణంగుఁ;

జెలువొప్పచుండెడి - జీవులయందుఁ
గలుగు గ్రాహ్య గ్రాహ - కత్వముల్ రెండు

సరియగు యోగ పూ-జలు సల్పుచుండు
మిరవందు సుజ్ఞాన - మినకులాధీశ!'

యని రఘువరున కా-త్మార్చనక్రమము
పనుపడ నమ్మౌని - పతి సత్కరుణను

నెఱుకగా నుపదేశ - మిచ్చి యాసరణి
మఱువ వద్దనుచుఁ గ్రమ్మఱ నిట్టు లనియె:

'తగ విను రామ! యం-తర్భావితంబు
లగు సకలార్థంబు - లందుఁ గల్గినది,

యద్వయ చైతన్య - మగు దీనిసరణి
సద్వివేకంబుతోఁ - జక్కఁగా వినుము!

లలిమీఱఁ బ్రాప్త కా-లమునందు ద్రవ్య
ములు గల్గ, నొక కాల-మున లేకపోవు,

కలిమి లేములకు సు-ఖంబు, దుఃఖంబు
నిలను బొందుచునుందు - రెల్లమానవులు

గౌరవార్థంబుగాఁ గామింతు, రట్లు
కోరినంతనె సమ-కూడునే తమకు?

విను మట్టి వాసనా - విరహితేంద్రియము
లను గూడి సుఖదుఃఖ - లాభ లోభముల

యం దంటి యంటక - యఖిలకార్యముల
సందేహ మొందక - సల్పుచునుండు,

మగణితంబు సదేక, - మద్వయ, మాద్య
మగు బ్రహ్మ మొక్కటె - యఖిలమై యుండు,

నంతియె కాని త-దన్యమైనట్టి
వింతవస్తువు లేదు - వెదకి చూచినను,

ఇనకులాధీశ్వర ! - యీ యర్థమందు
ననువొంద బిల్వ ఫ-లాఖ్యాన మొకటి

కల దది చెప్పెదఁ - గ్రమముగా వినుము !

*** బిల్వఫలాఖ్యానము ***

సలలితమైయుండి - సాహస్రసంఖ్య
గలయోజనముల దీ-ర్ఘముగ నొప్పుచును,
చలనమొందక యుగ - సాహస్రములకుఁ
బొలియ కెప్పుడు మహా-భూతమై యెపుడు
వెలుఁగుచు, విమలమై - విస్ఫుటం బగుచు,
మహిమమీఱఁగ నొక్క - మారేడుపండు
తహపొంది యంతటన్ - దా నిండియుండు;
నది పురాతన మయ్యు - నమృతాంశుకరణి
సదమలమై ప్రకా-శంబుగా నుండు;
వడివీచు కల్పాంత - వాయువేగమున
కదఁగక, కదలక - యచలమై యుండుఁ;
జాలుగాఁ గోటియో - జనసంఖ్య నమరు
మూలాళితోడ ని-మ్ముగ జగంబులకుఁ
దానె సంతతము నా-ధారమై యుండు;
దానిచుట్టు నజాండ - తతు లనేకములు
పొలుపొంద విశ్రమిం-పుచునుండు' ననుచుఁ
బలికిన విని రామ-భద్రుఁ డి ట్లనియె:
'వరమునివర్య ! బి-ల్వ ఫలం బటంచు
నిరవొంద మీరు నా-కెఱుఁగఁ జెప్పినది
యాచిన్మయాత్మస - త్తనుచు నామదికిఁ
దోఁచుచున్నది, దాని - తుద మొదల్ దెలియ
నానతీయుఁ'డటంచు - నడుగ, వసిష్ఠ
మౌని సంతోషాబ్ధి - మగ్నుఁడై రామ !

వినుము చెప్పెద సర్వ - విశ్వంబు చిత్త
మున, నయ్యహంకార - మునఁ గల్గి, చాల

వెలయుచు నేవేళ - వివిధభేదములఁ
జలియించు టది చిత్త - చపలత గాని,

యరయ నన్యంబుగా-దని నీవు దెలియు
కొఱకు బిల్వఫలంబు - గుఱుతుఁ జెప్పితిని;

నిరతంబు పరసత్తు - నిర్వికల్పయును,
గరమొప్పు నట్టి య-ఖండైకరసయు,

నగణితం బగునట్టి - యర్థంబు విశద
ముగఁ జేయుటకు మది - ముదము రెట్టింప

భాసురంబుగు శిలో-పాఖ్యానసరణి
వాసిగాఁ జెప్పెద - వసుధాతలేంద్ర !

పావనం బతిగోప్య - పద మదే గనుక
సావధానముగాను - జక్కఁగా వినుము !

## * మహాశిలోపాఖ్యానము *

అది యె ట్లనన్న మ-హామృదులంబు,
సదమల తేజ, మా-శ్చర్యకరంబు,

పొరి నరంధ్రయును, సం-పూర్ణయు నగుచుఁ
జిరతరంబై యొక్క - శిల యుండు' ననిన

విని రాముఁ డనియె నో - విమలమునీంద్ర !
పెనుపొంద మీరు చె-ప్పినది చిత్రదము

ఘనము, శిలయు, నేక - కళయును, నరంధ్ర
మును దా నగుచునుండి - మొనసి లోకముల

నిరతంబు తనలోనె - నిండించు కొనుచుఁ
బొరి నాకసంబు గా-డ్పును నాఁచి కొనిన

పగిది నాకాశాది - పంచ భూతముల
నగణిత బహుపద్మ - జాండ కోటులను

ఆ మహాశిలలోని - కాకర్షణంబు
వేమఱు సేయుచున్ - విడుచుచునుండుఁ,

దా నరంధ్రయు నభే-ద్యం బగుచుండు,
నేనాఁడుఁ గనినఁదా-నేకమై యుండు,

జలజగదాశంఖ - చక్రాది చిహ్న
ములతోడఁ బరిపూర్ణ-ముగ నిండియుండుఁ,

దెలివియై తా సుషు-ప్తినిఁ బొందుచుండు,
నలఘు పరబ్రహ్మ - మదియే యటంచు

నగణితప్రజ్ఞతో - నా రాఘవుండు
విగతసంశయుఁడై, వి-వేకియై నిజముఁ

జెప్పిన విని యావ-సిష్ఠుండు లోన
నుప్పొంగి, హర్షాశ్రు - లుబ్బుచుండఁగను

పరమసంతోష ని-ర్భరమానసుఁడును
గరమొప్పఁ బులకిత - కాముండు నగుచు,

గద్గద కంఠుఁడై - కరములు మొగిచి,
చిద్గగనరహస్య - శిల కథ మిట్లు

చెప్పిన రాము నీ-క్షించి, తా మెచ్చి,
యప్పు డి ట్లనియె 'మా-యప్ప! శ్రీరామ!

యోహెూహెూ! నీ విమ్మ- హెూరు రహస్య
మూహించి చెప్పితి - వున్న దున్నట్లు,

అల పరబ్రహ్మ మీ - వైతి, వటంచుఁ
బలికి, క్రమ్మఱ రామ-భద్రు నీక్షించి,

సమ్మతంబుగఁ జాల - సంస్తుతిఁ జేసి,
యమ్మునివర్యుఁ డి-ట్లనియెఁ గ్రమ్మఱను.

## * అర్జునోపాఖ్యానము *

'విను రామచంద్ర! వి-వేకి యైనట్టి
జనపతి కదనాది - సకలక్రియలను

సలుపుచుఁ జిత్త వి-శ్రాంతి వహించు,
నిలను బద్ధుండుగాఁ, - డీయర్థమందు

బలముగా నర్జునో-పాఖ్యాన మొకటి
కలదు చెప్పెద నది - క్రమముగా వినుము!

ఇట మీఁద జముఁడు తా-నెల్ల దేహములఁ
బటురోష మెసఁగఁ జం-పను రోసి, తపము

తా నాచరించి భూ-తలబాధ యుడుపఁ
గా నోపునటువంటి - ఘనశౌర్యధనుల

నగధీరులగు నర - నారాయణులనఁ
బొగ డొందఁ దగినట్టి - పుత్రులఁ గాంచుఁ.

బరఁగ నయ్యిరువురు - బదరి కాశ్రమము
నిరవు సేసికొని య-హీనతపంబు

పొసఁగఁ జేయుచునుండె - భూభార ముడుప
నసహాయశూరులై - యమకులమందు

నారాయణుఁడు జన-నంబగుఁ, దోడ
భూరి కౌరవ వంశ-మునఁ బుట్టునరుఁడు,

అలఘు మైత్రినిఁ గృష్ణుఁ - డర్జునుం డనఁగఁ
బొలుపొందుచుందు, ర-ప్పుడు కౌరవులకుఁ

బాండవులకు దొడ్డ - బవరంబు గలుగు,
నండయై శ్రీకృష్ణుఁ - డపు డర్జునునకు

ననుగుణసారథి-యై యుండు. నిట్లు
మొనయు భారత యుద్ధ-మున నాదియందు

సదయుఁడై జ్ఞాతులఁ - జంప నొల్లకయ
విదితుఁడై పార్థుండు - వెఱచుచుండఁగను.

నాపార్థు నా కృష్ణుఁ - డాదరింపుచును
దీపితతత్త్వోప - దేశంబుఁ జేయు;

నది యెట్టు లనిన నీ-వాలించి వినుము!
చెదరక యుండెడి - చిద్రూప మెప్పుడు

చెడదు, దృశ్యంబులే - చెడిపోవు చుండు.
నడర నే నెవ్వఁడ - నని యంటివేని

నిజము భావించిన - నీవు నిర్జరుఁడ,
వజుఁడవు, నిత్యుండ, - వాత్మవు గానఁ,

బుట్టువు, చావు నె-ప్పుడు నీకు లేదు;
నెట్టన నీరీతి - నిఖిలజీవులకుఁ

జావు, పుట్టువు లేదు - చర్చించి చూడ,
నేవేళ నయ్యాత్మ - యిరవుగా నుండు.

ఇ ట్లగుచుండఁగా - నిది యది యనుచు
మాట్లాడఁగూడ, దా-త్మ పరాత్మ సర్వ

మయుఁడు, శాశ్వతుఁడు, చి-న్మయుఁ డటుగాన,
భయము లే దాత్మ కే-పట్టుననైన,

జడములు దేహముల్ - జలబుద్బుదములు
పొడమి యణంగిన - పోలికగాను

ఆయాత్మయందు దే-హము లుద్భవించి,
మాయగా నణఁగు. నా-త్మ చరింపకుండుఁ

గనుక జడములైన - ఘట్టములఁ ద్రుంపఁ
జనుభీతి నీకేల? - యరి సమూహములు

మొనసి నీతో యుద్ధ-మును జేతు మనుచుఁ
జనుదెంచినపు డీవు - శాంతిఁ బొందుదువె?

శౌర్యకలితరాజ - జన్మంబు నెత్తి,
కార్యంబు మొనసిన - కాలంబునందు

ఘనశూరుఁడై యుండి - కానిచందమున
వెనుక ద్రొక్కునె యెంత - వెఱ్ఱివాఁడైన?

తనుబాధ లెందు నా-త్మను బొందకుండు,
నని నిశ్చయించి యో-గాత్మ బుద్ధినను

అన్ని కృత్యములు బ్ర-హ్మార్పణం బనుచు
నున్న, నా బ్రహ్మంబు - నొందెద వీవు,

లోకులలో నింత - లోఁగిపో నేల?
ప్రాకటంబుగఁ జేయు - భండనం బిపుడు

**విలయ వాయువు వీచ - వింధ్యపర్వతము**
**చలియించినను సుశా-స్త్రము లలంఘ్యములు,**

**అటుగాన మనుజుల - యప్రబోధమునఁ**
**బటు దేహవాసనల్ - ప్రబలంబు లగుచుఁ**

బొలుచు, నాత్మజ్ఞాన - బుద్ధిచే వాస
నలు క్రమక్రమముగా - నాశంబు నొందు'

నని యనేకములుగా - నాకృష్ణుఁ డర్జు
నునకు బోధింప, న-నూన విజ్ఞాన

కలితుఁడై పార్థుఁడ-క్కడ ఘోరసమర
మలరి యనాసక్తుఁ-డై చేసి గెలుచు

నటుగాన నీవు ని-రాసక్తిఁ బొంది,
ఘటికుఁడ వై సర్వ-కార్యముల్ నడుపు!

మఱి జంతువులకు జ-న్మపరంపరలను
బొరిఁబొరి సంకల్ప - పూర్వకంబులుగఁ

బరఁగుచుండెడిడి వి-భ్రాంతియే కాని,
నెఱసి భావించిన - నిలుకడల్ గావు

అని యివ్విధంబుగా - నారాఘవునకుఁ
బనుపడ నర్జునో-పాఖ్యాన సరణి

వినిపించి, క్రమ్మఱ - విశ్వాస మొదవ
మునివర్యుఁ డవల రా-మున కిట్టు లనియె

జరుగుచుండు నీ - యర్థంబునకును
సరి [illegible] - చరితంబు వినుము!

## * శతరుద్రోపాఖ్యానము *

ఒక్కనాఁ డొక చోట - నొక్కభిక్షుండు
చక్కఁగాను సమాధి - సలుపుచున్నపుడు

తొలఁగి, యా చిత్తవృ-త్తులు లోనఁ బొడమి
గలిబిలిఁ జేయఁగాఁ - గర్మాశయమునఁ

జింత సేయుచుఁ గొంత-సేపూరకుండె,
నంతలో వింతగా - నతనిచిత్తమున

బలిమి నాత్మను ప్రతి-భా సవిశేష
కలనముల్ పొడమఁగాఁ - గామేచ్ఛలోన

జనియింప సామాన్య - జనభావకాంక్ష
నొనరంగఁ గూడ వే-ఱొక నరుఁ డయ్యె.

అతఁ డంత జీవలుఁ-డను పేరుతోడఁ
బ్రతిభాసఁ బొంది స్వ-ప్నపురంబునందుఁ

దా విహరించి మ-ద్యము ద్రావి, నిదురఁ
బోవుచు విప్రుఁడై - పుట్టి, యా కలను

నెఱి నన్నము భుజించి - నిద్రించి, కలను
మరల నం దొక్క సా-మంతుఁడై పుట్టి.

తెఱఁగొప్ప నన్నంబు - తిని నిద్రవోయి,
విరివిగాఁ గలను భూ-విభుఁడై జనించి.

పూలపాన్పున నిద్రఁ-బొంది స్వప్నమున
నాలో సురాంగన-యై జనియించె.

యలఘురతి శ్రాంత - యగుచు నిద్రించి,
మెలపుగాఁ గల నొక్క - మృగియై జనించె.

పరఁగ నిట్లుగ స్వప్న - భవపరంపరలఁ
బొరిఁబొరి ననుభవిం-పుచు నుండి, తుదను

నలఘు రుద్రుండు తా-నైతి నటంచుఁ
గలఁగాంచి సంతోష - కలితుఁడై లేచి,

యా కలలోఁ గల - లాత్మ భావించి
ప్రాకటాశ్చర్య సం-భరితాత్ముఁ డగుచు.

శివుని రూపును గలన్ - జెందినకతన
నవిరళవిజ్ఞాని-యై మది నిట్లు

దలఁచె ' నీ స్వప్న శ-తంబులు మాయ
వలనఁ గల్గి నిజంబు - వలె దోఁచె మదికిఁ.

జెదరెడి మరుమరీ-చికలయం దెపుడు
నుదకంబు లేకుండి, - యుండిన ట్లుండు.

ఆకరణిని బ్రహ్మ-మందు విశ్వంబు
లేకుండి యుండిన - లీలగాఁ దోఁచు

నట్టి సంసార మా - యారణ్యమందుఁ
బుట్టిన స్వప్నాంగ-ముల ననేకములఁ

గనుచుండఁగానె యు-గములు పెక్కేఁగె'
నని తనలోన దా-నాశ్చర్యపడుచు,

నరిగి యత్యాది దే-హము లున్న జాడ
నరయుచుఁ దొలిభిక్షుఁ-డగుచుఁ దానున్న

తనువు నీక్షించి, చై-తన్యంబు దాని
కనువంద నీయఁగా - నది రుద్రుఁ డయ్యె,

నారుద్రుఁ డీరుద్రుఁ - డందుండి పోయి,
గౌరవంబుగఁ జిదా-కాశ సంస్కృతినిఁ

జెందిన జీ వటుఁ - జేరి ప్రాణముల
నందీయఁగా రుద్రుఁ-డయ్యె జీవటుఁడు

మొనసి య ట్లవ్విప్ర-ముఖ్య దేహములఁ
గని ప్రాణముల నియ్యఁ-గా, వారలెల్ల

మురువుగా శతరుద్ర-మూర్తులై రనఘ!
గరిమ నాభిక్షు సం-కల్పంబు లట్ల

తొలఁగక జీవ టా-దుల రూపు లగుచు
సలలిత సంవిదం-శంబులై తోఁచి.

నిలుకడ లైనట్ల-నే యుండె నన్ని
యలఘు మనోమాయ' - లని శతరుద్ర

జననక్రమముఁ జెప్పి - సంయమీశ్వరుఁడు
మనము రంజిల్లఁగా - మరల ని ట్లనియె

'వినురామ! యిఁక నొక్క - వృత్తాంత మమర
ననఘ సుషుప్తమౌ - నాఖ్యానసరణి,

ఘనమది యె ట్లన్నఁ - గాష్ఠతాపసుఁడు
ననఁగ, జీవన్ముక్తుఁ-డన రెండుగతులు

గల, వందు నిస్సార - కర్మకర్తృత్వ
ముల వీడి యింద్రియ-మ్ముల నణఁగించి,

కనుమూసి నిదురించు - గతి నున్నవాఁడు
ఘనుఁ డతఁ డెవఁ డన్నఁ గాష్ఠతాపసుఁడు;

అదియుఁగాక విరక్తి - నాత్మ యందుంచి
మొదట యుక్తాయుక్త-ములను దా నెఱిగి,

ఘనతరసచ్చిదే - కరసంబునందు
మనము నెల్లపుడును - మగ్నంబు చేసి,

**యజ్ఞానజనులలో - నఖిలకృత్యములఁ**
**బ్రజ్ఞతో నడిపించు - పావనాత్మకుఁడు**

**వంతుకెక్కిన సుజీ-వన్ముక్తుఁ; డిట్టి**
**శాంతు లీయిరువురు - నము లెట్టు లనిన**

సరిగాను చిత్తని-శ్చయరూపమైన
పరమాత్మ సత్తాను-భవమె మౌనంబు,

మొనయు తన్మౌనంబు - మూఁడుచందముల
నొనరు న దెట్లన్న - నూహతో వినుము!

ఊరక మాట్లాడ-కున్న చందంబు
నారయ వాఙ్మౌన-మగు, నింద్రియముల

మద మణంచుట యక్ష - మౌనమౌ, నెపుడు
నిదురించు విధముగా-నే పరాత్పరము

ననుభవసరణిగా - నంతరంగమునఁ
గనుచుండినదియె పో-కాష్ఠమౌనంబు,

అలర నీ మౌనత్ర-యమునందుఁ జూడ
నలువొందు కాష్ఠ మౌ-నంబు మే, లదియె

ధన్యం, బనాయాస-దము, సదాద్యంత
శూన్యయు నైన సు-షుప్తి చిత్సత్త

మదిని ధ్యానించి త-న్మయుఁడైన నదియె
కదలని మౌనసం-గతమైన మబ్బు,

పరఁగఁగా నాత్మ వి-భ్రాంతి ప్రపంచ
మరసి, యస్థిర మని - యా యర్థమందుఁ

గుదిరిన మౌనమే - గూఢ సుషుప్తి,
యదియు నెన్నఁగ నేక-మై, యనేకముగ

విమలమై వెలుఁగు సం-విద్రూప మదియె
నమల చైతన్యాంశ - మదియేను ఎఱుక,

మతి నిల్పినను సుషుప్తి - మౌనమై యుండు,
నతిశయమైన స - మ్యక్జ్ఞానపటిమ

చే నిరతసమాధి-సేయు ధన్యుండు
జ్ఞానయోగి యనాఁ బ్ర-శస్తుఁడై యుండు,

వరకాష్ఠమునికి, జీ-వన్ముక్తుఁడైన
పురుషున కనుభవం-బుగ నుండి, చాల

నొనరు సంవిత్తత్త్వ - మొకటియై యుండుఁ;
గనుక నయ్యిరువురిగతు - లేక మగును.

అది యెట్లయనిన దే-హాదివాసనలు,
మదియును, బ్రాణముల్ - మగ్నమై యచట

గుఱుతు దప్పక యణం-గుచు నుండునదియె
పరమపదం బండ్రు - పండితోత్తములు.

## * బేతాళోపాఖ్యానము *

అరయ సంసార మ-హాస్వప్న మందుఁ
బరఁగెడి బేతాళు-ప్రశ్న వాక్యములు

ఉన్నవి చెప్పెద - నొప్పుగా' ననుచు
నన్నరపతి కిట్టు-లనె వసిష్ఠుండు:

'విను రామ! కర్కటి - విధముగా జ్ఞాన
ధనయుక్తుఁడైన బే-తాళు ప్రశ్నములు

గల, వవి యెటులన్నఁ - గ్రమముగా వినుము!
పొలుచు బేతాళుండు - భూతలమందు

దిట్టఁడై నడిరేయిఁ - దిరుగుచు నుండు,
నట్టివాఁ డొక్కనాఁ-డం దొక్కపురిని

నడిరేయి నొక నర-నాథు నీక్షించి
పెద బొబ్బలిడి వెఱ-పించి యి ట్లనియె

'ఒకఁడవే చిక్కితి-వో రాజచంద్ర!
ప్రకటంబుగాఁ బట్టి - భక్షింతు నిన్నుఁ,

బ్రదికెదవేని నా - ప్రశ్నోత్తరములు
విదితంబుగాఁ దత్త్వ - వేత్తవై తెలుపు?

పరఁగ నే రవిరశ్మి-పరమాణువులును
గురుతర బ్రహ్మాండ-కోటులై యుండుఁ

తనియక యే మారు-తము వీచుచున్న
నొనరుగాఁగను రేణు-వులు మింట నెగరు?

కల నుండి కలకుఁ ద-క్కక పోవుచుండి
యలఘు తేజోమయ-మగు నాత్మరూపు

విరివిగా విడుచుచున్ - విడువఁ డెవ్వండు?
అరటికంబం బయ్యు - నాకులు, పొరలు

నగుచున్న కరణి నే-యణు వతివృద్ధి
యగుచుండు నెప్పుడు?, - నణుతను విడని

పరమాణువునకు నే-ర్పడ నణువైన
ధర మేరు గగన ప-ద్మభవాండ సమితి

మురువొప్పు నవయవం-బులు లేక యెపుడు
పరమై వెలుంగు నే-పరమాణు శిఖరి?

శిలలోఁ గలుగుచుండు-పుష్ట్యాదు లెపుడు?
తెలియఁజెప్పుము నీవు-తేటగా నిపుడు'

అని ఝుంకరించి యి-ట్లడుగఁగా నగుచు,
విని యానృపాలుండు-వెఱవ కి ట్లనియె

బేతాళ! నీవు సం-ప్రీతితో వినుము!
భూతాదియై పరి-పూర్ణుఁడై నట్టి

యతఁడు సంవిత్సూర్యుఁ-డఖిలరూపముల
క్షితిమీఁద వెలిఁగించుఁ-జిత్ప్రభయందుఁ

ద్రస రేణువులు జగ-త్త్రయమునై యెపుడు
రసయుక్త విజ్ఞాన-రవిచే వెలుంగు;

ఆకారసత్త, య-నాకారసత్త,
ప్రాకటంబుగఁ బరి-స్పందసత్తయును

ఖ్యాతిగా నొప్పు చి-దానందశుద్ధ
చైతన్యసత్త యీ-సర్వంబు నొక్క

పరమాత్మ యనుచుఁ జె-ప్పందగుచుండు
మెఱయు తన్మాయా స-మీరకంపమున

జగము లనెడి మహా-స్వప్న జాలమున
నగణిత స్వప్నంబు-లరుదుగాఁ గాంచు,

నది పరబ్రహ్మమౌ,-నా బ్రహ్మ మెపుడు
పదిలమౌ శాంతి సం-పన్నమైనట్టి

పరమనిజస్వరూ-పము వీడకుండు
నరఁటికంబము చుట్టు-నాకులుఁ, బొరలుఁ

బుట్టుచు లయమునుం-బొందుచునుండు
నట్టిచందంబుగా-నా బ్రహ్మమందుఁ

బొరలు, వృత్తము, పఱ-పును గల్గి, విశ్వ
మరుదుగాఁ గల్గుచు-నణఁగుచునుండు

మొగి నలభ్యము, సూక్ష్మ-మును, విమలంబు
నగుపరమాత్మరూ-పణు వగు నదియె

అగణిత శక్తి న-నంత ప్రకాశ
మగుటను గనకాచ-లాదులై యొప్పఁ,

బరువడిగా దీని-పరమాణు వితతు
లరయఁగా మేరు సూ-ర్యాదులు నయ్యెఁ,

బర్వి యొప్పుచు నుండు-పరమాణు వితతి
సర్వపూరక మహా-శైలమై వెలసె.

అది మహాజ్ఞప్తి మ-యంబై మనమును
గదియఁగా, దాని మ-గ్నం బయ్యె జగము,

తనియు విజ్ఞాన మా-త్రం బీప్రపంచ'
మని యా నృపాలుఁ డి-ట్లనుభవసరణి

గా తగన్ వినిపింపఁ-గాను మోదించి
భేతాళుఁ డతని సం-ప్రీతితో మెచ్చి,

యతని వీడ్కొని చని-యాహార ముడిగి,
మతిమంతుఁడై చిత్స-మాధియం దుండెఁ

దనమందిరమున కా-ధరణీంద్రు ఁడరిగె?
ననుచు భేతాళ వృ-త్తాంతంబు రామ

భూపాలునకుఁ జెప్పి,-'బుద్ధి విశ్రాంతి
నీపగిదిని బొందు-టిల దుర్లభంబు,

అతిసులభంబుగా-నవని విం కొకఁడు
హితమొప్ప సాధించు-నిట్టి విశ్రాంతి

మురువొప్ప నీయర్థ-మున నతిహీన
మెఱిఁగింతు' నని యమ్ము-నీంద్రుఁ డిట్లనియె

## * భగీరథోపాఖ్యానము *

'అనఘ! భగీరథుఁ-డను మహారాజు
పనుపడ భూమినిఁ-బాలింపుచుండి,

మనుజులు సంసార-మాయాబ్ధిలోను
మునిఁగిపోయెడి చంద-ములను భావించి,

మొనసి పశ్చాత్తాప-మును బొంది, యపుడు
తనమదిలోఁ దానె - తలఁచె ని ట్లనుచుఁ

"గటకటా! మానవుల్ - కష్టసంసార
మటమటమని పీడ - కాశచేఁ జిక్కి,

కాఁపురంబులు సేసి - కడుపటఁ జచ్చి,
పాపకూపములలోఁ - బడిపోదు; రిట్టి

హింసాస్పదంబును, - హేయంబునైన
సంసార మే నొల్లఁ - జాలు, నివెల్లఁ

దలఁప నిస్సార కృ-త్యంబులే కాని,
యలఘుసారములు గా, - వాయు వహములు,

రాత్రులు జరిగి తే-రకుఁ బోవుఁ గనుకఁ,
బుత్ర మిత్రాదుల - పొత్తు నా కేల?'

యని గాఢవైరాగ్య - మగ్గలింపఁగను
జని, త్రితలుండను - సద్గురుఁ జేరి,

తన యభిప్రాయ - మంతయుఁ దెల్పి మ్రొక్కి,
కనుల నీరొల్క గ-ద్గద కంఠుఁ డగుచు

వివిధ కుసంసార - విషమరోగమున
కవధి యెన్నఁడు గల్గు? - నానతిం' డనినఁ

త్రితలుఁ డిట్లనె రాజ! - దీనికి నవధి
యతులిత చిన్మాత్ర - మగు నాత్మ నాత్మఁ

దలఁచి నీవది యైనఁ - దద్రోగ మణఁగు,
నలఘుతరారోగ్య - మబ్బు, నీకనిన

విని నృపాలుఁడు పల్కె - విమలచిన్మాత్ర,
మనుపమం, బచ్యుత - మని మీ కరుణను

దోఁచు చున్నది; యందుఁ - దొలఁగక చిత్త
మే చందమున నిల్చు? - నెఱిఁగింపుఁ' డనిన

విని యా త్రితలుఁడు భూ-విభున కి ట్లనియె:
'అనఘ! సంసార మ-హారోగమునకు,

మొనయు రాగ ద్వేష - మోహవ్యథలకు
ఘనతారౌషధ మహం-కార శోషణము;

కావున నిపు డహం-కార బీజమును
నీవు సుజ్ఞాన వ-హ్ని జ్వాల యందు

వెరవరివై కాల్చి - విడిచితివేని
మరల దేహంబున - మాయాంకురంబు

పుట్ట, దప్పుడు ముక్తిఁ - బొందుదు వీవు.
నెట్టన నామాట - నిజముగా నమ్ము!'

అని త్రితలుఁడు పల్క - నా భగీరథుఁడు
మనమున నూహించి మరల ని ట్లనియె:

'వరగురు స్వామి! ప-ర్వతముపై వృక్ష
మఱలేక పుట్టియు-న్నట్టి చందమునఁ

దనువం దహంకృతి - తా నుదయించి
మనములో నెలకొని - మమకారములను

బొడమింప, నెట్టి నే-ర్పున దానిఁ గొట్టి
పడవైతు?' ననఁగ నా - భక్తునిఁ జూచి

తిరమైన దయతోడఁ ద్రితలుఁ డి ట్లనియె:
'ధరణీశ! నీవు చి-త్తంబు నడంచి,

సకలంబు వర్జించి - శాంతి వహించి,
యకలంక హృదయుండ-వై, భీతి విడిచి,

తలకొని యీషణ - త్రయమును గెల్చి,
యలరు నింద్రియమనో-హంకారములకు

శత్రుండవై, శాంతి - శమదమంబులకు
మిత్రుండవై, మాస -మీపంబు నకును

రాక, యేవేళఁ బ-రస్వరూపంబు
నేకాగ్రబుద్ధితో - నెపుడు చూచుచును,

బొరిఁ జిత్తవిశ్రాంతిఁ - బొందిన దనుక
నరయ భిక్షాహారి-వై, దీనదశను

పొంది నిస్పృహుఁడవై - భూమిపైఁ దిరుగు;
మందుచే ముక్తుండ - వయ్యెద' వంచుఁ

ద్రితలుఁ డీగతి నుప-దేశించినట్టి
యతులితోక్తులు విని - యా భగీరథుఁడు

ఆ మీఁద నిజరాజ్య-మంతయు విడిచి,
కామాది శత్రు వ-ర్గమును బోనడఁచి,

సర్వసన్న్యాసభా - స్వర నిష్ఠఁ బూని,
సర్వదేశములందు - సంచరింపుచును,

భిక్షాశనుండై, య-భేదభావమున
నక్షీణవిశ్రాంతి - ననుభవింపుచును,

సరసుఁడై కొన్ని వ-త్సరములు ధరను
జరియించి, మార్గవ-శంబుగాఁ దనదు

పురిఁ జేర వచ్చిన, - పురవాసు లతని
నరుదుగాఁ జూచి, ని-జాలయంబునకుఁ

దాము దోడ్కొని పోయి - తగఁ బూజఁ జేసి,
ప్రేమాతిశయమున - భిక్షలు పెట్టి,

యాదరింపుచునుండి; - రతని రాజ్యంబు
ప్రోదిగాఁ బాలించు - పుణ్యాత్మకుండు

రయమున నాభగీ-రథు చెంతఁ జేరి,
భయభక్తు లెసఁగఁగాఁ - బ్రణమిల్లి పలికె:

'ఓ మహాయోగీంద్ర! - యో కృపాసాంద్ర!
నా మీఁద దయయుంచి, - నాఁటి చందమున

నిలను జరింపఁగా - నేల? యిచ్చోట
నిలువవే! నన్ను మ-న్నించి' యటంచు

నతఁడు ప్రార్థింపఁగా - నా భగీరథుఁడు
హిత మొప్ప దద్రాజ్య - మేల నొల్లకను,

మఱి యందు నిల్వ కు-న్మత్తుని పగిది
సరగునఁ జని భూమిఁ - జరియింపుచుండి,

మార్గవశంబుగా - మఱియొక్క చోట
భర్గుఁడో యన నొప్పు - పరమదేశికుని

కడ కేఁగి మ్రొక్కి, య-ఖండాత్మబోధ
విడువక తా ననుభ-వించిన రీతి

వినిపించి, త్రితలుని - వీడ్కొని వేగఁ
జని, భగీరథుఁడు భూ-చక్రంబునందుఁ

దిరుగుచుండఁగఁ, దన-దేశంబు మున్ను
పరిపాలనము సేయు - ప్రభువు నశించి

పోవఁగా, నపుడు త-ద్భూమికి రాజు
కావలె నని మంత్రి - గణములు గూడి

చని, యా భగీరథు - జగతిపై వెదకి,
కని మ్రొక్కి ప్రార్థించి, - క్రమ్మఱ నతనిఁ

దోడుక వచ్చి, పొం-దుగ రాజ్యపదము
నడరఁ బాలించుట - కపుడు పట్టంబు

గట్టఁగాఁ, బూర్వ ప్ర-కార మారాజు
నెట్టన నందుండి - నిస్పృహుండగుచు,

మొనసి సప్తసముద్ర - ముద్రిత ధరణి
నొనరంగఁ బాలింపు-చుండి శమంబు,

దమమును, పరమశాం-తము, శత్రుమిత్ర
సమధర్మనత గల్గి - శాంతినిఁ బొంది,

యరయ జీవన్ముక్తు-డై యుండె' ననుచుఁ
బరఁగ భగీరథో-పాఖ్యాన మమరఁ

బట్టుగా బోధించి, - ప్రతిబంధకములు
నెట్టనఁ బాయక - నే యెవరికైన

నిలువ దాత్మజ్ఞాన - నిష్ఠ యెన్నటికి,
నెలమి నీ యర్థమం-దిల శిఖిధ్వజుని

చరితంబు చెప్పెద - సావధానముగ
నరలేక విను' మంచు - నావసిష్ఠుండు

సచ్చరిత్రుండైన - జానకీపతికి
మచ్చికతోఁ జెప్పి, - మరల ని ట్లనియె:

## * శిఖిధ్వజోపాఖ్యానము *

'అనఘ! శిఖిధ్వజుఁ-డను మహారాజు
పనుపడ భూమినిఁ - బాలింపుచుండె,

నతని భార్యామణి-యైన చూడాల
హిత మొప్పఁ బతిభక్తి - నెనయుచునుండె;

నా దంపతులు వృద్ధు-లై యటమీఁద
వేదాంతశాస్త్రముల్ - విన నిశ్చయించి,

వైరాగ్యకలిత భా-స్వర వివేకమున
సారజ్ఞుఁడైనట్టి - సద్గురు చెంతఁ

జేరి శుశ్రూషలు - చేసి మెప్పించి
భూరిసద్భక్తితోఁ బొసఁగ వేఁడినను

నాగురుం డిరువుర - కప్పు డధ్యాత్మ
యోగక్రమము లన్ని-యును కృపమీఱఁ

దెఱఁగొప్పఁగా నుప-దేశంబుఁ జేసి
యరిగె; శిఖిధ్వజుం-డా యాత్మబోధ

మఱచి యెప్పటిరీతి - మహి నేలుచుండె
సురుచిరయుక్తిచేఁ - జూడాల గురుని

పదభక్తి మఱువక, - పరమార్థసరణి
మదిని భావించి స-మ్మతి నిట్లు దలఁచె-

'ధీరుఁడై గురుఁ డుప-దేశించి నట్టి
సారార్థసరణి వి-చారించి చూడఁ

బంచభూతములచేఁ - బ్రభవించి ధరను
మించి నటించు ని-మ్మేను నేఁ గాను;

అందుఁ బుట్టు దశేంద్రి - యాళి తద్విషయ
బృందంబు గాను, హృ-త్ప్రేరితం బైన

తనువు సలిల బుద్బు-దంబు చందమునఁ
బెనుపొంద నుదయించి, - పెరిఁగి, నటించి,

వంచించు నక్కాల - వశమునఁ దుదను
పెంచు కైవడి పడి - భిన్నమై పోవు,

నటుగాన నేను దే-హం బనుమాట
సట యగున్; ప్రాణపం-చకము నే ననిన

నది సూక్ష్మదేహాంగ - మస్థిరం బగుట
నిదియును నేను గా - నెఱిఁగి చూచినను.

మది నే ననిన మహా - మాయతో నెపుడు
కదిసి సంకల్ప వి-కల్ప జాలములఁ

బొరిఁ బొరి నూరకే - పుట్టింపుచుండు.
నరయ సంశయ చంచ-లాత్మకం బగుచు

మొనసి తా నణుమాత్ర-ముగ సంచరించుఁ
గనుక మానస మేను-గా నెన్నటికిని;

నిలుకడ యగు బుద్ధి - నే నంటినేని
నలరారఁగా నిశ్చ-యాత్మక వృత్తి

కలది తానై, యహం-కార భావమున
కెలమిని నిరతంబు - హేతువై యుండుఁ

గాన, నే నాబుద్ధి-గా; నహంకార
మే నని చూచిన - నిలను బాలకునిఁ

బట్టిన భూతంబు - పగిది జీవంబు
నట్టిట్టు జరుగ నీ-యక చుట్టి పట్టి,

సత్తను మఱపించి, - జడత నొందించి,
చిత్తవృత్తులఁ బెంచి - చేష్టింపుచుండుఁ

గావున, నే నహం-కారంబు గాను;
జీవంబు నే నని - చింతింతు ననిన

మాయచేతను బ్రాణ-మయమై కలంక
మే యెడలను వీడ - కెనయుచు నుండు

మదియదే నేఁ దీని - మర్మంబుఁ గంటి,
నదియు నేఁ గాను; మ-హాసుకుమార

మగుచిత్తు సర్వంబు - నణఁగిన వేళ
మిగిలి తా నన్నింటి - మీఁద వెలుంగు;

నీ రహస్యము నేఁటి - కెఱుకకు నెఱుక
గా రయంబున నేను - గంటిఁ జిత్తమునఁ,

బ్రతిఫలించిన చిదా-భాసతో భూత
వితతు లెల్ల ననేక - విధములుగాను

నమలచిత్సత్తచే - నలరి జీవించు:
రమణీయమగు సూది-ఱాతి చెంగటను

దొరకొని యినుప సూ-దులు సంచరించు
కరణి జడములైన - ఘనభూతములును

నెరయు చైతన్య సా-న్నిధ్యంబునందుఁ
జరియించు నీ రహ-స్యము నేను గంటి,

నా చిదాత్మనైతి; - నఖిలేంద్రియములు
నాచెంత నటియించు - నానావిధముల,

విని కన నేర్చు సం-విత్‌జ్ఞాన పటిమ
[1]ఘన కపటాజ్ఞేయ - కలనచే, జిక్కి,

జడత నొందుచును ని-జస్వరూపంబు
నడరార మఱచి, మా-యలకు లోనగుచుఁ

బుట్టి గిట్టుచునుండు - పోల్కినిఁదోఁచు,
నిట్టి జగద్భ్రాంతి - యెఱుకయం దణఁగు;

నింతకాలంబున - కెఱిఁగితి, నాత్మ
చింతింప నంతయుఁ - జిద్విలాసంబు.

అని పెక్కుగతుల వే-దాంతార్థములను
మననంబు చేసి స-మాధి నేమఱక

చిరనిష్ఠతో నభ్య-సింపుచుండఁగను
గురుకటాక్షంబునఁ - గుదురైన బుద్ధి

చెదరకుండఁగ యోగ-సిద్ధి లభించె;
ముదిమి దొలంగె, న మ్ముదిత దేహమున

నలువొప్ప నవయౌవ-నంబు ప్రాపించెఁ;
జలనరాహిత్యంబు, - సర్వశాంతంబు

మొదలైన సుగుణ స-మూహ మాయింతి
యెద నుదయింపఁగా - నింపు సొంపెసఁగ

సంతోషభరిత సు-స్వాంతయై యుండి,
యంతలో నొక్క నాఁ-డాత్మేశుచెంతఁ

జేరి నిల్చినఁ, జూచి - చిఱునవ్వు నవ్వి
యా రాజు పల్కె నె-య్యమున ని ట్లనుచు

1. ఘనతరాజ్ఞాన సం-కలనచేఁ జిక్కి- వా.

చూడాల! నీకు భా-సుర యౌవనంబు
పోఁడిమి నే రీతిఁ - బొడమె వింతగను?

ముదిమి యెక్కడ డాఁగె? - మోహనతేజ
ముదయించి నీ మేన - నొప్పుచుండుటకు

హేతువే? మా చంద - మెఱిఁగింపు' మనిన
భూతలేశ్వరున క-ప్పొలఁతి యి ట్లనియె:

'నరవర! యీ యౌవ-నంబుఁ, దేజంబుఁ
బరభూమి కరిగి సం-పాదింప లేదు,

వినుము! తొల్లిటి మేను - విడుచుట లేదు,
జననాథ! క్రమ్మఱ - జనియింప లేదు,

ఇది నాకు సహజమై-యే యున్న దిపుడు,
కుదురుగా మనల కా-గురుఁడు సత్కృపను

నుపదేశ మిచ్చిన - యుచితవాక్యముల
నెపుడుఁ దలంపుచు, - నెఱుక నేమఱక,

యీ సర్వమును బాసి, - యేకమై నిలిచి,
తా సర్వమగు పర-తత్త్వంబుఁ గనుచు,

నల గగనసమాన-మగు మదిలోనఁ
దలఁగక నిస్సంగ-తను నే రమింతు;

లే దుదయంబును, - లేదు నాశమును
లేదు లేనిది, యాత్మ - లీలఁ గల్గినది

యనుభూతి యనుభూత - మనుచు సుఖింతు;
జననాథ ! దోష, రో-షము లాత్మ కిపుడు

దోఁపకున్నవి మహా-తుర్యభావమున
కాపట్య కలిత జ-గజ్జాలమునకుఁ

ప్రభువునై యిహమును - బాసి, పాయకను
శుభదృష్టి నను నేనె - చూచి చొక్కుదును;

మొనయు రాగద్వేష - ముఖ్య శత్రువులఁ
దునుమాడి, చిత్తవృ-త్తుల పొత్తు వీడి,

సరససద్గురువాక్య, - శాస్త్రదృష్టములు
కర మర్థితో నన్నుఁ - గలిసి మెలంగ,

నే నాత్మతత్త్వంబు - నిశ్చయించుకొని,
యానంద మొందుదు; - నాయాత్మ కెపుడు

అదిరూప, మిదిరూప - మని చెప్పఁగూడ,
దది సర్వవిషయేంద్రి - యాళి నీక్షించుఁ

గాని, దానిని నివి - గనుఁగొనఁ జాల;
వా నిర్మలాత్మ త-త్త్వానుభవంబు

గలిగియున్నది; సదా - ఖండ లక్ష్యమున
నిలిచి, చలింపక - నేను నే నైతి'

ననుచుఁ జూడాల ని-జాత్మానుభవము
వినిపింప, నంతయు - విని శిఖిధ్వజుఁడు

ఆ యింతి పలుకుల - కప్పు డర్థంబు
చేయనేరక రాజు - చిడిముడి ననియెఁ.

'జూడాల! నీ వవి - చోద్యంబు దోఁప
నీడ వచించితి - వింతియే గాని

అర్థమే గాని నీ-యనృతోక్తులందు
సార్థకం బున్నదే - చర్చించి చూడఁ?

బడుచుఁదనంబుచేఁ - బలికితి విన్ని
పడఁతి! నీ కిటువంటి ప్రౌఢోక్తు లేల?

చాలించు' మని రాజు - చపలాత్ము డగుచుఁ
దా లేచి పోయె, న-త్తరుణి చూడాల

తనమదిఁ దా నిట్లు - తలంచె 'నీ నృపుని
ఘనముగాఁ జుట్టిన - కర్మబంధంబు

తెగిపోవుదనుక ము-క్తిని నమ్మలేఁడు,
తగ దిప్పు డితని కీ-తత్త్వంబుఁ దెలుప'

ననుచుఁ దాను సమాధి - నభ్యసింపుచును
దనయింటిలోనే స్వ-స్థంబుగా నుండి,

ఘనయోగ మొనరించి - గగనయానదు
లనెడు సిద్ధులఁ బొంది - యానంద మొంది,

జనకుఁ డర్భకునకుఁ - జాలుగా విద్య
లనువొంద బోధించు - నట్టిచందమునఁ

దననాథునకు సతి - తత్త్వార్థములను
పనిఁ బూని కొన్ని య-ర్థములు దెల్పఁగను

వినినందుచేత వి-వేకంబు కొంత
జనియించె నృపున కా-సమయంబునందు,

విసువక యేవేళ - వేదార్థములను
వసుధామరుఁడు. శూద్ర-వానికిఁ దెల్పు

పగిదినిఁ జూడాల - పామరుండైన
మగనికి యోగక్ర-మముఁ దెల్పుచుండె'

నని శిఖిధ్వజుని వృ-త్తాంత మమ్మౌని
వినిపింప రామభూ-విభుఁ డిట్టు లనియె;

గురుచంద్ర! యా రీతి - గురుతరార్థముల
నరమర లేక నె-య్యంబు రెట్టింప,

గెంట కా సిద్ధయో-గిని శిఖిధ్వజున
కంటి బోధించు వే-దాంతార్థములను

నతఁడె తెలియకుండె - ననిన నిం కెవరు
ప్రతిభతోఁ దెలుతు రా - పరమార్థములను?

ఆ దంపతులకు మ-హాకృప మీఱ
వేదాంతసూక్తుల - వినిపించుగురుఁడు

ఒక్కఁడై, యుపదేశ - మొకటియై యుండి,
యెక్కువై చూడాల - యెఱిఁగిన దేమి?

ఇది యాశిఖిధ్వజుఁ - డెఱుఁగని దేమి?
అది తెల్పుఁ' డని రాముఁ-డడుగ వసిష్ఠ

ముని యిట్టు లనియె 'న-మ్ముదిత చూడాల
మునుపటి సంభవం-బుననుండి ముక్తిఁ

గామించి భూమికల్ - క్రమముగాఁ గడచి,
యా మీఁదఁ జరమ దే-హంబు ధరించి

యున్నందుచే గురుఁ - డొకమాఱు తనకుఁ
బన్నుగాఁ జెప్పిన - పరమార్థ సరణి

మననంబుఁ జేసి స-మ్మతిఁ బొందె నపుడు,
జననాయకుఁడు పూర్వ-జన్మంబులందు

రమణీయముక్తిఁ గో-రక, సుకర్మముల
నమరఁ జేసి నరేంద్రుఁడై జనియించి,

చూడాలతోడ భా-సురతత్త్వ సరణి
వేడుకగాఁ దాను - వినుటయే కాని,

తరుణిరీతినిఁ బర-తత్త్వచింతనముఁ
జిరనిష్ఠ నొంది చే-సినవాఁడు గాండు;

కావున నజ్ఞాన - కలితుఁడై, తత్త్వ
మేవిధంబున విన్న - నెఱుఁగలేకుండె.

నరనాథ! యెవరికై-నను గురుఁ డొక్క
గుఱిఁ జెప్ప; నాగుఱి - గొప్పగా నెంచి,

విని యది నమ్మి వి-వేకియై, కష్ట
మున కోర్చి తత్త్వార్థ-మును విచారించు.

వానికి దొరకు జీ-వన్ముక్తి సౌఖ్య;
మే నిందు కితిహాస - మెఱుఁగఁ జెప్పెదను.

చక్కఁగా విను రామ-చంద్ర!' యటంచు
మక్కువ నమ్మౌని - మరల ని ట్లనియె:

## * కిరాతోపాఖ్యానము *

'విని రాఘవేశ్వర! - వింధ్యాద్రిమీఁద
నొనరఁ గుటుంబియై - యొక కిరాటుండు

నుండి ధనాసక్తి - నుండిన చోట
నుండక, వనములం - దొంటిగా మౌని

కరణిని దిరుగ జాం-గల దేశమందు.
మెఱుఁగైనగవ్వ స-మీపంబుగాను

గనిపింప 'నది వెండి - గాఁబోలు' ననుచుఁ
జని చాలవెదుక న-చ్చట గవ్వ తనకుఁ

గనఁబడకున్నఁ ద-త్కాంక్షను విడువ
కను వాఁ డచట నున్న - కసవెల్లఁ బెఱికి,

యాడాడ వైచుచు - నలయుచు నందె
మూఁడుదినంబు లి-మ్ముగ గవ్వమీఁది

యాస వీడక చూడ - నమరరత్నంబు
వాసిగా దొరకఁగా - వాఁడు మోదించి,

దానిఁ గైకొనిపోయి - ధనవంతుఁ డయ్యె
నోనరనాథ! వాఁ-డొక్కటి వెదకి

యొకటిఁ గన్నట్లు గు-రూపదేశార్థ
మొక కాలమునఁ దోఁచ-కుండినఁ గాని

వేసటఁబడి దాని - విడువ 'కాత్మార్థ
మాసక్తితోఁ జూతు'-నని మానసమునఁ

బుట్టిన సంశయం-బులను ఖండించి,
పట్టుగా మనమందె - భావించెనేని

అమరసన్మణి వాని - కబ్బిన రీతి
రమణీయ సుజ్ఞాన - రత్న మీతనికి

సరగున దొరకు, మో-క్షధనాఢ్యుఁ డగును,
పరిపూర్ణ శాంతి సం-పన్నుఁ డౌ' ననిన

'తాపసోత్తమ! శిఖి-ధ్వజుఁడు మోక్షంబు
నేపగిదినిఁ బొందె? - నెఱిఁగింపుఁ డిపుడు'

అనిన వసిష్ఠు డి-ట్లనె 'రామచంద్ర!
విను మా శిఖిధ్వజు - వృత్తాంత మతఁడు

చూడాలసుజ్ఞాన - సూక్తు లాలించి
యాడ కాడకు మోక్ష - మం దాశ నుంచి,

పరమాత్మతత్త్వాను-భవము గాకున్నఁ
బరితాపమును బొంది - పట్టణమందు

నిలువ సైరింపక - నిఖిలతీర్థములఁ
బొలుపొందఁ గ్రుంకుచు - భూప్రదక్షిణముఁ

గావించి వచ్చెదఁ గా కని-పోయి,
తా వేగఁ బుణ్యతీ-ర్థములందుఁ గ్రుంకి

క్రమ్మఱ వచ్చి చ-క్కఁగఁ జిత్తశాంతి
నమ్మహీపతికి లే-కారటమొంది,

వైరాగ్యమున రాజ్య - వైభవంబులను
దా రోసి విడిచి యం-తఃపురమందుఁ

జూడాలయుండిన - చోటికిం బోయి,
పోఁడిమి నాసతిన్ - బుజ్జగింపుచును

ప్రియము మీఱ నిజాంక - పీఠంబు మీఁద
దయ నుంచుకొని మహీ-ధవుఁ డిట్టు లనియె: 1210

'వినుము చూడాల! వి-వేకివి నీవు
గనుకఁ జెప్పెద నొక్క - కార్య మే మనిన

ఈ రాజ్య మొల్ల, నే - నేలి తీరాజ్య
భారంబు నీ వింక - భరియింపవలయు,

సుతుఁడు లేకుండఁగాఁ - జూడాల! నీకు
హిత మొప్ప నీ రాష్ట్ర - మింపొంద నిచ్చి

పోయెద నేను త-పోవనంబునకు,
నాయాజ్ఞ మీఱక - నా మేలు గోరి

భామ! నీ వీ భూమిఁ - బాలింపుచుండు!
కామాది శత్రు వ-ర్గంబు నణంచి 1220

సారవిహీన సం-సారంబు విడిచి,
సారాత్మతత్త్వ వి-చారంబుఁ జేసి

సలలితచిత్త వి-శ్రాంతిఁ బొందెదను.
వెలఁది! నీ విందుకు - విఘ్నంబు చేయ

వల' దన్నఁ జూడాల - వరునకు మ్రొక్కి,
పలికె ని ట్లని ' మహీ-పాలక! నిన్ను

వనవాసములయందు - వర్తింపఁ బనిచి
జనులలో నేను రా-జ్యముఁ జేయఁదగునె?

ఎలమి నే కాలమం-దేపని సేయ
వలయునో యది చేయ-వలె' నదె ట్లనిన

సహజవృక్షములు వ-సంతకాలమున
రహిమీఱఁ బూచి శ-రత్కాలమందు

ఫలియించు నీరీతిఁ - బటు యౌవనమున
నలరుచు భోగంబు - లానందముగను

ననుభవింపుచునుండి, - యధికమౌ ముదిమి
తనువులన్ బొందిన - తఱి వనంబులకుఁ

బోవఁగావలయు, ని-ప్పుడు నన్ను విడిచి
పోవుదురే? పురం-బున నిల్చియుండి

తఱిమి కామాది శా-త్రవులఁ బోఁగొట్టి,
పరమ సుజ్ఞానాను-భవము సేయుచును

నన్నిటియం దంటి - యంటక రాజ్య
మున్నతమతిఁ జేయు-చున్నను నీకుఁ

గొదువ లే, దమల ము-క్తుండ వయ్యెదవు;
సదమల చిత్త, వి-శ్రాంతినిఁ బొంది

నిలువు నీ విచ్చట-నే' యంచు నింతి
పలుకఁగా విని మహీ-పాలుఁ డిట్లనియె:

'మగువ! నామాటకు - మాఱు మాటాడఁ
దగదు, నీ వెఱుఁగని - ధర్మంబు గలదె?

ఏ పుణ్యమహిమనో - యిపుడు నీ మేన
దీపించె యౌవన - దివ్యతేజంబు,

వెలఁది! నే నిప్పుడు - వృద్ధుండ నైతి
నల భోగభాగ్యసౌ-ఖ్యముల నే నొల్ల,

నతిపతివ్రతవు నీ-వైనందువలన
నతివ! ని న్నిం దుంచి - యరిగిన నాకు

మదిలోఁ గొదువ లేదు - మహి నెల్ల నీవు
పదపడి నీ రీతిఁ - బాలింపుచుండు!

క్షితి నేలుచుండి నేఁ - జిత్త విశ్రాంతి
హితమొప్పఁ జెందలే - నెన్నాళ్ళ కైనఁ

బరఁగ బ్రహ్మేంద్రాది - పదములం దున్నఁ
జిరముగా నిల్వదు - చిత్తవిశ్రాంతి,

కావునఁ దపమునే - గహనంబులందుఁ
గావింపవలయు ని-ష్కర్షగా' ననుచుఁ

బలికి చూడాలకుఁ - బట్టంబు గట్టి,
వెలయు రాజ్యము నేలు-విధముల నెల్లఁ

జెప్పి చూడాలచే - సెలవంది, నృపతి
యప్పురం బెడఁబాసి - యా రేయి వెడలి,

దూరాటవుల నొక్క - దుర్గస్థలంబుఁ
జేరి యందుఁ దపంబుఁ - జేసెద నంచుఁ

దలఁచి, జితేంద్రి య-త్వంబుచే ముక్తి
వలనుగాఁ దాఁ బొంద - వచ్చుఁ గా కనుచుఁ

బోఁడిమి నందున్న - పుణ్యతీర్థమున
మూఁడు కాలములందు - మునిఁగి లేచుచును

జెలఁగి దర్భలు, నార - చీరలు, జడలు,
పొలుచు రుద్రాక్షలు - భూతి ధరించి,

యొనరఁ గమండల-మును, జపమాల
యును, బూలపుట్టిక-యును, మృదువైన

హరిణాజినము, దృఢం-బగు నాగబెత్త,
మురుపాదుకలు గల్గి-యుండఁగా నతఁడు

చిరనిష్ఠచే బద్ధ - సిద్ధాసనమున
నిరవొందఁ గూర్చుండి - యెండ వానలకుఁ

దాను చలింపక - ధైర్యగుణంబు
నూని తపముఁ జేయు-చుండె నా నృపుఁడు.

ఇచట చూడాల తా-నెల్ల రాజ్యంబు
ప్రచురశక్తినిఁ బరి-పాలింపుచుండి

అష్టాదశాబ్దంబు - లరిగిన మీఁద
శిష్టుఁడై తప మొప్పఁ - జేయు నాయకుని

నిష్టంబుగాఁ జాడ - నిచ్చఁ జింతించి
యష్టసిద్ధులు తన - కబ్బియున్నందు

వలన నాథునిమీఁది - వాంఛతో లేచి
కలకంఠి గగనమా-ర్గంబున నరిగి,

తపముఁ జేసెడి శిఖి-ధ్వజుని వీక్షించి,
యపరిమితార్తి ని-ట్లని మది నెంచె.

'అజ్ఞానమున నీతఁ-డానంద మిచ్చు
విజ్ఞాన మెఱుఁగక - వెఱ్ఱి చందమున

వరరత్న భూషణా-వళిఁ దాల్చువాఁడు
తఱచు రుద్రాక్షలు - ధరియించినాఁడు,

భూరి హేమాంబరం-బులు దాల్చువాఁడు
నార చీరలు దాల్చి - నవయుచున్నాఁడు,

తలకొని స్వాదుగం-ధ మలందువాఁడు
పొలుపులేక విభూతిఁ - బూసికొన్నాఁడు,

మొగి మణి మందిర-ముల నుండువాఁడు
వగ చెడి యడవిలో- వసియించినాఁడు

సుకరమైనటువంటి - సుజ్ఞాన మెఱుఁగ
కకట! కర్మాసక్తు-డగుచు నున్నాఁడు,

స్త్రీరూపమున నేను - చెప్పినమాట
లీ రాజు నమ్మలే, - దిపుడైన నేను

మునికుమారక రూప-మును దాల్చియైన
జననాయకునిచిత్త - సంశయంబులను

దీర్చి తత్త్వార్థంబు - దెలిపెద నేను,
నేర్చి యూరకయుండ - నీతిగా దింక'

నని నిశ్చయించి యం-దద్భుతంబైన
పనిఁబూని పురుష రూ-పంబు ధరించె.

అది యె ట్లనిన హే-మాభ-దేహమున
సదమలధౌత వ-స్త్రములు ధరించి,

పరిమళ గంధ లే-పము వక్షమందు
విరివిగా యజ్ఞోప-వీతంబు మెఱయఁ

గర మొప్పఁగా శిఖా - కళికయందమరి
విరిదండ సొరెకు - వెనుక నటింప,

ఘనకమండల మొక్క - కరమునఁ బూని,
జనపతికడ బ్రహ్మ-చారిచందమునఁ

బుడమికిఁ జెయ్యెత్తు - పొడవుగా నిలిచి
పొడచూపఁగాఁ జూచి - భూపాలమౌని

యేదేవుఁడో వచ్చె - నిచటి ' కటంచుఁ
బాదుకల్ కడమీటి - బహుతీవ్రగతిని

నెదురేఁగి తోడ్తెచ్చి - యిష్టాసనమునఁ
గుదురుగా నతని దాఁ-గూర్చుండఁ బెట్టి,

పనిఁబూని యం దర్ఘ్య-పాద్యాది విధుల
మొనసి పూజలొనర్చి - మ్రొక్కఁగా, నృపుని

వీక్షించి 'శ్రీరస్తు - విజయో-స్తటంచు
నక్షీణకరుణతో - నా బ్రహ్మచారి

దీవించె నపుడు, పృ-థ్వీపతి యతని
భావించి' యో ముని-ప్రవర! యిచ్చటికి

నామీఁద దయయుంచి-నా చెంత కిపుడు
ఏమి కార్యార్థమై - యేతించినారు?

తలిదండ్రు లెవరు? మీ - స్థల మెద్ది?' యనిన
సలలితుఁడగు బ్రహ్మ-చారి యి ట్లనియె:

'విను పుణ్యచరిత! నా-వృత్తాంత మెల్ల,
ననిమిష మునిచంద్రుఁ-డగు నారదుండు

కర మొప్పుచున్న గం-గానది చెంత
గిరికందరమునందు - గెంటక తపము

సలుపుచు నుండఁగా - జాహ్నవీతటినిఁ
గలకలధ్వను లెసఁ-గంగ నమ్మౌని

విని, యిదేమో? యని - వింతగా నటకుఁ
జని, యందు జలకేళి - సల్పు సుందరులఁ

గనుఁగొన, వారి చ-క్కఁదనంబు లెల్ల
మనమున నాట న-మ్మౌనివీర్యంబు

పడిఁ జాఱె మెఱుపుకై - వడి ధాత్రి మీఁదఁ
బడఁగ, నమ్ముని దాని - స్ఫటికకుంభమునఁ

బెట్టి యుండఁగ నది - పిండమై యుండె;
నట్టి పిండంబునం - దవయవంబులును

బొడమఁగా దద్ఘటం-బున నుండి నేను
వెడలిన, మాతండ్రి - వేడ్కగాఁ బెంచి,

విమల కుంభమునుండి - వెడలితిఁ గాన
నమరగా ననుఁ గుంభుఁ-డను పేరఁ బిలిచి,

సకల విద్యలు నాకు - సాంగముల్ గాను
ప్రకటంబుగాఁ జెప్పి - బ్రహ్మచెంగటికి

నన్నుఁ దోడ్కొని పోయి - నాచే నజునకుఁ
బన్నుగా మ్రొక్కించి - పలికె ' నో తండ్రి!

' వీడు మీ పౌత్రుండు - వీని మన్నించి
వేడుకన్ యజ్ఞోప-వీతంబు నిచ్చి

తెలివిగా నాత్మోప-దేశంబు సేయ
వలె' నన్న ననుఁజూచి - వనజసంభవుఁడు

నలువొప్ప నుపనయ-నంబును జేసి,
విలసిత వేదాది - విద్యలు నేర్పి,

సారతత్త్వోపదే-శముఁ జేసి 'ధరణి
నారూఢ విజ్ఞాని-వై సంచరింప

నీవు పొ'మ్మనఁగ నే-నిర్మలతత్త్వ
భావుండనై భూమిపైఁ - జేరి, బ్రహ్మ

చారినై విహరింతు - సర్వస్థలముల,
నారీతి యిది నీకు - నాటఁ జెప్పితిని.

వరపుణ్యచరిత! యె-వ్వఁడ వీవు? వింధ్య
గిరిచెంత నొంటిగా - గెంటక నిలిచి

యేమి గోరి తపంబు - నిపుడు చేసెదవు?
నీ మదియందున్న - నిశ్చయం బేమి?

యా విధ మెఱిఁగింపు ' - మన శిఖిధ్వజుఁడు
తా వినయోక్తి న-త్తపసి కి ట్లనియె:

'వరముని! నే శిఖి-ధ్వజుఁడను వాఁడ
నరనాయకుఁడను పు-నర్భవదుఃఖ

భయమున రాజ్యంబుఁ - బరిహరించుకొని,
జయకారణంబైన - శాంతిఁ బొందుటకు

విపినంబులోఁ జేరి - విశ్రాంతిఁ గోరి
తపము సేయఁగ, నమ్మృ-తము విషంబైన

గతిఁ దపశ్చరణంబు -కష్టమై తోఁచు,
నతిచాపలము పుట్టు-నందుచే మదికి

నే నశక్తుఁడ నైతి - నిఁక నేమిసేతు?
దీనవత్సల! నాకుఁ దెలుపవే!' యనిన

నరనాథు నీక్షించి - నవ్వి యమ్మౌని
కరుణ నిట్లనె 'మహీ - కాంత! నీరీతిఁ

దెలిసితి నాయోగ-దృష్టి నె ట్లనినఁ
దెలియఁ జెప్పెద నీ స-తీసమేతముగ

నొక్కట గురువుచే - నుపదేశ మైతి,
వక్కడ నీ బుద్ధి - కాత్మానుభవము

దొరకకుండఁగ వచ్చి - దూరాటవులను
స్థిరబుద్ధి లేక కృ-శింపుచున్నావు.

నీ పత్ని గురుభక్తి - నిలిపియున్నందు
చే పరాత్మ సుఖంబుఁ - జెంది, నెమ్మదినిఁ

బురమునం దున్నది - భూపాల! నీవు
పర మెఱుంగక కష్ట-పడియెద విందు'

అని పూర్వవృత్తాంత - మతఁడు తెల్పఁగను
విని శిఖిధ్వజుఁ డందు - వెఱఁగొంది పలికె:

'విమలాత్మ! నీవు నా - విధముల నెల్ల
నమరఁ జెప్పితివి, నీ-యంత ధన్యుండు

దొరకఁడు నాకు, స-ద్గురుఁడవై నీవు
పర మెట్టిదో దానిఁ - బట్టి బోధించి

రక్షింపవలె' నన్న - రాజు నీక్షించి,
యక్షీణ కరుణ ని-ట్లనె బ్రహ్మచారి

'ధీరాత్మ! గురుఁ డుప-దేశించినట్టి
సారాత్మ బోధ ని-శ్చయముగా మొదటఁ

జిక్కినప్పుడె దానిఁ - జేపట్టలేక,
అక్కడ మది సంశ-యంబును నొంది,

నీ వెవ్వఁడై నట్టి - నిశ్చయార్థంబు
భావింపనేరక? - బహుఘోరతపముఁ

జేసిన మోక్షంబు - సిద్ధించు ననుచు
గాసికి నోర్చి సం-కల్పవికల్ప

జాలంబులకుఁ జిక్కి - చపలచిత్తమునఁ
గాలంబు నూరకే - గడపుచుంటివి;

వాసనావశులైన - వారు కర్మముల
నాసక్తితోఁ జేతు - రజ్ఞాను లగుచు,

వసుమతీశ్వర! నీవు - వారిచందమున
పసలేని కర్మ ప్ర-పంచ వాసనకు

లో నైతి విచట నా-లోకుల కరణి,
నానందకర మోక్ష - మబ్బునే దీనఁ?

బ్రాజ్ఞసాంగత్యంబుఁ - బరిహరించుకొని,
యజ్ఞాని వగుచు నిం-దడల నేమిటికి?

నిఁకనైనఁ బరతత్త్వ - మెఱిఁగితి వేని
సకలదుఃఖంబులు - సమయు' నటంచుఁ

బలుకఁగాఁ గుంభుని - పాదపద్మముల
కలఘు భక్తిని మ్రొక్కి - యవనీశుఁ డనియె:

'గురుఁడవు నీవు నా-కు నిజంబుగాను,
పరులు లేరిఁక నెన్ని - భంగుల నైనఁ

దిరముగా నాత్మోప-దేశంబు సేయ
దొరకొని నను గృతా-ర్థునిఁ జేయవలయు'

ననుచుఁ గన్నీరొల్క - నార్తుఁడైయున్న
'జనపతి మనము కా-షాయపక్వతను

బనుపడి యున్నది - పరమార్థవిద్య
నొనరంగ నితనికే - నుపదేశమీయఁ

దగు విప్ర' డనుచుఁ జిత్తమున నూహించి,
యగణితకరుణ ని-ట్లనియెఁ గుంభుండు:

'ప్రియముతోఁ దండ్రి చె-ప్పిన విద్య సుతుఁడు
భయభక్తు లెనఁగఁ ద-ప్పక వినురీతి

నామాట నీవు ని-ర్ణయముగా వినినఁ
బ్రేమతో నీకుఁ జె-ప్పెద నాత్మ విద్య,

మొదట నీ సంశయ-మునకు సాదృశ్య
మిది యనఁదగినట్టి - యితిహాస మొకటి

మదికిఁ దోఁచిన దిది - మనుజేంద్ర! తొలుత
విదితంబుగా నీకు - వినిపింతు వినుము!

### * చింతామణి ఉపాఖ్యానము *

అది యెట్టు లనిన మ-హాశాస్త్ర విదుఁడు
సదమలుం డగు నొక - జగతీసురుండు

తనమదిలోనఁ జిం-తామణిఁ గోరి
ఘనతపం బొనరింపఁ-గా నది వచ్చి,

యాభూసురుని చేతి కణికయై నిలిచె
నాభావ మెఱుఁగక - యా బ్రాహ్మణుండు

'తలఁచె నీరీతిఁ జిం-తామణి నన్ను
వలనొప్పఁగా మెచ్చి -వచ్చునే త్వరగ?

నెలమిఁ జింతామణి- నీయఁ జాలకయ
వెలయ వేల్పులు తపో-విఘ్నంబు సేయ

నీ రీతిఁ బంపినా-రీ గాజుపూస,
నే రీతిఁ గైకొందు -నిపు?'డంచు మదినిఁ

దలఁచఁగా, నెగిరి చిం-తామణి చనియె.
నలవిప్రుఁ డెప్పటి - యట్ల తపంబుఁ

బనిఁబూని చేయఁగా, - బహువత్సరముల
కొనర ప్రత్యక్షమై - యొక గాజుపూస

తనచేతి కొదవఁ, జిం-తామణి దొరకె
ననుకొని తనయింటి - కరిగె విప్రుండు.

పొలుపొందు నాగాజు-పూస నానాఁట
మలినమై పోవ, బ్రా-హ్మణుఁడు చింతించె;

నారీతిఁ దొలుత నీ - కబ్బుచున్నట్టి
సారవేదాంత సు - జ్ఞాన రత్నమును

విడనాడి వచ్చి యీ - విపిన మధ్యమునఁ
గడగండ్లఁ బడుచును - గర్మముల్ చేసి

కడతేరవలె నని - కాంక్షించినావు;
పుడమి నిందున ముక్తి - పొందునే నిన్ను?

విడువు నీవా భ్రాంతి - విమలాంతరంగ!
చెడిపోక నింక సు-స్థిరబుద్ధి నుండు!

ధరణీశ! నీవు త-త్త్వజ్ఞాని వగుచు
సరసచిత్తుండవై - సర్వకర్మములఁ

దలఁపకుండెడిది చిం-తామణిగాను
దెలియు, మీయడివి నా-ర్తిని వసించి

కర్మముల్ చేసి త-త్కర్మ ఫలంబు
నర్మిలి వాంఛించు-టది గాజుపూస

గాను నీ వెఱుఁగు; దుః-ఖంబు నణంచి
యానందమున బొంద - నాత్మ నూహించి,

మా యాశ్రమమునఁ గ-ర్మతపంబు నిట్లు
సేయఁగా నిన్నుఁ జూ-చితిఁగాన, నీకుఁ

దత్త్వార్థ మెఱిఁగింపఁ - దలఁచితి, నీవు
సాత్త్వికబుద్ధితోఁ - జక్కఁగా వినుము!

నీవు చింతామణి-నే కోరి తపము
నీవిధంబునఁ జేయు - టింతియే కాని,

స్ఫటికోపలంబైనఁ - బ్రాప్తంబుగాదు;
కటకటా యిట్టి సం-కల్ప వికల్ప

పటలంబులో నింకఁ - బడియుంటివేని,
చటుల మేఘము లాక-సంబును బొదువు

కరణి సంకల్ప వి-కల్పముల్ నిన్ను
మఱి మఱి పొదువు, స-మ్మతిఁ బొందనియవు;

గనుక సంకల్ప వి-కల్పంబులందు
మననంబు విడిచి, బ్ర-హ్మంబు నీ వసము.

'అదియెట్లు నే నౌదు? - నను సంశయంబు
హృదయమం దున్న నీ - కెన్నాళ్లకైన

దొరకదు ముక్తి, సంతో-షమొందునను
గరిమ సంశయము సం-కల్పమౌ దాని

విడువుము! నీ వింక - విడువకుండినను
దడఁబడి గాజు ర-త్నమటంచు భ్రమయు

నవనీసురునిరీతి - హాస్యపాత్రుండ
వవుదువు గాన, నీ - యజ్ఞత విడిచి,

తరళత నణఁచి చి-త్తత్యాగి వగుము.
అరసి సర్వత్యాగి-వై యుంటివేని

యది పురుషార్థ స-మాప్తి తదన్య
మిది యది యనఁగ లే-దిరవు కొన్నట్టి

యజ్ఞానవైరి నీ-కగపడినపుడు
ప్రజ్ఞతో వానిఁ జం-పక వీడినందు

వల్ల నీకిన్ని దుర్-వ్యథలు ప్రాప్తించె;
నల్లనాఁ డజ్ఞత - నణఁచియుండినను

ఎనలేని దుర్దశ - లేల నిన్ బొందు?
ననఘ! చిదానంద - మబ్బి నీజడత

విడిపించు' ననుచు భూ-విభున కేరీతిఁ
గడఁగి చింతామణి - కథ వినిపించి.

యాకుంభరూపిణి-యైన చూడాల
ప్రాకట కరుణతోఁ - బలికెఁ గ్రమ్మఱను:

'ఓ నరనాథ! యిం-కొక యితిహాస
మేను చెప్పెద నది - యె ట్లన్న వినుము!

*** గజోపాఖ్యానము ***

అలఘు వింధ్యారణ్య-మందొక్క గజము
గలదు హస్తిపుఁడు త-క్కక దానిఁ బొంచి

పట్టి గొలుసు దాని - పదమున నంటఁ
జుట్టి వృక్షమున క-చ్చుగఁ గట్టివేసి,

తా దాని ముందరి - తాఁటిమ్రానెక్కఁ
గా, దంతి దంత యు-గంబుతోఁ గాలి

గొలుసు గ్రక్కున పీచ్చి-కొని ఘీంకరింప,
నళికి హస్తిపుఁడు తా-నా మ్రాని మీఁద

నున్న నేనుఁగు మ్రాను - నురవడిన్ విఱిచి
తన్నుఁ జంపు నటంచుఁ - దరువుపై నుఱికి

పడిన, నేనుఁగు వాని - భావించి చూచి;
'పుడమిపై వ్రాలె నీ-పురుషుని నేను

జంపు టింకే? లంచుఁ జనియె నాదంతి;
కంప మొందుచు వాఁడు - క్రమ్మఱ లేచి,

చెచ్చెర నలఁత దీ-ర్చికొని తా నపుడు
నచ్చోట నుండక - యరిగి, కుంజరము

చనిన జాడను బోయి - సామజమున్న
యునికి పట్టు నెఱింగి, - యుపమగా దాని

చుట్టు నోదంబు హె-చ్చుగఁ ద్రవ్వి, పైనఁ
గట్టెలు తీఁగెలు - కసపు నాకులును

పఱచియుండఁగ గజ-పతి దానిమీఁదఁ
బరువెత్తి దిగజాఱి-పడి హస్తిపునకుఁ

జిక్కె నాదిని వాఁడు - చిక్కిన యపుడె
త్రొక్కి చంపకయున్న - దోషంబు చేతఁ

గరివాని చేతికే - క్రమ్మఱఁ జిక్కి,
యిర వెందుఁ దోఁచక - యేడ్చుచునుండె;

నీ కథార్థంబు నీ-వెఱుఁగవు, నేనె
వీఁకతోఁ జెప్పెద - విను! వింధ్య భూమి

యనఁగ నీ రాష్ట్ర, మీ-వా గజేంద్రంబు
మొనసిన వైరాగ్య-మును, వివేకమును

అలఘుదంతయుగంబు, - హస్తిపుఁ డనఁగ
బలియు నజ్ఞానంబు, - ప్రబలమైనట్టి

రాగశృంఖల మన - రహిఁ గరికాల
నాగతిఁ గట్టి యు-న్నటువంటి గొలుసు,

ఆ గొలు సూడ్చు టే-మన్నను నీవు
వేగ భోగేచ్ఛను - విడిచిన తెగువ,

తాటిపై వాఁ డుండి - ధరణిపైఁ బడిన
దేటి లక్షణమన్న - హెచ్చు రాజ్యంబు

..నటు నీవు విడుచుటే - యజ్ఞాన మగును;
బటుతాళమున నుండి - భయమొంది నేలఁ

బడినవాఁ డెవఁ డన్నఁ - బరఁగ నీమదినిఁ
బొడమినట్టి విరాగ-మును వివేకమును,

రదనద్వయంబుచే - రాగశృంఖలము
నదిమి వీకొను నీ - యట్టహాసమును

గనుఁగొని నీ మస్త-కంబుపై నుండి
యొనర నీకన్న మ-హోన్నతం బగుచు

సరియైన యజ్ఞాన - మందుండ వెఱచి,
యురికి కూలిన వేళ - నుర్విపైఁ ద్రొక్కి,

చంపక యడవిలోఁ - జరియింపఁ జనఁగఁ
దెంపుతో మరల న-దే నిన్నుఁ బట్టి

పడఁ ద్రోసెఁ గర్మ ప్ర-పంచజాతమున,
జడిసి చిక్కినవేళఁ - జంపని దేమి?

యనినను ఫలపరి-త్యాగిగా కెపుడు
ననువొందఁ గర్మ క్రి-యాభిమానంబు

దానిఁ జంపకయున్న - దయ యనంబడును,
దానిచేఁ గ్రమ్మఱఁ - [illegible] మించి

వరరాజ్యమును వీఁడి - వచ్చు నీతోడ
వెఱవ కజ్ఞానంబు - వెంటనే వచ్చి,

జననాథ ! కర్మవా-సన యనుఖాత
మున నిన్నుఁ బడఁద్రోసె-మోసంబు చేసి,

పరఁగ నోదంబుపైఁ-బఱచిన లతలు
దొరకను నీ తపో-దుఃఖంబు లగును,

అల కరిపరివార-మనుమానములును
వెలసిన నీమనో-వృత్తులే, మఱియుఁ

గరి కూలఁగాఁ బైనఁ-గప్పిన దుమ్ము
నరయ నీకర్మ మో-హాంధకారంబు,

చలచిత్త! నీవిట్టి-సామజేంద్రంబు
చెలువున నూరకే-చెడితి వటంచు

నాగజోపాఖ్యాన-మా శిఖిధ్వజున
కా గుణశాలియై-నట్టి చూడాల

పురుషాభిమానియౌ-భూపాలకునకుఁ
దరుణియై తాఁదెల్పు - తత్త్వార్థమందు

గుఱిని నిల్వఁ డటంచుఁ-గుంభాభిధాన
పురుషుఁడై జ్ఞాన మొ-ప్పఁగఁ జెప్పెననుచు

ముని రామునకుఁ జెప్పి-మోహం బడంచి,
మనము రంజిల్లఁగా - మరల ని ట్లనియె:

'వినురామ! యెంతటి-విద్వాంసుఁడైనఁ
దనియఁ దనంతనే- తత్త్వశాస్త్రములు

చదివి తపం బెంత-సల్పినఁగాని,
మది సంశయంబులు-మానవు, చిత్త

చలపత్వ మణఁగదు-శాంతి లభింప,
దపరిమితానంద-మబ్బదు గాన,

గురుని సంపాదించు-కొని కొల్చి, యతని
కరుణకుఁ బాత్రుఁడై-కడ తేరవలయు;

నటుసేయలేక దే-హాభిమానమునఁ
గుటిలాత్ముఁడగువాఁడు-కొన కెక్కలేఁడు,

ఎలమి శాస్త్రజ్ఞాన-మెంతైన గురుఁడు
కలుగకున్నందునఁ-గడముట్ట కణఁగు'.

అని వసిష్ఠుడు మ-హాకృప మీఱ
మనుకులోత్తముఁ జూచి మరల ని ట్లనియె:

అలకుంభరూపిణి-యైన చూడాల
వలనొప్పఁగా శిఖి-ధ్వజుని వీక్షించి,

'మొనసి సర్వత్యాగ-మును జేయు'మనిన
జననాథుఁ డా బ్రహ్మ-చారికి మ్రొక్కి,

యడర ని ట్లనె 'నో మ-హా గురుస్వామి!
పుడమి రాజ్యము, గృహం-బులు, భోగములను

విడిచి, యిల్లాలిని -విడిచి నేవచ్చి
యడవిలోఁ దప మిప్పు-డాచరించెదను,

ఇనకోటినిభతేజ!-యిపు డింతకన్న
నెనయు సర్వత్యాగ-మెటువంటి?' దనినఁ

గుంభుఁ డి ట్లనియె మ-క్కువ నీ తపంబు
దంభమే కాని, త-త్త్వజ్ఞాన మగునె?

ఒనర నన్నియు వీఁడి-యొంటిగా వచ్చి
వనవాసి వగుట స-ర్వత్యాగ మగునె?

బడలినఁగాని త-పంబుపై నాశ
విడువలే వనుచు భూ-విభుని చెంగటనె

తా నుండి, యతని దు-స్తరతపశ్చరణ
మూని చూచుచునుండి - యొకకొన్నినాళ్ళు

జరిగిన వెనుకఁ దాఁ-జాలిని బొంది,
యరమర లేక యి ట్లనియెఁ గుంభుండు:

'ఓ మహారాజ! యీ-యుగ్రతపంబు
నీమాడ్కిఁజేసి నీ-వెంత[2] పెంచినను

నరయ సర్వత్యాగ-మబ్బదు నీకు
మఱియెట్టు లనిన నీ-మానసగ్రంథిఁ

దెగఁద్రెంచివైచి ము-క్తినిఁ బొందవలయుఁ;
దగు జగంబులకుఁ జి-త్తము బంధకంబు,

గాన దానిని ముందు-గాఁ ద్రుంచితేని
దాన సర్వత్యాగ-ధన్యత నీకుఁ

గలుగు'నన్నను మహీ-కాంతుఁ డా కుంభు
నలర వీక్షించి యి-ట్లనియెఁ 'జిత్తంబు

ఎట్టిది? దాని నే-నెటు ద్రుంపవచ్చు?
నట్టి చందముఁ దెల్పుఁ'- డనినఁ గుంభుండు

పలికె ని ట్లనుచు. 'నో-పార్థివాధీశ!
యల వేదనాత్మ కా-హంకృతి చిత్త

బీజంబులోపల-బెరసిన రూప
బీజం బనఁగ నొప్పుఁ, - బెమపొంద దాని

2. చచ్చినను-వేం.

లీలచేఁ జాలఁ గ-ల్గిన యనుభూతి
లాలితంబైన ప-ల్లవము తద్బుద్ధి

నెఱయు నిరాకార-నిశ్చలాత్మకయు,
మురువొప్పు సంకల్ప-మూర్తియు ననఁగఁ

దగు బుద్ధి, దాని భే-దము మానసంబు
నగుఁజేతనంబునం-దతివృద్ధిఁ బొంది,

చేకొనఁగారాని-చిత్తవృక్షమును
గూఁకటివ్రేళ్లైన-గుణములతోడఁ

బడఁద్రోయు' మనిన భూ-పతి కుంభుఁ జూచి
'యడరఁ జిత్తమ్మన-కహమిక మూల

కారణంబైనది-కావున దాని
పారంబు భావించి-భస్మంబుసేయఁ

దగు నగ్ని యెద్ది? సి-ద్ధంబుగా నాకు
నగణితకృపను మీ-రానతిం'డనిన

విని కుంభుఁ డనియె 'నో-విమలాంతరంగ!
తనురూప పంచభూ-తములు నేఁ గాను,

అలరు నీవిషయేంద్రి-యములు నేఁ గాను,
జెలఁగి మనోబుద్ధి-చిత్తముల్ నేను

గా, నహంకృతి నేను-గాను, మఱెవ్వఁ
డే ననెడి విచార-మెప్పుడు నీకు

జనియించు నపుడు సు-జ్ఞానపావకుఁడు
పెనఁగు నహంకార-బీజంబు నంటి

చెచ్చెర భస్మంబుఁ-జేయు' నటంచు
నచ్చుగాఁ దెల్పఁగా-నవనీశ్వరుండు

బుద్ధి నూహించి కుం-భుని మోముఁ జూచి,
'సిద్ధంబుగా మీరు-చెప్పిన రీతి

గానె భావించితిఁ-గాను దేహంబు
గాను గోచరములు-గా నింద్రియములు

గాను మనంబును-గాను బుద్ధియును,
గాను జిత్తంబును గా-నహంకృతియుఁ,

నని రాజు పల్కఁగా-నా బ్రహ్మచారి
మనుజేంద్రుఁ జూచి స-మ్మతి నిన్ని నేను

గాను, గా నంటివి-గద! మ తెవ్వఁడవు?
పూని దెల్పు మటన్న-భూపాలుఁ డనియె:

'సక లేంద్రియాదులు-జడములై పోఁగ
నకలంక మజడమై,-యమలమై, యెఱుక

యగుచుఁ జావును, బుట్టు-వను రెండులేని
యగణిత చిన్మాత్ర-మగుదును నేను,

ఇటువంటి నన్ను నే-నెఱుఁగంగనీక
పటుతరాహంకృతి-భ్రాంతిఁబుట్టించి,

బెట్టుగాఁ దాఁ జిత్త-బీజమై నిలిచి
నట్టు పడంజేసి-న న్నేఁచి యేఁచి,

పూని నే నెంత త-పోనిష్ఠ నున్నఁ
గాని న న్నూరకే-గాసింపుచుండు,

దీనితోఁ బోరుచు-దిక్కేమి దోఁచ
కే నశక్తుఁడ నైతి-నిఁక నెట్టు? లనుచుఁ

బలుకఁగాఁ గుంభుఁ డా-పార్థివేశ్వరుని
సులలిత కరుణతోఁ-జూచి కారణము

వలనఁ గార్యము పుట్టు-వసుధేశ?' యనఁగ
నలనరేశ్వరుఁడిట్టు-లనె 'గురుదేవ!

దొరకొన్న తొల్లిటి-దోష మీవ్యథల
కరయ కారణ మయ్యె-నటుగాన, దీనిఁ

బొరిగొని నను మీరు-ప్రోవఁగావలయు,
నుఱుకు చిత్తంబు చి-త్తోన్ముఖిగాఁగ

నురురీతి నహమిక-యుదయించి మించి
పొరిఁబొరి వేదనల్-పుట్టించె' ననిన

నల కుంభుఁ డిట్లనెఁ 'నట్టివేదనల
కిలను గారణ మెద్ది-యెఱిఁగింపు' మనిన

జననాథుఁ డనియె నో-సద్గురుస్వామి!
యనలవేదన కన్య-మై ప్రకాశించి

మొనయు సత్తా మాత్ర-ముననె వేదనలు
జనియింపుచుండుఁ ద-త్సర్వదుర్వ్యథల

నలఁగెడి చిత్తంబు-నకు విత్తుగాఁగ
నల యహమిక వేద-నాత్మకం బయ్యె'

ననినఁ గుంభుఁడు పల్కె-'నటువంటి కార్య
మునకుఁ గారణ కార్య-ములు రెండులేవు,

భ్రమయు భ్రాంతినిఁ ద్రాటఁ-బామున్నరీతి
నమరఁగాఁ గనిపించి-యరసి చూచినను

పా మందు లేకున్న-పగిది బ్రహ్మమునఁ
దా మించి సకలభూ-తప్రపంచంబు

భ్రాంతిచే నుండిన-భంగి గన్పించు,
వింతగా నందె భా-వించి చూచినను

మెఱయు ప్రపంచంబు-మిథ్యయై పోవు,
నెఱయు చిద్బ్రహ్మమే-నిత్యమై నిలుచు;

నట్టి మిథ్యారూప-మగు ప్రపంచంబు
పుట్టిన కారణం-బుగ నన్న నృపుఁడు

చెలఁగి 'యీసృష్టిఁ జే-సిన పద్మభవుఁడు
నెలమినిఁ గారణం బేల కాఁ?'డనిన

విని కుంభుఁడా భూమి-విభుఁ జూచి, శాంత
మనుపమంబగును బ్ర-హ్మంబు తదీయ

కలన మ్మాబ్రహ్మకుఁ-గారణం' బనుచుఁ
బలికిన విని మహీ-పతి 'కారణంబు

లేకయే బ్రహ్మ యే-లీల జనించె?
నాకుఁ దెల్పుఁ' డటన్న -నగి కుంభుఁ డనియె:

'ధరణీశ! విను మనం-తం బద్వయంబు,
పరమంబు, శాంతంబు-పరిపూర్ణ, మజము,

అప్రతర్క్యం, బవ్య-యం, బమేయంబు
స్వప్రకాశంబును-స్వరూపంబు

నగుచు నవిజ్ఞేయ-మై, శుద్ధ బుద్ధ
మగుచు నెద్ది వెలుంగు-నయ్యాత్మ వలన

నా పద్మభవుఁడు తా-నై యుదయించె,
నాపట్ల సృష్టి త-దాత్మకం బగుచు

నెరసి తన్మాత్రమై-నెగడుచునుండుఁ,
గర మొప్ప నటుగానఁ-గార్యంబు లేదు,

కారణంబును లేదు-కావున నాకు
భూరి కర్తృత లేదు-భోక్తృత లేదు

ఆ పరబ్రహ్మమే-యఖిలమౌ టెరిగి
భూప! నీ యజ్ఞాన-బుద్ధి నణంచు,

నద్వయంబై పర-మామృతంబైన
సద్వస్తువునకు నా-శంబులే దెందు,

నట్టి బ్రహ్మంబు నీ-వై యుంటి వైన
గట్టిగా నిల్వ నె-క్కడఁ .జోటు లేక.

యజ్ఞాన మాత్మయం-దణఁగి నశించుఁ,
బ్రజ్ఞానమే పర-బ్రహ్మమై నిలుచు.

నాదిదేవుఁడు తాఁ జి-దాత్మకుం డగుట
చే దివ్యమై ప్రకా-శించుఁ దనంత

నరయ భూసలిలాదు-లై పలుమాఱు
పరఁగెడు [3]శక్తి సం - పాత సంపాద

నాత్మలో నొంది తా-నన బ్రహ్మయనఁగ
నాత్మయే యుండుఁ-దదన్య సంవేది

మఱివేఱె లేదు బ్ర-హ్మమె సర్వ మనుచు
నెఱుకకు నెఱుకగా-నెఱుఁగు చైతన్య

సాన్నిధ్యమందెన్న-సకల ప్రపంచ
మున్న చందంబుగా-నుండు, లేకుండు;

నున్నది సత్తయై-యుండు, లే దనుచు
నన్నది మాయమై-యణఁగు, బంగారు

రూప, నామముల చే-రూఢంబు లగుచుఁ
జూపట్టు భూషణ-స్తో మంబులట్ల,

---

3. శక్తిసంభవిత - వా.

నా పరబ్రహ్మమే-హరిహర బ్రహ్మ
రూపాదులగును వే-ఱుగ నొండు లేదు;

బంగారుగాక యా-భరణముల్ గాని
భంగి బ్రహ్మము గాక-ప్రత్యేకముగను

గలదె విశ్వం,' బనఁ-గా భూవిభుండు
పలికె ని ట్లనుచు 'ఓ-పరమమునీంద్ర!

అరయ నా బ్రహ్మమే-యై ప్రపంచంబు
మెఱయుచుండఁగ మీరు-మి థ్యను టేమి?'

యనినఁ గుంభు డిట్లు-లనియె నో నృపతి !
వినుము చెప్పెద నట్టి-వృత్తాంత మమర,

భర్మమం దొనర నా-భరణముల్ చిత్ర
కర్మ కల్పితములై-గనిపించి యణఁగు

చందంబుగా, బ్రహ్మ-సత్తాస్వరూప
మందు మాయా కల్పి-తా జ్ఞానరూప

నామక్రియాదులు-నశియించిపోవు,
నామహాబ్రహ్మమే-యంతట నిండి

తెలివియై యస్తిభా-తి ప్రియంబు లన
నలువొప్పు సచ్చిదా-నందమై యుండు ;

నామరూపంబులు-నశియించుఁ గనుక,
నే మిథ్య యంటిని-నిఖిలవిశ్వంబు ;

నీవు నా వాక్యంబు-నిజముగా నెంచి
భావనాతీత స-ద్బ్రహ్మమే ననుచుఁ

జెప్పి చూపఁగరాని-చిద్వస్తువందుఁ
దెప్పునఁ బొందు ! సం-దేహంబు విడువు !

నామాట నిజముగా-నమ్ము ! న' మ్మనిన
భూమీశ్వరుండు కుం-భుని పాదములకు

మ్రొక్కి యి ట్లనియె నో-మునికులోత్తంస !
మిక్కుటంబైనట్టి-మీబోధవలన

నెఱిఁగితిఁ దత్త్వం బ-దెట్లన్న వినుఁడు!
పరమాత్మయం దీ ప్ర-పంచ జాలంబు

చెలఁగెడి మరుమరీ-చికయందు జలము
గలరీతిఁ దోఁచిన -కైవడిగాను,

పరఁగ రజ్జువునందుఁ-బా మున్నరీతి,
నరయ స్వప్నప్రాయ-మగు ప్రపంచంబు

కర్త లేమినిఁ జేసి-కలుగుట లేదు,
పూర్తిగా నుండుట-పోవుట లేదు,

ఆదిమధ్యాంతంబు-లరయంగరాని
వేదాంత సారాత్మ-విమలమై నిండి,

ఇది యది యని చెప్ప-హేతువు లేక,
తుద మొదల్ గనరాక- తుర్యమై యున్న

యదియె సత్తామాత్ర-మదియె నే నైతి;
నిది మిథ్య యనఁ గూడ-దీ చిత్సుఖంబు

మీ కటాక్షమున న-మేయానుభవము
నీకాలమునకు నే-నెఱిఁగితిఁ, దనువు

నే ననెడి యహంత- నీరసం బయ్యెఁ;
నే నను తెలివిలో-నే యున్న గుట్టుఁ

దెలిసితి, మీ యుప-దేశంబు నాకు
ఫలియించె' నని మ్రొక్కి-పాషాణమటులఁ

గదలక చిత్తంబు-కనుదృష్టిలోనఁ
గుదిరియుండఁగ నట్ల-కొంతసే పుండి,

ముదమంది యట బహి-ర్ముఖుఁడైనఁ జూచి
'కొదవలే దిఁక' నను-కొని కుంభుఁ డనియె:

'క్రమ మొప్పఁగా మహీ-కాంత! నీ విప్పు
డమలమై పరిపూర్ణ-మగు చిత్పదమునఁ

జెందితివే? శాంతి-చిత్త విశ్రాంతి
నొందితి వే?'యన్న-నుర్వీశుఁ డనియె:

'ఓ గురుస్వామి! మీ-యురుకటాక్షమున
వేగఁ జిత్పదసౌఖ్య-విభవంబుఁ గంటి,

సాధుసాంగత్యంబు-చపలాత్మునైన
బోధ సుధారసం-బున దేల్చు నింత

కాలంబు నా కీ సు-ఖము దోఁచకుండు
టేలొకో?' యనఁ గుంభుఁ-డి ట్లని పలికె:

'ధరణీశ! తెలియు మం-తః ప్రశాంతమునఁ
గరణాదివిషయ భో-గముల నణంపఁ

గోరినవాఁడు స-ద్గురువాక్య మాత్మ
నారూఢిగా నమ్మి-యనవరతంబు

తక్కక గురుపద-ధ్యానంబు సేయ,
నెక్కువయగుచు మ-హీజంబునందుఁ

గాలపాకంబునఁ-గలిగిన పండ్లు
వ్రాలి నశించు కై-వడి లింగ దేహ

మాలిన్య మానాట-మగ్గి నశించు;
నాలోన నుండు భే-దాజ్ఞాన మణఁగు,

నజ్ఞాన మణఁగిన-నాత్మానుభవము
ప్రజ్ఞానమై నిండి-పండు, నంతటికి

సరస సద్గురు కటా-క్షము గల్గినట్టి
నరునకు సచ్చిదా-నందసౌఖ్యంబు

దొరకు, చిత్త మణంగుఁ-దుర్యసమాధి
యిరవగు చుండు, నీ-వీనాఁటి కట్టి

పరమ విజ్ఞాన సం-పన్నుండ వగుచుఁ
బొరిని జీవన్ముక్తిఁ-బొందితి' వనిన

వసుధీశుఁ డనియె-నో వరగురుస్వామి!
వసుమతిమీఁద జీ-వన్ముక్తుఁడెన

నరుని చిత్తంబు వి-నాశ మొందినను
పరఁగఁ జిత్తములేక-బ్రతికి యతండు

ధరణిపై నుండు వి-ధం బెట్టు లనిన
గురుతర కరుణ నా-కుంభుఁ డి ట్లనియె:

ఓ రాజ! విను పున-రుత్పత్తి వాస
నారూఢమై చిత్త-మజ్ఞుని యందుఁ

జలన మొందుచునుండు-సద్గురు కరుణ
వలన ముక్తుండైన-వరయోగియందుఁ

దరళత మాని స-త్తా మాత్ర మగుచు
నిరుపమ చిత్తంబు-నిలిచియుండుటను

రహి నొప్పు సంకల్ప-రహిత మైనట్టి
సహజ కర్మంబున-సక్తుఁడై యతఁడు

గావింపుచున్న త-త్కర్మ మాయోగ
పావక ముఖమందు-భస్మమై పోవు.

వరుసగా దాన జీ-వన్ముక్తుఁడైన
పురుషుండు క్రమ్మఱఁ-బుట్టుట లేక,

తుదను విదేహము-క్తుండగు; నీవు
పొదువుగా శమదమం-బుల నొంది, సర్వ

శాంతుఁడవై సర్వ-సముఁడవై నిరత
మంతరంగ జ్ఞప్తి-నరయుచు నుండు,

వసుధఁ బ్రాప్తములైన వస్తుజాలములఁ
బొసఁగు నుదాసీన-బుద్ధిచే నీవు

ననుభవించునుండు-మచలుండ వగుచు,
అనఘ! నిశ్చలచిత్తు-లగు వారి కిలను

దొడరు పునర్జన్మ-దుఃఖసంసార
ముడిగి నశించిపో-వుచు నుండుఁగాన,

నీవు చలింపక - నిన్ను నీ విపుడు
భావింపు' మనిన భూ-పతి కుంభుఁజూచి

'చలతాచలత్వముల్-సహజముల్ గాను
గలుగు, నారెంటి నే గతిని వారింతు?

నావిధ మెఱిఁగింపు-మనినఁ గుంభుండు
భూవరుఁ జూచి యో-పుణ్యాత్మ! వినుము!

పొగడొందు సలిల మం-భోనిధియైన
పగిదిఁ బ్రపంచమే-బ్రహ్మమై యుండుఁ,

గావున నీ వీయ-ఖండలక్ష్యమున
భావింపు మా పర-బ్రహ్మ మే ననుచు,

లలి నందుఁ జలతాచ-లత్వంబు లణఁగు,
బొలుచు రజ్జువు నందుఁ - బుట్టిన సర్ప

భయ మట్టిరజ్జువున్-భావింప మొదటి
భయము రజ్జువునందె - ప్రవిలీనమైన

పగిది బ్రహ్మమునఁ బ్ర-పంచ విభ్రాంతి
తగిలినప్పుడు పర-తత్త్వమై నట్టి

బ్రహ్మయందు లెస్స భావించి చూడ
బ్రహ్మయందే జగ-ద్భ్రాంతి లయించు;

జననాథ! వేదాంత - శాస్త్రచింతనను,
ఘనతర సాధు సాం-గత్యంబు చేతఁ,

జిత్తంబు చల్లనై-శీతాంశు రీతి
సత్తాస్వరూపమై - శాంతినిఁ బొందు;

నా సత్తయే కేవలా-భాస మగుచు
భాసురమై స్వాను-భవముగా యోగి

వరులకుఁ దోఁచు స-ర్వము బ్రహ్మ మనుచు,
మఱియెవ్వ రెఱుఁగ రా - మర్మ మటంచుఁ

దెలివిగా ని ట్లుప-దేశింపఁగాను
వలనొప్ప నాశిఖి-ధ్వజు డందుఁ బూర్వ

సందేహ ముక్తుఁడై - సతత సమాధి
యం దుండె; చూడాల - యపు డాత్మపురముఁ

జేరి మునుపటి రీతిఁ - జెలువొప్ప రాజ్య
భారంబు కొన్నాళ్ళు - భరియించియుండి,.

క్రమ్మఱ నాకాశ-గమనయై పోయి,
సమ్మతిగా నిజే-శ్వరు చెంతఁ జేరి,

కనుమూసి కదల క-క్కడ నున్న విభునిఁ
గనుఁగొని సంతోష - కలితాత్మ యగుచు

మురిసి నాథుని బహి-ర్ముఖునిఁ జేయుటకు
నరుదుగాఁ దాను సిం-హంబు చందమున

ఘనగిరుల్ ఘూర్ణిల్ల - గర్జించె నపుడు,
వనచరుల్ బెదరి రా-వసుమతీశ్వరుఁడు

చలియింపకున్న నా-శ్చర్యంబు నొంది,
చెలరేఁగి మఱియు గర్జించి గర్జించి,

యలసినప్పటికైన - నవనీశ్వరుండు
వలనొప్ప మేరు ప-ర్వతముచందమునఁ

గదలక మెదల క-క్కడ సత్త్వనిష్ఠ
వదలకున్నటువంటి - వాని నీక్షించి,

యా రమణీమణి - యతని మేల్కొలుప
వేఱె యుపాయంబు - వెదకె నె ట్లనిన,

స్థూలాంగమం దుంచి - సూక్ష్మదేహమున
లాలితమతి నవ-లంబించి కొనుచు

ధరణీశు సత్త్వచి-త్తంబులోఁ జేరి,
సరగునఁ జైతన్య - చలన మొందించి,

జగముచందమున నా-కాశమార్గమున
కెగసి భూమికి డిగ్గి - యెప్పటివలెనె

చిలుక పంజరములోఁ - జేరినమాడ్కి
నలరుచు నిజదేహ -మందుఁ దాఁ జేరి,

నిలిచి చూచుచు నుండె - నృపుని చిత్తంబు
చలనంబు నొందఁగా - సామగానంబు

కరణి సహస్రార-కమలమధ్యమున
సురుచిరమైనట్టి - సూక్ష్మలక్ష్యమునఁ

దనరు నోంకార నా-దము మ్రోయ, దాని
వినుచుఁ జొక్కుచు మహీ-విభుఁడు కన్నులను

దెఱచి, యా ముందర - దీపించి మున్ను
గురుఁడైన యట్టి య-క్కుంభు నీక్షించి,

యతని సద్భక్తితో - నర్చించి నిలిచి,
హిత మొప్పఁగా మ్రొక్కి - యెదుట నుండఁగను,

భూపాలుఁ జూచి కుం-భుఁడు సంతసించి
'యో పార్థివేశ్వర! - యోపుణ్యచరిత!

వలనైన విమల జీ-వన్ముక్తిసుఖము
పొలుపొంద సుస్థితిఁ - బొందెనే నీకు?

పరమచిదానంద - పదవియం దిపుడు
సరససుబుద్ధి వి-శ్రాంతిఁ బొందితివె?

ఇది ఖేద, మిది మోద-మిది భేద మనుచు
మదిఁ దోఁచ కవి యెల్ల - మఱచితే? యిపుడు

కడలేని కర్మ సం-కల్ప జాలముల
విడిచితివే? జ్ఞాన - విభవ మొందితివె?

సర్వవైరాగ్యంబు - సర్వసౌమ్యంబు
సర్వశాంతము నీకు - సంభవించినదె?'

యని పెక్కు విధముల - నడుగఁగా, నన్ని
విని కుంభునకు మహీ-విభుఁ డిట్లు లనియె:

'సద్గురువర్య! మీ - సత్కటాక్షమునఁ
జిద్గగనానంద - సీమలోఁ జేరి,

సారవిహీనసం-సారాంతమైన
భూరివిశ్రాంతినిఁ - బొందితి' ననిన

విని కుంభుఁ డనియె 'సం-విత్సుఖం బిచట
ననుభవింపుచు నుండు' - మని యొప్పఁ జెప్పి,

చాల సంతోషించి, - చని నిజభూమి
లీల దీపింపఁ బా-లింపుచు నుండె;'

నన విని రాముఁ డి-ట్లనె ' నో మునీంద్ర!
ఘనశాంతిఁ బొంది య-ఖండాత్మ నిష్ఠ

నొంది యున్నట్టి యా - యుర్వీశుబుద్ధిఁ
జెంది, సత్త్వగుణంబు - శేషించి నిలిచి

యుండెనే?' యని వేడ్క - నొప్పుగా నడుగ,
నిండిన దయ నా ము-ని ప్రభుం డనియె:

'విను రఘురామ! యా-వృత్తాంత మెల్ల
నెనయు ప్రబోధకు - హేతువై, యవని

మనము సత్త్వైక నిమ-గ్నమై యుండు,
ననువొంద నట్టి మ-హాత్ముని తనువు'

సమయకుండఁగ శివాం-శంబై ధరిత్రి
నమలమై జీవించు' - నని చెప్పి, మరలఁ

బలికె నిట్లని ' రామ-భద్ర! చూడాల
విలసిత చరితమే - విను మ దె టనినఁ

బతిని వీడ్కొని నిజ - పట్టణమందు
హితమొప్ప రాజ్యంబు - నేలుచునుండి,

మఱి కొన్నినాళ్ళ కా-మనుజేంద్రుఁ జూడ
ముఱిసి కుంభుని రూప-మునఁ బోయి, ఖిన్న

వదనంబుతోఁ దల-వాంచి ఖేదంబు
మదిలోఁ బెనంగొను - మాడ్కిఁ గన్నీరు

వెడలుచునుండఁగా, - వేఁడి నిట్టూర్పు
వెడలఁగా నమ్మహీ-విభుచెంత నిలిచె,

నా రీతి నిలిచి యు-న్నటువంటి బ్రహ్మ
చారినిఁ జూచి యా-జననాథుఁడనియె:

'సదమలచరిత! యో - సద్గురుస్వామి!
ఇదియేమి? యీ క్లేశ - మెందుకు వచ్చె?'

ననినఁ గుంభుం డిట్టు-లనె జననాథ!
నినుఁ జూడ నిచటికి-నేఁ బ్రేమచేత

వచ్చుమార్గమున దు-ర్వాసుండు నాకు
హెచ్చు కోపంబుతో - నెదురేఁగు దెంచి,

తరమిడి 'నిర్నిమి-త్తంబుగాఁ బగలు
పురుషుఁడవై న-టింపుచునుండు! రాత్రి

పొలఁతివై నీ వుండు - పొమ్ము! పొ మ్మనుచు
ఛలముతో నిటు ఘోర - శాపంబు నిచ్చెఁ,

గావున మదికి దుః-ఖము పుట్టె' ననిన
భూవిభుఁ డనియె ' నో - పుణ్యాత్మ! నీవు

అడల నేటికి? యెవ్వ-రైనను విధినిఁ
గడువలే' రని పల్క-గా, బ్రహ్మచారి

పగలెల్లఁ బురుషుఁడై - భావింప రాత్రి
మగవయై యిటు కొన్ని - మాసముల్ గడపి,

తదనంతరమున భూ-ధవుని వీక్షించి,
పదపడి యొక రేయి - పల్కె ని ట్లనుచు:

'భామను నే నైతిఁ - బార్థివాధీశ!
భూమి నీ కనుగుణ - పురుషుఁడు లేఁడు,

కావున నను: బొందఁ-గా వలె నింక
నీ' వని పల్కఁగా - నృపుఁ డందు కొప్పె,

నదిమొదల్ రాత్రుల-యందు వేడుకగ

రమణీయకపటాను - రాగంబు మీఱఁ
గ్రమముగాఁ గొన్నాళ్లు - కవ గూడి, యతని

సకల సమత్వ భా-స్వర చిత్తశుద్ధి,
ప్రకటనిర్లేప స-ద్భావ నిశ్చయముఁ

గని మెచ్చి, యవల నొ-కానొకనాఁడు
పనిఁబూని ' యామహీ-పాలు భోగేచ్ఛఁ

జెలు వొప్పఁగాఁ బరీ-క్షించెద' ననుచుఁ
దలఁచి యద్భుతమైన - తనయోగమాయ

చేత దేవేంద్రుని సృ-జియించె వేడ్క,
నాతఁడీ నయ్యింద్రుఁ - డైరావతంబు

పై నెక్కి, సురసతుల్ - ప్రకటదేవతలు
నానాముఖంబుల - నాటుగా గొలువ

వచ్చి సురేంద్రుఁడా - వసుధేశు చెంత
నచ్చెరువుగ నిల్చె, - నాశిఖిధ్వజుఁడు

చూచి యాజిష్ణు న-చ్చోటఁ బూజించి
'యీ చందమునను మీ-రిటకు వచ్చుటకు

హేతు?' వేమన నింద్రుఁ - డిట్లని పలికె:
'భూతలాధీశ! నీ - పుణ్యాతిశయము

మెచ్చి రంభాది కా-మినులు నీ పొందు
హెచ్చుగాఁ గోరి, యం-దెదురు చూచెదరు,

సకలభోగమ్ములా - స్వర్గలోకమున
నకలంకమతిని నీ-వనుభవింపుచును,

నచ్చోట నిల్చి క-ల్పాంతంబుదనక
విచ్చలవిడిగాను - విహరింపువలయుఁ;

గావున నాకలో-కమునకు నీవు
రావలె' ననఁగ నా - రాజేంద్రుఁ డనియె:

'ఇంత మాత్రపుఁ బని - కింద్ర! నీ విటకు
దంతీంద్రు నెక్కి రాఁ దగునె నన్ బిల్వ?

నీ వెంతఁ బిల్చిన - నే స్వర్గమునకు
రావలసిన దేమి? - రంభాదిసతుల

పొందు నే నొల్లఁ ద-దో[illegible]
నందించు నిండి నే-నంతట నుండి,

యరమర లేక బ్ర-హ్మంబునం దెపుడు
మెఱయుచు నేన ర-మింతు. నీ స్వర్గ

భోగంబు నే నొల్లఁ - బొమ్మన్న నింద్రుఁ
డేఁగె. మహిపాలుఁ - డిందుండె. నవలఁ

జూడాల మదిలోను - చోద్యమందుచును
బోఁడిమిఁ బతియందు - భోగేచ్ఛలేని

చందంబు భావించి - సంప్రీతి మెఱయ
నందుండి, కొన్ని నా-ళ్లరిగిన మీఁదఁ

గ్రమముగా నతని రా-గద్వేషయుగము
నమర ఁ బరీక్షింతు - నని నిశ్చయించి

యారూఢ యోగమా-యా ప్రభావమున
జారపురుషుని ము-చ్చటగా సృజించి

పగలు రాతిరిగాని - బలుసంధ్యవేళ
సొగసు లుప్పతిలంఁగ - జూతవృక్షంబు

క్రింద జారుఁడు తాను - గ్రీడింపుచున్న
సందడి నృపతి కా-శ్చర్యంబుగాను

వినిపింపఁజేసె, న-వ్విధము భావించి
మనమున హర్షించి -'మచ్చికన్ వీర

లొనరంగఁ గ్రీడింపు - చుందురుగాక
యని సైగగా లేచి, - యందుండి యవల

జనుచున్న యారాజ-చంద్రునిఁ, జూచి
తన మదిలో నిట్లు - తలఁచెఁ జూడాల

'రాగరోషంబు లీ-రాజును విడిచె,
భోగేచ్ఛతోడనే - పోయె, నీ రీతి

సర్వసన్న్యాసియై - శాంతుఁడై పరమ
నిర్వాణపదమందు - నిల్చినా డహహ!

ఇఁకఁ బరీక్షింప - నేల? నా రూప
మంకితముగఁ జూపు - టర్హ మీమీఁద'

నని పతి చన్నుత్రోవ - కడ్డంబుపోయి,
నెనరుతో ముందఱ - నిలిచినఁ జూచి

'యిందు బింబాస్య ! నీ-వెవ్వ? రిచ్చటికి
నెందుకు వచ్చితి ? - విపుడు నీమోము

చూచితే మద్భార్య - చూడాలవలెనె
తోఁచుచున్న దిదేమి? - తోయరుహాక్షి!'

యనుచు రా జడుగఁగా - నయ్యింతి పలికె:
ననఘ ! చూడాల నే - నైనదే నిజము.

నెరయఁ దత్త్వార్థంబు - నీకు బోధించు
కొఱకుఁ గుంభుండనై - కొన వెళ్లఁ గాను

నద్వైత సారార్థ-మై ప్రకాశించు
చిద్వస్తుతత్త్వంబుఁ - జెప్పి, పిమ్మటను

బరఁగ దేవేంద్ర రూ-పంబును, జార
పురుష రూపంబు నొ-ప్పుగఁ దాల్చి, నేనె

పొందుగా నీ గుణం-బులు పరీక్షించి,
యిందు నా నిజరూప-మిపుడు చూపితిని;

'ధరణీశ ! యివి యెల్ల - దబ్బఱో, నిజమొ
తెఱఁగొప్ప నీయోగ - దృష్టినిఁ జూడు'

మనిన శిఖిధ్వజుఁ - డాత్మ భావించి,
మొనసి నన్నియు నిజం-బుగ మదినెంచి,

పలికె ని ట్లనుచు 'నో-భామాలలామ !
పెలుచ నీ విపుడు చె-ప్పిన మాట లన్ని

సత్యమౌ, వేదాంత - శాస్త్రార్థములను
నిత్యంబు నన్ను మ-న్నించి బోధించి,

వదలని నా కర్మ - వాసన నణఁచి,
చెదరని సుజ్ఞాన - సిద్ధిఁ బుట్టించి,

చెప్పి చూపఁగరాని - చిద్బ్రహ్మమందుఁ
దెప్పున నన్నుఁ బొం-దించితి వీవు,

కావున నిపుడు ని-ష్కర్షగాఁ జూడ,
నీవె నా గురుడఁవు - నీకె మ్రొక్కెదను;

అన విని చూడాల - యమ్మహీపతికి
మనము రంజిలఁ జెప్పి, - మరల నాఘనుని

నిజపురిఁ జేర్చె; నా-నృపకులోత్తముఁడు
సుజనులు మెచ్చఁగాఁ - జూడాల, తాను

వదలక యమల జీ-వన్ముక్తు లగుచుఁ
బదివేలయేండ్లు భూ-పాలనఁ జేసి,

మొనసి యంత విదేహ - ముక్తినిఁ బొంది'
రనుచుఁ జూడాల వృ-త్తాంత మంతయును

జెప్పి, వసిష్ఠుండు - శ్రీరాముఁ జూచి
'యప్ప ! చిత్తత్యాగ - మైనదే శుభము,

ఎవరికైనను ధాత్రి - నిది నిక్క' మనుచు
నవిరళకరుణతో - నా వసిష్ఠుండు

ఘనమైన చూడాల - కథ రఘూత్తమున
కనువుగా బోధించె' - ననుచు వాల్మీకి

తన శిష్యుఁడగు భర-ద్వాజ సంయమికి
వినిపించెఁ దత్కథ విశదంబుగాను.

*** ప్రకరణాంతద్విపద ***

ఇది సోమనాథ వి-శ్వేశ్వరస్వామి
పదపద్మ భక్త సు-బ్రహ్మణ్య యోగి

చరణాంబుజాత ష-ట్చరణాయమాన
పరిపూర్ణ నిత్యస-ద్భావ నిమగ్న

మానసాంబుజ వెంగ-మాంబికా రచిత
మై, నిత్యమై, సత్య-మై ధన్యమైన

సామార్థ సార సు-జ్ఞాన వాసిష్ఠ
రామాయణం బను - రమ్యసద్ద్విపద

యందు నెన్నఁ జతుర్థ-మగు ప్రకరణము.
అందమై విమల మో-క్షాకరం బగుచు

శ్రీ తరిగొండ నృ-సింహుంనంగ
ఖ్యాతిగా వెలయు వేం-కటరాయ ! నీదు

పదయుగళకి సమ-ర్పణమయ్యె, దీని
సదమలులై వ్రాసి - చదివిన, వినిన

నరులు తాపత్రయా-ర్ణవము తరించి,
పరమైన నిర్వాణ-పదము నొందుదురు;-

భూచక్రమున నిది - పురుషార్థ మగుచు
నాచంద్ర తారార్క-మై యుండుఁ గాత!

**-: చతుర్థప్రకరణము సమాప్తము :-**

## పంచమప్రకరణము

శ్రీ తారకోల్లాస! - శేషాద్రివాస!
శ్రీ తరిగొండ నృ-సింహ! ధూతాంహ!

విన్నవించెద నది - వినుము వాల్మీకి
క్రన్నన చూడాల - కథ తెల్పఁగాను

తగవిని, యాభర - ద్వాజుండు మరల
నగణిత భక్తి ని-ట్లనె 'గురుస్వామి!

సురుచిరాత్ముఁడు వసి-ష్ఠుఁడు రాఘవునకుఁ
జిరకృపన్ మఱి యేమి-చెప్పె' నటంచు

నడుగ భరద్వాజు - నమ్ముని చూచి
యడరిన కరుణ ని-ట్లని చెప్పఁదొడఁగె:

'ఆ వసిష్ఠుండు రా-మావనీశ్వరుని
భావించి క్రమ్మఱఁ - బలికె ని ట్లనుచు

'ధరణీశ! వినుము చి-త్త త్యాగ సరణి
నెఱిఁగి సేయందగు - నీ యర్థమందు

ఫలితార్థమగు కచో-పాఖ్యానమొకటి
కలదు, చెప్పెద రామ! - క్రమముగా వినుము!

### * కచోపాఖ్యానము *

అనిమిష దేశికుం-డైనట్టి గురుని
తనయుండు కచుఁ డాత్మ-తత్త్వంబుఁ దెలియు

కొఱకు దండ్రికి మ్రొక్కి - కొంక కి ట్లనియె:
'నరులకు సంసృతి - నశియించు విధముఁ

దెలుపు' మన్నను సుర - దేశికుం డనియె:
'వలనుగా వినుము స-ర్వ వివర్జనంబు

చేసిన సంస్కృతి - చెడు,'నన్నఁ గచుఁడు
వాసిగా విని మ్రొక్కి - వనముల కేఁగి,

ఘనతర వైరాగ్య - కలితాత్ముఁ డగుచు
నెనిమిదేండ్లు చరించి - యించుకంతైన

శమము నొందక, మదిఁ -జలన మొందఁగను,
అమర దేశికుపాలి - కరిగి కచుండు

'ఓ తండ్రి! మది శమ - మొందలే, దేమి
సేతు?' నటంచు వ-చింపఁగా, గురుఁడు

మది శమ మొందు మ-ర్మంబు లన్నియును
వదలక చెప్పి, సర్వ - త్యాగవిధము

నప్పుడు బోధించె, - నటమీఁదఁ గచుఁడు
తెప్పునఁ బటు విర-క్తినిఁ బొంది పోయి,

గతవల్కలుండై య-ఖండతపంబు
మతి నిల్పి చేసి, శ-మం బొం

మూఁడేండ్ల మీఁద ని-మ్ముగ
యేడ నుండినఁ, దపం - బెంత చేసినను

జిత్తవిశ్రమ మెందుఁ - జిక్కలే' దనఁగ
నత్తనయునిఁ జూచి - యనియె గురుండు

'ఎలమిఁ జిత్తత్యాగ - మెఱిఁగి చేసినను
వలనుగా నీకు స-ర్వత్యాగ మొదవు'

ననఁ గచుండనెఁ 'జిత్త - మనునది యెద్ది?
కని దానిఁ బట్టి త్యా-గము సేయు టెట్లు?

తెలుపుఁ' డన్నను సుర - దేశికుం డనియె:
'నలువొప్పఁ జిత్త మ-నంగ వేఱొకటి

లే, దహంకృతియె; త-ల్లీలయే మనము,
పాదుగా నదిలోన - భావించి తెలిసి

తత్త్యాగ మొనరించు - తనయ! నీ' వనఁగ
నత్యంత భక్తితో - నప్పు డా కచుఁడు

'ఏ రీతిఁ దత్త్యాగ - మేను గావింతు?
నారీతిఁ దెల్పవే!' - యన గురుండనియె:

నెలవొప్పఁ జిత్తమున్ - నిటల మందుంచి
తళుకుఁగన్నులు మూయు - తఱి మీఁదికంట

మనమునఁ దోఁచు నా-త్మ ప్రత్యయమును
మనసు చేతనె లోన - మథియింపుచున్న

నదియె తారకయోగ - మగు; దృశ్యములను
చెదరఁ జూచినదె నీ - చిత్త, మాచిత్త

మునకు దృశ్యములుగా - మొనసిన వెల్ల
నొనర నశ్యము లగు - చుండఁగా, నట్టి

దృశ్యంబులకు నగు - దృక్కు చిత్తంబు
దృశ్యమౌ నీ, కాది - దృక్కువే నీవు;

పన్నుగా నదిలోన - భావించి చూడ
నన్నిటికిని ద్రష్ట - వయ్యెద వీవె!,'

యనినఁ గచుం డిట్టు - లనియె 'నే నెవఁడ
నని చూతుఁ దెల్పవే!' - యన గురుం డనియె:

'నా నోటనున్న దే-నాల్క?' యటన్న
వానిచందంబుగా - వచియించె దీవు,

క్రన్నన నాల్క లే-కయె 'నోట నాల్క
యున్నదో లేదో మీ-రొగిఁ జూడుఁ'డనెడు

పలుకు పుట్టునె? నాల్క - పలుక కుండినను,
కలిగిన నీవు లే-కయె నే నెవఁడను?

దెలుపు మనెడు వాఁడు - తేర కన్యుండు
గలుగఁడు, లోన ని-ష్కర్షగాఁ జూడఁ,

దెలుపు నా కిపు డన్న-దే నీవు సుమ్ము!
పొలుచు చైతన్య రూ-పుఁడ వైన నీవు

లేకయే నాల్క యే - లీల వచించు?
నో కుమారక! జడ - మూహింప జిహ్వ,

నీ వజడంబును - నిత్యంబు, నజము
పావనంబును, బరా-త్పరము, నద్వయము.

కావున ని న్నేఁచు - కాయాభిమాన
భావన నొందకన్ - బ్రహ్మమే నేను

అని నిగమాంత సి-ద్ధాంతసౌఖ్యంబు
ననుభవింపుచునుండు! - మదె చిత్సమాధి,

యేక, మాద్యంత ర -హిత, మవ్యయంబు,
నాకాశసదృశంబు, - నగుణ, మనంత

సచ్చిదానంద, మా-స్వానుభవంబు
నచ్చుగాఁ బొందు! నం-దర్థమై నిన్నుఁ

బొదువు నహంకార - భూతంబు నణఁచి
కుదురుగా నిందుండు - కొడుక!' యటంచుఁ

జెప్పిన తండ్రి నీ-క్షించి కచుండు
'కప్పుచుండెడి నహం-కార మెచ్చోటఁ

బుట్టు? నెచ్చటఁ జెడి-పోవు? నా రీతి
దిట్టముగా నాకుఁ-దెలుపవే!' యనిన

విని యమరగురుండు - వేడ్క ని ట్లనియె:
'అనఘ! యహంకార - మాకాశమందుఁ

బుట్టు తోయదమట్లు - పొడము, నణంగు,
నట్టి మిథ్యారూప-మగు నహంకృతిని

నజ్ఞులు నిజముగా - ననుసరింపుదురు;
ప్రాజ్ఞుల కది వట్టి - భ్రాంతిగాఁ దోఁచి

విడిచిన, మాయ తా - విరిసి నశించు.
నదరఁగా నీవు, నే - నను ద్వైతబుద్ధి

మెఱసి, పిమ్మట నదే - మిథ్యయై పోవు,
నఱిముఱి స్వప్నంబు - లన్ని నశ్యములు;

కావున ది,గ్దేశ, - కాల, కర్మములు
పోవఁగా నంతట - పూర్ణమై, పైన

మిగిలిన సద్రూప - మేనె యటంచు
జగదతీతంబై ప్ర-శాంతినిఁ బొందు

మపుడు సర్వత్యాగ-మగు నీ' కటంచు
నుపదేశ మిచ్చిన, - నూహించి కచుఁడు

సర్వశాంతినిఁ బొంది, - సచ్చిదానంద
నిర్వాణపద మందె - నిలిచె' నటంచుఁ

బావనంబగు కచో-పాఖ్యాన సరణి
నావసిష్ఠమునీంద్రుఁ-డా రాఘవునకు

వినిపించి, కల్పిత - విశ్వచిత్రంబు
మనమున భావించి - మరల ని ట్లనియె:

'రామ! విచారింప - రమణీయ మగుచు
నామహనీయ చి-దానంద మొదవుఁ,

జక్కఁగా నాత్మ వి-చారింపకున్న
నిక్కి యహంకృతి - నేను, నే ననుచుఁ

జెలఁగి మమత్వంబు-చే విజృంభించి,
పొలుపార సుఖదుఃఖ-ములఁ బొందుచుండి,

యవల నిరర్థకం-బై చెడిపోవు;
నవిరళ చరిత! యీ-యర్థంబునందు

## * మిథ్యాపురుషాఖ్యానము *

అలర మిథ్యా పురు-షాఖ్యాన మొకటి
కల దది యె ట్లన్నఁ - గ్రమముగా వినుము!

కలఁడు మాయా యంత్ర - గతుఁడైన పురుషుఁ
డలరి యాకాశంబు - నార్జించి, దాని

దాఁచిపెట్టుట కిల్లు - తాను గట్టించి,
చూచుచుండఁగ నది - స్రుక్కి నశించె;

నా యింటి తోడనే - యాకాశ మణఁగి
పోయె నింకె? ట్లని - పొగిలి, పిమ్మటను

గగనమున్ రక్షింపఁ-గావలె ననుచుఁ
బగటుమీఱఁగ నొక-బావిఁ ద్రవ్వఁగను

ఆ నాఁటి కా నాఁటి కా-బావి పూడె.
తా నందుఁ గూపగ-తంబైన నభము

పోయెనే హా! యని-పొరలాడి యేడ్చి
యా యాకసముఁ గావ - నటుమీఁద వాఁడు

కొండలు, మేడలు, - గొప్పలౌ నూతు
లొండొంటిఁ గట్టుచు - నుండఁగా, నవియు

నటు చెడుచుండఁగా, - 'నంబరం బణఁగె
నెటు చేతు?' ననుచు వాఁ-డెలుఁగెత్తి యేడ్చు;

ననఘ! నీ కిప్పు డీ-యర్థంబు నేను
వినిపింతు నెట్లన్న - వినుము సర్గాది

యం దనంతంబు, శూ-న్యంబు, నాత్మగుచు
మందమైనటువంటి - మాయాంబరమునఁ

బొలుచు నహంకార - పురుషుండు గలిగి
యలరి యనాత్మ తా-నగుచు నుండియును

రహి మీఱఁగా నాత్మ - రక్షణ కొఱకు
బహుశరీరముల క-ల్పనములు చేసి,

యవి చెడుచుండఁగా - నా రీతిఁ జూచి,
యవిరళాత్మకు వచ్చె - హాని యటంచు

నూరకే తా నేడ్చు - చుండు నజ్ఞుండు.
ధీరాత్మ! నీ విది - తెలిసి భూస్థలిని

ఘటమఠాద్యాకార-కములు నశించి
నటువంటి కాలంబు-లందు ఖేదంబు

మది నంటనీయక, - మాయగా నెఱిఁగి
కుదిరికగా నుండు - కోదండరామ!

అమితమౌ నభమున - కన్న విస్తృతము,
నమలంబు, ఘన, మశూ-న్యం, బచలంబు,

వ్యాకోచమైన చి-దాత్మయే గ్రాహ్య
మై కొనసాగఁగా, - నాయాత్మయందు

మొనయు చిత్తాకాశ-మున మేను లుబ్బి
చనఁగఁ, దదాత్మ నా-శము నొందె ననుచు

నజ్ఞాను లూరకె - యడలుచుండుదురు;
ప్రాజ్ఞు లందుకు దుఃఖ-పడ; రావిధమున

ఘటమఠాదులు చెడఁ-గా లోన నుండు
నటువంటి యాకాశ - మణఁగని మాడ్కి

దేహముల్ వరుసగాఁ - దెగిపోవుచున్న
దేహి నిర్లేపుఁడై - ధీరత నుండుఁ;

గావున శాంతం, బ-ఖండ, మద్వయము,
భావనాతీత మా-బ్రహ్మ మంతయును

నీవె యనుచు నెంచి - నీటుగా నాత్మ
భావింపు మోరామ-భద్ర! సంసార

విరహితుఁడై భేద - విభ్రాంతి మఱచి,
నెరసి బ్రహ్మంబు తా-నే నని చూచు

పురుషునకును లభించు - బుద్ధి విశ్రాంతి.
యరయఁగా నతఁడె మ-హా కర్త యగును;

అది యెటువలె నన్న - నఖిలచింతలను
మదిలో విసర్జించి - మాయాబ్ధి దాఁటి

కొదుకక చిన్మాత్ర -కోటరపదవి
విదితంబుగాఁ బొంది - వేద్యనిర్ముక్త

నిరతసంవిత్తత్త్వ - నిష్ఠ నేమఱక
యెఱుకనే భావింపు, - మెల్ల దిక్కులను

వెలయుశబ్దములను - వినను, శీతోష్ణ
ముల నెఱుంగను, రూప-ములను గన్గొనను,

గోరి షడ్రసములఁ - గొ[illegible]దముల
మూరుకొనను యోగ్య-ముగ[illegible]తెలివి

యా పరమాత్మగా - కన్య మొం డొకటి
యేపట్లనైన లే,-దెఱుకే పరాత్మ.

యా రహస్యాత్మ యం-దంట, కజ్ఞాన
కారణమై యహం - కార పూరుషుఁడు

తా నన్నిటికినిఁ గ-ర్త నటంచు మూఢ
మానవులను వృథా - మాయాబ్ధియందు

ముంచు నంతియె కాని, - ముక్తపూరుషుల
యంచున నిల్వలే -కణఁగు మిథ్యగుచు.

శ్రీరామచంద్ర! యా - చిద్బ్రహ్మమునకుఁ
బారంబు లే, దిట్లు - భావించినట్టి

యతఁడె మహాత్యాగి - యనఁబడు, మఱియు
నతఁడె మహాకర్త - యన నొప్పుచుండు,

నతఁడె మహాభోక్త - యగుచుండు; దీని
కితిహాస మొక్కటి - యేను చెప్పెదను.

## * భృంగి ఉపాఖ్యానము *

విను! భృంగి యొకనాఁడు - విశ్వేశుఁజేరి
ఘనభక్తితో మ్రొక్కి - కరములు మోడ్చి

'యో నాగభూషణ! - యో ధర్మనిపుణ!
యే నిశ్చయముఁబట్టి - యీ జగజ్జీర్ణ

గేహమందుండి యీ - క్లేశ సంసార
మోహాబ్ధి నెటు దాఁటి - ముక్తిఁ బొందుదును?

ఆవిధ మెఱిఁగింపుఁ' - డనిన, సత్కృపను
పావకాక్షుఁడు నవ్వి - పల్కె ని ట్లనుచు

'ననఘ! భృంగీశ! మ-హా గోప్య మొకటి
వినిపింతు, నది నీవు - వేర్వేఱ వినుము!

'తలఁప జన్మము మృతి, - ధర్మ మధర్మ
ములు లేవు, సుఖదు:ఖ-ములు లేవు తనకు'

నని ధృఢంబుగ నెంచి - నటువంటి పురుషుఁ
డనఘాత్ముఁ డగుచు మ-హాత్యాగి యగును;

సంతోషమున సర్వ - సమబుద్ధితోడ
శాంతుఁడై క్రోధ వా-సన నంట కెపుడు

తగు కోర్కెలను వీడి - తనకుఁ బ్రాప్తంబు
లగు పదార్థంబుల - ననుభవింపుచును

విమలాంతరంగుఁడై - విహరింపుచున్న
నమరఁగా నతఁడె మ-హాభోక్త యగును;

పొలుచు ధర్మాధర్మ - ముల, సుఖదుఃఖ
ముల, రాగదోష, దు-ర్మోహ లోభముల

ఫల, ఫలాభావముల్ - భావించి మదినిఁ
దలఁప, కంతటఁ బర - తత్త్వమే చూచు;

నతఁడు మహాకర్త - యగు, దృశ్యకరణ
వితతిఁ దొరంగిన - విమలవర్తనుఁడు

నగును మహాభోక్త' - యని శంకరుండు
తగ నుపదేశింప - ధన్యుఁడై భృంగి

యా రీతిగాఁ ద్యాగి-యై, కర్త, భోక్త
యై రాజయోగ సౌ-ఖ్యము నొందుచుండె.

నీవు నవ్విధమున - నిపుణుండ వగుచు
భావించి యానంద - పదమెదఁ బొందు;

మలరి యంతర్ముఖుం-డై బాహ్యమందు
వలనుగాఁ దాఁ జేయ-వలయు కార్యములఁ

జేయుచు నుండియుఁ - జిత్సౌఖ్యపదవి
నే యెడలను వీడ - కెనసి వర్తించు

నతఁడు శాంతుఁడు నిర-హంకారుఁ డగుచు
హితమొప్పఁ దన్నుఁదా - నెఱిఁగి మోదించు;

అనఘాత్మ! విను మాయ-హంకార భావ
మున నాత్మ తత్త్వ మి-మ్ముగఁ బొందరాదు,

గురుఁడు చెప్పినమీఁద - గుఱుతుగా నాత్మ
నెఱిఁగి యహంకృతి - నెడఁబాయవచ్చు'

ననిన రాఘవుఁ డిట్టు-లనె 'నో మహాత్మ!
తనర నహంతాభి - ధానచిత్తంబు

గతమైన యప్పుడ-క్కడ సత్త్వగుణము
హిత మొప్ప నొక్కటె - యేరీతి నిలుచు?

నానతిం'డనిన రా - మావనీంద్రునకు
మౌని యి ట్లనియె - 'నోమనువంశతిలక!

విలసిత ప్రజ్ఞతో - వినుము చెప్పెదను,
కలుషం బణఁగ నహం-కార మయంబు

గా నుండు చిత్తంబు - గతమైన వెనుక
నూని కామాదులం - దుదయింప కణఁగి

పోవు, సత్త్వగుణంబు - పొసఁగ శేషించి
యా విమలాత్మయం - దంటి విదేహ

ముక్తి పర్యంత మి-మ్ముగ నుండు, విషయ
రక్తిలోఁ జొరదు; వా-రక రక్తి మరలఁ

బొరిఁ గాలవశమునఁ - బుట్టినఁగాని
సరసిజంబును ముంపఁ - జాలని జలము

కరణి నయ్యాత్మ న-క్కడ ముంపలేక
వెఱచి తొలంగు, నా - విమలవర్తనుని

వాసనాగ్రంథులు - వాఁడి నశించు,
భాసురశాంతి సం-పద చాల మించుఁ,

గోప మా నాఁట సం-కుచితమై పోవు,
దీపించు సుజ్ఞాన-దృష్టి యంతటను;

పొలుపొంద నిటు సుల-భోపాయమైన
యలఘు సన్ముక్తి ప్ర-యత్నంబు సేయఁ

జాలక సంసార-జలధిలో మునిఁగి
యాలస్యమున మూర్ఖు-డగువాని తనువుఁ

గాలిచి చెప్పినఁ - గలుగునే జ్ఞాన?
మేల వానిఁ దలంప - నినకులోత్తంస?'

యని ముని భృంగీశ్వ - రాఖ్యాన మెల్ల
మను జేంద్రునకుఁ - జెప్పి మఱియు నిట్లనియె:

*** ఇక్ష్వాకూపాఖ్యానము ***

'అనఘాత్మ! యిక్ష్వాకుఁ - డను మహారాజు
మనువును జేరి స-మ్మతముగా మ్రొక్కి

పలికె ని ట్లని 'యీ ప్ర-పంచ మేరీతిఁ
గలుగు? నె ట్లణఁగు? నేఁ - గర్మ పాశమును

ఏరీతిఁ దెగఁద్రెంతు? - నిరవైనముక్తి
నేరీతిఁ బొందుదు? - నెఱిఁగింపు'ఁడనిన

మను విట్టు లనియెఁ 'గు - మార! నీ బుద్ధి
యనఘమై దీపించె - నహహ! నీ ప్రశ్న

యనుపమంబగు, శరీ-రాది దృశ్యములు
గనిపించు మృగతృష్ణ - కైవడి నంతె,

కాని నిక్కముగా, ద-ఖండ చిద్గగన
మే నిత్య మగు, నది - మిథ్యగా దెపుడు;

జగము దుర్మోహాతి - శయ [1]భావములను
నిగుడి యద్దములోని - నీడకైవడిని

భ్రాంత చిత్తులకు ని-బద్ధిగాఁ దోఁచు;
నంతియె కాని ని-త్యంబుగా దెపుడు.

రక్తిగా మాయాస్ఫు-రణచే ననేక
శక్తులె బ్రహ్మాండ - జాలంబు లగును,

పలుమాఱు బహు భూత - [2]భావన భావ్య
ముల నగు నాబ్రహ్మ-ము చలింపకుండు;

రమణీయ జలము త-రంగంబు లైన
క్రమమునఁ జిచ్ఛక్తి - కళ విశ్వమగును,

గావున బంధమో-క్షంబులు రెండు
లేవు, చలాచల - లీలాకలనలఁ

దలఁపక సర్వశాం-తమును వహించి
యెలమి నీ రాజ్యంబు - నేలుచునుండు!

తనఱొమ్ముపై నున్న - తనయునిఁ దాను
గనక యెం దరిగెనో - గద! యని యేడ్చు

జనని చందంబున - జరయును, మరణ
మును లేక హృదయాబ్జ-మున వెలుంగుచును

1. భారములను - వేం.

2. భావాన్య భావ - వేం.

నున్నయాత్మను గాన - కురుచింత నొంది,
విన్ననై యెచటనో - వెదకు మూఢుండు;

తానె దేహం బని - తనువున కొక్క
హాని వచ్చినఁ దానె - యణఁగుదు నంచుఁ

దలఁకు చుండునుగాని, - తా నాత్మ ననెడి
తెలివి నొందఁగ లేఁడు - దేహాభిమాని;

ఇట్టి మూఢాత్ము ల-నేకులు ధరను
బుట్టుచుందురు ముక్తిఁ - బొందనేరకను,

అరయ నబ్ధులు బుగ్గ-లైన చందమున
సరవి నెప్పుడు చిత్త - సంకల్ప మహిమ

వలన నీ సృష్టి స-ర్వము నగుచుండుఁ,
దలఁపునఁ గదలి క-దలకుండు నాత్మ

సంకల్ప మది రాజ్య-సౌఖ్య మంతటను
పొంకమై యనుభవిం-పుచునుండు నెపుడు,

అరయఁజిత్తము మాయ - యనుదానిచేత
నిరవంది సర్వమో-హిని యగుఁగాన

ఘనతరంబుగ సర్వ - గతమగు నాత్మ
యెన లేని తన్నుఁదా - నెఱుఁగంగ లేదు.

అగణితంబగు సచ్చి - దాకాశమయము
జగ మని భావించు - శాంతవర్తనుఁడు

క్రమముగా సద్బ్రహ్మ - కవచుఁడై, సతత
మమితసుఖం బొంది, - యహమిక లేక

నంతయు చిద్బ్రహ్మ - మని సతతంబు
చింతించు వరయోగి - చిత్పద మొందుఁ;

గావున నీవీ జ-గద్భ్రాంతి విడిచి
పావనచిద్బ్రహ్మ - పదమందుఁ బొందు!

యతియైన, గృహియైన, - నతిశాంతుఁడైన
సతత మీ జ్ఞానమే - సాధింపవలయుఁ;

బూని పట్టుటయును - బోవుట, నీవు,
నే నను టాత్మలో - నిరసించి, మమత

వీడి,[3] తనను దానె - వీక్షించుచున్న,
వాఁ డెటు లున్న జీ-వన్ముక్తుఁ డగును.

అనుదిన మీధ్యాన - మభ్యసింపకయె
తనుసుఖంబును గోరు - తామసాత్మునకుఁ

దెలియఁజెప్పిన యుప-దేశవాక్యములు
మేలుగాఁ జవిటి భూ-మిని విత్తినట్టి

విత్తులవలెఁ బోవు - విఫలంబు లగుచుఁ;
జిత్తశుద్ధుండైన - శిష్యోత్తమునకుఁ

దేటగా గురుఁ డుప-దేశించినట్టి
మాటలు ప్రోదియౌ - మహిమీఁద నిడిన

ఘనబీజములరీతి - గాను ఫలించుఁ;
బనుపడ హరిహర - బ్రహ్మాదు లొనర

బహువిధలీల లే-ర్పడఁ జూపుచున్న
సహజమౌ చిద్విలా -సంబుగా నెఱుఁగు,

సలలిత సర్వద-ర్శనములయందుఁ
గల యర్థములను ని-ష్కర్షగాఁ జూచి

3. తన్నే తాను - వేం.

యది భేదరహిత మ-హాబ్రహ్మ మనుచుఁ
జెదరక యాత్మలోఁ-జింతించు వాఁడు

కుదిరికగా నిరం-కుశ తృప్తిఁ బొందుఁ,
జెదరిపోవుచునున్న - చిత్తలయంబుఁ

జేసిన వరయోగి - చిత్సౌఖ్యపటిమ
వాసిగా ధర - నెంతవారికి రాదు;

లలి ముక్తి దేశ కా-లములందు లేదు,
బలియు నహంకార - భావంబు నణఁచి

విడిచినదే ముక్తి - విమలాంతరంగ!
పుడమి నీయనుభవం-బును దృఢంబుగను

దలఁపుచునుండు మం-తర్లక్ష్యమతిని;
అలవడు వర్ణాశ్ర-మాచారశాస్త్ర

వనధిఁదరించు నె-వ్వఁడు వాఁడు కర్మ
జనిత ప్రపంచపం-జరమును ద్రెంచి

యనఘుఁడై యిచ్ఛా వి-హారియై ముక్తి
కనుకూలుఁడై యుండు - నానంద మొందు.

లలితాత్మ! కర్మఫ-లత్యాగి నిలను
బొలుపుగా నంటవు - పుణ్యపాపములు.

కామకర్మంబులు - గావించువారు
పామరులై పుణ్య - పాపఫలముల

ననుభవింపుచునుందు - రజ్ఞాను లగుచు,
ఘనతర జ్ఞాన మా-ర్గము నెఱుంగకను

తనువుల సకల తీ-ర్థములలో ముంచి
పనివడఁ గష్టంబు - పాలు గావించి,

తుదను ముక్తినిఁ బొందు-దు మటంచుఁ దలఁతు,
రది యెట్టులన్న మ-హాతీర్థములను

శ్వానముల్ మునిఁగిన - చందంబు గాదె?
జ్ఞానంబు గలుగ నా - క్షణమాత్రమందె

యానందకరమగు - నమలసమాధిఁ
బూని జీవన్ముక్తిఁ - బొందఁగావచ్చు'

ననఁగ నిక్ష్వాకుఁ డి-ట్లనె 'నింద్రియముల
కును, విషయంబుల-కును, బరాత్మకును

వేఱుగా కొకటి యౌ-విధము దోఁచినది,
యారీతిఁ దెలియు టె?-ట్లన మను వనియె:

'విను పక్షు లంబర - వీథిఁ జరించు
ననువున విషయేంద్రి-యము లాత్మయందు

వరుసగాఁ దమతమ - వ్యాపారములను
జరియించు, నాత్మ కా-సంగంబుం గలదె?

గగనాంతరమునందు - గాలి చరింప
గగన, వాయువులకుఁ - గలదె సంగంబు?

ఆ చందమున సచ్చి-దాకాశమందుఁ
దోఁచుఁ బ్రపంచంబు - తుది నంటలేదు.

కనుకఁ బ్రపంచంబు - కల్లగా నెఱిఁగి
తనుతరశుద్ధ చై-తన్యంబు నెపుడు

గనుఁగొనుచుండు మ-ఖండ లక్ష్యమున'
ననఁగ నిక్ష్వాకుఁ డి-ట్లనియె 'నో తండ్రి!

త్రిగుణంబు లడ్డమై - త్రిమ్మరుచున్న
నగుణచైతన్యంబు - నరయు టె'?ట్లనిన

**మను విట్టు లనియెఁ 'జి - న్మయమగు గుణము**
**ఘనమగు చైతన్య - గగన వస్తువును**

**గుణములచేఁ గనఁ - గూడునె?' యనిన**
**గుణవంత! విను కొండ - గుఱివెట్టినటుల**

**నంతయు బ్రహ్మమే - యని యఖండముగ**
**చింతించి పొందుమా! - చిత్పదమందె'**

యని యుపదేశించి-యా మను వరిగె.
ననఘుఁడై యిక్ష్వాకుఁ-డా జ్ఞాన మెఱిఁగి,

పొసఁగ జీవన్ముక్తిఁ - బొంది రాజ్యంబు
పస మీఱ ధీరుఁడై-పాలించుచుండె;

ననుచు నిక్ష్వాకు వృ-త్తాంత మా మౌని
మనుజేంద్రునకుఁ జెప్పి - మఱియు ని ట్లనియె:

శ్రీరామ! యిపుడు నేఁ-జెప్పినరీతి
నారూఢ విజ్ఞాని - యగువాని కిలను

లౌకికాచార జా-లంబులు తఱచు
లేక, ప్రపంచని-ర్లేపుఁడై యుండు'

నన విని శ్రీరాముఁ - డతనికి మ్రొక్కి
'మునినాథ! జీవత్వ - ముక్తు లీయిలను

నాకాశగమనాదు - లైన సిద్ధులను
జోకగాఁ గోర రె-చ్చేటులనైన

ననియంటి, రిఁక వారి - యధికత లెట్లు
గనవచ్చు?' నని పల్కఁ-గా నా వసిష్ఠ

ముని రాము నీక్షించి - మొనసి యి ట్లనియె:
'ననఘాత్మ! విజ్ఞాను - లైనట్టివారు

అతిశయసిద్ధులం - దాసక్తిపడరు;
ప్రతిభతో మంత్ర జ-పక్రియాధ్యాన

వరహఠయోగముల్ - వరుసగా సల్పు
పురుషు లా సిద్ధులం - బొంది, లోకముల

సురుచిర మహిమముల్ - చూపుచు నుందు
రరుదుగా. నందుచే - నధికత రాదు;

ఆక్యజంబుగ జ్ఞాని - కజ్ఞాని కరయ
నెక్కువ తక్కువ - నేరీతిఁదెలియ

వచ్చు? న టన్న స-ర్వ ప్రపంచంబు
మెచ్చి యిదంతయు - మిథ్యగాఁ గనుట,

అన్ని కార్యంబులం - దాసక్తి విడిచి,
యున్నతఁ బరమార్థ - మూహించి కనుట,

త న్నొరుల్ తిట్టినఁ-దాను వారలను
బన్నుగఁ దిట్టక - పటుశాంతుఁ డగుట,

పుత్రదారాదుల, - భూప్రజాతతుల,
శత్రుమిత్రుల నొక్క - సమముగాఁ గనుట,

పొలుచు నయాచితం-బుగఁ బ్రాప్తమైన
యలఘు పదార్థంబు - లనుభవించుటయు,

లోకుల సందడి-లోఁ దాను పడక
యేకాంతమున నాత్మ - నెనసి యుండుటయు,

లలిని నిందాస్తుతు-లకు మానసమున
నెలమిఁ దాఁదగ్గక - హెచ్చకుండుటయుఁ,

బాయని ప్రారబ్ధ - పటిమచేఁ దాను
జేయఁగాఁ దగుపనుల్ - సేయుచుండుటయుఁ,

దొడరి వచ్చిన సుఖ-దుఃఖ జాలముల
నడర నిర్లేపుఁడై - యనుభవించుటయు,

వాద భేదములను - వడి సుళ్లఁ బడక
యే దెఱుంగ నటంచు - నింట నుండుటయు

సరయ నిత్యాది క-ళ్యాణ గుణములు
సరసాత్ముఁడైన సు-జ్ఞాని చిహ్నములు;

ఈ చిహ్నములకన్న - హెచ్చుకై సిద్ధు
లేచోటఁగోరఁ డ-హీన విజ్ఞాని.

అది యేల? యనిన మా-యా మహత్త్వములఁ
గదిసి నభోగమార్గ - గమనాదులైన

ఘన సిద్ధు లా యహం - కారముం బెంచుఁ
గనుక, లోకులకు నె-క్కడనైన మహిమ

చూప వేడ్క జనించుఁ, - జూపిన యపుడె
కాపట్య జనుల సాం-గత్యంబు గలుగుఁ:

గ్రమముగా నట్టి సాం-గత్యంబువలన
విమలాత్మ తత్త్వంబు - వీక్షింప మఱచు.

నప్పుడు గుహ్య జి-హ్వాచాపలంబు
లుప్పొంగి పుట్టుఁ గా-వున సిద్ధులందు

నాసక్తి పడక, మా-యాతీతమైన
భాసుర చిద్బ్రహ్మ-పదమునం దంటి,

ప్రారబ్ధవశమునఁ బామరులైన
వారిలో మెలఁగుచు - వాసిగా నుండి,

ప్రాప్తపదార్థముల్ - భక్షించి యాత్మ
తృప్తిఁ బొందుదురు, వె-ల్తిని బొంద రెపుడు;

తొలఁగక నిందాస్తు-తులు వారి కిలను
గలుగుఁ, గలిగిన దుః-ఖసుఖంబు లాత్మ

యం దంటనీయక - యా శత్రుమిత్రు
లందుఁ, దమందుఁ జి-దాత్మనే గనుచు

శాంతి బొందుదు; రట్టి - జనుల సంతోష
మింతింత యని చెప్ప - నెవ్వరి తరము?

ఇటువంటి సంతోష - మెనయుట కన్నఁ
బటు సిద్ధ మహిమ లే-ర్పడ గొప్ప లగునె?

చూడాలమహిమలఁ - జూపుటే? లనినఁ
బోఁడిమిగాఁ దన - పురుషుని ముక్తిఁ

బొందింపవలె నని - బుద్ధి నూహించి
యం దన్ని తాల్చె మా-యావతారములు;

తన నాయకుఁడు పర - తత్త్వంబుఁ గనిన
వెనుక నమ్మహిమలు - వేడ్కగా నైనఁ

బరులకుఁ జూపక - పతితోడఁ గూడి
మురువుమీఱ విదేహ - ముక్తిని బొందె.

నణిమాదు లైనట్టి - యష్టసిద్ధులును
గుణములే గాని, ని-ర్గుణ పరమాత్మ

కా దందుచే జ్ఞాన - కలితుఁడై సిద్ధు
లాదరంబుగఁ జూడఁ - డాత్మ నతండు

సరవి నయ్యుపగత - సంసృతి భ్రముఁడు
పరతత్త్వరతుఁడగుఁ - బరమయో గిలను.

మానరోష విషాద - మాత్సర్యములను
బోనాడి యుపశాంతిఁ - బొంది యుండినదె

శ్రీరాజయోగికిఁ - జిహ్నముల్ గాని,
వేఱె చిహ్నము లున్న-వే రామచంద్ర?

జీవులవిద్యచేఁ-జిక్కి కర్మముల
త్రోవలోఁబడి సుఖ-దుఃఖ వాసనలు

ఊరక ప్రేరేపు - చుండఁగా నాశ
చే రాగ కలితులై, -చిత్పదంబునకు

దూరస్థు లగుచును - దుర్యమార్గమునఁ
జేరక, సృష్టిలోఁ - జిక్కుదు; రాశ

పడుటయే బంధంబు, - భావించి దాని
విడిచినదే ముక్తి - వేఱొండు గాదు;

కనుక గ్రాహ్యాగ్రాహ-కముల నేమఱక
కనుచు సంకల్ప వి-కల్పముల్ విడువు!

ధరను దద్జ్ఞులు గతా-ర్థమునకు వగవ,
రరసి చూచి భవిష్య-దర్థంబులకును

పసచెడఁగాఁ జింత-పడి డస్సిపోరు;
వసుధఁ గ్రమప్రాప్త - వర్తమానార్థ

ములనే గ్రహింతు రి-మ్ముగ, నదిగాక
తెలియ జీవునకును - ద్రివిధరూపములు

గలవు స్థూలము, సూక్ష్మ, - కారణం బనఁగ,
నలరారునట్టి దే-హముల మూఁడిటిని

విడువు! పరముఁబట్టు!, - వివిధాంగములను
బొడము నీ స్థూలంబు - భోగధుర్యంబు;

జనవర! సూక్ష్మంబు - సంకల్పమూర్తి
యనఁబడుచుండు, - నయ్యాతివాహికము

చెలువొప్ప నాద్యంత - చిన్మాత్ర మగుచు
నలువుగా నిత్యమై-న పరస్వరూపు

మూఁడవది య'టంచు - మునినాయకుండు
వేడుకగాఁ దెల్ప,-విని రాఘవుండు

మరల నాలోచించి - మౌని నీక్షించి
'సారిది జాగ్రత్స్వప్న - సుప్తినిష్ఠంబు

గాని తుర్యమును త-క్కక తెల్పుఁ'డనిన
మౌని రామునిఁ జూచి - మఱియు ని ట్లనియె:

విహితంబుఁ జెప్పెద - విను మనుజేంద్ర!
యహమికానహమిక - లాత్మఁ దోఁచకను

సత్తు నసత్తను - సంజ్ఞలు మఱచి,
చిత్తవిశ్రాంతినిఁ - జెంది, నిర్మలుఁడు

సర్వశాంతుఁడు నై య-సక్తుఁ డైనదియె
నిర్వాణపదతుర్య - నిష్ఠ యౌ, నందుఁ

బొరిఁ బొరి సంకల్ప-ములు లేమి నదియె
సరసజాగ్రత్తయు - స్వప్నమున్గాదు,

అరసి చూచినను జా-డ్యము లేనికతన
సురుచిరంబైన సు-షుప్తియుఁ గాదు,

నెఱయు నహంకార - నిరసనబుద్ధి
నఱిముఱి సమతోద-యంబగు నందుఁ

జిత్తంబు విశదమై - చేష్టింపకుండు,
నత్తఱి నందుఁ దు-ర్యావస్థ పొడము;

భూనాథ! నీవు ప్ర-బుద్ధుండ విలను
గాన నీబోధ చ-క్కఁగ వృద్ధిఁబొందె.

నిటువంటి సద్బోధ - నెనసిన మౌని
పటునిశ్చలత్వంబు - భావించి వినుము!

### * ముని వ్యాధోపాఖ్యానము *

ఒక్క కాననములో - నొక్క కిరాతుఁ
డొక్క బాణముఁబూని - యొక్క మృగంబు

పై నేయఁగా, నేటు - వడి పోయె మృగము;
దాని వెన్నంటి య-త్తఱిఁ బర్వువాఁ

వ్యాధుఁ డయ్యాశతో - నరిగి యొక్కెడను
బోధనిమగ్నుఁడై - పూర్ణుఁడై యున్న

మౌని నీక్షించి 'యా-మార్గంబునందుఁ
దాను నాచే నొచ్చి - తరలిన మృగము

వచ్చెనే?' యనఁగ న-వ్వరముని వాని
నచ్చెరువుగఁ జూచి - యనియె ని ట్లనుచు:

'సర్వసమత్వ భా-స్వరనిష్ఠఁ బూని
నిర్వాణపదమందు - నిలిచి యుండెదను,

ఏను నీ మృగము పో-యినజాడ నెఱుఁగ
బో నిషాదుఁడ!' యనెఁ - బూర్ణుఁడై నట్టి

మునివాక్యముల కర్థ-ము నెఱుంగ కతఁడు
తన యిచ్చ నరిగె; నత్త-పసి యందుండె.

'ఎందు కీకథఁ జెప్పు-టెఱిఁగింపు' ఁడనిన
ముందర సరభసం-బుగఁ బోవుచున్న

మెకమునే చూడక - మిన్నంటియున్న
యకలంక తుర్య సౌ-ఖ్యం బిది యంచుఁ

దెలియఁ జెప్పితి, నిది - తెలిసి యందున్న
చెలఁగు తుర్యము నభ్య-సింపుచు నుండు!

మిట్టి ప్రశాంతాత్మ - లెందున్నఁగాని
గట్టిగా ముక్తులు-గాఁ జూడు' మనుచుఁ

గ్రమముగా వ్యాధుని - కథ వినిపింప,
నమలుఁడై శ్రీరాముఁ-డతని వీక్షించి

'మౌనీంద్ర! యిట్టి స-మాధి నే రీతిఁ,
బూనుచు నభ్యసిం-పుదు రార్యు' లనిన

విని యమ్మునీంద్రుండు - విజయరాఘవునిఁ
గని యిట్టు లనియె 'నో-కాకుత్స్థతిలక!

### * షడ్విధసమాధులు *

సార వేదాంత వి-చారంబు చేసి
ధీరసమాధి సా-ధించు టె ట్లనినఁ

బరువడి బాహ్య ప్ర-పంచ దృశ్యముల
నరసి మిథ్య లటంచు - నన్నిటియందు

నున్న సద్రూపంబు - నూహింపుచున్నఁ
బన్నుగా సవికల్ప - బాహ్యదృశ్యాను

విద్ధ సమాధి యి-వ్విధ మగున్, జ్ఞాన
పద్ధతి మఱువక - ప్రణవంబు వలనఁ

గలుగు శబ్దం బనే-క ప్రకారములఁ
బలుక నవెల్ల శ-బ్ద బ్రహ్మ మనుచుఁ

దెలిసి, యా తెలిసిన - తెలివి నే ననుచుఁ
దలఁపుచునుండు చం-దంబు నూహింప

జనహిత! సవికల్ప - శబ్దానువిద్ధ
మనెడు బాహ్యసమాధి - యగు నవ్విధంబు,

శాంతమై, స్వచ్ఛమై, - చలనంబు లేని
యంతరంగసమాధి - యను న దెట్లనినఁ

దెలిపెద హృదయమం-దే మానసమును
నిలిపి, లోలోఁ జూడ - నెఱసి కామాది

వృత్తు లనేకముల్ - విరివిగాఁ బొడము,
చిత్తంబు వాని నీ-క్షింపుచు నుండు,

ననఘమై చిత్త కా-మాది దృశ్యముల
కును ప్రకాశము నిచ్చు - గూఢచైతన్య

కళ యన్నిటినిఁ దాను - గనుఁగొనుచుండుఁ;
గళవళ మొంద క-క్కడ నిదానించి

యమలమై తగు ప్రత్య-గాత్మ నే ననుచు
నమర భావింపుచు-న్నట్టి చందంబు

విను లోని దృశ్యాను - విద్ధసమాధి
యని చెప్పఁదగుచుండు, - నదియునుంగాక

యరయ నిస్సంగంబు, - నద్వయం, బజము
పరమాత్మ యని సదా - బహువిధ శ్రుతులు

పలికెడి శబ్దార్థ - పటిమ నేమఱక
తలఁపుచున్నట్టి శ-బ్ద జ్ఞానమందుఁ

గలసి మనంబు మ-గ్నం బైనరీతి
వెలయు లో శబ్దాను - విద్ధ సమాధి

యగు దృశ్యశబ్దంబు - లందు లక్ష్యంబు
తగులక, తనుఁ దానె - దలఁపుచు నుండి,

యదియును మఱచి బ్ర-హ్మైక్య సంధాన
మొదవఁగా, నందు మ-నోన్మని నొంది,

యిది యది యనుట లే-కేకమై నిలిచి,
కదల కున్నది నిర్వి-కల్పసమాధి

యగు; మఱి జన్మ క-ర్మాదులు లేక
మిగులుచు వ్యాపక-మే స్వరూపముగా

గలుగ, నానందమే - ఘనశరీరముగఁ
గలుగఁగా మహదాది - ఘనతత్త్వములకు

నాధారభూతమై - యవ్యయంబైన
బోధస్వరూప సం-పూర్ణచిద్రసము

లో లీనమగుచు బా-లుని మాడ్కి, జడుని
పోలిక, బలువేల్పు - పూనిన వాని

కరణి సంకల్ప వి-కల్పవృత్తులను
మఱచుచు దేహాభి-మానంబు లేక

యపు డనుభూతిర-సావేశ మెసఁగ,
విపులంబుగా బుద్ధి - విశ్రాంతి నొంద,

మురువొప్పఁగాఁ దుది - మొదలు దోఁచకయె
నెఱసి యంతట నిండి - నిదురించువాని

పగిది నున్నది యసం - ప్రజ్ఞాత మనఁగఁ
దగిన సమాధియై - తనియుచు నుండు;

శ్రీరామ! నీకు నేఁ - జెప్పినరీతి
నాఱు సమాధు లి-ట్లభ్యసింపుచును

ననఘులై వర్తింతు - రార్యు' లటన్న
మునిని వీక్షించి రా-ముఁడు పల్కె మరలఁ:

'బొలుపొందఁగా సప్త - భూమిక లేడు
గలవని మును చెప్పఁ-గా వింటి, నిపుడు

పొసఁగ సవిస్తరం-బుగ మీరు మరల
వినువక తెల్పుఁడా - విధము' లటంచు

నడుగ, వసిష్ఠుండు- నారాముఁ జూచి
యడరిన కరుణ ని-ట్లని చెప్పఁదొడఁగె:

## * సప్తభూమికలు *

'మనుజేంద్ర! భూమికల్ - మఱి య వెట్లనిన
విను ప్రవృత్తుండు, ని - వృత్తుం డనంగఁ

గల రాయిరువురందుఁ - గ్రతుకర్మయుతుఁడు,
పొలుపుగా స్వర్గాది - భోగంబులొందు,

నానివృత్తుఁడు భోగ - మస్థిరం బనుచుఁ
దా నిశ్చయించి త-త్పదలక్ష్యమందుఁ

బొందుఁ; బ్రవృత్తుండు - పుణ్యపాపంబు
లిందుఁ జేయుచును ద-న్నెఱుఁగక యుండి

పొలియుచుఁ బుట్టుచుఁ - బుణ్యపాపముల
ఫలము లనుభవించుఁ, - బరఁగ నిందందు

నిలుక డెక్కడ లేక - నింగిని, నేల
నలయక యమిత దే-హములు ధరించి

తిరుగుచుండఁగఁ, గడ-తేరు కాలమున
వరయోగి జన సహ-వాసంబు దొరక

వారిసూక్తులు విన - వాంఛ జనించు,
వైరాగ్యమున మది - వర్తించు నవలఁ

గడలొత్తు నబ్బుల - కరడులలోనఁ
బడిన కూర్మము మేడ-పైకెక్కి నటుల

పెక్కు జన్మంబుల - పిదప వివేక
మొక్కింత జనియింపు - చుండఁగా మదిని

సంసార సుఖముల - సారంబు, లధిక
హింసాస్పదము లని - యెఱిఁగి, 'కామాది

రిపులను ఖండించు - రీతులఁ గరుణ
నిపుడు నా కెఱిఁగించి, - యీ భవార్ణవముఁ

దరియింపఁజేసి, యా-త్మను జూపఁదగిన
గురుఁడు నా కెందుఁగ-ల్గు'? నటంచు ధరను

గ్రమముగా వెదుకఁగాఁ - గర్మ వాసనలు
సమయుచునుండఁగా - సద్ధర్మ భక్తి

వైరాగ్యముల మీఁది - వాంఛలు పొడము,
సారవిచార భా-స్వరనిష్ఠ గలుగుఁ,

గర్మాభిలాష త-క్కక వీడి, యాత్మ
మర్మ శాస్త్రములఁ బ-ల్మఱుఁ జూడఁగోరు,

సదమల ధర్మ వి-చారుఁడై యుండు,
నది విచారాభిమా-నాత్మకం బగుచుఁ

బొలుపొందు నిదియాది- భూమికై యుండు;
నెలమి నీ భూమిక - నెక్కినవాఁడు

సారశ్రుతిస్మృతి - శాస్త్రేతి హాస
ధారణాయోగ త-త్త్వజ్ఞానగోష్ఠి

గలిగినవాఁడై, య-ఖండ పాండిత్య
కలితులౌ పండితా-గ్రణులను జేరి

మొనసి దద్వ్యాఖ్యాన - ములుఁచేసి, బుద్ధి
తనియఁగాఁ బద పదా-ర్థ జ్ఞానసూక్ష్మ

భావజ్ఞుఁ డగుచు, లో-పలఁ బ్రవేశించి
యే వేళఁ దనుఁ బట్టి - యేఁచుచున్నట్టి

కామాది శత్రు వ-ర్గమును ఖండించి,
పాము పొరను వీడ్చు - పగిది నవిద్య

యను తెరం దెగఁద్రెంచి - యమలుఁడై నిలిచి
తనుఁదాను దెలియు త-త్త్వజ్ఞుఁడైనట్టి

గురుసేవఁజేసి యె-క్కువ రహస్యముల
నెఱిఁగి, తదర్థ ము-న్నెపు డూనియున్న

బుద్ధియే రెండవ - భూమిక యంచు
సిద్ధాంతముగ బుధుల్ - సెప్పుచుండుదురు.

ఎలమి నీ భూమిక - నెక్కిన పురుషుఁ
డలరి యసంగమం - బనెడి తృతీయ

భూమికపై కెక్కి, - పూలపానుపున
సామోదచిత్తుఁడై - శయనించువాని

కరణిని సంతోష - కలితాత్ముఁడగుచు
నరుదుగా నుపనిష - దర్థసారంబు

మదియందు నిండఁగా, - మనుజసంగంబు
వదలి, యేకాకియై - వనగుహలందుఁ

జరియింపుచును, మహా - సంతోషి యగుచుఁ,
బరఁగ నాత్మానాత్మ - భావవివేక

కలితుఁడై కాలంబు - గడపుచుఁ, జిత్త
చలనంబు నణఁపుచు - శాంతుఁడై యుండు;

అతనికిఁ దత్త్వ శా-స్త్రాభ్యాస పటిమ,
నతిశయమైన జ్ఞా-నానంద వస్తు

దృష్టి నానాటికి - దీపించి మించి,
యిష్టమై, యెఱుకకు - నెఱుకయై యుండు,

ఆమాడ్కి నిస్సంగ - మనెడి తృతీయ
భూమిక ద్వివిధమై - పొలుచు నెట్లనిన

సామాన్యమును, విశే-ష మనంగ రెండు
గా మహి నుండు, నా - క్రమ మెల్ల వినుము!

ఘనపదార్థములందుఁ - గర్తయు, భోక్త
యును, బాధ్యుఁడును, మఱి-యును బాధకుఁడును

నిజముగాఁ జూచిన - నేనుఁ గా ననియు,
గజిబిజి సేయు సు-ఖంబు, దుఃఖంబు

తెలియ సర్వేశ్వరా - ధీనంబు లనియుఁ,
గలితభోగములు రో-గంబుల కనియు,

మొనసిన సంయోగ-ములు వియోగముల
కనియు, నన్నియును గా-లాధీన మనియుఁ,

దొడరి యనేక వ-స్తువులయం దాశ
పడక, ప్రాప్తాశియై - బ్రతికి యుండుటయు,

సరవి సామాన్య ని-స్సంగమై యుండు.
మఱి విశేషాసంగ-మం బెట్టి దనిన

నవని దుర్జన దూరుఁ-డగుచు వసించి,
ప్రవిమలాత్మను సదా - భావించుకొనుచుఁ

జిరశాంతి ని ట్లభ్య-సించిన, నాత్మ
కరతలామలకంబు - గాఁదోఁచు; నపుడు

పనుపడు సంసార - పారంబు సార
మన నొప్పు పరతత్త్వ - మందుఁ దాఁ బొంది,

యెపుడు సర్వం బీశ్వ-రాధీన మనుచుఁ,
గపటకారణపూర్వ - కర్మ మే మనుట

మఱచి, శాంతిని లోనె - మౌనంబు పూని
మురిసి ప్రపంచ ని-ర్ముక్తుఁడై యున్న

నది విశేషాసంగ - మన నొప్పు; మఱియు
విదితంబుగా లోను- వెలి, క్రిందు, మీఁదు,

దిక్కుల, గగనవీ-థినిఁ జేతనంబు
లెక్కువలై జాడ్య - హీనంబు లగుచు

లలి వస్తువస్తుక-లన మొందకున్న
నలఘు చిదాభాస - లంబరాకృతులు

వెలుఁగుటలోన భా-వించి చూచినది
యల విశేషాసంగ-మన నొప్పు; మఱియుఁ

బరఁగ సమ్మద సార-భము, చిత్తనాశ
కరము, సంసృతి పత్ర - కలితంబు, విఘ్న

విరహితంబైన వి-వేక పద్మంబు
మురువుగా నెదలోన - ముందుగా మొలిచి,

రహినిఁ దత్త్వవిచార - రవిరశ్మిచేత
విహితప్రబుద్ధమై - వృద్ధిఁ బొందుచును

గుఱుతుగా నీయసం - గులకు ఫలంబుఁ
దిరముగా నిచ్చుఁ దృ-తీయ భూమికను.

జనునకు సజ్జన - సంగతి కర్మ
మునఁ గాకతాళీయ-ముగ నుదయించు,

నాది భూమికయను - నమృతాంకురమున
కాదరంబుగ వివే-కాంబుసేచనము

సేయ సదంశంబు - చేఁ జిగుళ్లెత్తు;
నాయెడఁ గృషిసేయు - నతఁ డాది యందు

మొలుచు సస్యాళి ని-మ్ముగఁ బ్రోచుకరణి
నల యాది భూమిక - నరయఁగావలయు,

'నేమిటి కటు?' లన్న - నిటువంటి ప్రథమ
భూమిక తనమీఁదఁ - బొడము భూములకు

మనికిపట్టగుఁ గాన - మఱువక యాత్మ
మననఁ జేయుచు సద్వి-మర్శంబు నొంది

యామీఁద నిస్సంగ-మై యాత్మతీయ
భూమిక యందు సొం-పుగ నొప్పుచుండు,

నిట్టి మూఁడవభూమి - కెక్కిన మీఁదఁ
బుట్టవు సంకల్ప - బుద్బుదావళులు.'

అని వసిష్ఠుఁడు పల్క - నారామచంద్రుఁ
డనుపమభక్తితో - నప్పు డి ట్లనియె:

'మునినాథ! ధరణిపై - మూఢాత్ముఁడైన
జనుఁ డే విధంబున - సంసార జలధి

తరియించు? నట్టిచం-దము దెల్పవలయు,
మెఱవడి నేఁడు భూ-మికల యం దొక్క

భూమికపై నెక్కి - పొలిసిన మనుజుఁ
డే మార్గమునఁ బోవు - నెఱిఁగింపు' ఁడనిన

విని వసిష్ఠుఁడు మహీ - విభుని వీక్షించి
'విను రామ! చెప్పెద - విశదంబుగాను

రూఢదోషుఁడు, భవ-రోగి, తామసుఁడు,
మూఢుండు నైనట్టి - మూర్ఖచిత్తుండు

సంసారియై బహు - జన్మంబు లెత్తి
హింసలఁ బడుచుండు,- నెన్నటికైన

ఘనభవాంబుధి దాఁటి - గట్టెక్క లేఁడు;
మొనసి కర్మంబు లి-మ్ముగఁ జేయువాఁడు

భూరి వైరాగ్యంబు - పుట్టిన దనుక
ధారుణీ జన్మ శ-తంబులు దాల్చి

యలసి, యావల నీశ్వ-రార్పిత కర్మ
ములఁ జేసి దుష్టాఘ-ముల వీడుచున్న

నప్పు డాపరమేశ్వ - రానుగ్రహంబు
తప్పక గల్గ, న-ద్వైత విజ్ఞాన

వాసన పొడము, న-వ్వల విరాగంబు
వాసిగా నుదయించి - వాంఛల నణఁచు;

మెలుపగు నాది భూ-మిక యిదే యగును.
పొలుచు సంసార మీ - భూమిక యందు

సమయు; నిదే తత్త్వ-శాస్త్ర సమ్మతము.
క్రమముగా నీ భూమి-కను జేరియున్న

యతఁ డొక వేళ దే-హము వీడి చనిన
నతులిత భూమికాం-శాను సారమున

నమలమైన ప్రభాస- నమరలోకమునఁ
గమనీయ దేవతాం-గనలను గూడి

యచట భోగంబుల - ననుభవింపఁగను
బ్రచుర సత్పుణ్య పా-పము లుడిపోవ,

నలరి యా పుణ్యాత్ముఁ - డవనిపై వ్రాలి
తొలఁగక భాగ్యవం-తుల యింట నైన,

వరయోగి యగువాని - వంశమందైన
నరయఁ బ్రజ్ఞాశాలి-యై యుదయించి,

వరుసఁ బూర్వజ్ఞాన - వాసనచేత
మెఱయు తదూర్ధ్వభూ-మికలను దాఁటి,

తదనంతరంబునఁ - దా బ్రహ్మ మగును.
మొదటి భూమిక నుండి -మూఁడు భూమికలు

వ్యవహార మాత్ర భే-దాస్పదంబులుగ
నవనిపైఁ దోఁపించు - నది జాగరంబు;

ఇట్టి జాగ్రద్భూమి - కెక్కినఘనుఁడు
పట్టుగా నార్యుఁడన్ - ప్రస్తుతిఁ బొంది

వర్తింపుచుండి స-ర్వప్రయత్నములఁ
గర్తయై కావించుఁ, - గర్త గాకుండుఁ;

దత్త్వశాస్త్రవిచార - తత్పరుం డగుచు
సాత్త్వికబుద్ధి నా-చార్యుఁడై యుండు.

నట్టి యాచార్యత్వ - మాది భూమికను
దట్టమై యంకురి-తం బగుచుండుఁ,

దెఱఁగొప్ప నదియె ద్వి-తీయభూమికను
విరివిఁ జూపట్టఁగా - వికసితం బగును,

తెప్పున నదియె తృ-తీయ భూమికను
తప్పక సంభావి-తం బగుచుండు;

అగతి నార్యుఁడై - యట మృతుండైన
యోగసత్పుణ్య సం-యుతసంచితంబు

సమసినదనుక నా - స్వర్గలోకమున
నమితభోగంబుల - ననుభవింపుచును

పెద్దకాలం బుండి, - పిమ్మట ధరను
తద్దయు విమలత-త్త్వజ్ఞుఁడై పుట్టి,

సరసమౌ పూర్వవా-సనచేత మరలఁ
బరమ యోగాభ్యాస - పరుఁ డగుచుండుఁ;

బొలుచు నిట్టి తృతీయ - భూమికాభ్యాస
బలమున నజ్ఞాన - పటలంబు తెగును;

విమలమౌ చిత్తంబు - వృత్తులఁబాసి
యమరు సమ్యక్జ్ఞాన - మగుచు దీపించుఁ,

గడ నీఁ దృతీయ జా-గ్రద్భూమినుండి
తొడరి యామీఁదఁ జ-తుర్థ భూమికను

సాత్త్వికుఁడై చేరి, - సర్వసమత్వ
తత్త్వజ్ఞుఁ డగుచు ద్వై - తాభ్యాస మరసి,

వదలక ద్వైత భా-వన నంటియున్న
నది యప్పు డిద్ధ స్వ-ప్నావస్థయగును,

నరయఁగా నట్టి స్వ-ప్నావస్థ యందు
శరదభ్రగతి బుద్ధి - సన్నమై యణఁగి,

యపుడు సత్తామాత్ర-మై శాంతిఁ బొంది,
యపగత ద్వైతమై - యన్నియు మఱచి,

యామీఁదఁ బంచమం-బైన సుషుప్తి
భూమికం బొంది సొం-పునఁ జిదానంద

లహరిలో మునిఁగి మె-ల్లన నటుమీఁద
సహజతుర్యాఖ్యమౌ-షష్ఠభూమికను

జెంది యొప్పుచుఁ జిద - చిత్తుల డెంద
మందుఁ దలంపక, - యహ, మనహమిక

యను రెంటి నెడఁబాసి - యద్వయ, ద్వయము
ననుటయు మఱచి తా-నంతట నిండి

పెరుగు హృద్గ్రంథిని - భేదించి మించి
యరయ వివాసనుం-డై శాంతిఁ బొంది,

నిర్విణ్ణుఁడై యోగ-నిద్రఁ బెంపెసఁగ
నిర్వాణరూపుఁడై - నిత్యదీపంబు

వలె నొప్పుచుండు జీ-వన్ముక్తుఁ డిలను,
దలకొని గగనమ-ధ్యస్థ కుంభంబు

కరణిని వెలిని లోఁ-గాను శూన్య మగుచు,
ధర జలరాశి మ-ధ్యస్థకుంభంబు రీతిఁ

బొలుపుగా వెలిలోను - బూర్ణమై నిండి
వెలుఁగుచునుండు; నీ - విధముగా యోగి

యగువాఁడు దేహ ము-న్నంత కాలంబు
జగతి మీఁదను సర్వ - సాక్షియై యుండి

ధన్యాత్ముఁడై దేహ-ధారణ కొఱకు
మాన్యుఁడై యజ్ఞాన - మనుజులలోను

చరియింపుచును క్షుత్తు-శాంతిఁ బొందింప
నరుదుగాఁ బ్రాప్తాశి - యగుచుండి, తుదను

ముదము మీఱ విదేహ - ముక్తినిఁ బొందు,
నదియె సప్తమభూమి - కాఖ్యయై యుండు.

మెఱయు నయ్యాఱు భూ-మికల కన్నిటికి
నరయ సీమాభూమి-కై యుండు నదియె;

యారూఢి వాఙ్మన - సాతీత మగుచు
సారమై యుండు నా - సచ్చిత్పదమును

కొందఱు శివుఁ డంద్రు, - కొందఱు విష్ణుఁ
డందురు, మఱికొంద - ఱజుఁ డంద్రు, మఱియు

నందుఁ గొందఱు శూన్య-మందురు, కాల
మందురు, ధరఁగొంద - ఱమరఁగాఁ బ్రకృతి

పురుష సంయోగ వి-భూతి యటంద్రు.
పరఁగ నీవిధమున - బహుశాస్త్రవిదులు

అతిశయప్రజ్ఞచే - నందఱు నన్ని
మతములఁ బుట్టించి - మహిమఁ గల్పించి,

నామ, రూపంబు లె-న్నఁడు లేని యాత్మ
కీ మాడ్కి ధరణి న-నేకముల్గాను

బనుపడ నామరూ-పములఁ గల్పించి
కొనియాడి కొనుచు నె-క్కువ తక్కువలుగఁ

దలపడి దేవతాం-తర భేదములను
గలుగఁ జేయుదు రా య-ఖండ భూమికకు.

జననాథ! యిటువంటి - సప్తభూమికల
మొనసి సాధించిన - ముఖ్యాధికారి

భవపాశమును ద్రెంచి - పరమందుఁ బొందు,
నవిరళచరిత! నీ - వా ప్రకారముగ

భూమికాభ్యాస మొ-ప్పగఁ జేసి, శాంతి
నా మహాబ్రహ్మమై, - యన్నిటియందు

నీవంటి యంటక - నిస్పృహత్వమునఁ
బావనరాజ్యంబు - పాలించు' మనిన

**జననాథుఁ డా ముని-శ్వరుని వీక్షించి**
**మనమున నూహించి - మరల ని ట్లనియెఁ:**

**'బొలుచు కారణ కార్య - భూతాళితోడ**
**బలసియున్నట్టి ప్ర-పంచ మంతయును**

పరమైన నిర్గుణ - బ్రహ్మమం దైక్య
మెఱిఁగి కావించురీ - తెట్ల'?న్న మౌని

నరనాథు నీక్షించి - నగుమోము మెఱయ
నరమరలేక యి-ట్లని చెప్పఁదొడఁగె:

## * బ్రహ్మైక్యసంధానము *

'ఇనవంశతిలక! నీ-వీ రహస్యంబు
వినుము నేఁ - జెప్పెద విశదంబుగాను

పరఁగ జీవేశ్వరో - పాధుల కైక్య
మెఱుఁగకుండిన ధాత్రి - నెవ్వరికైన

నరుదైన తత్త్వం ప-దార్థైక్యభావ
మరయ మనోరథ - మగునంతె గానఁ

గరమొప్పు నీ కార్య - కారణైక్యంబు
నెఱుఁగంగవలె, నది - యెఱిఁగినయపుడె

తహపొంది పరమత-త్త్వంబు తా నొకటి
సహజంబుగా నిండి - శాంతమై యుండు;

జననాథ! యీశ్వరు - సర్వదేహంబు
ననుపమ బ్రహ్మాండ - మగుచుండు, మఱియు

నెఱసిన జీవుని - నిఖిల దేహంబు
నరయఁగాఁ బిండాండ - మగు, నివి రెండు

ధర ముఖ్యపంచభూ-తంబుల చేతఁ
బరువడి నిర్మింపఁ-బడియుండుఁ గాన

మొనయు నీ బ్రహ్మాండ-మునకుఁ బిండాండ
మునకుఁ గారణ మిల - ముఖ్యభూతములు.

అలపద్మజాండ పిం-డాండముల్ కార్య
ములు, కార్యకారణ-ములకు భేదంబు

లేదు; కారణ మిల-లేక కార్యంబు
లేదు, తంతుచయంబు - లేక వస్త్రంబు

కలుగ, దాచందంబు-గా నజాండంబు
కలుగక పిండంబు - గలుగ; దారెండు

కారణ, కార్యముల్ - గావున వాని
కేరీతినను భేద - మెన్నఁగా రాదు.

బాహుళ్యమైన యీ - పద్మజాండమున
కూహించి చూచిన - నుత్పత్త్యవస్థ,

మొనయు నీ పిండాండ-మునకు భావించి
కనిన జాగ్రదవస్థ - గనుక, రెంటికిని

సరవితో నైక్యంబు - సహజమై యుండు;
మఱియు జాగ్రత కభి-మానియై పనులఁ

జేయించు నీశుండు - సృష్టికర్తైన
యాయబ్జజునియంశ - [illegible]ండుఁ గనుక,

రమణీయ బీజాంకు-ర న్యాయ మొప్ప
నమర నయ్యిరువుర - కైక్యంబు గలుగు;

ఘనత నొప్పు హిరణ్య-గర్భమై యీశ్వ
రుని లింగదేహ మౌ-రూఢిగాఁ జూడ,

నినుము కాలిచికొట్ట - నెగురుచుఁ జెదరి
కనిపించు విస్ఫు లిం-గంబుల మాడ్కిఁ

దెలియ నీశ్వరలింగ - దేహంబునుండి
గలిగె ననేకలిం-గ శరీరతతులు

గనుక, నీశ్వరుని లిం-గ శరీరమునకు
మొనయు నీ లింగాంగ-ములు వేఱుగావు;

అరయ హిరణ్య గ-ర్భాంశమే యష్ట
పురి యయ్యెఁ, దత్సంగ-మున నాత్మ కిలను

మురియు గర్భావాస-ములు గల్గసాగె;
గరిమనొప్పు హిరణ్య - గర్భమన్ దాని

వరప్రతిపాలనా-వస్థాంశు పటిమ
నరయ జీవునికి స్వ-ప్నావస్థ యగును

గనుక, నారెంటి కై-క్యం బని యెఱుఁగు
మనఘ! యీలింగ దే-హాభిమానమున

వెలయు తైజసుఁడగు - విష్ణునంశంబు,
నల కార్యకారణ - న్యాయంబుచేత

సలలిత విష్ణు తై-జసుల కిద్దఱికి
నలరార నైక్యమౌ, - నదియునుగాక

తగిలి వీడని మహా-తత్త్వ స్వరూప
మగు ప్రకృతాంశమే - యజ్ఞానశక్తి

యగుఁగాన నారెంటి - కైక్యమౌ టెఱుఁగు;
మగణిత సర్వ సం-హారరూపమున

నతిశయంబగు ప్రళ-యావస్థ చేతఁ
బ్రతిభతోఁ బుట్టింపఁ - బడియె సుషుప్తి,

అందుచే నారెంటి - కైక్యమౌ; మఱియు
నందు సంహార క-ర్తైన రుద్రాంశ

మే మించి ప్రాజ్ఞుఁడై - మెఱయు, నీ రెండు
తామసాహంకార - తత్త్వమై యుండు,

నారెంటి కందుచే - నైక్యమౌ; మఱియు
సారజ్ఞుఁడైన యీ-శ్వరునిజశక్తి

యనెడు మాయకును జీ-వాత్మనిజ్ఞాన
మునకు వే ఱనువారు - మూఢు, లీశ్వరుని

సర్వసాక్షిత్వ మెం-చంగ జీవునకుఁ
బర్విన లీలతోఁ - బ్రతిబింబమైన

యలఘు తుర్యావస్థ - యగు రెంటి కైక్య
మెలమిఁ గల్గుచునుండు,-నీ ప్రకారముగఁ

బరఁగ జీవేశ్వరో-పాధుల కైక్య
మిరవొందఁ గల్గఁగా - నీశ్వర జీవ

భేదంబు గల దంచు - బెట్టుగా నిలిచి
వాదించు టెట్లన్న - వసుధేశుఁ డనియెఁ:

'తెలుచ జీవేశ్వర - భేదంబు వేద,
మలరి పల్కుట దేమి? - యానతిం' డనిన

మౌని యి ట్లనియె 'రా-మ! తొలుత భేద
మూని చెప్పకయున్న - నుర్విని జనులు

మొదట నభేద మి-మ్ముగ విచారించి
తుదముట్టఁ జాల, రం-దున దయచేత

బెట్టుగా జీవేశ - భేదవాక్యములఁ
బుట్టించి యీశ్వర - పూజ గావించి,

తదనుగ్రహమున న-ద్వైతచింతనము
కుదిరికగాఁ జేసి - కొన్నాళ్లకైనఁ

బొసఁగ జీవన్ముక్తి - పొందెద రనుచు
విసువక భేద మా-వేదంబు పలుకుఁ

గావునఁ, బూర్వ-పక్షము నుద్ధరింపఁ
గావలెఁ దొలుత స-త్కర్మ పద్ధతిని

ఎఱిఁగిన యటువలె - నేతివాక్యాను
సరణంబుచేత దూ-షణసేసి విడిచి,

యా మీఁద సిద్ధాంత-మైన యర్థమును
క్షేమంబుగాఁ బ్రతి-ష్ఠింపఁ గావలయు.

ఒనరఁగా నదియు వే-దోక్తమే గనుక
జననాథ! వేదశా-స్త్రము లివ్విధమునఁ

జెలరేఁగి భేదముల్ - చెప్ప, నవ్వలను
దొలఁగక యుపనిష-త్తులు నిదానముగఁ

గ్రమమొప్ప భేదవా-క్యముల ఖండించి
యమలమై యద్వయం-బైన బ్రహ్మమును

ఘనులకుఁ గనుసంజ్ఞ - గాఁ జూపుచుండు;
ఘనతకెక్కు హిరణ్య - గర్భంబు లింగ

తనువులు రెండు సి-ద్ధముగ లేకున్నఁ
బెనుపు నొందు నజాండ - పిండాండములును

గలుగవు, కారణ - కార్యంబులైన
యలపద్మ జాండ పిం-డాండంబులకును

సహజ మైక్యము స్థితి - స్వప్నము యొక్క
విహితావయవములై - వెలయుచున్నట్టి

సృష్టి జాగ్రత లని - చెప్పఁగా నొప్పు,
నిష్టంబుగా విష-యేంద్రియంబులను

జెలఁగి కూడిన మన - స్సె స్వప్నరూప
కలితమై దినమును - గనిపింపుచుండు,

వేడుకగా నదే - విషయవాసనలఁ
గూడి బాహ్యేంద్రియ - గోళకంబులను.

వెలసి నిలిచిన బాహ్య - విషయకృత్యముల
సలువునదే యగు - జాగ్రదవస్థ,

గాన నా స్వప్నంబు - కారణం బగును,
దాని కార్యం బనఁ - దగును జాగ్రత్త,

యలరు నందున రెంటి - కైక్యమౌ మఱియు
వెలయఁ దైజసుఁడగు - విష్ణునంశంబు

కావున వారి కై-క్యము గల్గుచుండు
నా విశ్వుఁడగు - పద్మజాంశమందునను

నా యిద్దఱికిఁ గల్గు - నైక్యసౌఖ్యంబు
మాయచే నభిమాన - మగ్నుఁడై మొదట

నమరు నవ్యాకృత-మం దంకురించి
రమణీయమైన హి-రణ్యగర్భమును

నరయ నజ్ఞానాంశ - మగు లింగతనువు
నతిముఱి నైక్యమౌ, - నవ్విధంబుగను

దనరు మాయకు నవి-ద్యకు నైక్య మొదవు,
సునిశిత ప్రళయ సు-షుప్తులు రెండు

కారణలౌ స్థిత-కలయు కార్యంబు(?)
లారయ నీయుభ-యముల కైక్యములు

కలిగినతఱి వేఱె - కారణం బొకటి
వలవ దోశ్రీరామ! - వసుధాతలేంద్ర!

నరవి నావిశ్వ తై-జసులపుట్టువులు
పరఁగ రుద్రునివల్లఁ - బ్రాజ్ఞునివలనఁ

గలిగె, రాజససాత్త్వి-కంబులు రెండు,
నలఘుత్వతామ సా - హంకారమందుఁ

బొలుపులేక యణంగి - పోవుచునుండు;
నలరు నజ్ఞానంబు - నవ్యాకృతంబు

మఱచు నాత్మజ్ఞాన - మాయలనుండి
యరుదుగా నుదయించు - నం దైక్య మొందుఁ,

దొలి సర్వసాక్షిత్వ - తుర్యంబులందుఁ
బ్రళయ సుషుప్తులు - ప్రభవించి యచటఁ

గరమర్థిఁ గారణ - కార్యభావనను
బరఁగ నైక్యము నొందుఁ - బార్థివాధీశ!

తలకొని మఱియు రు-ద్రప్రాజ్ఞు లిర్వు
రల యీశ్వర, ప్రత్య-గాత్మల వలనఁ

గలిగిరి, వారిక-క్కడ నైక్యమొదవు;
నెలమి నేదేది యే-యే కారణమునఁ

గలుగు నా కార్య మా - కారణంబునకుఁ
దలఁచి చూచినను భే-దంబు గాకుండుఁ;

గుదిరి సర్వంబును - గుణసామ్య మెందుఁ
బొదువుగాఁ బలుమాఱు - పుట్టు, నణంగు,

రూఢిగా మాయా స్వ-రూపమైనట్టి
గాఢమై తగు కార్య - కారణైక్యంబు

గలుగఁగాఁ దత్కార్య - కారణోపాధు
లెలమినిఁ గల్గు జీ-వేశ్వరైక్యంబు

నిత్యసిద్ధం బయ్యె - నేఁ జెప్ప నేల?
ప్రత్యక్ష మీ యను-భవము భావించు!

తలఁపఁగాఁ 'దత్పద - త్వంపద'శబ్ద
ముల కైక్యమగు రీతి - మొనసి చెప్పితిని.

సరస జీవేశ్వర - చైతన్యమునకుఁ
బరమైన 'యసిపద' - భావన చేతఁ

బరఁగ నైక్యంబు చె-ప్పకయే లభించు
దెలుఁగఁ జెప్పితి; నిది-యిటు లుండనిమ్ము!

అగణిత బ్రహ్మంబు - నందు వికర్త
మగు గుణసామ్యాది - యఖిలవిశ్వంబు

నరయఁగా వేఱుగా - దా బ్రహ్మమునకు,
వరగుణసాంద్ర! స-ర్వము బ్రహ్మమగును.

భ్రాంతిచే రజ్జువుఁ - బా మని చూచి
నంతటనే రజ్జు-వగునె సర్పంబు? 1080

బ్రహ్మమున్ జూచి ప్ర-పంచ మటన్న
బ్రహ్మ మీ మిథ్యా ప్ర-పంచ మే లగును?

జలమే తరంగముల్, - శబ్దముల్, సుడులు,
నల బుగ్గలై తోఁచి-నట్లు పరాత్మ

భ్రాంత చిత్తులకుఁ బ్ర-పంచమై తోఁచు,
నింతియే కాని లే-దీ ప్రపంచంబు.

తలకొన్నఁదత్త్వ ని-ర్ధారణ చేతఁ
జెలఁగి విచారణ - చేసి చూచినను

అల బ్రహ్మమే, విశ్వ-మై కనిపించుఁ;
బొలుపొందు నిటువంటి - పూర్ణానుభవము 1090

గలిగిన ధన్యుఁ డా-కారంబు లేని
యలఘు పరబ్రహ్మ - మనుచు భావించు.

మాయాశరీరాభి-మానంబు లేక
నా యమల బ్రహ్మ-మగు యోగివరుని

డెంద మెందెందు వాఁ-డిగఁ బోవుచున్న
నందందు బ్రహ్మమే - యగపడుచుండుఁ

గాని, విశ్వము వేఱు-గాఁ గానరాదు.
కాన సమాధి యే-కాంతమం దుండి

కావింతు ననెడి సం-కల్ప మేమిటికి?
నే వేళ నిన్ను నీ-వెఱుఁగుచు భూమిఁ

బాలించు' మన రామ-భద్రుండు పలికె:
'నో లలితమునీంద్ర! - యుర్వి నేలుచును

నే నసంప్రజ్ఞాత - నిర్వికల్పంబు
లూని యేకాంతమం-దుండక, వినుట,

కనుట, మాట్లడుట - గలిగి యుండుటను
మన మాత్మతత్త్వంబు - మఱువదే?' యనిన

నరపతి నీక్షించి - నగి యావసిష్ఠుఁ
డఱలేని నెనరుతో - నమర ని ట్లనియె:

'విను రామ! జనక భూ-విభుఁ డాత్మ తత్త్వ
మొనర నీక్షింపుచు - నుండి, విశ్వంబు

ఉన్నటు లుండఁగా - నూహించి మించి
పన్నుగాఁ దాఁ బర - బ్రహ్మంబు నంటి,

పాసఁగ జీవన్ముక్తిఁ - బొంది రాజ్యంబుఁ
బసమీఱ ధీరుఁడై - పాలింప లేదె?

ఘనతనుప్రారబ్ధ - కర్మవాసనలు,
ననుపమాజ్ఞానంబు - నర్థక్షణంబు

చెనఁటులై యావరిం-చిన మాత్రముననె
యనఘుఁడై బ్రహ్మవే-త్తై ధన్యుఁడైన

వానిమోక్షమునకు - వచ్చునే హాని?
పూని స్వప్నంబులో - భూరిదుఃఖంబు 1120

ననుభవింపుచు నుండి - యపుడె మేల్కొనిన
వెనుక దుఃఖము వాని - వేధింపఁగలదె?

ఆ ప్రకారంబుగా - నధ్యాత్మనిష్ఠుఁ
డై ప్రపంచము మిథ్య - యనుచు భావించు

జ్ఞాని యొక్కొక వేళఁ - జపలసంసార
మూని కావింపుచు - నున్నమాత్రమున

నతని కా సంసార - మంట దెన్నటికి;
నతఁ డిల నిర్లేపుఁ - డఖిలపూజ్యుండు,

సర్వస్వతంత్రుండు - సర్వశాంతుఁడు
సర్వపూర్ణుఁడు సర్వ-సముఁ, డటుగాన 1130

వాఁ డెటు లున్న జీ-వన్ముక్తుఁ డగుచు
వేడుకగాఁ జూచు - విశ్వచిత్రముల,

అంతా పరబ్రహ్మ - మని తోఁచినపుడు
వింత సంసారంబు - వేఱయెందుండు?

భావింపు మీ యను - భవమాత్మయందు
నీ వసంప్రజ్ఞాత, - నిర్వికల్పముల

సాధింపనేల? వి-శ్రాంతిచే నాత్మ
బోధానుభవ మొంది - పూర్ణుండ వగుము!

మఱపు ని న్నంటదు - మనువంశతిలక!
పరమహంసున కసం-ప్రజ్ఞాతనిష్ఠ

తగు, గృహస్థున కది - తగ; దండువలన
జగతి నేలుచు నుండు - జనకుఁ,డా రీతి

నిరుపమప్రజ్ఞతో - నిఖిలరాజ్యంబు
పరుఁడవై లీలగాఁ - బాలింపుచుండు!

పరమహంసుని క్రమ-పదము నొందెదవు,
నరనాథ! నిజముగా - నమ్ము నామాట.

చెలఁగు చుండెడి జగ-జ్జీవేశ్వరులకుఁ
గలుగు నీ వ్యాపార - గౌరవస్థితులు,

అవియెల్ల సగుణమా-యా చిద్విలాస
సవరణంబులు గాని, - సత్యముల్ గావు;

సత్యంబు నీవైన - సత్పదవస్తు
వత్యంత నిర్మల, - మగుణ, మద్వయము.

ఆ జగజ్జీవేశ్వ-రాధార, మజము,
రాజయోగానంద-రససముద్రంబు

కావున, నీవె య-ఖండచైతన్య
భావన నొంది స-ద్బ్రహ్మమై యుండు'

మని యుపదేశింప, - నా రాఘవుండు
కనుఁగవ మోడ్చి చి-ద్గగనంబు నంటి

తనుఁదాను భావించి - తన్మయుం డగుచు,
ననుభూతిరసమగ్నుఁ-డై కొంత తడవు

మనుజేశ్వరుఁడు చిత్స-మాధి సౌఖ్యంబు
ననుభవించి, కృతార్థుఁ-డై కనుల్ దెఱచి

యా గురునకు మ్రొక్కి - యంచున నిలువఁ
గా, గురుఁ డమ్మహీ-కాంతు నీక్షించి

'యన్న! శ్రీరామ! బ్ర-హ్మైక్యసౌఖ్యంబు
చెన్నొంద ననుభవిం-చితివే?' యటంచుఁ

గరుణతో నడుగ ను-త్కంఠ దీపింపఁ
గరములు మొగిచి రా-ఘవుఁ డిట్టు లనియె:

ఓ గురుచంద్ర! మీ-యుపదేశ మహిమ
చే గుఱిగా జగ-జ్జీవేశ కార్య

కారణైకత్వ ప్ర-కాశమర్మముల
ధారాళముగఁ గంటి, - ద్వైతం బడంగె;

నహహ! మహాద్వైత - మాదిమధ్యాంత
రహితమై, యమితమై, - రమ్యమై, యెఱుక

యై, సచ్చిదానంద-మై, నిర్విశేష
మై, సర్వపరిపూర్ణ - మయ్యెఁ; నే నదియె.

ఇటువంటి యనుభూతి - నిదమిత్థ మనుచుఁ
బటిమతోఁ జెప్పి చూ-ప నశక్యమయ్యెఁ;

నతిశయజ్ఞానర-హస్యవాక్యముల
హిత మొప్ప మీరు నా-కెఱిఁగించుకతన

నన్నిటికి నతీత - మగు పదమందుఁ
బన్నుగాఁ బొందితి, - భవభయం బణఁగెఁ;

దల్లివి, తండ్రివి, - దైవము, గురుఁడ
వెల్లభంగులను నా - కెవ రింక మీరె;

కావున మీ పద - కమలయుగ్మంబు
భావించి నిర్వాణ- పదము నొందితిని'.

అని పల్కి భక్తితో - నంజలిఁజేసి
వినుతింప, రామభూ - విభుని వసిష్ఠ

మౌని ప్రేమను జూచి - మరల ని ట్లనియె:
'మానవాధీశ! బ్ర-హ్మంబు నీ వయ్యు, 1190

నారాయణుఁడ వయ్యు - నన్ను మన్నించి
సారవేదాంతశా-స్త్రము నేను దెలుప

విశదంబుగా నీవు - వినినందువలన,
దశరథాత్మజ! నేను - ధన్యుండ నైతి'

నని పెక్కువిధముల - నా రఘూత్తమునిఁ
గొనియాడి, పూజఁ గై-కొని వసిష్ఠుండు

అంతరంగంబునం-దా రాము మెచ్చి,
సంతసింపుచు నిజా - శ్రమభూమిఁజేరె;

## * శ్రీ మద్రామాయణ కథాసంగ్రహము *

అంత నా శ్రీరాముఁ - డాత్మార్థ మెఱిఁగి,
వింతగాఁ దనుఁ దాను - వీక్షించుకొనుచు 1200

సలలిత విమల సు-స్వాంతుఁడై లేచి
చెలువొప్ప దశరథు - చే సెలవొంది,

యా రాముఁ డపుడు వి-శ్వామిత్రు వెంట
సారజ్ఞుఁడైనట్టి - సౌమిత్రితోడ

శరచాపములు పూని - చని యరణ్యమునఁ
దిరుగు తాటకను మ-ర్దించి, పిమ్మటను

నతివేగ మారీచుఁ-డను వానిఁ దఱిమి,
ప్రతిభ దీపింప సు-బాహునిఁ ద్రుంచి,

కరుణతో గాధేయు - క్రతువు రక్షించి,
పరఁగ నహల్య శా-పంబును దీర్చి,

గరళకంఠుని కార్ము-కంబు ఖండించి,
సురలు మెచ్చఁగ మహీ-సుతను వరించి,

పరశురాముని బాహు-బలము నణంచి,
ధరణిజతో నయో-ధ్యాపురిఁ జేరి,

మెఱయుచు సీతాస-మేతుఁడై యచట
సురుచిరలీలల - సుఖియింపుచుండె.

మఱికొన్ని నాళ్లకు - మంథరవలన
దురుసుగాఁ గైకకు - దుర్బుద్ధి పొడమ

రామచంద్రుని మహా-రణ్య భూములకుఁ
దా మించి పొమ్మన్న, - దశరథేశ్వరుని

యనుమతిఁ గైకొని - యతిశాంతుఁ డగుచు
జనకజా సహితుఁడై - సౌమిత్రితోడ

నా రాముఁ డడవుల - కరుగఁగా, సీత
నా రావణాసురుఁ - డపహరింపఁగను

శ్రీరాముఁ డచ్చటఁ - జింతించి, పంపఁ
జేరి, సుగ్రీవుతో - స్నేహంబు చేసి,

వనచరోత్తముఁడైన - వాలినిఁ ద్రుంచి,
యినసూనునకు రాజ్య-మిచ్చి, యంగదుని

యువరాజుగాఁ జేసి - యుంచి, యామీఁదఁ
బవనాత్మజుని భక్తి - భావన మెచ్చి,

యతని చేతికి సీత - కానవా లిచ్చి,
ప్రతిభతోఁ బంప, న - ప్పవననందనుఁడు

లవణాబ్ధి లంఘించి - లంకలోఁ జొచ్చి,
యవనీతనూభవ - నచ్చోటఁ గాంచి,

శ్రీరామచంద్రుఁ డి-చ్చిన యుంగరంబు
గౌరవంబుగ సీత - కరములం దుంచి,

చెచ్చెర సీత యి-చ్చిన మానికంబు
నచ్చుగాఁ గైకొని - యందుండి కదలి,

వనపాలకుల నొంచి, - వనము మాయించి,
ఘనశూరుఁడైన య-క్షకుమారు నణఁచి,

లంకాధిపతిని ని-ర్లక్ష్యంబు చేసి,
లంకఁ గ్రక్కునఁ గాల్చి, - లవణాబ్ధిఁ గడచి,

రామున కా శిరో-రత్నంబు నిచ్చె;
నా మీఁద రఘువరుఁ - డఖిలవానరులఁ

గూడి తోయధిని మి-క్కుటముగాఁ గట్టి,
పోఁడిమి లంకకుఁ - బోయి శౌర్యమునఁ

గడఁగి రావణకుంభ - కర్ణాదులైన
చెడుగు రక్కసులఁ గూ-ల్చి, విభీషణునకుఁ

బనిఁబూని లంకలోఁ - బట్టంబుఁ గట్టి,
జనకజన్ దోడ్కొని - సౌమిత్రితోడ,

వానరాదులతోడ - వరపుష్పకంబు
పై నెక్కి, సాకేత - పట్టణంబునకు

వరశక్తి దీపింప - వచ్చి,; లక్ష్మణుఁడు,
భరతశత్రుఘ్నులు - పవననందనుఁడు

తనుఁజేరి కొలువఁగాఁ, - దగిన వేడుకల
మొనసి వసిష్ఠాది - మునులకు మ్రొక్కి,

సీతతోఁ బట్టాభి-షిక్తుఁడై, సురలు
ఖ్యాతిగాఁ బొగడ, ను-త్కంఠ దీపింప,

గురుతరకల్యాణ - గుణగణుం డగుచుఁ
బరమాత్ముఁడై, తాను - భావ మేమఱక

పరిపూర్ణ భావసం-పన్నుఁడై ప్రజలఁ,
బరమ శాంతాత్ముఁడై - పాలింపుచుండె.

అని భరద్వాజ సం-యమికి వాల్మీకి
ఘనతరజ్ఞాన యో-గ ప్రకారంబు

వినిపింప, నంతయు-విని భరద్వాజుఁ
డనఘుఁడై వాల్మీకి - కంజలిఁజేసి,

కొనియాడి యచ్చట - గురుభక్తి మెఱయ,
ననుపమ విజ్ఞాని-యై శాంతిఁ బొంది,

శమదమ ప్రముఖ భా-స్వర సద్గుణముల
నమర జీవన్ముక్తుఁ-డగుచు సుఖించె.

## * ప్రకరణాంతద్విపద *

ఇది సోమనాథ విశ్వే-శ్వర స్వామి
పద పద్మ భక్త సు-బ్రహ్మణ్యయోగి

చరణాంబుజాత ష-ట్చర ణాయమాన
పరిపూర్ణ నిత్య స-ద్భావ నిమగ్న

మానసాంబుజ వెంగ-మాంబికారచిత
మై, నిత్యమై, సత్య-మై, ధన్యమైన

సామార్థ సార సు-జ్ఞాన వాసిష్ఠ
రామాయణంబను-రమ్యసద్ద్విపద

యం దంత పంచ-మంబగు ప్రకరణము
నందమై విమల మో-క్షాకరం బగుచు 1280

శ్రీతరిగొండ నృ-సింహుండనంగ
ఖ్యాతిగా వెలయు వేం-కటరాయ! నీదు

పదయుగళికి సమ-ర్పణ మయ్యె; దీని
సదమలులై వ్రాసి-చదివిన, వినిన

వరులు తాపత్రయా-ర్ణవము తరించి,
పరమైన నిర్వాణ - పదము నొందుదురు.

భూచక్రమున నిది - పురుషార్థ మగుచు
నా చంద్ర తారార్క-మై యుండుఁగాత!

**-: వాసిష్ఠరామాయణము సంపూర్ణము :-**



